త్వరలో వచ్చుచున్నది

# అపూర్వ శ్రీ కృష్ణ తెలుగు టాకీ తులాభారము

త్వరలో వచ్చుచున్నది



కలకత్తా
కాళీ ఫిలింకంపెనీ
**వారిచే**

అర్. సి. ఏ.
ఫోటోఫోన్ యంత్రము
మీద నవీన పద్ధతులతో
అసమాన నట సమ్మేళనముతోడ
తయారుకాబడిన భక్తిరస ప్రధాన
మైన తెలుగు టాకీ.

ఆంధ్ర, తమిళ రంగములయందు
నిరుపమాన ప్రఖ్యాతి గాంచి ఆంధ్ర నటకుల
కెంతయు నపూర్వకీర్తిబడయజేసిన రంగమార్తాండ
కపిలవాయి రామనాథశాస్త్రిగారు (నారద)
మిస్. సభారంజని, మిస్. ఋష్యేంద్రమణి,
మిస్. ప్రేమలత, మిస్. సీతారాం, మిస్. లక్ష్మి
రాజ్యం, మిస్. కాంచనమాల. యస్. పి. లక్ష్మణ
స్వామి,
యస్.
జయసింగు,
ఆంధ్ర ఛార్లీ
చాప్లిను జోగి
నాథం, వగయిరా
ప్రముఖు లిందు పాల్గొనిరి.

తేదికై నిరీక్షింపుడు

ఏప్రల్ నెలలో నెల్లూరు, బెజవాడ,
తెనాలి, విశాఖపట్టణం, విజయనగరం,
పట్టణములలో ప్రదర్శింపబడును.

*For booking apply to sole proprietor* :—**GUPTA & CO., M. S. R. A. GUPTA, Managing Director,**
3/7, Thatha Muthiappan Street, G. T. MADRAS.

# భారతి

## సచిత్ర మాసపత్రిక



అధిపతి

కా. నాగేశ్వరరావు



సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౨, సంచిక ౪

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౫

# విషయసూచిక

# చిత్రములు




సంపు. ౧౨ యువసంవత్సరము, చైత్రమాసము (ఏప్రిల్ ౧౯౩౫) సంఖ్య ౪

# యుగాశీస్సు

విశ్వనాథ సత్యనారాయణ

నవకోకిల కంఠకుహూవు - చివురులలో రాగమెల్ల చెరలాడినదో
చివురెత్తు భావపరిణతి - యువరేఖారసనిధాన మొలికించె నహో!

వేపపూతలకుఁ బూవిలుకానిములికి తనమ్ము పొందని విధానమ్ము చూచి
సాయంసమయ మందచారు మారుతములో సన్నగిల్లిన శైత్య సరణిచూచి
కొమరు పీసరపోవఁ గ్రమముగా ముదురెక్కు- చున్న లేఁజివురాకు చిన్నె చూచి
మొగిలు లేఁదునుకైనఁ దగులనిగగనమా ర్గమున వచ్చిన వేడిగాలిఁ జూచి
అరనిదురలోని తన ప్రియురాలిదైన - బిగి సడలుచున్న కౌఁగిలివిధము చూచి
విగతశైశవభావావృతి నెగయు నూత్న - యువవిలాసమ్ము లోకశోభ నొలుకఁబోసె.

ధృతి 'నిమ్మాదిని' పూఁ దేనియల్ త్రావెనో ఈతుమ్మెదల క్రోవి కింత తావి
చెలగి 'జహాంగీరు' చివురాకు మెక్కెనో ఈకోకిలపుపాట కింత తేట
సౌఖ్యమిచ్చెడు మాత్ర చలిచిక్కఁబట్టెనో ఈగాలి తెరపాటు కింత నీటు
ఆయుఃప్రమితి తనయందు నిండించెనో ఈవేఁప క్రొంబూత కింత సేత
భావపరిణతి కలయువాభ్యర్చనీయ మైన యీ తెన్గుతోట పూఁదేనెయూట
యువమనోహరకుసుమ మధూర్మి వలయ - కమ్ము లీ తెన్గువనులు రసమ్ము గనులు.

ఉక్కపోయకయుండ నోగి నుల్లిపొరవంటి చలువచేసిన క్రొత్త వలువ తాల్చి
తనయంద మెల్లదిక్కున గుబాళించగాఁ గమ్మగంబూర మై గంద మలఁది
వెడఁదయాకనుదోయి విశ్వసుందరముగా కప్రంపుకాటుక కనులఁ దీర్చి
త్రైలోక్యవిజయ గర్వచ్ఛాయ తోఁచునం దంపుమోమున లేఁత నవ్వమర్చి
మధురభావమ్ములే మూర్తి మలచినట్టు - లున్న కాంతాసహస్రమ్ము లుభయపార్శ్వ
ముల బరాబరుల్ సేయ శ్రీ ముగ్ధమూర్తి-కుసుమబాణుండు పూఁదోటఁ గొలువుతీర్చె.

ఇవి చిల్కపల్కులో పువుముల్కిదార కాలి గండపెండారమ్ము కదలుసడియొ
ఇది పికీగానమో మదనదేవునిపార్శ్వ చరకన్యకాగళస్వాదుమధువొ
ఇది చివురెఱ్ఱనో యిందిరముద్దారు కొడుకుకన్నుంగవ కొసరుకెంపొ
ఇవి తేనెవాకలో చివురాకునడిదంబు వానియాకార సర్వస్వఖనులొ
అలరుతోటలనెల్ల యువాభిరామ - మూర్తి పరిణత భావసమ్ముగ్ధమూర్తి
కుసుమశరదేవతామూర్తి గోచరించె - తెనుఁగుతోటల నాశీర్వదించునట్లు.

---

1935 సంవత్సరమునకు

# "హిస్ మాస్టర్స్ వాయ్స్"

## గ్రామఫోనుల వెలలు.



| మాడల్ నెం. | పాతవెల | క్రొత్తవెల |
|---|---|---|
| 104 | రూ. 150 | రూ. 130 |
| 97 | ,, 80 | ,, 70 |
| 114 బ్రౌన్ | ,, 155 | ,, 140 |
| ,, వాల్నట్ | ,, 155 | ,, 145 |
| 113 వాల్నట్ | ,, 200 | ,, 180 |
| 130 మహోగని(ఫినిష్) | ,, 185 | ,, 160 |

| మాడల్ నెం. | పాతవెల | క్రొత్తవెల |
|---|---|---|
| 102 నలుపు | రూ. 120 | రూ. 100 |
| ,, వాల్నట్ | ,, 125 | ,, 110 |
| ,, రంగులు | ,, 130 | ,, 110 |

ఇదియే మా గ్రామఫోనులను
కొనుటకు మంచితరుణము!

## ది గ్రామఫోన్ కంపెని లిమిటెడ్,

45, సౌత్ పెరేడ్, బెంగుళూరు. No. 200.




# PETROMOL.

## రుచికరమైన లేహ్యము

దీనిలో

పెట్రోలియం, హైపోఫోస్ఫైట్స్ కలిసియున్నవి.

దగ్గులు, జలుబులు, రొమ్ముపడిశము,
యింక ఊపిరితిత్తులకు సంబంధించిన
సమస్తవ్యాధులను పోగొట్టును.

ఇంకను

నరములకుబలముకలిగించి రక్తమునువృద్ధిపరచును.
జీర్ణశక్తి బాగుగా కలుగును.

**Bengal Chemical : : Calcutta.**

"నేను అనేకజబ్బులకు కల్జానా వాడిచూచితిని. ప్రతిరోగివిషయములోను అది అద్భుతముగా గుణ మొసంగియున్నది. కల్జానా సర్వరోగనివారిణి యని నా యభిప్రాయము"

అని డాక్టరు డబ్లివు. డి. చారి
రంగూన్‌నుండి వ్రాయుచున్నారు.



## కల్జానా

వలన మీ దేహమునకు
బలము ఆరోగ్యము చేకూరును.

సుప్రసిద్ధులగు గొప్ప గొప్ప వైద్యులసలహాలను అనుసరింపుము. వారు తెలియపరచున దేమనగా బలహీనత, వ్యాధులు మొదలయినవి శరీరమునందు ఒకవిధమయిన పదార్థము లోపించుటవలన కలుగుచుండును. అట్టి పదార్థములు కలిసియున్న ఖనిజాహార మగు కల్జానా సేవించినచో తప్పక తిరిగి మామూలు ఆరోగ్యము, దేహదార్ఢ్యత చేకూరును.

ఇంతటి గొప్పపేరుగాంచిన బలప్రవర్ధకాహారమును సేవించుటకు ఆలసింపకుము. నేటినుండియే మొదలుపెట్టి వాడుము.

కల్జానా తీసికొన్నప్పటినుండియును సాధారణ బలహీనత, చిరాకుదనము, పండ్లు కదలుట, చర్మవ్యాధులు మున్నగునవి అంతరించును.

మంచి బలవంతుడవై యుండుము. నేటినుండి కల్జానా మొదలుపెట్టుము. మీ సమీపమునగల యే మందుల దుకాణములోనైనను దొరకును.

# Kalzana




నెం. 1

సదారోగ్యము కలిగించు ఖనిజాహారము.

చేతితో స్పృశింపబడలేదు.

# సంస్కృత ప్రత్యయములు

పరవస్తు వేంకటరామానుజస్వామి

౧. 'ఇండో-యూరపియన్' భాషలు ప్రత్యయ ప్రకృతి భాషలని యింతకుముందు మనకు దెలిసియున్నది. ప్రకృతిప్రత్యయభేద మాదినుండియు వచ్చినది గాదు. మాతృభాషోత్పత్తియైనతరువాత గొంతకాలమునకు ప్రారంభమై క్రమముగా నభివృద్ధిచెంది స్థిరపడినది. 'ఇండో-యూరపియన్' భాషాచరిత్రమున ప్రత్యయప్రాగభావావస్థ యొకటి యుండెడిదని మన మంగీకరింపవలసియున్నది. అందు పదములన్నియును ధాత్వభిన్నములుగా నుండిన వని చెప్పవచ్చును. దీనిని ధాత్వవస్థ యనవచ్చును. ప్రత్యయభాషలబట్టి మన మూహింపదగిన యవస్థకంటె నీ మాతృభాషకు ప్రాచీనతరావస్థయైయున్నది. దీనినే 'ఇండో-యూరపియన్' మూలభాష యని వ్యవహరింతుము.

౨. 'ఇండో-యూరపియన్' భాషలలో ప్రత్యయరహితము లని నిర్ణయించుటకు వలనుపడనిపదము లనేకములు గలవు. ఇవి ప్రత్యయప్రాగభావావస్థకు నిదర్శనములవలె దోచుచున్నవి. ఉ. స, గ్రీ. nu, లా. nu, ప్రా. ఐరిష్. nu, ప్రా. హై. జ. nu, లిథు. nu, ఇట్టివి కొన్ని ప్రత్యయరహితధాతురూపములైన పదములు లోపించి వానిస్థానమున ప్రత్యయవిశిష్టపదములు వ్యవహారములోనికి వచ్చినవి. ప్రత్యయవిశిష్టపదములలో ప్రత్యయములను భాగములను వదలిన బశిష్టభాగములు [illegible] సంబంధముతో వాక్యమునందు దప్ప ప్రత్యేకముగా సార్థకములని తలంచుట సరికాదు. మఱియు ప్రకృతిప్రత్యయ భేదావసరమున మాతృభాషలో గలిగిన పరిణామములను దెలిసికొనుట కాధారములు లేకుండుటచే [illegible] విభాగము సరియైనదనిగాని, మిగిలిన ధాత్వంశము [illegible]రూపముతో నున్నదనిగాని తలంచుటకు వీలులేదు.

౩. ప్రాతిపదికములును, పదములును సమాసజన్యములని భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము. పరస్పర సంబంధమునుంజేసి యనేకపదములు గలిసి యేకపద మైన నది సమాస మనిపించుకొనును. అట్టి సమాసమున బూర్వపదమునకుగాని, యుత్తరపదమునకుగాని వ్యస్త రూపముతో సంబంధము తిరస్కృతమైన దాని ప్రత్యేక స్వాతంత్ర్యము లోపించి సమాసము కేవలపద మనిపించు కొనును. ఒకప్పు డది యఖండపదముగాగూడ దలంప బడవచ్చును. ఉ. సో (స + ఉ), అవె. hauv. మఱి యొకప్పు డందలి యొకపదము తనస్వాతంత్ర్యమును విడనాడి యనేకపదాన్తరములతో సమానార్థమున వ్యవ హరింపబడి ప్రత్యయ మనిపించుకొనవచ్చును. వ్యస్త పదముతోడి సంబంధలోపము దీనియందు వివిధములగు విపరిణామములను పొందించును. ఈవిపరిణామములు స్వరూపమునగాని, యర్థమునగాని, రెంటియందునుగాని సంభవింపవచ్చును. ఉ. అభంమ్, మత్; వికట, కట; ఇంగ్లీషు. wifely, lic. ప్రకృతిపదము వ్యవహారము నుండి జారినయెడల సంబంధలోపము పూర్తియగును. ఇట్లు సంస్కృతమునం దగపడు అంచ్ ధాతువు భాషా న్తరములలో లోపించి తదర్థకశబ్దములు ప్రత్యయము లనిపించుకొనుచున్నవి. ఇట్లే లక్, లుక్, ల్యక్ రూప ములలో నగపడు నడాగమము మాతృభాషలోనే ప్రత్యేకవ్యవహారమును నష్టపోయి ప్రత్యయసామ్య మును బొందినది. ప్రకృతిపదము వ్యవహారములోనున్నను సమాసమున నది స్వరూపవిపరిణామమును బొందుటచే ప్రత్యయాన్తరములతో సారూప్యమును పొంది ప్రత్య యముగా దలంపబడి తద్ఘటితసమాస మేకపదముగా వ్యవహరింపబడవచ్చును. ఇట్లు అంచన్తశబ్దముల విభక్తు లలో క ప్రత్యయాన్తశబ్దరూపములవంటివి ప్రవేశించినవి. ఇట్టి విపరిణామము లతిమందముగా భాషల యవస్థాభేద ములన్నిటియందును జరుగుచుండును. ప్రత్యేకభాష లలో సమస్తపదములనుండి యేరీతిగా ప్రత్యయము లుత్పన్నములైనవో మాతృభాషలోగూడ నారీతిగానే

ప్రత్యయము లుత్పన్నము లై యుండవలయును. ప్రత్యయోత్పత్తి భాషల ప్రాచీనావస్థలకు గాని, నవీనావస్థలకు గాని నియతమై యుండలేదు. మాతృభాషలో ప్రారంభమై ప్రత్యేకభాషల యన్నిదశలలోను జరుగుచునే యుండును. అభివృద్ధిపొందుచున్న భాషలలో నిటు పైనిగూడ జరుగుచునేయుండును.

౪. సమస్తపద మఖండపదముగా దలంపబడి యంత మాత్రమున ప్రత్యయోత్పత్తిగలుగునని తలంచుటకు వలను పడదు. ప్రత్యయోత్పత్తి కీక్రిందిస్థితు (Conditions) లవసరము. ౧ సమాసమునందలి ముఖ్యపదము స్పష్టముగా దెలియుచుండవలయును. పదాన్తరములతో నది సంబంధమును కలిగియుండవలయును. ౨. విపరిణామమును బొందినభాగ మనేకపదములలో నేకార్థమున నుపయోగింపబడి యుండవలయును. ౩. ఆయర్థము గుణ క్రియాదిరూపముగాను, సామాన్యముగాను నుండవలయును. ఈధర్మములు పట్టినయెడల నాపదమును దిరస్కృత సమాసముగా (Obscured Compound) దలంపవలయును. దానిని వ్యవహరించువారి కది యఖండపదముని గాని, దానిలో విపరిణామమును బొందిన భాగము కతిపయవర్ణసారూప్యమువలన బ్రత్యయాన్తరములతో సమానముగా నుండుటచే ప్రత్యయవిశిష్టమని గాని తోపవచ్చును ఇట్టి తిరస్కృత సమాసములు ప్రత్యేకభాషలలో విశేషముగా నుండుటయే కాక 'ఇండో-యూరపియన్' మాతృభాషలోగూడ నుండినవని నిస్సందేహముగా జెప్పవచ్చును. ఈక్రిందిపదములు మాతృభాషలోనే యిట్టిస్థితి నుండినవని చెప్పవచ్చును. ఉ. శ్వశుర, గ్రీ. hekuros, గాథి. svaihra; స్వసర్, లా. soror; వింశతి, గ్రీ. fikati; నీడ, ఆర్మీనియన్. nist; పరుత్, గ్రీ. perusi; ప్రష్ఠ, ప్రా. హై. జ. first, ప్రా. ఇంగ్లీ. first; సో, ప్రా. పెర్షి. hauv, గ్రీ. ou. ఈక్రిందిపదములు సంస్కృతమునందుమాత్ర మగపడుచున్నవి. నేదీయ (న + సద్) భిషజ్ (భి + సజ్; చూ. అభిషజతి.)

౫. సమాసమున నొకపదము ప్రత్యయములోనికి మారినతరువాతను దానిననుసరించి క్రొత్తపదములు వ్యవహారములోనికి వచ్చును. ప్రత్యయార్థ మెంతవ్యాపకముగానుండిన నంతశీఘ్రముగా నూతనపదము లుత్పన్నములగును. ఏదైన నొకకాలమున నొకప్రత్యయము తత్ప్రత్యయఘటితపదముల ననుసరించి నూతనపదముల యుత్పత్తి కుపయోగించినయెడల నది సఫల (Fertile) ప్రత్యయమని గాని, సజీవ (Living) ప్రత్యయమనిగాని, లేనియెడల వంధ్యప్రత్యయమని (Barren) గాని, నిర్జీవ ప్రత్యయమని (Dead) గాని వ్యవహరింపబడును. ఒక కాలమున సజీవముగానున్న ప్రత్యయము కాలాన్తరమున నిర్జీవమై స్వల్పసంఖ్యాకములగు ప్రాచీనరూపములలో మాత్రము మిగిలియుండవచ్చును. ఇందులకు గారణములు ప్రస్తుతభాషాశాస్త్రస్థితినిబట్టి దురూహములుగా నున్నవి.

౬. 'ఇండో-యూరపియన్' భాషలలో బ్రకృతి ప్రత్యయవిభాగము సుకరము కాకుండుటచే ప్రత్యయముల స్వరూపమును నిస్సందేహముగా నిర్ణయింపజాలము. మనవిభాగమున ప్రత్యయమని తలంపబడుభాగమున బ్రకృత్యేకదేశము కలిసియుండిన నుండవచ్చును. కావుననే ప్రకృతిప్రత్యయవిభాగము నిర్దుష్టమైనది కాజాలదు, శాస్త్రసౌలభ్యముకొఱకు చేయబడినది.

౭. అఖండార్థమున బ్రయోగింపబడు ప్రత్యయము లనేకములు ప్రత్యేకభాగములక్రింద విభాగార్హములుగా నున్నవి. ఉ. -tro- (-tr + o) చూ. అరిత్ర, అరిత్రృ; -isto- (is + to) చూ. నవిష్ఠ, నవ్య. సాధారణముగా భాషలతరువాతి యవస్థలలో పైవిధముగు సంయుక్తప్రత్యయము లీక్రింది మూడుకారణములలో నేదైననొకదానివలన కలుగునట్లు తెలియుచున్నది.

i. శబ్దములయంశములు మాఱవచ్చును. అప్పుడాశబ్దములలోని ప్రత్యయమునకు జివరను నూతనముగా నొకవర్ణము చేరుట సంభవించును. రెండుశబ్దములలో నేదైన నొకవిభక్తిరూపము సమానమగుటచే నందొక శబ్దముయొక్క యంతము రెండవదానియంతముతో సమానముగా చేయబడును. దీనిననుసరించి మిగిలిన సజాతీయ శబ్దములలోగూడ నూతనరూపము లేర్పడును. ఇట్లు

అవెస్తాభాషలో న్త్ (శతృప్రత్యయము) అను ప్రత్యయము అన్తయనురూపమును పొందినది. అన్త్ ప్రత్యయాన్తశబ్దముల ద్వితీయారూపమును (Barant-em) అకారాన్తశబ్దముల ద్వితీయారూపములును (Aspe-m) సమానముగానుండుటచే అన్త్ ప్రత్యయాన్తశబ్దముకూడ నకారాన్తములని తలంపబడి ప్రత్యయమునకు అకారము చేర్చబడినది. ఈరీతిని ప్రత్యయరహితశబ్దములకు ప్రత్యయసంయోగముగూడ గలుగును. పాదశబ్దము పాత్ శబ్ద ద్వితీయావిభక్తిజన్యము (పాదమ్); ఇమా, ఇమాన్ అను విభక్తులలోని ఇమయను ప్రాతిపదికముగూడ నిట్లే యుద్భవించినది (ఇ + మ్).

ii. ప్రకృతిప్రత్యయము లత్యంతాశ్లిష్టము లగుటచే వానిసంధి తెలిసికొనుటకు వీలుపడకపోవుటచే శబ్దాన్తరములతో ప్రయోగింపబడినప్పుడు ప్రత్యయము పూర్వపదభాగముతో గలిసి యుపయోగింపబడుట సంభవించును. సరియగు విభాగ మశక్యమగుటచే నదంతయు ప్రత్యయమని భ్రమింపబడును. ఇట్లు ప్రథిమన్ శబ్దములోని ఇమన్ప్రత్యయము శబ్దాన్తరములలోని (ప్రథిమన్) ఇకారయుక్త మన్ప్రత్యయమేయని చెప్పవచ్చును.

iii. సమానార్థకములగు రెండు ప్రత్యేకప్రత్యయము లేకప్రత్యయముగా జేయబడును. ఇట్టి మేళనము భాషాశాస్త్రమున సంపర్క (Contamination)మని వ్యవహరింపబడును ఇట్టిప్రత్యయమేళనము తఱచుగా నర్థమును స్ఫుటతరముగా దెలియజేయునుద్దేశముతో చేయబడుచుండును- ఉ. జ్యేష్ఠతమ (జ్యేష్ఠ), పురుషత్వతా (పురుషత్వ, పురుషతా).

పై రెండవవిధమువ మూడవవిధమున సంయుక్త ప్రత్యయములు మాతృభాషలోనే యుత్పన్నమైనవని, చెప్పవచ్చును. పై రెండవతీరున మాతృభాషలోనే స్త్రీప్రత్యయమగు నీకారము శబ్దాన్తనకారముతో జేరి (తక్షన్, గ్రీ. tekton) నీయను రూపమును పొంది (తక్ష్ణీ, గ్రీ. tektaina) పతిశబ్దమునకు చేర్చబడినది. (పత్నీ, గ్రీ. potnia.) తమ, తాతి మొదలగు ప్రత్యయములు మూడవతీరున మాతృభాషలోనే యుత్పన్నములైనవి (t + ama ; ta + ti).

౮. పదనిష్పాదకప్రత్యయము లనియు, ప్రాతిపదికనిష్పాదకప్రత్యయము లనియు ప్రత్యయములను రెండుభాగములుగా విభజింపవచ్చును. పదనిష్పాదకప్రత్యయములు సుప్పులనియు, తిఙులనియు రెండువిధములుగా నున్నవి. ప్రాతిపదికనిష్పాదకప్రత్యయములు కృత్తులు ఉణాదులు అనియు తద్ధితలనియు రెండువిధములుగా నున్నవి. పైవిభాగములు పరస్పర విభిన్నములైనవి కావు. అనేకప్రాతిపదిక నిష్పాదకప్రత్యయములు పదనిష్పాదకములుగా వ్యవహరింపబడ నారంభించినవి. మఱియు సుప్తిఙులలోను, కృత్తద్ధితలలోను ననేకప్రత్యయములు సమానముగా నున్నవి.

ధాతువునకుగాని తదంగమునకుగాని చేర్పదగిన ప్రత్యయములకు ప్రాథమిక (primary) ప్రత్యయములనియు, ప్రాతిపదికకు జేర్పదగినవి యానన్తర(Secondary) ప్రత్యయములనియు ప్రాతిపదికనిష్పాదక ప్రత్యయములు రెండుభాగములుగా విభజింపబడినవి. ఈవిభాగమును సంస్కృతవైయాకరణులు ప్రప్రథమమున జేసియున్నారు. మొదటికక్ష్యను కృత్తు లుణాదులనియు, రెండవ కక్ష్యను తద్ధితలనియు వారు వ్యవహరించియున్నారు. ధాతృ, జనితృ మొదలగు శబ్దములలోని తృప్రత్యయము మొదటిజాతిలో జేరును. వృకీ, విదుషీ మొదలగుశబ్దములలోని ఈప్రత్యయము రెండవజాతిలో జేరును.

భాషాచరిత్రమున కీవిభాగ మంత ముఖ్యమైనది కాదు. మొదటినుండియు నిట్లు ప్రత్యయములు నియతముగా నుండినవనువిషయము నిర్వివాదాంశము కాదు. తఱచుగా నుపయోగింపబడు ననేక ప్రత్యయములకు ప్రాచీనకాలమున గూడ నీవిభాగము సరిపడియుండ లేదు. య ప్రత్యయము ప్రాచీనకాలమునుండి రెండువిధములుగాను నుపయోగింపబడినట్లు నిదర్శనములు గలవు. ఉ. యజ్య, గ్రీ. agios ; పిత్రియ, గ్రీ. patrios, లా. patrius. మఱియు దొలుత నొక

కక్ష్యలో జేరిన ప్రత్యయము కాలక్రమమున రెండవకక్ష్య లోనికి మాఱియున్నది. ఉ. మన్ (ఇమన్), యస్ (ఈయస్) ఇష్ఠ అను మొదలగు ప్రత్యయములు మొదట ధాతువునకు జేర్పబడుచుండి క్రమముగా బ్రాతిపదికకు జేర్పబడ నారంభించినవి. ఇట్టి విపర్యాసము మాతృభాషలోగూడ జరిగినట్లు తెలియుచున్నది. దీనికి యస్ (ఈయస్) ప్రత్యయమే నిదర్శనము. ఈప్రత్యయ ఘటితపదములు మాతృభాషలోనే ప్రాతిపదికాన్తరములనుండి యుత్పన్నమైనట్లు తలంపబడెను. సాడీయస్ (గ్రీ. Edion) అను శబ్దము స్వాదు (గ్రీ. Edus) శబ్దముతో సంబంధింపజేసి దానినుండి యుత్పన్నమైనట్లు తలంపబడెను.

౯ ప్రత్యయములలోగూడ స్వరవిపరిణామకృత భేదము లగపడుచుండును. ఉ తృ, తర్ (పిత్రా, పితృషు, పితరః, పితరమ్); ను, నో (చినుమః, చినోమి); స్, అస్ (సూనోః, హరేః, మరుతః); తి, తే (భవతి, భవతే). దీని ననుసరించి ప్రత్యయములకు ప్రబల (Strong) దుర్బల (Weak) రూపభేదములు పరిగణింపబడుచుండును దుర్బలరూపమున నచ్చులకు స్వరవిపరిణామకృత దుర్బలస్థితియును, ప్రబలరూపమున ప్రబలస్థితియును సంభవించును కాని యనేకశబ్దములలో ద్వైరూపములకు బరస్పరసాంకర్యము సంభవించి యొకరూపమునకు బదులు మఱియొకరూపము నగపడుచుండును. ఇట్టిరూపవిపరిణామమును భాషాశాస్త్రములో సమీకరణ (Levelling)మని వ్యవహరింతురు. రూపసమీకరణము స్వరవిపరిణామభేదముల యుత్పత్త్యనంతరము మాతృభాషలోనే ప్రారంభమైనట్లు తెలియుచున్నది. కాబట్టి ప్రత్యయముల కేసందర్భమున నెట్టిరూపము సంభవించునో నిస్సందేహముగా నిర్ణయించుట సాధ్యము కాదు. కాని విశేషపరిశ్రమము సలిపి భాషాతత్త్వవేత్త లనేకప్రత్యయములనుగుఱించి నిర్ణయములు చేసియున్నారు. ప్రథమాద్వితీయాసప్తమీ ఏకవచనములలోను, ప్రథమాద్వితీయాద్వివచనములలోను, ప్రథమాబహువచనములోను (కొన్నిశబ్దములలో ద్వితీయాబహువచనములోను) ప్రబలరూపమును, మిగిలిన విభక్తులలో దుర్బలరూపమును గనబడుచుండును. ఉ. పితా, పితః పితరమ్, పితరి; పితరౌ; పితరః కాని పిత్రా, పిత్రే, పితృభిః, పితృషు. ప్రత్యయమునందే కాక కొన్నిశబ్దములలో ప్రకృతిభాగమునగూడ నిట్టిరూపభేద మగపడుచున్నది. ఉ. పాత్, పాదమ్, పాదః; కాని పదే, పదః. ఈభేదము ననుసరించి విభక్తులుగూడ ప్రబలవిభక్తులనియు, దుర్బలవిభక్తులనియు రెండువిధములుగా వ్యవహరింపబడుచున్నవి. తిఙన్తరూపములలోగూడ బరస్మైపదైకవచనమునమాత్రము ప్రబలరూపమును, బరస్మైపదద్వివచనబహువచనములలోను, నాత్మనేపదమునందంతటను దుర్బలరూపములును నగపడుచుండును. ఇచ్చటగూడ నీభేదము ప్రకృతిభాగములోగాని, ప్రత్యయభాగములోగాని కనబడవచ్చును. ఉ. ఏమి, ఇమః; స్యాన్ గ్రీ. eimen (సీమ).

స్వరవిపరిణామకృతాభేదము కేవలోదాత్తాది స్వరవిపర్యయజన్యము కాని యర్థభేదకృతము కాదు. అయినను ద్వైవిధముగా రూపభేదములు విభక్తులలో నియమితమగుటవలన నర్థభేదముతో సంబంధింపబడినవి. ఇట్లుస్వరవిపరిణామమాత్రకృతభేదముగలపితా(పితార్), పితః (పితర్) అనురూపము లర్థభేదద్యోతకము లైనవి. ఇట్లే ఇంగ్లీషున sing, sang, bind, bound మొ. కనబడును.

౧౦. కతిపయసంస్కృతప్రత్యయముల రూపభేదములును, దద్విశిష్టపదములలో సంభవించినరూపసమీకరణమును నీక్రిందవివరింపబడినది:—

I ఈ (-ī-) ప్రత్యయము: ఇది స్త్రీప్రత్యయముగా మాతృభాషలోను, జన్యభాషలలోనుగూడ నుపయోగపడెను. ఈయర్థమున నిది యనంతరప్రత్యయముగా నుండెను. పుంనపుంసకశబ్దముల కిది చేర్పబడుచుండెను. అకారాన్తశబ్దములచివర నుండు అకార మిది చేరునప్పుడు లోపించుచుండెను. ఉ. వృక—వృకీ. క్వాచిత్కముగా నిది ప్రాథమికప్రత్యయముగాగూడ నుపయోగపడుచుండెను. ఉ. శమీ, శచీ. ఇట్టిశబ్దములు మాతృభాషలో నుండినవని నిర్ణయింపజాలము. రెండుభాషలలోనైనను సమానమగు పదము కనుపించుట లేదు.

ఏతత్ప్రత్యయాన్తశబ్దములు జన్యభాషలలో ననేకరూపభేదములను బొందియుండుటచే నీప్రత్యయమునకు సంబంధించిన స్వరవిపరిణామజన్యమగు మాతృభాషలోని ప్రబలరూపమును నిర్ణయించుట సులభసాధ్యము కాదు. యకారాదిప్రత్యయములు కొన్ని దుర్బలావస్థలో ఇకారాదిగా నగపడుటచే నీప్రత్యయమునకుగూడ నాకారము (-yā-) ప్రబలరూపముగా దలంపబడుచున్నది.

ఈప్రత్యయము రూపభేదములు పూర్వ మీక్రిందివిధమున విభక్తులలో విన్యస్తమైయుండె నని యూహింపబడినది.

ప్రథమైకవచనము—-ī- (ఈ). ఉ. దేవీ.

ద్వితీయైకవచనము— -ī- లేక -iy- (ఈ లేక ఇయ్) (-īm or -iym̥).

ఉ. దేవీమ్. స్త్రియమ్ అను మొదలగురూపములు పై రెండవరూపమునకు సంబంధించినవి. ఇవి న్యాయముగా స్త్రియ అను మొదలగురూపమున నుండదగినవి, కాని మకారాన్తములగు పై మొదటివిధమగురూపముల ననుసరించి వీనిచివరనుగూడ మకారము చేర్చబడినది.

ద్వితీయాబహువచనము— -iy- (ఇయ్) (-iy n̥s) ఉ. స్త్రియః.

హలాదివిభక్తులు— -ī- (ఈ) ఉ. దేవీభిః, స్త్రీషు.

మిగిలినవిభక్తులు— -yā- (యా) ఉ. దేవ్యాః, స్త్రియాః.

ప్రత్యయాన్తరమేళనము సంభవించినప్పుడుగూడ నీప్రత్యయ మీకారరూపమును బొందును. ఉ. పత్నీవన్త్.

సంస్కృతమున ఇకారాన్త స్త్రీలింగశబ్దములు కొన్నివిభక్తులలో నీకారాన్తశబ్దముల ననుసరించుచున్నవి. ఉ. గత్యాః, గత్యై, మఱియు ధాతుప్రతిరూపకములగు నీకారాన్తశబ్దములకును పూర్వోక్తప్రత్యయఘటితేకారాన్త శబ్దములకును గూడ రూపసాంకర్యము సంభవించినది. ఉ. ధియై, ధియాః.

ఈప్రత్యయమునకు నకారాన్తశబ్దములలోని నకారము చేరి నీయనుప్రత్యయ మేర్పడినది. నకారాన్తశబ్దముల స్త్రీలింగరూపములలో ప్రత్యయవిభాగము చేయునపుడు శబ్దాన్తనకారము ప్రత్యయభాగముగా భ్రమింపబడినది. (తక్షన్-ఈ: తక్ష్-నీ) ఇది శబ్దాన్తరములకు జేర్పబడినది. ఉ. పత్నీ, పలిక్నీ, హరిక్ణీ, పరుష్ణీ. ఇట్టి క్రొత్తరూపములు మాతృభాషలోనే ప్రారంభమైనట్లు పత్నీశబ్దపు భాషాన్తర రూపములు సూచించుచున్నవి. ఉ. గ్రీ. potnia.

వాతీ, యాతీ, పాతీ మొదలగు యాకారాన్త ధాతువుల శతృప్రత్యయాన్తశబ్దముల స్త్రీలింగరూపములలో నకారము లోపించుట న్యాయము కాదు. సతీ మొదలగు రూపముల ననుసరించి లోపించినది.

II. అన్ (-en-) ప్రత్యయము మొదటినుండియు నిది కర్తృవాచకపదనిష్పాదక ప్రాథమికప్రత్యయముగా నున్నది. ఇది ధాతుదుర్బలరూపమునకు జేర్పబడును. ఉ. ఉక్షన్, వృషన్.

ఈప్రత్యయమునకు en-on (అన్); ēn-ōn (ఆన్) అనునవి స్వరవిపరిణామజన్య ప్రబలరూపములుగాను, -n (న్)-n̥ (అ) అనునవి దుర్బలరూపములుగాను నున్నవి. దుర్బలరూపములలో మొదటిదియజాదివిభక్తులకు బూర్వమునను, రెండవది హలాదివిభక్తులకు బూర్వమునను గనబడుచుండును. ఉ. ఉక్ష్ణః, ఉక్షసు. ప్రత్యయాన్తరములు పరమగునప్పుడుకూడ నీప్రత్యయము దుర్బలరూపమును బొందును. ఉ. తక్ష్ణీ. విభక్తులలో రూపసమీకరణమువలన గొన్నిభాషలలో దుర్బలరూపము నశించి తత్స్థానమున ప్రబలరూపము ప్రవేశించినది. అట్టిభాషలలో ద్వివిధములగు ప్రత్యయాన్తరవిశిష్టపదములే దుర్బలరూపస్థాపనము చేసి పూర్వము దుర్బలవిభక్తులలో నిది యుండినదని సూచించుచున్నవి. ఈప్రత్యయముయొక్క ప్రబలరూపభేదములు పూర్వ మీక్రిందివిధమున విభక్తులలో విన్యస్తమైయుండెనని యూహింపబడినది.

ప్రథమైకవచనము.—పుం. లిం.—-ēn,- ōn-ఆన్) ఉ. ఉక్షా, తక్షా.

ప్రథమాద్వివచనబహువచనములు, ద్వితీయైకవచనము—పుం. లిం.— -en, -on (అన్)—ఉ. ఉక్షణమ్.

ప్రథమాద్వితీయలు. నపుం. లిం. ō(n), ē(n), n̥, -n̥- సప్తమ్యేకవచనము —-en- ఉ. ఉక్షణి.

యన్, ఇన్, మన్, ప్రత్యయరూపములుగూడ బైవిధముగానే యుండెను.

కర్తృవాచకములు కాని యన్నన్తశబ్దములు కొన్ని కలవు. ఉ. యువన్, అసన్, మూర్ధన్, ప్లీహన్. నపుంసకలింగశబ్దములు సామాన్యముగా సంగవాచకములుగా నున్నవి.

కొన్ని నకారాన్తశబ్దముల కికారాన్తశబ్దముల తోను (ఉ. అక్షన్, అక్షి; దధన్, దధి మొ) కొన్ని శబ్దములకు సకారాన్త శబ్దములతోను (ఉ. అహన్, అహస్; ఊధన్, ఊధస్) మఱికొన్నిశబ్దములకు శబ్దాన్తరములతోను (ఉ. అసన్, అసృజ్; యకన్, యకృత్; శకన్, శకృత్; ఆసన్, ఆస్య; ఉదన్, ఉదక; దోషన్, దోష్; యూషన్, యూష; పన్థన్, పథి, పథ) రూపసాంకర్య మేర్పడినది.

III. యన్ (-yen) ప్రత్యయము. ఈ ప్రత్యయము య ప్రత్యయమునకు అన్ ప్రత్యయము చేరుటచే (-yo- + -en) నేర్పడినదని చెప్పవచ్చును అకారాన్తశబ్దములు నకారాన్తములగుట యన్నిభాషలలోను అగపడుచున్నది. కావున మాతృభాషలోగూడ నిట్టి మార్పు జరుగుచుండినదనియు, నాయలవారిచే జన్యభాషలకును సంక్రమించినదనియు జెప్పవచ్చును.

సమాసమున నీకారాన్తశబ్దమునకు మాఱుగ అకారాన్తశబ్దమును వ్యవహరించుట మాతృభాషలోనే ప్రారంభమైనది. ఇదియే యకారాన్తప్రత్యయము నకారాన్తమగుటకు బీజమైనది. మాతృభాషలో సమానార్థకములగు అకారాన్తనకారాన్తశబ్దము లనేకము లుండినవనియు, వానిలో అకారాన్తశబ్దములే సమాసమున నేకారణముచేతనో వ్యవహరింపబడినవనియు, వాని ననుసరించి మిగిలిన నకారాన్తశబ్దములుగూడ అకారాన్తములుగానే సమాసమున వ్యవహరింపబడినవనియు మన మూహింపవచ్చును. ఇట్టినియమమే అకారాన్తశబ్దములు నకారాన్తము లగుటకు గారణమైనది. సమానార్థకములగు అకారాన్తనకారాన్తశబ్దముల కుదాహరణములు. ధర్మన్, ధర్మ; వక్వన్, వక్వ. శబ్దాన్తరములను నకారాన్తములుగా జేయునలవాటు జన్యభాషలలో నన్నికాలములయందును నగపడుటచే నకారాన్తశబ్దములు క్రమముగా నభివృద్ధి పొందినవి ఆర్యన్‌భాషలలో నజన్తశబ్దముల కొన్ని విభక్తులు నకారాన్తశబ్దముల ననుసరించుచున్నవి. ఉ. దేవానామ్, యుగాని, హారిణః, మొదలయినవి.

ఈ ప్రత్యయాన్త శబ్దములు కొన్ని అల్పతా (Diminutive) సూచకములుగాను, కొన్ని గుణక్రియావాచకములుగాను నున్నవి.

ఈప్రత్యయమునకు -yen -yon (యన్); -yēn, yōn (యాన్) అనునవి స్వరవిపరిణామజన్య ప్రబలరూపములుగాను -in, -in̥, ī n (ఇన్, యా, ఈన్) అనునవి దుర్బలరూపములుగా నున్నవి. విభక్తులలో వీనివిన్యాస మన్‌ప్రత్యయరూపములవలెనే యుండెను. ఆర్యన్ మూలభాషలో రూపాన్తరము లుండదగిన విభక్తులలో గూడ ఇన్ అను రూపము ప్రవేశించినది. అందుచే ఆర్యన్‌భాషలలో ఈప్రత్యయము ఇన్ అను రూపమునమాత్ర మగపడుచున్నది. ఉ. అర్చినః, అర్చిని. మఱియు హలాదివిభక్తులకు బూర్వము య (in̥) అనురూపముస్థానమున ఇ అను రూపమును (అర్చిభ్యః), ప్రథమైక వచనమున యా (yēn, yōn) అను రూపముస్థానమున ఈ అను రూపమును (అర్చీ) అన్నన్త (en) శబ్దముల ననుసరించి ప్రవేశించినవి. చూ. తక్షభ్యః, తక్షా.

సంస్కృతమున గొన్ని యల్పసంఖ్యాకములగు పదములలో నిది ప్రాథమిక ప్రత్యయముగా నుపయోగింపబడియున్నది. మదశబ్దమునుండి యుత్పన్నమైన మదిన్ శబ్దము మద్‌ధాతువునుండి యుత్పన్నమైనదని

తెలంపబడవచ్చును. ఇట్టిశబ్దముల ననుసరించి యీ ప్రత్యయము ధాత్వంతరములకు జేర్పబడినది. ఉ. అభిభాషిన్.

ఆకారమునకు బరమగునప్పుడు ఈప్రత్యయము యిన్ అను రూపమును పొందును. ఉ. స్వధాయిన్. ఇచట యకార మాగమముకాని యిన్ అనునది వేఱు ప్రత్యయము కాదు. ఇన్ ప్రత్యయమునుండియే మిన్, విన్ అను ప్రత్యయములు ఉత్పన్నములైనవి. ఉ. ఋగ్మిన్, మనస్విన్-మాన్తశబ్దమున కిన్ప్రత్యయయోగము సంభవించినప్పుడుండలి శబ్దాన్తమకారము ప్రత్యయభాగముగా తలంపబడి యందు జేర్పబడినది. ఇట్లేర్పబడిన మిన్ ప్రత్యయము శబ్దాన్తరములకు జేర్పబడినది.

IV. వన్ (-ven) ప్రత్యయము— ఈ ప్రత్యయము వప్రత్యయమునకు అన్ప్రత్యయము చేరుటచే (-vo-+-en) నేర్పడినదని చెప్పవచ్చును. ఉ. తక్వన్, తక్వ; ఋభ్వన్, ఋభ్వ, ఋక్వన్, ఋక్వ; పద్వన్, పద్వ. అకారాన్తశబ్దములను నకారాన్తములుగా జేయుటలనాటే దీనికి మూలమని చెప్పవచ్చును. (చూ. యన్ప్రత్యయము.)

ఈప్రత్యయాన్తశబ్దము లనేకార్థములను బోధించుచుండెను. వానిలో గొన్ని క్రియావాచక నామములుగా నుండెను. వీనిచతుర్థి సంస్కృతమున తుమున్నర్థమున ప్రయోగింపబడుచుండెను. చతుర్థియం దీప్రత్యయము యొక్క దుర్బలరూప ముండవలయును. ఉ. మఘోనే —కాని సప్తమి ననుసరించి యిందు ప్రబలరూపము నాత్యభాషలోనే ప్రవేశించినట్లగపడుచున్నది. ఉ. దావనే, గ్రీ. dofenai; అవె -vīdvanēi, గ్రీ. eidenai (From feidfanai)

ఈ ప్రత్యయమునకు -ven,-von (వన్), -vēn, vōn (వాన్) అనునవి స్వరవిపరిణామజన్యప్రబలరూపములుగాను -un, -un̥ (ఉన్, వ) అనునవి దుర్బలరూపములుగాను నున్నవి. విభక్తులలో వీనివిన్యాసము అన్ ప్రత్యయ రూపములవలెనే యుండెను. ప్రాచీనవిన్యాసము ఆర్యన్శాఖాభాషలలోనే యగపడుచున్నది. ఉ. ప్ర. ఏ. మఘవా; ద్వి. ఏ. మఘవానమ్; స. ఏ. మఘవని; తృ. ఏ. మఘోనా. సంస్కృతమున నిట్టిశబ్దములరూపములలో రెండువిధములగు సమీకరణము సంభవించినది. ౧. వన్నుప్రబలరూపము దుర్బలరూపస్థానమున ప్రవేశించినది. ఉ. అథర్వా, అథర్వాణమ్, అథర్వణి అనురూపముల ననుసరించి అథరుణా, అథరుణః అను మొదలగురూపముల స్థానమున అథర్వణా, అథర్వణః అను మొదలగురూపము లుత్పన్నములైనవి అవెస్థాభాషలో athaurunō (చతుర్థి) అనురూపము కలదు. ఇట్టి నూతన రూపోత్పత్తికి మన్నన్తశబ్దముల రూపములు సహకారియైనవి. ఉ. అశ్మనా, అశ్మనః. కొన్నిశబ్దములలో ప్రబలరూపము పూర్తిగా ప్రవేశింపక తదేకదేశమగు వకారముమాత్రము ప్రవేశించినది. ఇట్లు ఋతౌనా, ఋతౌనః అను మొదలగు రూపములకు మాఱుగా ఋతావ్నా, ఋతావ్నః అను మొదలగు రూపములు వ్యవహారములోనికి వచ్చినవి. ఇందులకు పీవ్నా, పీవ్నః అను మొదలగు పీవన్శబ్దరూపములును, మన్నంతశబ్దములరూపములునుసహకారములు గావచ్చును. ఉ. అర్యమ్ణా,అర్యమ్ణః. ౨. నపుంసక లింగోకారాన్తశబ్దముల సారూప్యమువలన గొన్నిశబ్దములకు (ఉ. ఆయన్) క్రొత్తరూపము లేర్పడినవి. ఉ. ప్ర. ద్వి. ఏ. ఆయు.

మిథునశబ్దము వన్ప్రత్యయాన్త శబ్దము. ఇందు దుర్బలరూపము (-un) స్థిరపడినది. చూ. అవె. mithwan.

V. మన్ (men) ప్రత్యయము - ఈప్రత్యయము మప్రత్యయమునకు అన్ప్రత్యయము చేరుటచే (mo + en) నేర్పడినదని చెప్పవచ్చును. (చూ. యన్, వన్ ప్రత్యయములు ) ఈప్రత్యయాన్తశబ్దములు చాలవఱకు క్రియావాచకనామములుగాను గొలదిగ కర్తృవాచకములుగాను నుండెను. క్రియావాచకనామముల చతుర్థి తుమున్నర్థమున ఆర్యన్ గ్రీకుభాషలలో వ్యవహరింపబడుచుండెను.

ఈప్రత్యయమునకు -men, -mon (మన్), -mēn, -mōn (మాన్) అనునవి స్వరవిపరిణామజన్య ప్రబలరూపములుగాను -mn, -mn̥, -mn̥ (మ్న,

అన్, మ) అనునవి దుర్బలరూపములుగాను నున్నవి. కొన్నిశబ్దములలో రూపసమీకరణము సంభవించినది. ఉ. వర్త్మనా, వర్త్మనః (చూ. నామ్నా, అర్యమ్ణా). యన్నన్తవన్నన్త శబ్దరూపముల సామ్యము ననుసరించి యివి వర్తనా, వర్తనః అని యుండవలయును. కాని సప్తమీవిభక్తిని (వర్త్మని) హలాదివిభక్తులను (వర్త్మభిః) ననుసరించి పైరూపములలో మకారము ప్రవేశించి యుండవలయును. ఈ విపరిణామ మార్యన్ మూల భాషలోనే జరిగినది. తుమున్నర్థమున వ్యవహరింపబడు చతుర్థీరూపములో భాషాన్తరములలోగూడ మకార మగపడుటచే (చూ. విద్మనే, గ్రీ idmenai) నిందలి రూపసమీకరణము మాతృభాషలోనే జరిగినదని చెప్ప వలసియున్నది.

ఇది ప్రాథమికప్రత్యయమైనను మాతృభాషలోనే యనంతరప్రత్యయముగా గూడ వ్యవహరింపబడినట్లు తెలియుచున్నది. ఉ. అర్యమన్—అర్య.

ప్రథిమన్ మొదలగురూపములు పృథు మొదలగు రూపములనుండి యుత్పన్నమైనవని తలంపబడుటచే ఇమన్ అను ననంతరప్రత్యయ మేర్పడినది. ఉ. ప్రథిమన్, ధూమ్రిమన్.

VI అర్, తర్ (-er-ter) ప్రత్యయములు-ఈ రెండు ప్రత్యయములును నేకార్థమున వ్యవహరింపబడు చున్నవి. తకారాన్తప్రత్యయాన్తరఘటిత శబ్దమునకు అర్ప్రత్యయము చేర్చుటచే తర్ప్రత్యయ మేర్పడి యుండవచ్చును.

ఈ ప్రత్యయాన్తశబ్దములు సామాన్యముగా కర్తృ వాచకములుగా గాని, సంబంధవాచకములుగా గాని యున్నవి. మొదటిజాతిశబ్దము లన్నియు తర్ప్రత్య యాన్తములుగా నున్నవి. రెండవజాతిశబ్దములలో అర్ ప్రత్యయాన్తశబ్దములు గూడ గలవు. ఉ. నర్, ఉషర్. కర్తృవాచకశబ్దము లన్నియును బూర్వము పుంలింగము లనే గలిగియుండెను. సంబంధవాచకము లర్థమునుబట్టి పుంలింగముగాగాని, స్త్రీలింగముగాగాని యుండినవి. ఉ. పితర్, మాతర్, కర్తృవాచకశబ్దములు విశేషణ ములుగా వ్యవహరింపబడుటవలన వానికి నపుంసకలింగ రూపములు సంస్కృతమున వ్యవహారములోనికి వచ్చి నవి. ఉ. దాతృ, దాతృణీ, దాతౄణి.

ఈ ప్రత్యయములకు er, or (అర్) ter, tor (తర్) -ēr, -ōr (ఆర్), -tēr, -tōr (తార్) అనునవి స్వరవిపరిణామజన్య ప్రబలరూపములుగాను, -r, -r̥ (ర్, ఋ) -tr, -tr̥ (త్ర్, తృ) అనునవి దుర్బలరూప ములుగాను నున్నవి. దుర్బలరూపములలో మొదటివి అజాదివిభక్తులకు పూర్వమునను, రెండవవి హలాదివిభ క్తులకు పూర్వమునను నగపడుచుండును. ఉ. పిత్రే, దాత్రే; పితృషు, దాతృషు—ప్రత్యయాన్తరము పర మగునప్పుడు గూడ దుర్బలరూపమే యగపడుచుండును. ఉ. భ్రాతృత్వ. విభక్తులలో రూపసమీకరణమువలన గొన్నిభాషలలో దుర్బలరూపము నశించి తత్స్థానమున ప్రబలరూపము ప్రవేశించినది. అట్టిభాషలలో బైవిధము లగు ప్రత్యయాన్తరవిశిష్టపదములే దుర్బలరూపస్థాపనము చేసి పూర్వము దుర్బలవిభక్తులలో నిది యుండిన దని సూచించుచున్నవి. ఈ ప్రత్యయముల ప్రబలరూపభేద ములు పూర్వ మీక్రిందివిధమున విభక్తులలో విన్యస్తమై యుండెనని యూహింపబడినది.

ప్రథమైకవచన.— -tēr, -tōr ఉ. పితా, దాతా. ప్రథమాద్వివచన బహువచనములు, ద్వితీయైకవచనము — -ter, -tor. ఉ. పితరమ్, పితరౌ, పితరః, గ్రీ. Patera, సప్తమ్యేకవచనము—ter ఉ. పితరి, దాతరి, గ్రీ. Pateri. కర్తృవాచకశబ్దముల ప్రథమాద్వివచనబహు వచనములలోను, ద్వితీయైకవచన ద్వివచనములలోను, నగ పడు దీర్ఘాకారము (o) కారజన్యమనికాని, (tor) ప్రథ మైకవచనరూపసమీకరణజన్య మనికాని చెప్పవలసి యున్నది. ఉ. దాతారౌ, దాతార, దాతారమ్.

దేవర్, నర్, ఉషర్, స్వసర్, ననాన్దర్ అను నవి అర్ప్రత్యయాన్తశబ్దములు. ఆర్యన్మూలభాషలో నపాత్ శబ్దము సంబంధవాచకమగుటచే తర్ప్రత్యయా న్తముగా మార్పబడినది. ఈవిపర్యయము తృతీయాద్యేక వచనములలో ప్రారంభమైయుండవలయును.



మీకు

# బలహీనత గలదా?

మీ బలహీనత జ్వరము, వ్యాధులవలన యేర్పడినను, లేక అతిగా పనిచేయుటవలన కలిగినను, ప్రసిద్ధికెక్కిన బలప్రవర్ధకాహారమగు సనటోజన్ తీసికొన్న యెడల, తిరిగి మీకు వెంటనే మామూలు ఆరోగ్యము శక్తి యొసగును.

బలహీనతను పోగొట్టుటలో సనటోజన్ ప్రపంచమంతటను పేరుమ్రోగినది. చికాకు, మాంద్యము, కడుపు నొప్పులు, ఆకలి లేకపోవుట మున్నగునవి అంతరించును. "సనటోజన్ నా యుద్దేశ్యములో జబ్బుపడినపిదప కోలుకొనువారికి వరప్రసాదమువంటిది. అలసట, బలహీనతలను వెంటనే పోగొట్టును." అని డాక్టర్ యస్. క్రిష్ణమూర్తిరావుగారు శేలమునుండి వ్రాయుచున్నారు.

సనటోజన్ ఒకసారి వాడిచూడుడు. నేడు ఒక సీసా కొని కొంతకాలము క్రమముతప్పకుండ వాడుడు. ఆరోగ్యము, బలము యెంత త్వరగా చేకూరునో తెలిసికొని మీరే యద్భుతమొందెదరు.

సనటోజన్ బజారులలో ప్రతిచోటను దొరకును.

# SANATOGEN

నిజమైన బలప్రవర్ధకాహారము.

చేతితో స్పృశింపబడనిది. (నెం. 2)

# రాజమోహన హేరాయిలు



శ్రేష్ఠమయిన సువాసనగల తలనూనె. మెదడుకు చల్లదనమును గలిగించి వెంట్రుకలను అభివృద్ధి చేయుటలో అత్యుత్తమ మయినది.

తలపోటు, మాడుపోటు, శిరోవేడిమి, చుండు మొదలగువాటిని పోగొట్టి కన్నులకు చలవ నొసంగి వెంట్రుకలను మృదువుపరచి, నల్లగా పెంచుటలో అత్యుత్తమ మయినది.

స్త్రీలకు ఆనందమును కలుగజేయును.

సీసా 1-కి రు. 0-12-0 6 సీసాలు రు. 4-4-0

పోస్టేజి ప్రత్యేకము.

## పి. శి. ఏ. అండు కంపెని,

ఆయుర్వేదసమాజం,

పెరిదేపి, నెల్లూరుజిల్లా.

---

ఆయుర్వేదశాస్త్రి, అష్టావధాని, కవిరాజ

కందుకూరి వేంకటసుబ్బారావుగారి

# కామామృతము

కామామృతము:—దేశదేశములలో ప్రఖ్యాతిబొందినది. రాత్రి 1 మాత్ర సేవించిన 1 గంటకే ఎంత నిస్సారమైనశుక్లమైనను సంసారసౌఖ్యము నీయఁగలదు. ఏవిధముగా నష్టమగుచున్న శుక్లమైనను 5 దినములలో నిలిపివేయును. మధ్యనపుంసకులు, నరములశక్తితగ్గినవారు ఈ మందునే పైకి పూతగాఁగూడ నుపయోగించుకొనవలెను. 20 మాత్రల సీసా 1-కి రూ. 2-0-0.

తేజోమృతము:—సెగరోగము (గనోరియా) ఎట్టిరంగుతో, ఎంతటిబాధతో, ఎన్ని సంవత్సరముల నుండియున్నను మొదటిమోతాదునుండియే సుగుణమును జూపించి పూర్తిగ నివారించును. 1 సీసా రు. 4-0-0

వృద్ధామృతము:—ఒక్కసీసా చాలును. నల్లమందువేసికొనుదురభ్యాసమునుదొలఁగించి ఆదాయమును బలమును వృద్ధిచేయును. 1 సీసా రు. 5-0-0

విలాసము:—అమృతాశ్రమము,

నెం. 2, ఏలూరు, పశ్చిమ గోదావరి.



Lost or Impaired
VITALITY
RESTORED
DIABETES EXPERT
SECURE A SPECIALIST'S ADVICE,
IN CASES OF LOST-VITALITY & DIABETES.
Full particulars from
WRITE LEGIBLY, STATING YOUR AGE, MARRIED OR SINGLE, OCCUPATION AND A BRIEF HISTORY OF YOUR CASE. CORRESPONDENCE STRICTLY CONFIDENTIAL.
DR. JEAN F. STRANDGARD,
(LATE OF BERLIN AND VIENNA),
BANGALORE, S. INDIA.
W

వైదికయుగాంతమున కర్తృవాచక తృజంతశబ్దము అస్ధాతురూపముతో జేర్చి భవిష్యదర్థమున ప్రయోగింపబడ నారంభించినది. ఈప్రయోగమునకు సంస్కృతభాషలో వ్యవహారము హెచ్చినది. ప్రథమపురుషమున అస్ధాతురూపములు విడిచిపెట్టబడినవి. తృజంతశబ్దప్రథమైకవచనరూపమే మధ్యమోత్తమ పురుషద్వివచన బహువచనములలోగూడ వాడబడినది. ఉ. దాతా, దాతారౌ, దాతారః; దాతాసి, దాతాస్థః, దాతాస్థ; దాతాస్మి, దాతాస్వః, దాతాస్మః.

VII. అత్ (nt) ప్రత్యయము——ఇది ప్రాథమిక ప్రత్యయము. ఉ. సన్త్, రుదన్త్. ఈ ప్రత్యయాంతశబ్దము లీ విశేషణములుగాను, విశేష్యములుగాను గూడ నున్నవి.

అకారాంతధాతువులమీద నీప్రత్యయము -nt, -nt (న్త్, అత్) అనురూపములను, దద్భిన్నమగువానిమీద -nt- (అన్త్, అత్) అనురూపమును బొందును. ఉ. రుదన్తమ్, రుదతః, రుదత్సు; సన్తమ్, సతః, సత్సు; చిన్వన్తమ్, చిన్వతః, చిన్వత్సు. ప్రథమైకవచనమున నీప్రత్యయము -ōn, -ont (ఆన్, అన్త్) అనురూపముల నొందుచుండెను. ఉ. భరన్, గ్రీ. Pheron.

దాన్త్, శాన్త్, పాన్త్ మొదలగు నాకారాంత ధాతుజరూపముల తృతీయాదివిభక్తులలో పూర్వము నకారము లోపించుటలేదు. సంస్కృతమున రూపాంతరములకు లోపించినది——ఉ. సన్తమ్, సతః. చూ. ఈప్రత్యయము. మహన్త్శబ్దము సర్వనామస్థానమున మహాన్త్ అనురూపమును బొందును. ఉ. మహాన్తౌ, మహాన్తమ్. వేదమున ద్వితీయైకవచనమున మహామ్ అనురూప మగపడుచున్నది. సమాసమున మహచ్ఛబ్దము మహా అనురూపమును బొందును. దీనిని బట్టి మహాన్, మహాన్ అనునకారాంతశబ్దము పూర్వముండెననియు, దానికిని మహత్శబ్దమునకును సంపర్కము (Coutamination) వలన మహాన్త్ అనురూప మేర్పడెనని పాశ్చాత్యు లూహించియున్నారు.

VIII. వత్ (vent) ప్రత్యయము——ఈప్రత్యయము సామాన్యముగా స్వత్వమును బోధించును. ఇది యనంతరప్రత్యయము. దీనికి vent, vnt (వన్త్, వత్) అనునవి స్వరవిపరిణామజన్య ప్రబలదుర్బలరూపములు. మాతృభాషలోనే కొన్ని విభక్తులలో ఈప్రత్యయస్థానమును వస్ (ves, vos) ప్రత్యయ మాక్రమించిన దనుట కార్యన్ భాషలలోను, గ్రీకుభాషలోను నిదర్శనములు గలవు. ప్రథమైకవచనము- పుంలింగము - అవె. -vās, సంబోధన ప్రథమైకవచనము - పుంలింగము. వై. వస్, అవె. vō, గ్రీ. tēos (చూ. వస్ ప్రత్యయము.) సంస్కృతమున ద్వివచనబహువచనముల ననుసరించి ప్రథమైకవచనమునను, సంబోధనప్రథమైకవచనమునను నకారము ప్రవేశించి vān (వాన్), van (వన్) అను రూపము లేర్పడినవి.

అశ్వావన్త్, సుతావన్త్, శక్తీవన్త్, విషూవన్త్ అను మొదలగు శబ్దములలో ప్రకృత్యంతవర్ణము దీర్ఘమైనది.

తప్రత్యయాంతశబ్దమునకు పైప్రత్యయమును చేర్చి యట్టిశబ్దమును గ్రియాపదముగా వ్యవహరించునలవాటు సంస్కృతమున గలదు. ఉ. మాం న కశ్చి ద్దృష్టవాన్.

పైప్రత్యయమునకు సమానార్థక మగు మన్త్ ప్రత్యయ మొకటి కలదు. ఈప్రత్యయమునకుకూడ వస్ ప్రత్యయరూపభేదములకు సమానములగు రూపభేదములు గలవు. ఉ. ప్రథమైకవచనము. అవె. మాస్; సంబోధన ప్రథమైకవచనము, వై. మస్; గ్రీ. temos.

IX యస్. (-yes) ప్రత్యయము.—— ఇది మొట్టమొదట ప్రాథమికప్రత్యయముగా నుండెను. క్రమముగా నేతత్ప్రత్యయాంతశబ్దములకు శబ్దాంతరములతో సంబంధమేర్పడి వానినుండి యితరము లుత్పన్నమైనట్లు తలంపబడినవి. ఉ. స్వాదీయః, గ్రీ. ēdiōn; స్వాదు, edus. ఇట్లీప్రత్యయ మనంతరప్రత్యయముగామారి నూతనశబ్దములలో స్పష్టముగా నట్లుపయోగింపబడినది. ఉ. బ్రహ్మీయః.

పూర్వమీప్రత్యయాన్తశబ్దమున బ్రకృతి ప్రబల రూపమును గలిగియుండినట్లును, ఇష్ఠప్రత్యయాన్తశబ్దమున దుర్బలరూపమును గలిగియుండినట్లును దెలియుచున్నది. తత్సంబద్ధమగు మూలశబ్దమున బ్రకృతి, సామాన్యముగా దుర్బలరూపమును గలిగియుండెను. ఉ. లఘు, పృథు—ప్రథీయః; లఘిష్ఠ. కాని వైభేదములు రూపసాంకర్యమువలన లోపించినవి. ఉ. లఘీయః, ప్రథిష్ఠ, బంహిష్ఠ.

ఈప్రత్యయమునకు -yes, -yos (యస్) (-yēs,) -yōs (యాస్) అనునవి స్వరవిపరిణామజన్యప్రబలరూపములుగాను -is (ఇస్) అనునది దుర్బలరూపముగాను నున్నవి. దుర్బలరూపము ద్వితీయాబహువచనాది దుర్బలవిభక్తులలో నగపడుచుండెను. ప్రబలరూపములు విభక్తులలో నీక్రిందివిధముగా విన్యస్తమై యుండినవని యూహింపబడినది.

ప్రథమైకవచనము పుంలింగము yōs-(యాస్).

ప్రథమైకవచనభిన్న ప్రబలవిభక్తులు - పుంలింగము yos (యస్).

సంబోధనప్రథమైకవచనము - పుంలింగము yos (యస్) వై. వస్యః.

సప్తమ్యేకవచనము...yes (యస్).

ప్రథమాద్వితీయైకవచనములు - నపుంసకలింగము yos (యస్) ఉ. వస్యః.

ఆర్యన్‌భాషలలో దుర్బలవిభక్తులలో is (ఇస్) అనుదాని స్థానమున yes, yos (యస్) అనురూపము ప్రవేశించినది. ఉ. వస్యసే, వస్యసః, వస్యోభిః. సంస్కృతమున సంబోధనప్రథమైకవచనమున yos(యస్) అనురూపముస్థానమున యాన్ అనురూపము ప్రవేశించినది. ఉ. వస్యన్. ఇది వన్నన్తశబ్దముల ననుసరించి జరిగిన మార్పు.

పూర్వము yes (యస్) ప్రత్యయార్థమున yen (యన్) ప్రత్యయమొకటి యుండియుండుననియు, నీ రెండుప్రత్యయములకును సంపర్కమువలన సంస్కృతమునందలి ప్రథమాద్వితీయా విభక్తులలో నిరూపము లేర్పడియుండుననియు భాషాశాస్త్రజ్ఞు లూహించియున్నారు. (యాస్ + యాన్ = యాంస్). మహాన్త్ అనుప్రాతిపదిక మీరీతిగానే ప్రత్యయద్వయసంపర్కమువలన నేర్పడియుండునని ముందే చెప్పబడినది. చూ. అత్ ప్రత్యయము. ఆయుః, ఆయున్, బుభ్వః, బుభ్వన్ అనుమొదలగు వైకల్పికరూపములు పైయూహను బలపఱచుచున్నవి.

తీక్ష్ణీయ (తీక్ష్ణ), బ్రహ్మీయ (బ్రహ్మన్) ద్రఢీయ (దృఢ) అనుమొదలగురూపములు సంస్కృతమున నూతనముగా నామములనుండి యుత్పన్నమైనవి.

X వస్ (-ves)—ఈ ప్రత్యయము ప్రథమమున ననభ్యస్తధాతువునకుగూడ జేర్పబడుచుండినట్లు తోచుచున్నది. విద్వః, సహ్వః అను మొదలగు రూపము లిట్టి వాడుకనే సూచించుచున్నవి.

ఈ ప్రత్యయాన్తశబ్దములలో బ్రకృతి, కొన్ని భాషలలో దుర్బలరూపమునను, మఱికొన్ని భాషలలో ప్రబలరూపమునను నుండుటచే బూర్వము మొదటిరెండు విభక్తులలోను ప్రబలరూపమును, మిగిలిన విభక్తులలో దుర్బలరూపమును గలిగియుండెనని యూహింపబడినది.

ఈ ప్రత్యయమునకు -ves, -vos, (వస్); vēs, vōs (వాస్) అనునవి స్వరవిపరిణామజన్యప్రబలరూపములుగాను, us (ఉస్) అనునది దుర్బలరూపముగాను నున్నవి. దుర్బలరూపము ద్వితీయా బహువచనాది దుర్బలవిభక్తులలో గనబడుచుండెను. ప్రబలరూపభేదములు విభక్తులలో నీక్రిందివిధముగా విన్యస్తమైయుండినవని యూహింపబడినవి.

ప్రథమైకవచనము, పుంలింగము ves, vos, ఉ. అవె. vidvas.

ప్రథమైకవచనభిన్న ప్రబలవిభక్తులు. పుంలింగము vos.

సంబోధనప్రథమైకవచనము. పుంలింగము vos ves, ఉ. వై. విద్వః.

సప్తమ్యేకవచనము. ves.

ప్రథమాద్వితీయైకవచనములు. నపుంసకలింగము vos.

పాశ్చాత్యభాషలలో వస్ ప్రత్యయాన్తశబ్దార్థమున వత్ ప్రత్యయాన్తశబ్దము లగపడుచున్నవి. కాని హలాదివిభక్తులకు పూర్వ మగపడు వత్ ప్రత్యయాన్తరూప (ఉ. విద్వద్భిః విద్వత్సు) మాప్రత్యయముతో సంబంధించినదని తలంప నవసరము లేదు. వస్ ప్రత్యయము కూడ హలాదివిభక్తులకు బూర్వము వత్ అనురూపమును బొందును. కాని తృతీయాదివిభక్తులలో నీప్రత్యయము ఉస్ అనురూపమును బొందవలయును గాన ఉత్ అనురూప మేర్పడవలసియుండగా వత్ అనురూప మేర్పడుట వస్ వన్త్ ప్రత్యయముల సంబంధమున వ్యవహారమున జరిగియుండును. వన్త్ ప్రత్యయాన్తశబ్దములకును వస్ ప్రత్యయాన్తశబ్దములకును ప్రథమాసంబోధన ప్రథమావిభక్తుల యేకవచనమున రూపసామ్య ముండుటచే (ఉ. వాన్, వన్) హలాదివిభక్తులలో గూడ రూపములు సమానముగా జేయబడియుండవచ్చును. విద్వత్తర, విద్వత్తా, విద్వత్త్వ మొదలగు శబ్దములుగూడ నిట్టి రూపసాంకర్యజన్యములని గానే తలంపవలయును.

సర్వనామస్థానములలో ననుస్వారము వన్త్ ప్రత్యయాన్తములసాహచర్యమున ప్రవేశించియుండవచ్చును. ఆశబ్దములలో ప్రథమైకవచనేతరవిభక్తులలోని నకారము (వన్తః, వన్తమ్) మొదట ప్రథమైకవచనమున ప్రవేశించియుండవచ్చును. తరువాత నందుండి తత్సమానమగు వస్ ప్రత్యయాన్తశబ్దముల ప్రథమైకవచనముల జొచ్చియుండవచ్చును. తరువాత నందుండి మిగిలినవిభక్తులకు వ్యాపించి వస్ ప్రత్యయాన్తశబ్దములరూపములను, వన్త్ ప్రత్యయాన్తరూపములను సదృశములుగ జేసియుండవచ్చును. ఇట్లే వన్త్ ప్రత్యయాన్తశబ్దముల సంబోధన ప్రథమైకవచనములందలి వస్ అనురూపము వన్ అనురూపముగ మొదట మారియుండును. తరువాత దీని ననుసరించి వస్ ప్రత్యయాన్తశబ్దముల సంబోధనప్రథమైకవచనములోని వస్ అనురూపము వన్ అనురూపముగా మారియుండవచ్చును.

M. V. R.



'గొబ్బి'

# ప్రతిష్ఠ

పాటిబండ మాధవశర్మ
(కవితావిహారము)

అది పరిణద్ధయుష్మదధరామలరక్తిమ కాదు సుమ్ము! నా
హృదయకటాహనిస్సరదసృక్పరికల్పితలేపనమ్ము; అ
య్యదియు భవద్దృగంచల మహఃప్రభ కాదు! మనోజ్ఞరాగసం
పదమలమైన నాహృదయపంకజ రక్తిమ కాని నెచ్చెలీ!

చెదరిన రత్నఖండికలచేత పరశ్శతధా విభిన్నవ
ర్ణ దురధిగమ్యరూప శబలత్వవికారిత దర్శనమ్ము, దు
ర్విదిత యథార్థ మీహృదయభిత్తికి చెక్కలుడుల్చి శోభన
ప్రద నవనీతసౌధ పరిపాండువుగా నొనరించి యుంచితిన్.

తళుకులనీను నిర్మలసుధాపరిధౌతములైన కుడ్యవీ
థుల పురతస్థలిన్ నిలిచి తొంగలిఱెప్పల నొత్తిగించి శీ
తల ప్రణయాతిమోహన సుధాపరిషేచనకృత్కటాక్ష దృ
క్కులఁ దిలకింపు మింత కనుగొందువు నీసుకుమార రూపమున్!

ఎఱుఁగుదు నేఁట తేపటఁ గ్రమింతువు మద్భవనాంగణస్థలిన్,
దరదరవింద సుందరపదద్వయి కందునొ యంచు ముందుగా
పరువులుగా నమర్చితిని పల్లవపేశలమైన నాయెదన్
వెఱవక సాగిరమ్ము, విలపింపదు, వ్రీలదు, మాడిపోవదున్.

ఈవిమలప్రభాతమున ఈకృపణాత్మక సౌధవీథికిన్
దేవతవోలె నీవు చనుదెంచెడు వేళ, భవత్పదద్వయీ
పావన నిక్వణాంతములు వైదికఋక్కుల నాలపించె, శో
భావరణీయవక్త్రమున భాసిలె ముగ్ధములై యుషస్త్విషల్!

అవిరళధాళధళ్య హృదయాంగమ సౌరభమిద్ది దేవతా
భవనము! తత్ప్రసాద పరిపావిత చిత్తముతోడ శాంతివై
భవనిభృతాంతరంగమున వర్ధిలు మిచ్చట కోటివర్షముల్!
భవభయ విస్మృతిప్రద మహాయనిబర్హణ మిద్ది నెచ్చెలీ!

“మధుకణములు” నుండి.

# నన్నెచోడుడు—వచనరచన

గొబ్బూరు వేంకటానందరాఘవరావు

## ౧

### నన్నెచోడుని కాలము

నన్నెచోడకవిరాజవిరచితమైన కుమారసంభవ కావ్యరాజము ఆంధ్రలోకముయొక్క దౌర్భాగ్య వశమున చిరకాలము మఱుగుననుండియు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి పరిశ్రమవలన వెలువడి విద్వజ్జనమనోహరమై ప్రకాశించుచున్నది. ఈ కావ్య కర్తయగు నన్నెచోడుడు నన్నయభట్టారకునకు పూర్వు డనియు, క్రీ. శ. ౯౪౦ సంవత్సరములో నితడు పాశ్చాత్యచాళుక్యులతో యుద్ధముచేసి రణరంగమున నిహతుడయ్యెననియు, తత్పూర్వము రాజపదభ్రష్టుడై యజ్ఞాతవాసము చేసి మరల లబ్ధరాజ్యుడై కొంతకాల మేలెననియు శ్రీరామకృష్ణ కవిగారు గ్రంథపీఠికలో వ్రాసిరి. శ్రీ బుట్టా శేషగిరిరావు పంతులుగారీకాల నిర్ణయము నంగీకరింపక నన్నెచోడుడు నన్నయతర్వాతి వాడనిరి. క్రీ. శే. రావుబహద్దరు కందుకూరి వీరేశ లింగము పంతులుగారు తమ 'కవిజీవితములు' కడపటి కూర్పులో నీకుమారసంభవకర్త నన్నయకుపిమ్మటివా డనియే నిర్ణయించిరి. ఆంధ్రచరిత్రకారులగు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారీయంశమునుగూర్చి ఇంకను పరిశోధింపవలయుననిరి. క్రీ. శే. తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు కుమారసంభవకావ్యమును బలుమారు చదివినను నన్నెచోడుడు నన్నయకీవలివాడే యనుభావము స్పష్టపడినదని ఆంధ్రసాహిత్యపరిషత్తువారి మధుర సభలో ప్రకటించిరి. క్రీ. శే. కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుపంతులుగారీనిర్ణయమునకు సమ్మతించిరి. శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారిట్టి యభిప్రాయమునే తెలియజేసిరి.

ఈకావ్యమును నాయోపినకొలది పఠించియు, దీనిగూర్చి పండితులు, విమర్శకులు వ్రాసినవ్యాసములు చదివియు, చర్చించియు చూడగా నన్నెచోడుడు నన్నయకు తరువాతివాడనియే నాకు తోచినందున ౧౯౩౩-వ సంవత్సరములో నేను ముద్రింపించిన గద్య వాఙ్మయచరిత్ర ప్రథమసంపుటము ౨౩-వ పుటలో నిట్టి యభిప్రాయమునే తెల్పి, తునిలో జరిగిన సాహిత్యపరిషత్సభలో ప్రకటించితిని.

పిమ్మట బ్రహ్మశ్రీ నడకుదుటి వీరరాజుపంతులు గారు కొవ్వూరులో జరిగిన సారస్వతసభలో నన్నెచోడుడు నన్నయకు పూర్వుడనిరి. ఆవెనుక తేణుకు సాహిత్యపరిషత్సభలో కూడ వారట్లే తెలిపిరి. బ్రహ్మశ్రీ జయంతిరామయ్యపంతులుగారును, బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారును వీరరాజుగారి హేతువులు సరియైనవికావని ఖండించిరి. ప్రస్తుతము మా ఎలమంచిలి బోర్డు హైస్కూలు ప్రధానోపాధ్యాయులుగా నున్న బ్రహ్మశ్రీ వెంపరాల సుబ్రహ్మణ్యము పంతులుగారు ఆంధ్రేతిహాసపరిశోధకమండలివారి పత్రికలో (Vol I. Pages 144-48) నన్నెచోడుడు నన్నయకు పూర్వు డనియే వ్రాసిరి.

ఈ వ్యాసములన్నియు నాయోపినకొలది చదివితిని. అందలి విషయములనుగూర్చి ఆయావ్యాసకర్తలలో కొందరితో చర్చించితిని. మఱియు గవర్నమెంటు శాసనపరిశోధకులుగా నున్న శ్రీ కృష్ణమాచార్యులవారు ఒకప్పుడు చామర్లకోట రాగా వారితోకూడ నన్నెచోడునికాలమునుగూర్చి చర్చించితిని. ఈ కాలనిర్ణయమునకుపకరించినశాసనముల ప్రతులను, వాటిపై వ్యాఖ్యానములను నా నేర్చుకొలది చదివిచూచితిని. కాని నా పూర్వాభిప్రాయమును మార్చుకోవలసినంత బలమైన సాక్ష్యము లభింపలేదనియే నాకు తోచుచున్నది. మఱియు నీక్రింద వివరింపబడిన వచనరచనలను పరిశీలింపగా [చూ. పుట ౨౮ Etc.] నన్నెచోడుడు నన్నయ

వచనరచనల ననుసరించెనని నాకు దృఢముగా తోచు చున్నది.

శ్రీరామకృష్ణకవిగారు గ్రంథపీఠికలో "ఒక వేళ మనకవి ప్రాచీనుడు కాదయ్యెనేని కొఱంత యేమి? రత్నము లెందు నెప్పుడు పుట్టిననేమి? చవులు గలవేని రాజభోగ్యము లగునుగదా? సర్వవిధముల నిరుపమానము నీకావ్యరత్నము కవి యెవ్వడైన, నెప్పుడుండి నను సర్వజనాదరణీయమే" అని వ్రాసియున్నారు. శ్రీ వీరరాజుపంతులుగారును కొవ్వూరు సారస్వతసభలో చదివినవ్యాసములో "ఇవ్విధమున బహువురచే బొగడ బడుచున్న యిమ్మహారాజకవిరాజశిఖామణి యెప్పటి వాడైననేమి? ఎప్పుడున్నవాడే! ఎప్పటికి నుండు వాడే" అని వ్రాసినారు.

నిజము. రసగ్రహణదక్షులై కావ్యామృతమును గ్రోలి యానందించువారలకు సాధారణముగా నట్లే తోచును. "కాలనిర్ణయమునుగూర్చి ఎందుకీ వాదప్రతి వాదములు? ఎవరుముందైననేమి? ఎవరు వెనుకైన నేమి? ఏమి కొంప మునిగినది? ఉభయులు కవులే. ఉభయులకావ్యములు చదివి యానందింపరాదా?" అని యనేకులు ప్రశ్నించుచుందురు.

కాని చరిత్రకారుని కట్లనిపించదు. ఆంధ్ర జాతియొక్క వాఙ్మయపరిణామము పరిశీలించు వారికి ఎవరికావ్యము పూర్వమో, ఎవరికావ్యముపరమో, ఎవరిరచన లెవరి కెట్లు మార్గదర్శకములయ్యెనో, ఏకాలపు రాజకీయ, సాంఘిక నైతికాదివిషయము లే కావ్యరచన మున కెట్లు హేతువులైనవో, ఏకాలపువారియుత్తమ భావము లే కవిరచనలో నెట్లు ప్రకాశించుచున్నవో గమనించుచు, విమర్శించుచు, వాఙ్మయచరిత్ర వ్రాయ బూను భాషాసేవకునకు కవియొక్కయు, కావ్యము యొక్కయు కాలనిర్ణయము మిక్కిలి యావశ్యకము. ఇందు కెంతటిపరిశ్రమయైన కావలసియుండును. "మన నన్నెచోడు డేకాలమున నుండెనో నిర్ణయింపదగిన యాధారములు సంపూర్ణముగా లభింపవయ్యె. లోకము లోని మహాకవులగతులన్నియు నిట్లె సందిగ్ధమత భేదముల పాలయ్యె. లోకమితనికవితాప్రభావ మిట్టిదని యెఱుంగగాబోలు గాలము తనపట్టీయక మనల వంచించు చున్నది" అని శ్రీరామకృష్ణకవిగారు రెండవభాగపు పీఠికలో వ్రాసినారు. కాని యింతవఱకు జరిగిన పరిశోధనలు, విమర్శనములు, చర్చలు నిష్పక్షపాత బుద్ధితో పరిశీలించిచూడగా ఇప్పటికి తేలినపర్యవసానమువలన నన్నెచోడుడు నన్నయకు తరువాతివాడని నిశ్చయించుటయే సమంజసమని నాకుతోచుచున్నది.

## ౨

నన్నెచోడునిగూర్చి ప్రశంసించుసందర్భమున నాంగ్లవాఙ్మయ పాఠకులకు ఆల్ ఫ్రెడ్ మహామహుడు (Alfred, the great) స్ఫురణకు రాగలడు. ఉభయులును దేశాధీశులే. ఉభయులు రాజ్యభ్రష్టులై కొంతకాల మజ్ఞాతవాసము చేయుచు దేశసంచార మొనరించి మరల రాజ్యముల బడసినారు. ఉభయులును గొప్ప భగవద్భక్తులు; గాఢమతావేశము గలవారు; పూర్వగ్రంథములను పఠించి స్వభాషలలోనికి పరివర్తనముచేసి శాశ్వతమైన భాషాసేవ చేసినారు. కాని రాజకీయములో ఆల్ఫ్రెడ్ మహామహునకు గల ప్రాముఖ్యము నన్నెచోడునకు లేదు. నన్నెచోడునకు గల కవితాప్రభావము ఆల్ఫ్రెడ్ నకు లేదు. ఆంగ్ల రాజు కేవల వచనగ్రంథరచయిత. నన్నెచోడుడు మహా కావ్యకర్తయైన కవిరాజు. ఉభయులు దైవభక్తి, మతావేశము, గురుభక్తి విశేషముగాగల మహావిద్వాం సులు; నిష్కపటులు. కార్యనిర్వహణతత్పరులు. భక్తి వినయసంపన్నులు. వీరివచనరచనలు స్వచ్ఛములు; సుబోధ ములు; సజీవములు; రసవంతములు; మనోహరములు. వీరిశైలి శబ్దాలంకారభూయిష్ఠమై, అక్షరరమ్యత కలిగి, శ్రుతిసామ్య, వృత్త్యనుప్రాసాదిచమత్కార రచనల చేతను, సజాతీయపదరచనలచేతను లలితమై విన సొంపుగా నుండును.

ఆల్ ఫ్రెడ్ మహామహుడు క్రీ. శ. ౮౭౧ మొదలు ౯౦౧ వరకు రాజ్యమేలెను. ఇతడు పోపుగ్రిగరీ, బీడ్,

బోథియన్ మొదలగు పూర్వక్రైస్తవాచార్యులు రచించిన మతగ్రంథముల నాంగ్లీకరించినాడు.

నన్నెచోడుడు ౧౨-వ శతాబ్దివాడు. మహోన్నతాశయుడు. మనఃపూర్వకముగా మతమునకు, భాషకు అపూర్వసేవచేసినాడు. ప్రజల మతైకజీవనమునకు తనజీవితము సమర్పణచేసినాడు. అపూర్వకల్పనలయం దద్వితీయుడు. భావాంబరవీధిని నిరర్గళముగ విహరించిన మహామతి. నన్నపార్యుని పరిశ్రమచే పెంపొంది 'పార్వతీపతిపదాబ్జధ్యాన పూజా మహోత్సవములతో' పూతమై ప్రవహించుచుండిన ఆంధ్రవాఙ్మయ ప్రవాహము నిరంతరాయముగ విజృంభింపజేసి 'హరిహరచరణారవిందవందనాభిలాషి యగు తిక్కనమనీషి' కందిచ్చిన పరమపూజ్యుడు. కావ్యము మతవిషయప్రాధాన్యముకలదైనను, అపూర్వకథారచనసమ్మేళనముచే నహహా యనిపించుచున్నది. విసువుగొలుపువెఱ్ఱిప్రాతలు వ్రాయక, మధురకథారచనము సాధనముగా గ్రహించి, ఈశ్వరభక్తిపూర్వకమైన శైవమతావేశక్రియాసంస్కారములను, హృద్యమై యద్భుతమొందించుసౌందర్యకల్పనలతో రమ్యముగా కూర్చి, పాఠకులహృదయసీమలందు మరుపురాకుండ ముద్రింపగల్గినకళానిధి. మనకు తెలిసినంతవఱ కీతడే యాంధ్రమున ప్రథమరాజకవి. ఈతని కవితాసామర్థ్యమునుబట్టి ఆంధ్రకవిసింహాలలో నీత డొకయగ్రస్థానము నలంకరించుచున్నాడు. రాజకవి యనువిశేష మటుండ ఈతనికి ప్రకృత్యంశములయందుగల స్వతస్సిద్ధము, నకల్పితము నైన ప్రేమయు, జీవితమునం దానందమును, అపూర్వమైన పరిశీలనశక్తియు, సౌందర్యగ్రహణదక్షత్వమును, మతాదిసమస్తవిషయములను హృద్యముగ వర్ణించుచు రచించి చెప్పగల సహజశక్తియు, అద్భుతకల్పనాసామర్థ్యమును, అపూర్వకావ్యకళానైపుణ్యమును కలవాడగుట భాషలో నాచంద్రతారార్కము నుండదగిన దివ్యకావ్యరచనాకౌశలమును ఈతనికడ ముఖ్యముగా గమనింపదగియున్నవి. విశేషించి నన్నెచోడునికాలమునాటికి, జైనబౌద్ధాది అవైదికమతములకును, శైవవైష్ణవాదిభేదములుగల వైదిక హిందూమతములకును తీవ్రమైన యాఖరిపోరాటము జరుగుచున్నందున ప్రజాసామాన్యమునకు స్వమతవ్యాప్తికావలయుననియు, తన్మూలమున తమమతములకు ప్రాబల్యప్రాధాన్యములు లభింపవలయుననియు నాకాలపు విద్వాంసులు గాఢప్రయత్నములు సల్పుచుండిరి. పరమశివభక్తుడగు నన్నెచోడుడు ఈశ్వరునిచే తన కనుగ్రహింపబడిన సమస్తశక్తిసామర్థ్యములను ఈశ్వరప్రీతికరముగ, శైవగురూపదేశక్రమమున శైవమతాచారవ్యాప్తికై వినియోగించి ఇహపరముల సాధించుటకై యీకావ్యరాజము రచించెనని చెప్పదగియున్నది. ఈమూలముగా ఆంధ్రప్రపంచమునకు శైవోత్తములయుత్తమభావములును, ఔత్సుక్యమును చక్కగా వ్యావర్ణింపబడినవి.

నన్నెచోడుడు ఈకావ్యమును స్వతంత్రముగ రచింపలేదు. ఉద్భటుడను కవిచంద్రుడు పూర్వము నసాలంకారముగాను, గూఢవస్తుమయ కావ్యముగాను కుమారసంభవమను సంస్కృతకావ్యము రచించి హరు మెప్పించెనని ౧-౨౧ లో నన్నెచోడుడే చెప్పియున్నాడు. ఉద్భటుని కావ్యముచూచి నన్నెచోడు డీయాంధ్రకావ్యమును రచించెను. కాని యీకావ్యము బానిస-భాషాంతరీకరణముకాదు. కాళిదాసకృత కుమారసంభవము నీతడు చదువకపోలేదు. చదివి దాని కింకను వన్నెతెచ్చుపద్యములు కొన్ని రచించినాడు. స్వతస్సిద్ధమైన భావము లెన్నో కూర్చి యీరెండు కావ్యములకు మెఱుగుబెట్టినాడు. కావ్యమునందలి వివిధాంగములకు తూచినట్లు సరిపడిన పొందిక, చక్కని కథానిర్వహణక్రమము, ప్రత్యక్షములా అనిపించు వర్ణనలు కలిగి కావ్య మెంతో రమ్యమై యొప్పారుచున్నది.

ఈకవిరాజు మహాకార్యధురంధరులని ప్రఖ్యాతిగనిన సగర, భగీరథ, శ్రీరామాదు లుదయించిన సూర్యవంశమునందు, కాశ్యపసగోత్రమున చోడబల్లికిని, శ్రీసతికిని కుమారుడై జన్మించి పెక్కుయజ్ఞములు చేసినట్లు చెప్పుకొన్నాడు.

ఈకుమారసంభవము ౧౨ ఆశ్వాసములు ౨౦౨౦ రచనలు గల పద్యగద్యాత్మకమైన చంపూకావ్యము.

ప్రాచీనాలంకారికులు నిర్ణయించినవిధమున "అష్టాదశ వర్ణనల పరిపూర్ణంబై, దశప్రాణంబుల సప్రాణంబై, నవరస భావభరితంబై, షట్త్రింశదలంకారాలంకృతంబైన" దివ్యకథ. సప్తసంతానములలో కృతియే యుత్కృష్టము గావున, తన గురువరప్రభావముచే తనకు లభించిన కవితాశక్తివలన 'సద్రసబంధురమై'న యీప్రబంధము రచించి యీతడు తనగురువగు జంగమ మల్లికార్జునునికే దీనిని వినయముతో నంకితముచేసి యున్నాడు. ఈపద్య మెంతోరమణీయముగ నుండుట చేత నీక్రింద నెత్తి వ్రాయుచున్నాను.

సీ. శరధినీరులు పయోధరములు కొనివచ్చి
      కురిసి వారధియందు గూర్చునట్లు
   చేనబండినవిత్తు చేనికఫలకాంక్షఁ
      జేర్చిక్రమ్మఱ వెదవెట్టునట్లు
   రోహణాచలపతి కూహించివరరత్న
      సంచయంబున విభూషించినట్లు
   తీర్థాళి కర్థిఁ దత్తీర్థోదకంబుల
      నెసకంబుగా నర్ఘ్యమిచ్చినట్లు
   నింగిముట్టియున్న జంగమమల్లయ
   వరమునందుగనిన వస్తుకవిత
   దగిలి వారియంద నెగడింతురవికి
   నీపమున నర్చలిచ్చు పగిదివోలె. I. ౪౯.

ఈతడు తనగురువగు జంగమమల్లికార్జునునకు, శివునకును అభేదము చెప్పియున్నాడు. ఉన్నతగోత్ర సంభూతుడనని యీతడు చెప్పుకొనుటయటుండ, గురుదైవములకు భేదము పాటింపక, ఇట్టివినయముతో తన కృతిని గురుసమర్పణచేసిన యీకవి 'నతులగుచుజా మహోన్నతితనర్చుచు' అను భర్తృహరి వాక్యమును సార్థకముచేసి మనకు పూజ్యుడగుచున్నాడు.

ఈతనియున్నతజన్మము, మహనీయశీలము, వీరపురుషోచితగౌరవము, అపూర్వ కార్యనిర్వహణకుతూహలము, ప్రాచీనవాఙ్మయ పఠనాప్రాగల్భ్యము, స్వమతాభిమానావేశములు, నిరుపమాన శౌర్యధైర్యములు, స్వార్థత్యాగము, అకాలమరణము వలంచుకొనినపుడాంగ్లవాఙ్మయపోషకులగు సర్ ఫిలిప్ సిడ్నీ (Sri Philip Sidney) యను వీరవిద్వచ్ఛిఖామణి స్ఫురణకు రాగలదు.

భౌతికదేహము వీడినను, జగత్పితలగు పార్వతీపరమేశ్వరుల వివాహము, కుమారోత్పత్తి, తారకాసుర సంహారము నను ముఖ్యాంశములుగల కుమారసంభవ కావ్యరాజ మాంధ్రభాషలో రచించి శాశ్వతయశోదేహముతో నొప్పారుచున్నాడు.

ఈకవిచంద్రుని వచనరచనావిధానమును పరిశీలించి, అందలి మర్మములు గ్రహించి, ప్రాశస్త్యము నెఱుంగయత్నించుటయే యిటుపై మన ముఖ్యోద్దేశము.

## 3

కుమారసంభవము పండ్రెండాశ్వాసములలో పద్యగద్యముల మొత్తము సంఖ్య ౨౦౨౦. అందు వచనముల సంఖ్య ౫౯౫. అందును 'అంత', 'మఱియును' మొదలగు కుఱుచవచనముల సంఖ్య ౧౭౫. శతాంశరీతిని లెక్కించిచూడగా నూటికి ౨౯ వచనముల రచించెననియు, కుఱుచవచనములు నూటికి సుమారు ౯ కలవనియు తేలుచున్నది.

ఇక రచనలో వచనగ్రంథపరిమితి గమనించుదాం, పండ్రెండాశ్వాసములు మొత్తము గ్రంథములో ౬౩౬౬ పంక్తులు గలవు. ఇందు ౧౨౯౫ వచనపంక్తులుగలవు. అనగా నూటికి ఇరువదిపంక్తులు వచనము రచింపబడినదని స్పష్టముకాగలదు. నన్నయభట్టారకుడు రచించిన భారతపర్వములలో నించుమించుగ సగబాలువచన మున్నట్లు కనుగొంటిమి. [చూ. ఆం. క. వా. చరిత్ర. I. ౩౮ పుట] తిక్కనసోమయాజి మూడింట నొకపాలు వచనములరచించెను. నన్నెచోడుడు ఐదింట నొకపాలు మాత్రము వచనగ్రంథరచనచేసెను. సంఖ్యయందును, రచించిన వచనపంక్తుల పరిమితియందునుగూడ నన్నెచోడుడు గద్యకు చాలతక్కువప్రాముఖ్యము నిచ్చినాడు.

నన్నయభట్టారకుడు ప్రతి యాశ్వాసమునందలి రెండవరచన 'అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె' నని వచనమే రచించెను. తిక్కనసోమయాజికూడ ఆపద్ధతినే యవలంబించి 'దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె' నని వ్రాసెను. నన్నెచోడు డాపద్ధతిని వ్రాయలేదు. ప్రథమాశ్వాసమునందు ౧౨ పద్యములైనతరువాతగాని యతడు వచనరచన కుపక్రమింప లేదు.

రెండవయాశ్వాసమునందు రెండుపద్యముల తరువాతను, ఐదవయాశ్వాసమునందు మూడుపద్యముల తరువాతను వచనములు రచించెను. తక్కిన యాశ్వాసములలో రెండవరచన వచనమేయైనను, అది నన్నయ, తిక్కనల రచనలవలె యొక్కటేమువ్వున నారంభమగుటలేదు.

ఇక నేయే ప్రయోజనములకు నన్నెచోడుడు వచనముల రచించుచుండెనో పరిశీలింతము.

౧. ముందు చెప్పబోవునదేమో సూచించు నుపక్రమణశీలములైన రచనలకు (Introductory):

I. ౬౭—నా చెప్పంబూనిన దివ్యకథాసూత్రం బెట్టిదనిన.

౨. పూర్వోత్తరకథా సందర్భములను చక్కగా కలుపుట కనువైన సముచ్చయార్థకరచనలకు:

'మఱియు', 'తదనంతరంబ', 'అంత' లోనగునవి.

3. పూర్వోదాహృతములైన యంశములనే సంగ్రహముగా పేర్కొని యుత్తరకథావివరణమున కుపక్రమించు సందర్భమున వచనములు రచింపబడుచుండెను.

చూ: I ౨౨౧ దక్షప్రజాపతి శిరచ్ఛేదమైన పిమ్మట నతనిభార్య "దొడరనడుగులిడుచు దుఃఖాతిశయమున దల్లడిల్లుచున్న దక్షుధర్మపత్నివచ్చిపురుష శైక్షంబు వేడుచు జాలడవుల నభవు మ్రోలబడియె".

౨౨౨. ఇట్లనాథస్మృతి ననన్యశరణ్యయై శరణు వేడు దక్షాంగనంగని.........

౪. ఆశ్వాసాంత గద్య.

౫. పట్టికలు: ఏదేని యొకజాతి లేక గణమును గూర్చి ప్రశంసించునపు డందలి యుపజాతులను వివరించి తెల్పుచు పట్టికలు రచింపబడినవి. అవి నన్నయభట్టారకాదులపట్టికలంత దీర్ఘములు గావు.

I. ౯౪. వేదండఘటలు: "అందమందమృగభద్రజాతి, గిరచర, నదీచరో, భయచరదేవాసురాంశ, కలభ, కరేణు, ధేను, వశున, భిక్షుపోతకాదివన్యగజయూథంబు."

౬. వర్ణనలు. నన్నెచోడు డేదేని యొకయంశమును వర్ణించునపు డందలి వివిధాంతర్భాగములయొక్కగాని, ఉప-తరగతులగాని పట్టికలు రచించుచు వర్ణించుట సాధారణముగా గమనింపదగియున్నది.

పార్వతి తపోవర్ణనము

I. ౭౪౭: అట్లు గౌరీనగంబునందు పరమేశ్వరుంగోరి ఘోరతపంబుసేయం దొడంగి వితస్నానార్చనాహోమాదినిత్యకర్మంబుల, శాకాహార, ఫలాహార, పర్ణాహార, జలాహార, మారుతాహార, నిరాహారాది మహాతపోవ్రతంబుల, నందావాసాశ్రికవాసైకపాదాంగుష్ఠోర్ధ్వ బాహూర్ధ్వ ముఖాధోముఖాగ్ని ముఖపంచాగ్ని మధ్యాద్యనేకోగ్రతపంబు లం ప్రాణాయామప్రత్యాహార ధ్యానధారణ, జపసమాధులనుషడంగయోగంబుల, మనోవాక్కాయకర్మంబుల నతినిష్ఠానుష్ఠానంబుల పరమేశ్వరారాధన తాత్పర్యయై నిరంతరానంతతపోవృత్తిం బ్రవర్తించుచుండె నంత"

ఒకప్పుడు కవి తాను వర్ణింపబూనిన యంశము లందలి యుపతరగతు లన్నింటిని వివరముగా పేర్కొనక, సంఖ్యాదికముమాత్రము సంగ్రహముగా పేర్కొని విడుచుటయు కలదు. చూ: II ౭౦౯.

"మఱియు ద్రమ్యాది నవవిధదంత వధలను, బ్రహ్మత్యాద్యష్టవిధహస్తవధలను ప్రోక్తాదిపంచవిధ గాత్రవధలను, బృహదాదిచతుర్విధరాతాదివధలను సంయోగ వధాద్యేకాశీతి వధలను, వైహాయసాద్యనేక

విధగాత్రవధలను జకుర్బలంబుల నిట్లు ప్రచ్చి వధావన నేయుచుండె."

ఇట్లే II. ౭౦౩, ౭౦౭ కూడ చూడనగును.

సృష్టిసౌందర్య విశేషములు.

సముద్రవర్ణనము: I. ౧౧౬

మహాపరువవజ్రపాత భీతాయాత క్షోణిధర పక్షవిక్షేప క్షుభితానేక నక్రచక్రతిమితిమింగిల తద్గళ కుంభీర కుంభీనసాద్యనేక జలచరకులాకులితలులితాలోలకల్లోలానూన ఫేనాయమాన శుక్తిముక్తాఫలాభిరామంబు.

హిమవంతుడు: I. ౨౬౨.

సకల సుగుణమణిగణంబులు నిజఘనమణిగణంబులతో బిన్నసరంబులై వెలుగునజాండకరండకర్పూరపాలీశలాకయుంబోలె దేజరిల్లు ప్రాలేయ కుత్కీలక చక్రవర్తి.

అందుపై నీశ్వరునిసమాధిస్థానము: I. ౩౩౩.

సహకార కర్పూర నారికేరనమేరు దేవదారు మందార పారిజాత జంబూ జంబీరాశోకానీకలతామందిరాంతరంబున హిమవంతునిరంతరోపార్జితానంత పుణ్యఫలంబునుంబోలె నవదాతశిశిరద్యోతితశశికాంతశిలాతలంబుసమాధిస్థానంబుస్వీకరించి......

స్త్రీ పురుష వర్ణనలు

పార్వతి. I. ౩౨౨.

అఖిలలావణ్యపుణ్యాధిదేవతయు, నశేషసౌభాగ్యలక్ష్మియు నపార గుణమణిగణభూషణానర్ఘ నాయక మణియు నిఖిల భర్తృదారికావిమలముక్తాఫలహారతరల సరసీరుహరాగరత్నంబునుం బూర్ణయౌవనాలంకృతయు నై యొప్పుచున్న పార్వతి.

మునికుమారులు: I. ౭౦౮.

పత్ర, పుష్ప, ఫల, మూల నీవారాకారవల్మవేద్మకుశాహరణార్థము విహరించుచున్న మునికుమారులు.

మునిముఖ్యులు: I. ౭౩౫.

...అనేక ప్రకారంబుల వేదశాస్త్రపురాణాగమ సారవృత్త్యాధ్యాత్మ శాస్త్రవిధి హేయోపాదేయపదార్థంబుల నిజశిష్యగణంబులకు విస్పష్టంబుగా వ్యాఖ్యానంబు చేయుచున్న మునిముఖ్యులు.

ఇట్లే రమ్యదీర్ఘ సమాస ఘటితములు, నానావిధ శబ్దాలంకారభూషితములు నగు వర్ణనలనేకములు గలవు. చూ. స్కందుస్కంధావారవర్ణన II. ౬౦౩, ౨౧; కుమారుని పట్టాభిషేకము II. ౪౭౨, ౭౫, ౭౭, ౭౯, ౪౧; ఇట్టిచోట్ల కేవల పద్యములుగాని, కేవల వచనములుగాని యున్నచో విసుపుపుట్టవచ్చును. చదువరుల కట్టి ప్రయాసములేకుండ పద్యగద్యము లొకదానివెనుక నొకటిగా రచింపబడుటగలదు. చూ. యుద్ధవర్ణన.

౭. కథావివరణరచనలు (Narratives): ఈకవి సింహుని రాజధానియైన ఒరయూరుసమీపమున ప్రవహించు కావేరీస్రవంతివలెనే యీతని కథావివరణరచనలు మృదుమధుర రసభావభరితములై మసలుటలేక మంచివడి గలిగియుండును.

మునిపత్నులు: II. ౪౧౨, ఇట్లు ధర్మచారిణులు నిజాధీశ్వరులచేతం బరివర్జితలై మాఋవలుకనోడి పరమేష్ఠిపాలికింజని యకామకకృత దోషంబులం బతుల చేతం బరిభవింపబడితిమని విజ్ఞాపించినం జతురాననుండు తద్వృత్తాంతం బెఱింగి పతివ్రతావృత్తియందు వ్రతభ్రష్టలైనను నీశ్వరుపేర్యంబు ధరియించిన పుణ్యఫలంబున జ్యోతిర్లోకంబునం గృత్తికలై ప్రవర్తింపుడని వరంబుగా విరించి కరుణించి నియమించిన మహాప్రసాదం బని పుణ్యగతికి నరిగిరి.

౯. సంభాషణార్థములు: వర్ణనాదులయందువలె నీరచనలు దీర్ఘసమాసభూయిష్ఠములుకావు. కాని శబ్దాలంకారములయందు కవికి గల నైసర్గికాభిమానముచేత నిందుకూడ వృత్త్యను ప్రాసములు, సజాతీయపదరచనలు విశేషముగా కనబడుచున్నవి.

I. ౧౭౬. దక్షుం డందఱ నాక్షేపించి "మీరు భిక్షువలనిభయంబున దాక్షాయణి పక్షంబునం బలికినం

గర్మబాహ్యుండగు పాషండుండు పూజ్యుండగునె—
ఇందు 'క్షు' వృత్త్యనుప్రాసముటుండ భిక్షు, భయము, పక్షము, బలికి, బాహ్యుడు, పాషండుడు, పూజ్యుడు. అను శ్రుతిసామ్యము (Alliteration) కూడ గమనింప దగినది.

I. ౪౦౭ ఇంద్రుండు ప్రార్థించిన నప్పనికై కొని "నాకిది యేమిగహనంబ" ని దర్పకుండు దర్పించి.

౧౦. **నానావిధములు:** ఈరచనలలో పైనివివరింపబడిన రచనలలో రెండుగాని, అంతకెక్కువ సంఖ్యగలవిగాని వివిధ-తరగతులరచనలు పెక్కుచేరియుండును. చూ II. ౭౨.

ఈశ్వరుడు హిమవంతునిపురమున ప్రవేశించుట

"పరమేశ్వరుండు పౌరజనంబుల నయనేందీవరంబుల నిజాననేందుచంద్రికాజాలంబుల నలంకరించుచు తదీయావలోకనామృతనయనకలశంబు లాత్మీయదయావలోకనామృతానందరసాపూర్ణంబుసేయుచు విపణిమార్గంబుగడచి ప్రాలేయాచలచక్రవర్తిరాజమందిరంబుప్రవేశించి తదంతఃపురాంగనాదత్తపంచమణి శేషాక్షతాకలితోత్తమాంగుండగుచు జనుదెంచి కనకమయరమ్యహర్మ్య మణిభద్రంబున రుద్రుండు వృషభేంద్రుండేర్చి డిగ్గి నగపతిదత్తసముత్తుంగమణిసింహాసనాసీనుండయ్యె నంత హిమవంతుండు మృదుపదంబులుగడిగి తదీయామలజలపవిత్రీకృతాత్మీయపంచిమందిరాభ్యంతరుం డై పరమానందంబున.

ఇందు సందర్భోచితవర్ణనలతోగూడిన కథావివరణముకలదు.

## ౮

## శైలియందు గమనింపవలసినవిశేషములు

నన్నెచోడునిరచనలో **ముఖ్యముగా** చూపట్టునది సజాతీయపదరచన. నన్నయభట్టారకునిరచనలలో నిట్టివి లేకపోలేదు. [చూ ఆం. స. వా. చ. I. ౯౬]. కాని నన్నెచోడునిరచన కిదియొక ముఖ్యలక్షణమని చెప్పవలసినంత తఱుచుగా నగపడుచున్నది.

I. ౫౧. దివ్యకల్పంబు కల్పించు మహాకవిముఖ్యుడు.

I. ౧౧౪. అర్చనలర్చించి.

I. ౧౪౬; II. ౩౭౬. అలంకారాలంకృతము.

I. ౨౧౭. నారక్షోచితదండంబులదండించి.

I. ౫౯౫. దహనదాహము.

I. ౩౧౬, ౨౬౨, ౯౬౬, Etc. వర్ణింపందగిన వర్ణనలు.

II. ౪, లక్షణలక్షిత; ౪౯ నియోగమునను నియోగించి; ౬౨౧ నర్తకినర్తనస్థానము Etc.

మఱియు రచించునపుడు మొదట నొకశబ్ద ముపయోగించెనేని యాశబ్దమే ఆవాక్యములో పలుమఱు దొరలునట్లు పేర్చికూర్చుటయం దీకవికి మిక్కిలి యభిలాషముకలదు.

I. ౧౨౩ అశేష విశేషంబులు విశేషించుచు.

I. ౩౬౬ వాక్పతికి బృహస్పతి.

,, ౩౯౧ శృంగారయోని శృంగారరస......

,, ౩౯౩ మోహనాయుధుడు వజ్రాయుధునాస్థానము.

,, ౩౯౬, ౪౧౦ సురరాజు వలరాజు సుందరాకారము.

సురపతికి రతిపతి

,, ౪౦౫ సురవల్లభుడు రతివల్లభునకు

,, ౪౫౧ నాగాభరణు నాగబంధంబున స్తుతించె.

,, ౫౩౫, ౯౧౩ గిరిశుండు రజతగిరి కరిగిన గిరిజ.

I. ౨౭౪ చతుర్ముఖుండు పంచముఖున కభిముఖుండై.

### శబ్దాలంకారములు

"అక్షరములు సూక్తులార్యులకు కర్ణరసాయనలీలగ్రాలగా" రచింతునని ప్రతినవట్టి (I. ౩౫) కావ్య

మొనర్చినవాడగుట యీకవిరచనలలో నేదేనియొక శబ్దాలంకారము జూపట్టని పంక్తు లించుమించుగా లేవని చెప్పవచ్చును.

## ఛేకానుప్రాసములు

I. ౧౪౩. కలకలప్యాది; I. ౫౫౦. చలచలం బగునడలది.

I. ౫౯౧, ౮౨౬. రణరణకవ్యథ; I-౫౯౭. కందెఅదెఅచిన.

I. ౮౦౫. లీయమానమానస; II, ౨౦౮. ప్రభా ప్రభావప్రసరము; ౩౯౮,—బేటబేటంబు. ౮౮౯ విక్ష తక్షతజాతము. ౮౯౧. తిగ్మకరకరప్రహతి Etc.

## శ్రుతిసామ్యము (Alliteration)

I. ౧౪౬. విధివిహితవిధానము; ౨౦౯. కానక కాందిశీకులై కనుకనంజని; II. ౯౪౬. పరిమితపరి వారపరివృతుడు. II. ౯౮౪. విభూతివిశేషరమణీయం బులంగని విస్మితులగుచు.

I. ౪౭౪. స; I. ౪౯౪. ద; II. ౪. ము; I. ౩౩౩. 'శ' ౯౬౬. ప్రళయనిర్ఘాత, ప్రతిధ్వనులు, ప్రేలిపడ. Etc.

## వృత్త్యనుప్రాసములు

ఈతని వృత్త్యనుప్రాసములలో 'న్త' వృత్తిబహు ప్రాయికముగా కానవచ్చుచున్నది. I. ౭౯౦. అంతం బార్వతి వసంతానంతలతాంతసంతతినంత కాంతకా క్రాంతపూజాత్యంత హోమాదిక్రియలం బ్రవర్తించు చుండునంత. ఇట్టిరచనలే,

I. ౧౮౩, ౫౨౭, ౫౩౫, ౫౮౩, ౮౨౮, ౯౦౨, ౯౦౯.

II. ౨, ౩౨౬, ౪౦౬, ౬౪౫, ౭౧౪, ౮౪౧, ౯౧౧ సంఖ్యలు గల వచనములలో నగపడుచున్నవి.

'క్త' I. ౩౪౮, ౭౩, ౨౩౮ లోను,

'క్ష' I. ౨౩౮, II. ౮౮౯ ,,

'ద్ద' I. ౩౬౪ ,,

'ట' I. ౩౬౬. లోను వృత్త్యనుప్రాసము లున్నవి.

'ట', 'క' I. ౯౮౯. ఇట్టివింకననేకములు గలవు.

## యమకాదులైన మరికొన్ని శబ్దవృత్తులు

I. ౪౧౬ దుర్నిమిత్తంబులు నిర్నిమిత్తంబుపుట్టుట.

, ౫౭౭ మరణపరిచ్ఛేదంబు కచ్ఛేదంబుజేసి.

II. ౮౪౫. సిద్ధులనప్రసిద్ధులంజేసి సాధ్యుల హేలాసాధ్యులంజేసి విద్యాధరులం దృణాధరులంజేసి, వియచ్చరుల వియచ్చరులం జేయుచు...ఇట్లే II ౯౦౯.

II. ౯౬౨ ఇట్లఖిలామరవరమదవారణుండగు తారకాసుర మదనారణుండై తదీయమదవారణ వార ణుండై వెలుంగు కుమరుంగని.....

ఈకవికి శబ్దాలంకారముతో కూడిన రచనలు కూర్చుటయం దెంతయిష్టమో పైయుదాహరణములవలన తేటపడగలదు. చెప్పవలసినయంశము సులభముగా రెండు మాటలతో చెప్పుట సాధ్యమైనను శబ్దాలంకారముతో రచించుట కెన్నిడొంకలైన తిరిగివచ్చును. తలకు చెయ్యిచుట్టి ముక్కు చూపును. [చూ. II. ౮౪౧] జంభాసురుని కొల్చు యోధులందరు చచ్చిరని వ్రాయక, "నిజానంత సామంత సంతానం బంతయు నొక్కట కృతాంత నికేతనాంతర్గతులగుటఁగని" అని వ్రాసినాడు. 'న్త' అను వృత్త్యనుప్రాస రచనమునకై ద్రావిడ ప్రాణాయామము చేసినాడు. (సశేషము)

---

# ఆధునికాంధ్రవాఙ్మయము-స్త్రీలు

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదు

*

౨

కోలది ప్రాయమునందే వలయు విజ్ఞానమును సముపార్జించుకొని గ్రంథముల వెలయించిన ఆధునికాంధ్రకవయిత్రులలో స్థానాపతి రుక్మిణమ్మగారి కొక స్థానము గలదు. ౧౮౮౪-వ సంవత్సరమున గోదావరీ మండలములోని నిడదవోలునం దొక సుప్రసిద్ధవైదిక కుటుంబమున నీమె జన్మించెను. తనపదమూడవయేట స్థానాపతి సత్యనారాయణగారిని వివాహమాడెను. విద్యాభ్యాసంగము చాలవరకు విశాఖపట్టణమున భర్తగారిగృహమునందే జరిగినది.

ప్రాయపుప్రొద్దింక గొంత పడమర దిరుగక పూర్వమె, మేల్కాంచి తెనుగుతోటయందు ప్రవేశించి వెఱపెరుగని హృదయముతో, దట్టముగ నల్లుకొనియున్న కావ్యలతానికుంజముల సమీపించి ప్రయాసకోర్చి పరిశోధించి భావసౌరభముల గుబాళించు కుసుమముల సేకరించి నేర్పుమీర పూలమాల రచియించి పలుకుల వెలందిపాదాంకముల చెంత సమర్పించి యాశీర్వాదముల బడసిన యీచిరంటిజీవితము సంస్తవనీయమై యలరుచున్నది.

తనివిదీరని యుత్సాహమును పాఠకులకు గల్గించుటయు, తనరచనావైభవమును విపులముగ ప్రదర్శించుటకు వలయు నవకాశమును సమకూర్పగలుగు విషయములను నిర్ణయించుకొనుటయందే కవివర్యుని ప్రతిభ వెల్లడియగును. శ్రీ రుక్మిణమ్మగారి పూలమాలలోని కుసుమములన్నియు, ఒకేలతనుండి సేకరింపబడినవి కావు. అందువలననే ఇవి వింతవింతరంగులతో, వైవిధ్య సౌరభములతో నలరుచున్నవి. ఈ కుసుమములు గ్రీష్మతాపమునకు వాడిపోనేరవు; గాలితాకునకు రాలిపోనేరవు; కలకాలము నిలచియుండి, వాఙ్మయలక్ష్మికి చక్కదనము గూర్చి శాశ్వతసౌరభముతో తెనుగువారి నలరింపగలవు.

చందమామయను ఖండకావ్య మెంత యుత్సాహముతో ప్రారంభింపబడినదో, అంత నిరాశతో ముగింపబడినది. 'చిమ్మచీకటి తెరలను జీల్చుకొనుచు బాలవెన్నెల నిగ్గుల బయలువెడలి' వచ్చిన చందమామను దలచి పాఠకుడు సంతసమున తలయూపుచున్నాడు కాని 'చుక్కలేతప్ప నితరము జోడులేక, మల్లెపూవోట తిరుగాడు మాలివోలె చల్లగా నెటుపోదువో చందమామ!" అను ప్రశ్న ఆతనిహృదయమున జాలిని కలిగించుచున్నది. చీకటితెరల జీల్చి 'వెండి మేఘాల మేడలవీథులందు విహరించిన జాబిల్లి, పాపము, తుదిని జోడులేక మెల్లగా చల్లగా జారిపోవలసి వచ్చెను! లోకమున మానవు డెంత శీలవంతుడైనను, ఎందరకానందము గూర్చువాడైనను, తుదిని పూర్వజన్మమునందలి పుణ్యముల ననుసరించి ఫలము ననుభవించునను విలువగల నీతి, ఈకావ్యమునం దొకింత ధ్వనించుచున్నది. 'అమృతవర్షమ్ము గురియుచు' 'తరుణకిరణకరయుగ మెత్తి ముద్దాడి కౌగలించి' మానవుల నానంద జలధి నోలలాడించిన చందమామ, కర్మవశమున తుదిని వెలవెలబోయి, 'చుక్కలేతప్ప నితరము జోడులేక' చల్లగా నెచ్చటికో జారిపోవలనసివచ్చెను గదా! కర్మపద్ధతిని నిరూపించునప్పుడు భర్తృహరి

"నైవాకృతిః ఫలతి నైవకులం నశీలం
విద్యాపి నైవ నచ యత్నకృతాపి సేవా,
భాగ్యాని పూర్వతపసా ఖలు సఞ్చితాని
కాలే ఫలన్తి పురుషస్య యథైవవృక్షః"

("రమ్యరూపంబు విద్యయు రాజసేవ
కులము శీలంబు జాలవు ఫల మొసంగ
బూర్వపుణ్య సంచితభాగ్యములు ఫలించు
గాలమున పనసాదివృక్షములకరణి")

అని పలికియున్నాడు. ఈపలుకులు పైయభిప్రాయ మును తెలియబరచుచున్నవి.

పూర్వరాజన్యులచరిత్రలను సమగ్రముగ నెఱుంగుటకు, వారికాలమునందు రచియింపబడి, వారికంకితము చేయబడిన గ్రంథములే మన కిపు డాధారము లగుచున్నవి. కవితయం దాదరములేక కాలమంతయు పోరాటములందే గడపిన రాజుల చరిత్ర సమగ్రముగ లభించుట కెక్కుడు ప్రయత్న మిపుడు చేయవలసి వచ్చినది. తొలుతటి ఆంధ్రరాజుల చరిత్రను సమకూర్చుట కెన్నికష్టములు పడవలసివచ్చెనో, అందు విద్యాభిమానులగు నరపాలుర చరిత్ర లెంతసులభముగ లభించెనో చరిత్రకారునకే యెఱుక. కవులను పోషించి, కవితావల్లరికి వలయు దోహదము గావించిన నరవరుల నామము లింతదనుక నిలచియుండుట గాంచియే:

‘అమల భోగైక విశ్వంభరాధిపతికి
కలితమాతంగసైంధవోత్కరరథాది
భటసహస్రమ్ము లెన్నేని వఱలనిమ్మ,
కవితలేకున్న గీర్తి నిక్కముగ గలదె?’

అని వీరు విశదపరచియున్నారు. ఈ విదుషీమణికి కవితయందు గల యభిమానము కొలదియిడరానిది. అందులకే

‘సూర్యచంద్రులు బ్రహ్మాది సురవరేణ్యు
లాదిమధ్యాంతరహితుడో నాపరాత్ప
రుండు దేని గాంచగలేరో యూహిగాను
కవిమహాత్మకు డద్దాని గాంచు జగతి.’

అని పలికి, ‘కవిగాంచనిచో రవిగాంచునే సువిూ’ అను కైపదమునందలి భావమును విస్తృతము గావించియున్నారు.

ఈకవయిత్రికి పురాణములయందు నమ్మకము, అభిమానము ఉత్కటముగ నుండినట్లు ‘కుంతీసందేశము’ ‘కృష్ణునితో పాంచాలి’ మొదలగు విషయములను నిర్ణయించుకొనుటయందే విదితమగుచున్నది. కాని:

‘అన్యదేశాల సంచార మన్యదాస్య
మొక్కభార్యకు చేవురు నొప్పమీర
భర్తలై పాండవులు కీర్తి ప్రబలియుంట
వ్యాసకవిసార్వభౌము నిర్వ్యాజకరుణ.’

అని యొకచో నుడివి పాఠకునిమనమునందు ఆలోచన రేపుచున్నది. పైన గీటుంచిన పద్యభాగమునందలి యౌచిత్యమును ఉచితజ్ఞులగు పాఠకులే నిర్ణయింపవలసియున్నది.

“మొల్ల తఱిగొండవెంకమ్మ ముద్దుపళని
అచ్చమాంబయు మొదలుగా నాంధ్రమహిళ
లమితవిఖ్యాతిగాంచు టేయవనిలోన
క్రముకవితామృతాస్వాదకలన గాదె?’

అని పలికి, నన్నయపోతనాది కవినాథుల నామములనిందు చేర్కొనక స్త్రీలయెడ తమకుగల పక్షపాతమును విశదపరచిరని తలంచుట పొరపాటు. బ్రతికియున్నన్ని దినములు లోకమున కెఱుకలేకయే, కాలము గడపుచు, వంటఇంట కుమిలిపోవుచున్న స్త్రీలు సహితము ‘క్రమకవితామృతాస్వాదకలన’ చిరజీవులై యున్నారని నిరూపించి, వారి నామములనుసహిత ముదాహరించి, ఆధునికాంధ్ర నారీమణులయందు నిద్రించుచున్న చైతన్యమును మేల్కొలుపుట కీరీతి దొరకొనిన శ్రీ రుక్మిణమ్మగారిని అభినందింపవలసియున్నది.

‘ఎందఱెందరో ఘనసుధాస్యందిలేఖినుల తెనుగుసీమ ధనధాన్య నిలయ మనియు, ‘రుధిరనిష్యంది లేఖినుల తెనుగుసీమ యోధసంకలితమనియు, మధుష్యంది లేఖినుల తెనుగుసీమ ప్రణయమండలమటంచు వ్రాసిరేగాని, ‘కడుపుకాలెడివారల గాంచుకతన’, ‘కీరు డొకడును గనరాని కారణమున,’ ‘ప్రణయతత్త్వమ్మె తెలియని ప్రకృతియగుట’ ఆపలుకులన్నియు వ్యర్థములయ్యెననెడి ఈకవయిత్రిపలుకులు ఆమెహృదయావేగమును, దేశభక్తిని విశదము చేయుచున్నవి. మఱియు “The woman's duty as a member of the common wealth, is to assist in the ordering, in the comforting, and in the beautiful adornment of the state.” (సక్రమసౌకర్య

ముల నేర్పరచి, దేశమున సంతృప్తిని పాదుకొల్పి దేశ కల్యాణమునకు తగుసాయమును గావింపవలసిన బాధ్యత ప్రతిస్త్రీయందును గలదు.) అని యొక ఆంగ్లకవిపుంగవుడు నుడివినట్లు, శ్రీరుక్మిణమ్మగారు తెనుగుదేశము నందు నేడు ప్రబలియున్న దారిద్ర్యమును, కొఱతవడియున్న ఔదార్యమును, సాహసమును విశాలహృదయులకు తెనుగుతోబుట్టువులకు భక్తిపూర్వకముగ నివేదించి తమధర్మమును యుక్తముగ నిర్వహించుకొనిరి. పైన గీటుంచిన రసోచితములగు పదములను నిర్ణయించుకొనుటలో కవయిత్రి బయల్పరచిన నేర్పు ప్రశంసింపదగియున్నది.

> 'అల నిలింపపుష్పామోద యాయశోద
> కట్టుసేయు పుత్రుని భయపెట్టదలచి'

బాంధమున నుమ్మడనెడు బూచిగలదని చెప్పినప్పుడు "భయంకరోగ్రులౌ దనుజుల గల్మషాత్ములదాల్మి నశించి సమస్తలోకముల్ గొనకొని సంచరించితిని, నమ్మకపోదువు విచిత్రమయ్యె; నెందును గనజాల నిప్పుడెటులొచెను చూపగదమ్మ" యని కృష్ణుడు ప్రశ్నించినప్పుడు, 'విస్మయమునంది, కుమారు మనంతమూర్తిగా నాకెల్లెడ మాయలో దగిలి కన్నుల బాష్పకణాళి గ్రమ్మ కృష్ణుని వడిచేర్చి' ముద్దుగొనెనట యశోద. ఒకగంభీర భావమును పైనగీటుంచిన కొలదిపదములలో ఇముడగలనేర్పు, ఎట్టితొట్రుపాటులేక పాలమున్నీటి తరగలవలె పద్యముల నడుపగలశక్తి నేటికవయిత్రుల యందు కొలదిమందికే గలదు.

'కృష్ణునితో పాంచాలి', 'పతిసందర్శనము' మొదలగు కొన్ని కావ్యములయందలి కథావస్తు విదివరకే పలువురచే వర్ణింపబడియుండుటచే వానిని తిరిగి పరామర్శించునప్పుడు శ్రీరుక్మిణమ్మగారి లేఖిని స్వాతంత్ర్యమును సంపూర్ణముగ గోల్పోయినది. మొత్తముమీద ఈవిదుషీమణి అనుకరణములతోడను, అనువాదములతోడను కాలమును వమ్ముసేయక, తమస్వశక్తిచేతను, తమకాలమునందలి సంఘమర్యాదలను, రాజకీయవిషయములను, వాఙ్మయవికాసమును ప్రతిబింబించు కావ్యమణిహారములతో తెనుగుతల్లిని గైసేసి ఆధునిక కవయిత్రులయందొక గణనీయమైన స్థానము నలంకరింపగలరని, ఆశించుచున్నాను. ఈ కవయిత్రి ప్రస్తుతము అరణ్యసుందరి అను గ్రంథము రచియించుచున్నారని వినుటకు సంతసమగుచున్నది. ఇట్లే చక్కని గ్రంథముల వెలయించుటకు వలయు సామర్థ్యమును, ప్రోత్సాహమును; వీరికి;

> 'శ్రీమదోంకార పంజరాసీనశుకము
> ప్రాంచదుపనిషదుద్యాన పరభృతమ్మ
> ఆగమారణ్యవీథి మయూర
> మైన కాత్యాయనీదేవి,' ప్రసాదించును గాక.

## 3

> "Full many a gem of purest ray serene
> The dark unfathomed caves of ocean bear
> Full many a flower is born to blush
> unseen]
> And waste its sweetnees on the desert air"

(కాంతుల వెల్గ్రక్కు విలువగల మణులెన్నియో చీకటుల జిమ్ము సముద్రగర్భమున దాగియున్నవి. చక్కదనమున కాలవాలమగు కుసుమము లెన్నియో నట్టడవియందు నిరర్థకముగ నేల వ్రాలుచున్నవి) అని ఆంగ్లకవి పుంగవుడగు థామసుగ్రే నుడివినట్లు, ఆంధ్ర వాఙ్మయమున, ఆదరణలేని హేతువున, ప్రతిభావంతులగు కవులు కవయిత్రులు రచించిన కొన్ని అమూల్యములగు గ్రంథములు, నామరూపములులేక కాలమహాప్రపంతిలో కలసిపోయినవి. క్రీ. ౧౮౮౦ ప్రాంతమున తంజాపురాస్థాన కవులలో చంపకవల్లి, కస్తూరి, అంబుజవల్లి, సీత, రంగాజమ్మ, మొదలగుస్త్రీలు గూడ గలరని తెలియుచున్నది. ఇందు. రంగాజమ్మ మన్నారుదాస విలాసము, ఉషాపరిణయము అను గ్రంథముల రచియించెను. మిగిలిన విదుషీమణుల నామములు గ్రంథాంతరములందు గన్పించుటయే గాని, వారు రచియించిన గ్రంథములు లభించినట్లు గన్పట్టదు. సహజముగ స్త్రీలు తమగ్రంథములను లోకమునకు

సమర్పించుటకే వెనుకాడెదరు. స్త్రీలు విద్యనభ్యసింప నర్హులు గారనెడి పరిహాసవాక్యములు బయల్వెడలిన నాటనుండి, వారు తమగ్రంథములను బయల్పరచుటకు భయపడిరి. కొన్ని విలువగల గ్రంథములు ఈకారణమున ఒరుల కెఱుకలేకయే శిథిలమైపోయినవి. తాము రచియించిన గ్రంథములను బ్రచురించియు, లోకమున కెక్కుడుగ వెల్లిగింపక మిన్నకుండిన వారిలో శ్రీ గుడిపూడి ఇందుమతీదేవిగారొకరు.

ఈకవయిత్రి ౧౮౯౨-వ సంవత్సరమున జన్మించెను. శ్రీ గుడిపూడి రామారావుగారిని వివాహమాడెను. వీరికాపురస్థలము ఆత్మకూరు. ప్రస్తుతము బెజవాడయందే నివసించుచున్నారు. అంబరీషవిజయము, రామకథామంజరి, లక్షణాపరిణయము, తరుణీశతకము అను గ్రంథములను వీరు రచియించిరి. ఇందు రామకథామంజరి యను గ్రంథమంతయు వచనమున సులభశైలిలో వ్రాయబడినది.

అంబరీషవిజయము ౧౯౨౨ సంవత్సరమున ముద్రింపబడెను. భాగవతమునందలి కథకును, ఈగ్రంథమునందలి కథకును మార్పులేమియును గానరావు. ఈగ్రంథమును

'పతిసేవారతమతికిని
పతిహితగుణతతికి బాంధవప్రియమతికిన్
కృతినొసగెద సద్గుణసుమ
లతకు మదంబకు సనంతలక్ష్మ్యంబికకున్'

అని తమతల్లిగారికి అంకితముగానిచ్చియున్నారు. ఆధునికయుగమునందు వెలువడుచున్న గ్రంథములయందు గన్పట్టు క్రొత్తతీరుపోకడలేవియు నిందు పొందుపరుపబడలేదు. శ్రీ ఇందుమతీదేవిగారందులకే: "ఇందు గొన్ని సంగతులతిచిత్రములు నమానుషములు నని నవనాగరకులగు సోదరులు, బరిహసింతురేమో !...... అయిన నందలి గ్రాహ్యములగు ముఖ్యవిషయములే గైకొని నన్ను నాసోదరసోదరీమణులు మన్నింతురుగాక !" అని పీఠికయందు నుడివియున్నారు.

అంబరీషుని కడకు నారదుని యాగమనమును వర్ణించు ఈక్రిందిపద్యమునందలి తుదిపాద మెుకింత తేలిపోయినను, మొత్తముమీద ఈపద్యమునందలి ధారాశుద్ధిని తిలకింపుడు :

'శారదనీరదేందు ఘన
సారతుషారమరాళశైలజి
ద్వారణక్షీర హీరదర
భారతి మౌక్తికభాసమాన మా
సారశరీర కాంతులను
సర్వదిగంతములందు గప్పగా
సారెకు మాధబాలకులు
సయ్యన నవ్వుచు వెంట పర్వగాన్.'

ఈగ్రంథమున కొన్ని పద్యములందు చక్కని భావములు పొందుపరుపబడినవి:

విప్రవర్య మహితకరాబ్జ ప్రయుక్త
జలకణశరనిహత నిశాచర సముదయు
తను వినిర్గత శోణితమనగ గగన
తలముగాంచు సంధ్యారాగ మలమె నంత.'

ఇట్టి పద్యములేగాక

'భక్తిలేకను వేరుగా ముక్తిరాదు
జ్ఞానికైనను వాగ్వధూజానికైన.'
'వేశ్యబ్రాహ్మణేశ్వరున కన్నివేళలందు
లీల చేదోడువాదోడునై లతాంగి.'

మొదలగు చక్కనిపదముల సూడికకోడను ఈగ్రంథమున కథ నడుపబడినది.

ఈవిదుషీమణి పెక్కుగ్రంథములను ప్రేమమీర పఠియించి, వానిలోని రసవంతములగు భావములను, పదములను విడువనేరక తమగ్రంథమున పొందుపరచియున్నారు.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు బుద్ధచరిత్రయందు

'పాపము నశించె ధర్మంబు పాదుకొనియె
కలుపుకలవర్యో లేమికి గల్గె లేమి
కపిలవస్తుపురేంద్రు నగారమందు
పిన్నవెలమాడ్కి పుత్రుండు బెరుగుచుండ.'

అని, బుద్ధుడు జన్మించినతరువాత లోకమునందు గల్గిన మంగళప్రదమగు మార్పులను వినిపించియున్నారు. అట్లే శ్రీ ఇందుమతీదేవిగారును:

'కలవు కలవయ్యె కలిమియు గలిమి యయ్యె
నహితులెల్లరు హితులైరి యవనియందు
లేమికిని లేమిగల్గె నీభూమినాథు
రమ్యకీర్తి దిగంత విక్రాంతి జెందె'

అని పల్కి అంబరీషుని రాజ్యము నందలి ప్రజల యున్నతిని విశదపరచిరి. మఱియు పారిజాతాపహరణమునందు గల,

'అమరులబోనపుట్టిక స
హాస్రమయూఖుని జోడు కోడె సం
తమసము వేరువిత్తు కుము
దంబుల చక్కిలిగింత పుంశ్చలీ
సమితికి జుక్కవాలు నవ
సారసలక్ష్మి దోలంసు బావకో
కములకు గుండెతల్లడము
కైరవమిత్రుడు దోచె యుర్వినన్.'

అను చంద్రోదయవర్ణనము వలెనే

'కలువలమెచ్చిన నేస్తగాడు సిరికిం
గారాబుసైదోడు త
మ్ములకుం గీడు చకోరపాళికి ముదం
బుం గూర్చు బల్విందు ని
చ్చలు లోకద్వయిబాపుమందు గిరిజా
జానీశిరోరత్నమా
జలజాతాక్షు మఱంది వచ్చె సకలా
శలక్కాంతిచే నింపుచున్.'

అని ఇందుమతీదేవిగారు తమగ్రంథమునందు చంద్రోదయవర్ణనమును పొందుపరచిరి.

ఆధునికాంధ్రకవయిత్రుల గ్రంథములయందీయనుకరణపద్ధతి విరివిగ గన్పట్టుచున్నది. ఈపద్ధతి సత్వరము పరిహరింపబడవలయును. క్రొత్త యభిప్రాయములతో, క్రొత్తపోకడలతో, క్రొత్తకథావస్తువులను నిర్ణయించుకొని గ్రంథముల వెలువరించినగాని సజీవమగు భాషయొక్క చక్కదనము బయల్పడదు. శ్రీ ఇందుమతీదేవిగారు తమప్రతిభను ఎల్లవిధముల లోకమున కెఱుకపరచుట కిదివరకు వర్ణింపబడని కథావస్తువును నిర్ణయించుకొని చక్కనిగ్రంథము వెలువరింతురని తలంతును.

'లక్షణాపరిణయము'నందు

"తనదేహద్యుతి నీరదంబు గుణసం
ధాన ధ్వనుల్గర్జిత
ధ్వనుల య్యింద్ర శరాసనంబు మరి యా
తన్వంగి క్రొమ్మించు త
ద్ఘనకోదండ విముక్త ఘోరశరసం
ఘం బెన్న వర్షంబుగా
దనరం గృష్ణుడొనర్చె సర్వరిపు సం
తానాగ్ని మగ్నంబుగన్."

అను పద్యమునందలి లలితమగు భావము

"కనుగొంటిన్ మధుపాన మత్తతను భృం
గశ్రేణి గానంబు క్రొ
న్ననలన్మెక్కుచు చొక్కి నిక్కి పికగా
నంబున్ సముస్తాగ సం
జనిత స్థానము కీరదంపతుల వా
సస్థానమా యాదవేం
ద్రుని యుద్యానము చిత్తమందు ఘనసం
తోషంబు మీరన్ జెలీ."

అను పద్యమునందలి యుద్యానవనవర్ణనము హృద్యముగనున్నవి. ఇందుమతీదేవిగారి గ్రంథములలో లెంతరచియించిన లక్షణాపరిణయమే గణనీయమగు స్థానము నలంకరించుచున్నది. ఈవిదుషీమణి అమూల్యములగు గ్రంథముల నిట్లే వెలయించి, తన సోదరీమణులకు, ఆదర్శప్రాయయై యలరగలదని ఆశించుచున్నాడను.

(సశేషము)

# గంధవతి

కుందుర్తి నరసింహారావు

నీకార కీనిలింపతటినీహృదయస్థలి పూలసెజ్జయై
రేకులువిచ్చి అవ్యయపరిమళకాంతులు దిక్కుదిక్కులన్
సోకగ చిమ్ముచున్నది, ప్రసూనసుగంధశరీర, మానవా
నీకమనస్తరంగిణులు నిన్నుగ్రహింపగలేవు నేటికిన్.

జలధర సుందరీనివహ చర్చితచందనరేఖ, అర్కమం
డల తిలకమ్ముదీర్చి, గగనమ్మును పెండ్లికుమారుడాయె: మం
గళదరహాసకాంతు లిటు, గంధవతీ, ప్రసరించి వ్యర్థకాం
క్షలనిడి పంచభూతముల శాశ్వతబద్ధుల జేయుచుంటివా?

రాణులకీవికై ఉదయరాగ సువర్ణపటాంచలమ్ము నీ
పాణితలమ్మునుండి విడబారి నభఃపృథివీనిరోధిత
స్థానమునిండుగా మనుజసంతతిగప్పుచు వెంబడింప, నీ
మేనిట గోచరింపదు నిమేషము, మానవతీశిరోమణీ.

కోటియుగమ్ములన్ నరునికోరికకందని దివ్యపుష్పగం
ధాటవి నీయపూర్వ హరిదంబరవేణి సమస్తదేశ దే
శాటనదక్షుడౌ పవనుడైన స్పృశింపగలేక, నేల పూ
దోటలనుండి నాహృదయతూలిక దాహముతీర్ప వచ్చెదున్.

సోయగ ముంగరాల్ తిరుగుచున్నగతిన్ నవమేఘమండల
చ్ఛాయలు చుట్టుకొన్నవి అజాండము: పెంపుడులేని ముంగురుల్
పాయలుగాగ నీనొసలిపై విడిపోయినవేమొ, మాయమై
పోయినచీకటుల్ మరలముంచునొ యీమధురప్రభాతమున్.

అఖిలజగమ్ము నీవనుయథార్థముపల్కి జగన్నియంత్రు స
మ్ముఖమున పారితోషికము పొందుటకై చను నీవిహంగముల్
సుఖమయవాంఛలన్ దగులుచున్న కళంకితబుద్ధితోడ నా
సఖులయి పాటలన్ ప్రకృతిసఖ్యతనే వరియించి నిల్చెదున్.

గంధవతీ, శ్రవఃకుహర గర్భకఠోరగతిన్ ధ్వనించు నీ
సింధుతరంగఘోష మరచెన్ భువనత్రయ మార్గరాజ్య గ
ర్వాంధ నదీవతంసమిది పాడదొడంగె, రసాతలస్థ ని
ర్బంధమునుండి నీవిటుధరాతలి కీనదినుండి వచ్చుటన్.

ఇదినాలేత మొడందపొంగె యనుకో, హేమాచలాశారస
ప్రదవీణారవ దివ్యగంగయనుకో—త్రైలోక్య సౌందర్య సం
పద మాకున్ చవిజూపవచ్చిన నిలింపప్రాభవా,—నీకు ని
య్యదియే జన్మవిలాసయాత్రలకు తావయ్యెన్ మదిచ్ఛావిధిన్.

తాలిమిగోలుపోయిన లతాంతములైనవి తారకల్, వినీ
లాలకలందురాలిన అలంకృతిచే నిను గౌరవించి, ఆ
శాలసలైన దృక్కుల వచస్సుధలన్ భవదీయగంధ స
మ్మేళనశక్తిచే నఖిలమేదిని మోహావశమ్మొనర్చుచున్.

చక్కెరపల్కుతో మలయ చందనవందన మందికొన్న దా
చక్కని తావితో నదులు సంద్రములేలునదృష్టపూర్వవా
రిక్కవటన్న మానవు లెరింగెద రేమొ రవంతనిన్ను ! మా
వాక్కు లమేయజీవరసవాహినినెట్లు తరించు, సుందరీ ?

రాగవిహీనలౌజలచరమ్ములు శుష్కగళమ్ములన్ త్వదీ
యాగమనప్రభూత హృదయార్తినొకేపరివెల్లడించు, నా
మూగతనమ్ము రాగపరిపూర్ణమటంచు గ్రహింపలేవు సం
యోగసుఖక్షణమ్ముల మహోత్సవ రావకళంకముల్ సఖీ.

ఈయాకాంక్షలు, ఈనిరంతరమనోహింసాకృతుల్, జీవహ
త్యాయజ్ఞమ్ములు, భావిభోగఫలమోహవ్యూహముల్, సాహసో
పాయమ్ముల్ మృగతృష్ణలెల్ల త్రుటిలో వారింతు భూమీజన
చ్ఛాయన్ నిన్నతిలోకగంధయుత పుష్పప్రాభవన్ నిల్పుచున్.
పోయినజీవితాశయము పూర్ణకళంకముగా మనస్తను
చ్ఛాయలు మాసిపోవు మనుజావళికిన్ క్షణమాత్రశాంతి సం
ధాయకుడైనచో కవి కృతార్థుడుపో, నిజముక్తిమార్గమో
హాయతనాంధులయ్యెడు మహాత్ములకంటె సహస్రభంగులన్.

---



ఏకామ్రేశ్వర దేవాలయ ప్రధానద్వారము-కంచి A. N. S.



A. N. S.

ఏకామ్రేశ్వరాలయ గోపురముపయినుండి-కంచి

# నాటకోపన్యాసములు ౨

(అనువృత్తము)

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

ఆంగ్లసాహిత్యపరిచయఫలముగా మన కవులిద్దఱును సాహసించి తెలుఁగువాఙ్మయమునఁ బ్రవేశపెట్టిన విషయములలో నెల్ల ముఖ్యమైనది శోకాంతముగా వ్రాయుట. ఇది సంస్కృతలాక్షణికు లెల్ల కూడ దని గట్టిగా విధించిన శాసనమునకు నేరుగా ఎదురుతిరిగిన నడత. సంస్కృతనాటకములలో నెల్ల కథానాయకుని మరణముతో ముగియునది భాసమహాకవి 'ఊరుభంగ' మొకటే యిప్పటికి కనఁబడుచున్నది. కాని మనకవు లిద్దఱును దాని నెఱుఁగరు. అది వారు కీర్తిశేషులైనపిదపనే వెలువడినది. అంతవఱకు ఇతరు లెవరును దాని పేరైన నెత్తి యుదాహరింపలేదు. కావున మనకవులు శోకాంతరూపకములు వ్రాయుటకు ఆయింత మాత్రము వెన్నుబలమును సంస్కృత వాఙ్మయమునుండి లభించియుండలే దనుట సత్యము. మరణముతో ముగియు శోకాంత నాటకములు కృష్ణమాచార్యులు వ్రాసినవి నే నెఱిఁగినంతవఱకు నాలుగు: విషాద సారంగధరము, ముక్తావళి, అజామిళ చరిత్రము, చంద్రహాసచరిత్రము. వీనిలో ముక్తావళినిమాత్రము మరల మోదాంతముగా మార్చి ముద్రించినారఁట (ముక్తావళి పీఠిక). శ్రీనివాసరాయల రామరాజు, సుల్తానా చాందుబీ, శిలాదిత్య, మూఁడును శోకాంతములు. కాని వీరికి కృష్ణమాచార్యుల కున్నంత యభిమాన మిట్టిమరణాంతనాటకము లందున్నట్లు తోఁపదు. వారి విషాద నాటకములలో నెల్ల నెక్కువ ప్రచారముగల 'రామరాజు' వారు మొదలు సంతోషముతోనే ముగించిరి. కాని 'సుమనోరమసభ' వారు దానిని ఖేదాంతముగా మార్చి తుదలో కథానాయికానాయకులగు ఆషాబీని పటాణిని చంపిరఁట. మరణముతో నాటకమును ముగించినచో మంగళమున కేమేని లోపము వచ్చునో రాదో యెఱుఁగనుగాని, సభ్యులకు శోకము చచ్చువాని యోగ్యతనుబట్టి యుండును గావున, శిలాదిత్యునివంటిపాత్రము చచ్చినను మనకు కొంత కనికరము గలుగవచ్చునేమో కాని శోకము గలుగదు. అట్లే అవివేకియైన రామరాజు (ఆనాటకసంవిధానప్రకారము) చచ్చినప్పుడు మన కంతగా దుఃఖము కలుగని తీరుననే ఆత్మకును, దేశమునకును ద్రోహియైన పటాణీని, వానిని రవులుకొల్పి తన్నేలిన రాణికి ద్రోహముచేసిన ఆషాబీని గ్రంథకర్తయిష్టమునకు విరుద్ధముగా నాటకపు తుదలో చంపినను మనకన్నులలో నీరురాదు. 'సుల్తానాచాందుబీ' యొక్కటే శ్రీనివాసరాయల నాటకములలో కొంత శోకాంత మనఁదగినది. అందును ముఖ్యులగు కథా

నాయకులజీవితము సుఖముగోఁ పర్యవసాన మగుటచేత ముసలిరాణియగు చాందుబీ కూనీచేయఁబడి ఆకస్మికముగా మరణించినను ఇచట శోకరసము మందగించియే యున్నది. కాఁబట్టి శ్రీనివాసరాయలు నిజముగా శోకాంతమైన రూపకమును వ్రాయనే లేదనవచ్చును. కృష్ణమాచార్యులు రచించిన నాలుగింటిలోను 'చంద్రహాస'లో తుదకు చచ్చువాఁడు దుష్టబుద్ధియగు మంత్రియే కావున వానిచావునకై యేడ్చు వెఱ్ఱు లెవరును ఉండదు. 'అజామిళచరిత్రము'న ఆలుబిడ్డలతోఁపాటు అజామిళుఁడు చచ్చుట యెవరి స్వాధీనమునుగాని ప్లేగురోగముచే ఆకస్మికముగాఁ గలిగినది గావునను, అప్పటికి వానిజీవితమందలి కష్టము లన్నియు ముగిసి యుండుటచేతను, తుదలో వానికి యమకింకరులను తన్ని తోలి విష్ణువు మోక్షము నిచ్చుటచేతను ఆనాటకము మోదాంతమే యనక తప్పదు. 'ముక్తావళి' యిప్పుడు తుదలో చావనున్నవారును, చచ్చినవారును అందఱును బ్రదికినట్లే ముద్రింపఁబడినది. గ్రంథకర్త అసలు వ్రాఁతలో ఎవరినిముగించి ఎవరినిమిగిలించియుండెనో యెఱుఁగము. కావున ప్రకృతము మనకు మిగిలినది ఆద్యంతము శోకమయమైనది 'సారంగధర' యొక్కటే. కాని పదిశోకాంతనాటకములు చేసినంతపని తెలుఁగువారి కిదియొకటే చేసినది; చేయుచున్నది. దీనికిఁదగినట్లు కార్చుటకుఁ గావలసినన్ని కన్నీళ్లు తెలుఁగువారికున్నవా యని సందేహపడవలయున్నది.

ఈనాటకమందలి శోక మింతతీవ్రముగా హృదయభేదకముగా నుండుటకుఁ గలకారణము లందఱెఱిఁగినవే. రూపము, యౌవనము, పదవి, చదువు, శీలము మొదలగు నన్నిటియందును సాటిలేని యాదర్శమూర్తి సారంగధరుఁడు కథానాయకుఁడు. వానిని మనసార మొదలే వలచియుండినను నిర్బంధముచేత వానితండ్రిని వృద్ధుని పెండ్లాడి సహజమై బలవత్తరమైన ప్రణయతృష్ణతీరు మార్గముగానక పరితపించు చిత్రాంగి కథానాయిక. ఇరువురియందును మన కనురాగమును అభిమానమును గలవు. తనయాశలన్నియు పటాపంచలై అవమానమునకు నొచ్చి తెగించినమనసుతోఁ సారంగధరునిపై నిరాపనిందను మోపినదని చిత్రాంగినైనను గొంతతప్పు పట్టఁగలము కాని సారంగధరుని నడతను వ్రేలెత్తి తప్పుచూపలేము. ఇట్టి స్థితిలో అట్టి ధర్మమూర్తికి కాళ్లుచేతులు కత్తరించుశిక్షచే మృత్యువు సంభవించుటను జూచి యోర్చుట మనుష్యశక్తికి మీఱినపని. ప్రపంచవ్యవహారములో ఇది యిట్లునడచుట అసాధ్యమునుగాదు. అసంభావ్యమునుగాదు. కాని యది యన్యాయమని, అకార్యమని మనుష్యుఁడై పుట్టినవాఁడెల్లఁదలఁచి తీఱును. శక్తియున్నంతవఱకు అట్టివి సంభవింపకుండుటకు ప్రయత్నములు చేయును. పని తన శక్తికిమించినప్పుడు ఏదేవతలైనను దిగివచ్చి దీనికి ప్రతీకారముచేయరాదా యని యంగలార్చును. అమానుషశక్తిగలదేవతావ్యక్తులు

ఇట్టి సమయములందు ధర్మమును న్యాయ
మును స్థాపింపక పోయిరేని వారిబ్రతుకు
నట్టి యమృతపు దండుగయే కాని వేఱు
కాదనుట మన కందఱకును గలుగు
భావము. కాఁబట్టియే యెవఁడో సిద్ధుఁడు వచ్చి
మరల సారంగధరుని బ్రతికించినట్లు ప్రాచీ
నులు పైనికథ కుత్తరరంగ మొకటి యతి
కించిరి. అసలుకథ కేవలము కల్పితము
గానిండు; లేక చరిత్రాధారము గలది
కానిండు. అది సారంగధరుని మృతితోనే
ముగిసియుండనిండు; కాని దాని నట్లే వ్యవ
హారమునందు నిలుపుకొనుట యసాధ్యము.
మనుష్యస్వభావమునకు, మనుష్యుల ధర్మ
న్యాయాభిమానమునకు, మనుష్యుల సహజ
మగు శాంతిప్రియతకు విరోధము. కాని కృష్ణ
మాచార్యుల కీ సిద్ధుని కథ సరిపడలేదు.
నాకును సరిపడదు. తెగిన కాళ్లను, చేతులను
తిరుగా అతికించి బ్రతికించు విచిత్రసిద్ధశక్తిని
నమ్మినను నమ్మకున్నను, బ్రతికించిన తరు
వాత వాఁడు సారంగధరుని నొకజోగిని జేసి
యేకొండగుహలోనికో యీడ్చుకొనిపోవుట
చేత, మనపాలికి వాని చావును బ్రతుకును
ఒకటేయైనవి. కాని కృష్ణమాచార్యులవలె
కాళ్లు చేతులు తెగిచచ్చువఱకే సారంగధరుని
బ్రతుకు నూహించి వదలుటకు నా దేహ
మనస్సులు రెండును గంపించుచున్నవి. 'నీతి
బోధ విషాదనాటకములందువలె మంగళాంత
నాటకములందు గలుగఁజాలదని నా తప్పని
యభిప్రాయము' అని వారు విషాదసారంగ
ధరముపీఠికలో వ్రాసిరి. నీతికిని నాటకముల
కును ఇంత స్పష్టమైన సమీప సంబంధ
మున్నదని నే నెప్పుడును అనుకొనలేదు.
విషాదము నెక్కువగా నాటకములం దనుభ
వించుటచే జనులు నీతిమంతు లగుదురనుట
నాసిద్ధాంతమునకుఁ గాని యనుభవమునకుఁ
గాని యింకను రానిమతము. నాటకములు
చూచునది చదువునది రసానుభవమునకు,
తన్మూలముగ మనశ్శాంతికి, ఏన శోక మొక
రసముగాదా? శృంగారముతో నాటకము
ముగింపవచ్చునఁట, శోక మేమితప్పు చేసెను?
అనియడుగవచ్చును. నిజమే. శోకమునకును
రసత్వము- ఆస్వాద్యత్వము- కలదు. లేకున్న
మనము దానిని చూడనేచూడము. కాని
ప్రతిరసమును ఒక హద్దుమీఱినతరువాత
అసహ్య మగును. శృంగారమును ఇంతేకదా.
నాయికానాయకుల పెండ్లివఱకును, వారి
సరససల్లాపములవఱకును ప్రదర్శించి తరు
వాతివారి శృంగారచరిత్రమీఁద తెరవైతుము
గాదా? శోకమునకువలె శృంగారమునకును
సహజమైన ముగింపునీయఁ బ్రయత్నించిన
చో గతియేమి? మఱియు శోకమువలె
బీభత్సమును ఒకరసమేకదా! దానినిగూడ
తెగఁబెంచి రంగముమీఁద నెవరైనఁ జూపు
దురా? రసము ననుభవించి యానందించు
మన మనస్తత్త్వముగూడ తక్కిన ప్రకృతి
ధర్మములకు లోఁబడినదేకాని కేవలము
స్వతంత్రము గాదు. రస మేదియైనను మనము
సహజముగా నేర్పఱుచుకొన్న నీతి, ధర్మము,

ఆనురూప్యము, సౌమనస్యము మొదలగు హద్దులనుమీఱిపోయినచో దానిఫలమగు ఆనందమును మన మనుభవింపఁజాలము.

ఏతప్పు నెఱుఁగని యిట్టి పాత్రములను దెచ్చి ప్రత్యక్షముగా రంగమునకు బలి యిచ్చుపద్ధతి పాశ్చాత్త్యకవులలో మితిమీఱి యుండెను. మహాకవులగు షేక్స్పియర్ మొదలగువారుగూడ ఈ చాపల్యమునకు తప్పినవారు కారు. రాజద్రోహియైనవాఁడు తప్పించుకొనిపోఁగా ఆతప్పునకు రాజభటులు ఏపాపము నెఱుఁగని యతని చిన్నకుమారుని తల్లికన్నులయెదుటనే పొడిచి చంపి తల్లిని గూడ పరువెత్తించుకొనిపోయి చిత్రవధ చేసిన రంగ మొకటి 'మాక్‌బెత్' నాటకమున మనము చూడవలసియున్నది. (అం. ౪. రం. ౨.) ఇట్టివి చూచి సంతసించు రక్తపిపాసువులు వారిలోను, మనలోను గలరు. కాని కోడి పుంజులను, పొట్టేళ్లను పోట్లాడించి యవి కాళ్లు మెడలు తెంచుకొని తలబుఱ్ఱలు పగులఁగొట్టుకొని చావుబ్రతుకులలో నుండఁగా చూచి యానందించువారికిని వీరికిని మనస్తత్త్వమం దెక్కువభేదము లేదు. ఇటీవలి పాశ్చాత్త్యవాఙ్మయమునందే యిట్టి కేవలోద్రేక ప్రధాన మగు సన్నివేశములకు వెలయిచ్చువారు చాలమంది లేరు. ఇఁక మన ప్రాచీనులన్ననో శోకమును రూపకములలో గౌణముగా ప్రయోగించిరే కాని యది ప్రధానముగాఁ గలరూపకము లరుదు. ఉత్తరరామచరిత్ర మున్నగునవి యొకటి రెండున్నను వానితుదలో సంతోషమే కలదు. ఇఁక చావును వారు ప్రత్యక్షముగా చూపనే చూపరు. ఇట్లు దుఃఖమయములగు సన్నివేశములనెల్ల సుఖమయముగాఁ జేయుటలో ప్రాచీనాధునికకవులకల్పనలు చాల దుర్బలముగా, కృత్రిమముగా నున్నవని యొక యాక్షేపణ కలదు. అందు చాలసత్యమునుగలదు. కాని యది కర్తలోపముగాని పద్ధతిలోపముగాదని నామతము. మనలో నన్ని నాటకములును అట్లులేవు. శాకుంతలము, మృచ్ఛకటిక మొదలగు నాటకములలోని శోకమును సుఖముగాఁ ద్రిప్పిన కవులకల్పన కేమి విలువ యీయఁగలము? నాటకములు వ్రాయఁబూనినవారందఱును చక్కని సంస్థానమును గల్పించు శక్తిగలవారని యెవరు చెప్పఁగలరు? ఎందఱో తమ యయోగ్యత నెఱుఁగకుండ పనిచేయ నుంకింతురు. ఎట్లో ముగింతురు కూడ. కాని మూలతత్త్వము నిర్ణయించునప్పుడు వారిరచనలు పనికిరావు.

కాఁబట్టి సారంగధరుని చరిత్రమున కృష్ణమాచార్యులు చేసిన యీ మరణాంతపు మార్పు నాకు రుచింపలేదని నామనవి. అనఁగా ఆనాటకమందు నాకు రుచిలేదని కాదు. అందలి పాత్రపోషణము, సల్లాపకౌశలము, సంవిధాన చాతుర్యము ఇత్యాదులను బట్టి చూచినచో వారినాటకములలోనెల్ల నిది యుత్తమమనక తప్పదు. ఇంతేకాదు. తెలుఁగుభాషయందలి యుత్తమరూపకములు కొన్నింటిలో నిది యొకటి యనుట నిస్సందేహము. నా యిప్పటి

చింత యేమనఁగా సారంగధరుని పూర్తిగా చంపుటలో గ్రంథకర్త యాశ్రయించిన మార్గము పాశ్చాత్త్యకవుల సామాన్యపద్ధతుల ననుకరించుటచేఁ గలిగిన యడ్డుదారియే కాని దానిచే నాటకపరమఫలమగు రసానుభవానందము పూర్తిగా నెఱవేఱలేదనుటయే. కాఁబట్టి యిందలి శోకరసము వీరి 'పాదుకాపట్టాభిషేకము' నందలిదానికన్న ఒకవన్నె తక్కువయే యనకతీఱదు.

ఐన సారంగధరుని గతియేమి? సిద్ధుఁడు మరల రావలసినదేనా? బంకవేసి తెగిన కాళ్లుచేతు లతికింపవలసినదేనా? — యని యడుగుదురేమో! నావంటివాఁడు కృష్ణమాచార్యులవంటికవికి కల్పనలు సూచింపఁబూనుట తాతకు దగ్గు నేర్పఁబూనినట్లు. సారంగధరుని జంపవలెనని మొదలే సంకల్పించుకొన్నాఁడు గాని లేకున్న నా యసామాన్యప్రతిభావంతునికి వానిని బ్రతికించుకల్పనమార్గములకు కఱవులేదు. చిత్రాంగిపై సందేహము గలిగినవెంటనే సారంగధరుని శిక్షను నిలుపుమని రాజరాజుపంపిన భటుఁడు అడవిలో దారితప్పి ఆకస్మికముగా విలంబించుటకు బదులుగా నేరుగా పోయియుండెనేని యేతొందఱయు నుండకపోవునుగదా!

నాది వట్టి ఛాందసముగా కొందఱకుఁ దోఁపవచ్చును గాని నన్నడిగినచో చిత్రాంగినిగూడఁ జంపవలసిన పనిలేదు. దానిని మొదటినుండి తాటకవలెనో, శూర్పణఖవలెనో కేవల క్రూరవ్యక్తిగా కంటికి పడిన మగవానిని కామించి లోఁబఱుచుకొనఁజూచు జగజాఁగగా తయారుచేసియుండినచో అది చచ్చిన శనివదలెనని సంతసించియుందుము. కాని కృష్ణమాచార్యుల చిత్రాంగి యట్టిది కాదు. మోసము జరుగక, తండ్రినిర్బంధముతో ముసలివానిని పెండ్లాడక, తాను వలచిన సారంగధరునినే చేపట్టఁగలిగియుండెనేని ఆయమ సామాన్యస్త్రీలకన్న ఉత్తమమైన నడవడి గలిగియే యుండును. దమయంతి పుష్కరుని, రుక్మిణి శిశుపాలుని బలవంతముగా పెండ్లియే చేసికొని యుండిన యెడల వారెట్టివారుగా పరిణమించి యుందురో యెవ రెఱుఁగుదురు! చిత్రాంగిని మేలుతరగతి గరితగాఁ జేయుటకుఁ దగిన చదువు, సంస్కారము, స్వాభిమానము, పాపభీతి మొదలగు గుణము లామెయందుఁ గలవు. కాని యామెగతి బలవంతముగా చెఱసాలలో నిష్కారణముగావేసి తప్పించుకొనుటకు ప్రయత్నింపఁగా శిక్షించినట్లైనది. బ్రతుకులో నెమ్మది యనుమాటయే లేకపోయినది. తుదకు సారంగధరుఁడు మృతిఁజెందినతరువాత రాజరాజనరేంద్రుఁడు ఏడ్చుచు మొత్తుకొనుచు 'ఈడుగానివివాహమెందును జనదు' అని తనతప్పును ఊరివారందఱికి చాటిచెప్పెనుగాని ఆమాట యా భర్తనోట వినఁగల తృప్తియైనను పాప మా నిర్భాగ్యురాలికి లేదయ్యెను! ఇట్లు ఏ తృప్తియు లేక, యేయాశయుఁ దీఱక, అడవ

చావు చచ్చుటకు చిత్రాంగి యర్హురాలు గాదని తలఁచియేకాఁబోలు, భర్త శిక్షను విధించినమాట విన్నంతనే ఆమె దిగులుపడి తన్నుకొని పడిచచ్చినట్లున్న కృష్ణమాచార్యుల కల్పననుమార్చి, చిత్రాంగి తానే కత్తితో పొడుచుకొని భర్తను చెడఁదిట్టి చచ్చినట్లు కల్పించి కొందఱభినయింపఁగాఁ జూచినాను. ఈమార్పు సభ్యులకు కొంత తృప్తి నిచ్చుననుట నిస్సందేహము. కాని యసలు చిత్రాంగి చావనేవలయునా? మఱి తనతప్పు ఇంతగా బయలైనతరువాత ఆ బండబ్రతుకు బ్రతికి యేమిఫలమని యడుగుదురు. తాను జేసినది తప్పని యెఱుఁగనివారికి, పాపభీతి లేనివారికి ఇట్టిది బండబ్రతుకగునుగాని తన దోషము నెఱిఁగి హార్దముగా పశ్చాత్తాపము పడఁగలవారికి బ్రతుకులో బండతన మేమి? మఱియు తప్పులను దిద్దుకొని తరువాతి నడతను శుభ్రముగా నుంచుకొనుటకు నవకాశము బ్రతుకులో నున్నది. చచ్చిన నేమి గలదు? చిత్రాంగి న్యాయబుద్ధిని పాపభీతిని పశ్చాత్తాపమును గ్రంథకర్త స్పష్టముగా వివరించియే యున్నాఁడు. ఇఁక చావు ఎవరి యుపకారముకొఱకు? ఇట్లే 'రామరాజు చరిత్రము'లో శ్రీనివాసరావు ఆయుస్సు నిచ్చియుండినను ఆపాపీని పటాణిని తుదకు రంగభూమికి బలియిచ్చిన 'సుమనోరమసభ' వారిమార్పుకూడ చింత్యమే. పటాణిదృష్టిలో రామరాజు తనతండ్రియనుట యొకటితప్ప తక్కిన యతనిగుణములన్నియు దుష్టములే. శిక్షార్హములే. కావున వానినిజంపి పటాణి స్వధర్మమే నెఱవేర్చినాఁడు. తన్నుగనిపెంచిన తండ్రిని జంపితినే యనుదుఃఖము వానికిఁగలుగుట సహజమే. కాని దానికి ఆత్మహత్య ప్రతీకారమా? జన్మాంతరములందు నమ్మికగల చిత్రాంగికిని, పరలోకముగలదని విశ్వసించిన పటాణికిని జీవితమందలి తప్పులఫలములు చావుతోఁదీఱునా?

ఇఁక ఇట్టివి సహజములుగావా? ఇట్లు ఉద్రేకమునకులోఁగి చంపువారును చచ్చువారును లేరా? యని వేఱొకప్రశ్న. కావని, లేరని యెవరనిరి? ఇంతకన్నను అన్యాయములు, అసహ్యములు నైనవి యెన్నో జీవితమునందు చూచుచు వినుచు నున్నాము. వానినెల్ల సహజములనునెపమున రంగస్థలమున కెక్కింపఁగలమా? ఎక్కింపవచ్చునా? భీమసేనునివంటి యసాధారణ బలశాలియగు మగనికి తనకన్నులయెదుట సభలో తన ప్రియపత్నిని కీచకునివంటి మత్తుఁడు తన్ని అవమానపఱిచినప్పుడు వానినూరక గొంతు పిసికి చంపి పాఱవైచుటతోమాత్రము తృప్తి గలుగదు. అక్కఱుతీఱదు. వాఁడు వానిని చంపినవిధానమును తిక్కనసోమయాజి యెట్లు వర్ణించినాఁడు?—

విక్రృతపుఁజావు సంప మది
వేడుకపుట్టినఁ గిట్టి పట్టి మ
స్తకమును బీనదీర్ఘభుజ
శాఖలుఁ బాదయుగంబుఁ మేనిలో

నికిఁ జొరనుగ్గుగాఁ దుఱిమి
  నించిన గ్రంతలతిత్తియైన కీ
చకు ధరణిస్థలిం జదిపి
  చక్కని ముద్దగఁ జేసె దుష్టుఁ డై.
(భార. విరా. ౨-3౫3)

పరోక్షానుభవముగల కావ్యమునందే యిది యింత కష్టముగా నున్నప్పుడు సహజ మను నెపమున దీనిని ప్రత్యక్షముగా రంగమందు చూపవచ్చునా? చూపుటకు సాధ్యముగా దని వదలుట వేఱుమాట. ఏదో యొకమార్గ మున కిటుకుచేసి పైని మారణవిధిని చూపఁ గలశక్తియున్నను చూపఁదగదనియు, ఇట్టి వానివలన సభ్యుల కుద్రేకపు మత్తెక్కించుట తప్ప నిజమైన నీతిగాని, ఆనందముగాని కలుగ దనియు నాయభిప్రాయము.

ఇఁక సారంగధరునివంటి వట్టియుత్తమ పాత్రములనుగాని, దుష్టబుద్ధివంటి యధమ పాత్రములను గాని యుక్కుబొమ్మవలె తయారుచేయరా దనియు, పాత్రములలో ఉత్తమమధ్యమాధమగుణములు మిశ్రముగా నుండిననే తప్ప చూచునట్టి మనకు వానితో 'సామనస్యము' కలుగదనియుఁ గొందఱు వాదింతురు. పాశ్చాత్త్యులలోని స్వభావ వాదపు పరిణామములలో నిది యొకటి. మన కవు లిద్దఱు నీ యభిప్రాయము నంతగా మన్నింపలేదని సంతోష మగుచున్నది. పాత్రములతో మనకు తన్మయత్వము కలుగుట, వాని స్వరూపము మన హృదయము లం దచ్చుపడుట, కవియు నటుఁడును వాని కిచ్చిన తీర్పునుబట్టి, వర్చస్సునుబట్టియుండునే కాని అవి మిశ్రములుగా నున్నంత మాత్ర మునఁ గలుగదు. సారంగధరుఁ డొకమాఱు చిత్రాంగికి లోఁబడినట్లును, హరిశ్చంద్రుఁ డొకతూరి యసత్యమాడినట్లును కల్పించుట యొక గొప్పకాదు. అట్లుచేయుట 'లాభః పరం గోవధః' అనునట్లు ఆమహాపురుషుల మొగముపై నొకమసిబొట్టు పెట్టినట్లగునే కాని ఆపాత్రముల వ్యక్తికి మేల్మి రాదు. అవియెక్కువ సత్యములుగా మనకుఁ దోఁపవు. మంచి యందుఁగాని, చెడ్డయందుఁ గాని తీవ్రమైన హఠము గలిగి వర్తించువ్యక్తులు అస్వాభావి కములనుట మన స్వభావాజ్ఞానమునే వెల్ల డించును. మంచిచెడ్డల మిశ్రములగు దుర్బల వ్యక్తు లెట్లో అట్లే నమ్మిననమ్మికకుఁదగినట్లు పట్టినపట్టువదలని ప్రబలవ్యక్తులును ప్రకృతి యందు సహజములు. కళాప్రపంచము వీని నేల వదలవలయును? కళావంతుని ధర్మ మెల్ల తానేఱుకొన్న వస్తువుగాని, పాత్రము గాని మనకు హృదయంగమ మగునంత తీవ్ర తతో తయారుచేయుటయే కాని వేఱుకాదు. అట్టి పాత్రములు ప్రకృతిలో నున్నవా యను చర్చతో వాని కంతగా పనిలేదు. ఉండవచ్చునని తోఁచినను, ఉండవలయునని బుద్ధిపుట్టినను జాలును. మఱియు నాఁటినుండి నేఁటివఱకు దినదినమును, క్షణక్షణమును ధర్మము, నీతి, శాంతి, శక్తి మొదలగునన్నిటి యందును పరమావధిని సాధించుటయే మను ష్యులపరాయణమై యుండఁగా భావనామయ

మఱుగు కళాప్రపంచమునందైనను దానిని పూర్తిగా సాధించునాశను మనమేల వదలవలయును? ఎట్లు వదలఁగలము? అట్లని మిశ్రపాత్రములను వదలవలయునని నేను జెప్పను. మిశ్రవ్యక్తులను ప్రదర్శించుటయే కళాకారుని ధర్మమనిమాత్రము నే నంగీకరింపఁజాలను.

ఈసందర్భమున మఱియొకవింత. సారంగధరుఁడు అంతయుత్తమపాత్రముగా నుండుటకు మనలో కొంద ఱోర్చుకొనలేరుగాని, వానితండ్రి రాజరాజనరేంద్రుఁడు తెలుఁగువాఁడై తెలుఁగుమహాభారతమునకు మూలపురుషుఁడు కావున వాఁ డింతటియకార్యము చేసియుండఁడనియు, అందుచే తెలుఁగువారీకథ నాటకముగా నాడుటకాని, చూచుటకాని ఆంధ్రగౌరవమునకు లోపమనియు ఆవేశముతో వాదింతురు! ఇట్లు చూడఁబోయినచో విరాటపర్వము నాటకమాడిన కర్ణాటకుల కవమానము. ఎందుకనఁగా విరాటుఁడును, వానికొడుకగు నుత్తరుఁడును కర్ణాటకులఁట! మొదటివాఁడు పంద, రెండవవాఁడు పిఱికి. ఇట్లే రామాయణము నాడినచో అరవమహాశయుల కాగ్రహము. రావణాసురుఁడు మొదలగువారు ఆదియరవలఁట! వంతులమీఁద ఒండొరుల పెండ్లాముల నపహరించి సంసారము చేసిన వాలిసుగ్రీవులును కర్ణాటకులుకావచ్చును గాన రామాయణపు అగౌరవములో కన్నడమువారికిని భాగముగలదు! ఇట్టివిమర్శలు తెగుట యెప్పటికి? అది యట్లుండనిండు. చెప్పవచ్చినదేమనఁగా మనవారి కుత్తమపాత్రములం దభిమానము లేకపోలేదుగాని ఇంకెవరిమాటలనో యనువదించుచు కావ్యనాటకాదులందు వానివలన రంజన చెడుననుచున్నారేకాని, ఇది తమ హృదయమును తాము పరీక్షించుకొని చెప్పుమాట కాదని.

(౨) ఈకవు లిద్దఱును తమ నాటకములను తామే ఆడించుటకై పూనుకొన్నవారగుటచేత, నాటకప్రపంచమున కవికి తరువాత ముఖ్యప్రకృతులగు నటులయొక్కయు, సభ్యులయొక్కయు ఇష్టానిష్టములను, అనుకూల ప్రతికూలములను గమనింపవలసిన యక్కఱ వీరి కేర్పడినది. అందుచేత ఇంటిలో కూర్చుండి నాటకములు వ్రాసి అచ్చొత్తించు ననేకకవుల రచనలవలె వీరివి కేవల శ్రవ్యకావ్యములుగాక నిజమైన దృశ్యకావ్యములును అయినవి. సంస్కృతభాషలో కేవల ప్రాచీనములైనవి కొన్నితప్ప తక్కిన వేవియు నభినయించుట కనుకూలముగా లేక, అభినయించినను రక్తియుండకపోవుటకుఁ గల ముఖ్యకారణము ఆకవు లెవరును అభినేతల జవాబ్దారీని ఎఱుఁగకపోవుటయే యనుటలో సందేహము లేదు. నటులు పంక్తిబాహ్యులని, నటన పాపమని భావము హిందూసంఘములో చాలనాళ్లనుండి వేరూఱి యుండెను. అట్టికాలములో సంఘతిరస్కారము నెదిరించి విద్యావంతులగు సంస్కారులను నటులనుగాఁ గూర్చుకొని, వారికి నాట్యవిద్యయందు మంచి శిక్ష గలుగుటకు అవకాశముఁ గల్గించి, కన్న

...ము ప్రధానభాషగాఁగల బళ్లారిపురములో తెలుఁగునాటకములందు మితిమీఱిన యభిరుచిఁ గల్పించి యెన్నో సంవత్సరములు నిర్వహించిన మన కవిద్వయము సాహసమును, నాటకరచనయందలి భక్తిని, కార్యశూరతను ఎంత పొగడినను దీఱదు. సభ్యులయొక్కయు, నటులయొక్కయు దృష్టిలేనికవికి కథాప్రణాళిక ననుసరించి చెప్పవలసిన యర్థభావములను ఒకరినోటనో, పెక్కురనోటనో సల్లాప రూపమునఁ జెప్పింపవలయుననుఒకయభిప్రాయము తప్ప, ఒకఁడాడినమాట యింకొకనిమాటతో పొత్తుకలిపినదా లేదా, ఒకఁడు మాటాడుచు [illegible]ంచునప్పుడు ఇతరపాత్రములు మూఁగబొమ్మలవలె నుండక సందర్భమునకు సన్నివేశమునకు తగినట్లు చేరికగా వర్తించుట కవకాశము కలదా లేదా, కల్పించిన సంకేతములు క్రియలును రంగస్థలమున చక్కఁగా ననుకరించుటకు వీలున్నదా లేదా, వానియందు వైవిధ్యము గల్గి విసుగువేసట కలుగనీక పరస్పరసాహాయ్యమున నడచుచున్నవా లేదా,—ఇత్యాదిగా తర్కించి సమంజసముగా నాటకమును దిద్ది తీర్చుట కంతగా అక్కఱతోఁపదు. ఈ యుక్తాంశము నుంచుకొనుటచేతనే వీరినాటకములలో సామాన్యకవులవానిలో లేనిబిగువు, ఐక్యము, ఆనుపూర్వ్యము, విచ్ఛిత్తిలేని కథాప్రవాహము మొదలగు సద్గుణములు ఎక్కువగాఁగానవచ్చును. అందును తానే పాత్రమును ధరించి యభినయించుటయందు శక్తియు రక్తియుఁ గలిగియుండుటచే కృష్ణమాచార్యులరచనలలో శ్రీనివాసరాయల రచనలకంటె నీగుణము లెక్కువగాఁ గనిపించును.

ఇట్లు నటులయనుకూలములను, సభ్యుల యభిరుచులను దృష్టిలో నుంచుకొనుటవలన పైని లాభములున్నను ఇందు నాటకకర్తలు స్వతంత్రతను బోఁగొట్టుకొను నపాయము గలదు. నటులందఱును సమానమైన ఉత్తమాభినయశక్తియు, విద్యాసంస్కారమును, విమర్శశక్తియుఁ గలవారైయుండుట యేనాటకసంఘమందును అసాధ్యము. వారియభిరుచియు పై మూఁడుగుణములనుబట్టి రకమువారుగా నుండును. ఇఁక సభ్యులమాట యిప్పుడు చెప్పఁబనిలేదు. అదియొకసంత. నాలుగణాలకు బ్రతికియున్నవాఁడెల్ల నాటకసభ్యుఁడు గావచ్చును. కాఁబట్టి యిట్టివారి నావర్జింపవలసినప్పుడు కర్త యెట్టివాఁడైనను కొంతలొంగక, తనస్వరూపమును అంతస్తును దింపక తప్పదు. మనకవు లిద్దఱినాటకములందును ఈఫలములు గానవచ్చుచున్నవి. శ్రీనివాసరాయలు ద్రౌపదీవస్త్రాపహరణకథ నాటకమునకు తగినదిగాదని తన 'ప్రపంచ నాటకచరిత్ర' లో కంఠోక్తముగా చెప్పినను దానిని తరువాత తానే వ్రాసి యాడింపవలసెను. మయసభలోని యింద్రజాలము, ద్రౌపదిచీర లొలుచునప్పటి వివిధవర్ణాఢ్యయ వస్త్రములయావిర్భావము మొదలగువానిని వింతలు వింతలుగా అన్నికంపెనీలవారును జూపుచుండఁగా మనముమాత్ర మూరకయేల

యుండవలెనని 'సుమనోరమసభ' వా రెవరో యొత్తిడిచేసిరికాఁబోలు! ఇట్లే పురాణకథల నుండి యేదోయొకముక్కను తీసి స్వతంత్రముగా విచిత్రసంధానముఁ గల్పించుశక్తియు రక్తియుఁగల కృష్ణమాచార్యులు వట్టిసన్నివేశములపట్టీవలె నుండు ప్రహ్లాదచరిత్రను రచింపవలసెను. ప్రహ్లాదుని పాములతోఁ గఱిపించుట, కొండనుండి క్రిందికిఁద్రోయుట, ఏనుఁగులచేఁ ద్రొక్కించుట, అగ్నిలో వేయుట, స్తంభము పగిలి నరసింహమూర్తి యావిర్భవించుట మొదలగు విచిత్రములను ఎందఱో సభలవారు వింతలువింతలుగాఁ బ్రదర్శించి మెప్పులందుచుండఁగా 'సరసవినోదిని' సభవారు మాత్రము మడిగట్టుకొని సోమరులై యుండఁదీఱునా? ప్రతికంపెనీయందును గాలిపటమునాట్యమో, గంగిరెద్దులగంతులో నేర్చినవాఁ డెవఁడోయొకఁడు ఎట్లోవచ్చి తప్పక చేరుకొనియుండును. సాధ్యమైనంతలో ప్రతినాటకమునందును వానినాట్యమున కవకాశముఁ గల్పించుట కర్తకు విధి. కాఁబట్టియే రుక్మాంగదుని యేకాదశ్యుపవాసవ్రతమహాత్త్వముచేత విధివిరామములు లేక మోక్షమునకుఁ బోవుచుండు జీవులముక్తిమెరవణిలో ముందు నాట్యమాడియాడి కాలుసేతులు కట్టెవాఱియున్నను రంభ, ఊర్వశి మొదలగు నప్సరసలు కృష్ణమాచార్యుల బ్రహ్మసభలో మరల నాట్యమాడవలసెను! ప్రాచీనమైన కర్ణాటక హిందూస్థానీ సంగీతపద్ధతులం దభిరుచియు, అభిమానమును ఇద్దఱుకవులకును గలదుకాని, ఆపద్ధతిప్రకారము తయారుచేసిన పాటలను రక్తిగా నటులందఱును పాడఁజాలరు. పాడలేకున్నను పాడఁగల మని, పాడవలయు నని తలఁచువారు ప్రతినాటకసంఘమునందును కొందఱైన నుందురు. అట్టి నటుల తృప్తికై, వానిని విని చేతులుదట్టి తలలాడించి యానందించు సామాన్యసభ్యుల సంతోషమునకై, పార్సీఖత్తులును, వానివలె కల్పింపఁబడిన హిందూస్థానీ కర్ణాటకపు గత్తులును మనకవు లిరువురును స్వేచ్ఛగా నుపయోగింపవలసిన వారైరి. తత్ఫలముగా తెలుఁగుసీమలో ముత్తైదువల పెండ్లిపాటలు గూడ ఆవరుసల క్రిందికే దిగినవి! ఇద్దఱి నాటకములందును పెక్కింటికి ముగింపు చాల ఆకస్మికముగాఁ గానవచ్చును. కథలోని ముఖ్యవిషయము ముగిసినను దానికి సంబంధించి రంగమందు నిలిచియున్న వ్యక్తుల మనోభావములు పూర్తిగా వెలువడకనిదే మంగళము పాడుట చాల వికారముగా నుండును. కాని శ్రీమహావిష్ణువు ఆకాశము నుండి దిగి కొడుకును చంపనున్న రుక్మాంగదుని చేతికత్తిని తటాలున నిలుపుటతో ఆ కథలోని సత్త్వంతయు ముగిసినది. అప్పటికే నాలుగైదుగంటలకాలము ఒక చోటి రు న కూర్చుండియున్న సభ్యులలో ననేకుల యోర్పు సుతిమించి యుండును. వారప్పటికే లేచి కుర్చీలు వెనుకముందు కీడ్చి గందరగోళము చేయ మొదలుపెట్టుదురు. ఇఁక మోహిని, ధర్మాంగదుఁడు, సంధ్యావళి మొద

లగుపాత్రముల సుఖదుఃఖములచింత యెవరికి? తీర్చినతీర్పును జూచి యానందించువారు లేన ప్పుడు ఏల యీవృథాశ్రమము? వీరి యనేక నాటకముల యాకస్మిక పర్యవసానమున కిది తప్ప వేఱుకారణము నాకు గోచరింపదు.

ఇరువురి నాటకములందును హాస్యరస ప్రధానములగు సన్నివేశములు కొన్ని కల్పింపబడియుండుట కిట్టి సభ్యపరాధీనతయే కారణము. తక్కిన యన్నిరసములకంటె హాస్యరస మందఱకును హృదయంగమ మగును. ఎందఱో హాస్యప్రీతిచేతనే నాటకమును జూడఁబోవుదురు. సంస్కృతనాటకము లందు విదూషకపాత్రము ప్రవేశించి రస భంగము చేయుట కిదే హేతువు. కాళిదాసుని విదూషకపాత్రము చాలదని కర్ణాటక నాటక సభలవా రందఱును శాకుంతలము నాడు చుండిన కాలములో, అసలునాటకమునంతైదు నిమిషములలో ముగియుచుండిన ఆఱవ యంకపు విష్కంభమును కనీసము అరగంట ప్రొద్దుపెంచి, అందుబెస్తవాని యమాయికపు కేళాకోళము, కోమట్ల బేరపు టక్కులు, నౌకరువారి లంచాల చిక్కులు మొదలగు కుచోద్యములను విస్తరించిచూపి 'వినోదము' చేయుచుండిరి. ఇదియింకను పూర్తిగా నశింప లేదు. హాస్యప్రియులైన సభ్యులను తృప్తి పఱుపవలసినప్పుడు గ్రంథకర్త యిట్టివి కల్పింప వలసియుండును. మనకవు లిరువురిలో కృష్ణమాచార్యులకు చక్కని హాస్యమును గురించు శక్తికలదు. శ్రీనివాసరాయల కది తక్కువ. ఐనను వారు హాస్యసంవిధాన కల్పనాప్రయత్నముమాత్రము చేయకవదల లేదు. వారి 'ప్రహ్లాద' యందలి గురుశిష్య సంవాదము, ప్రస్తావనలలోని విదూషక పాత్రము —ఇత్యాదు లిట్టిబలవంతపుహాస్య వస్తువులు. సరసమయి, నిజముగా చమత్కార జనకమగు హాస్య మిందు లేదనియే చెప్పక తీఱదు. కృష్ణమాచార్యుల నాటకములలో పెక్కుచోటుల సంవిధానముతో సమంజస ముగా అతుకుకొన్న హాస్యరస మున్నను కొన్నిచోట్ల అసంబద్ధముగాను గానవచ్చును. 'చిత్రనళీయము'లో సుదేవపర్ణాదులు అడ విలో కలిసికొన్నచోట నుండు హాస్యమిట్టిది. 'చిరకారి'లో చెవిటివారివినోదము, 'వరూ థిని'లోని సరస్వతి చక్రవంతుల సంవాదము మొదలగునవి యిట్లే యేర్పడినవి. అందందు— ముఖ్యముగా కృష్ణమాచార్యుని రచనలలో— సంస్కారులగు సభ్యుల మనసుకు వెగటు గల్గించు మాటలుగూడ దొరలినవి. ఇవి విని నవ్వువారు, సంతసించువారు సభ్యులలో దండిగానే యుందురు. కాని నవ్వఁజాలక మనసు నొచ్చుకొనువారును ఉందురనుటకూడ గమనింపవలసిన విషయము.

(3) తమ నాటకములు ప్రజలకు నీతిని బోధింపవలయునను సంకల్పము ఆచార్యుల కన్న రాయల కెక్కువగా నున్నట్లున్నది. ఇద్దఱును శౌర్యము, సాహసము, భక్తి, పతి సతీవ్రతములు, సత్యము, అహింస— మొద లగు నీతులవిజయమును బోధించు పురాణ

చరిత్రకథల నేఱుకొనియో, అట్టివానిని గల్పించియో రచించినవారే. ప్రాఁతకథలలో నీతికి భంగముఁ గల్గించు సన్నివేశము లుండెనేని యిరువురును స్వతంత్రించి వానినిమార్చినవారే. వాలిని మఱుఁగున నుండి రాముఁడు వధించెననుట, అర్జునునిమీఁది యభిమానమున ద్రోణాచార్యుఁడు నిరపరాధియైన యేకలవ్యుని కుడిబొటనవ్రేలిని మరల వాఁడు విల్లు ముట్టకుండ, గురుదక్షిణగా గ్రహించెననుట, ఇత్యాదులను కృష్ణమాచార్యులు మార్చివేయఁగా (సుగ్రీవపట్టాభిషేకము, హిడింబాభీమసేనీయము) ధర్మరాజు ద్రోణుని జంపుటకై యుద్ధభూమిలో నసత్యమాడెననుటను శ్రీనివాసరాయలు మార్చిరి. (శిరోమణి.) కాని నాటకతత్త్వము మొత్తముమీఁద రసప్రతిపాదన మనుట కృష్ణమాచార్యులదృష్టి. నీతిప్రదర్శనమునందలి యభినివేశము శ్రీనివాసరాయలయెడ కొంచెము ముదిరియున్నది. కాఁబట్టియే సారంగధరుని కథ దుర్నీతిభూయిష్ఠమని వారు నాటకముగాఁ దలపెట్టలేదు. "నీతి కుదుర్పవలయు నన్న దుర్నీతినించుక ప్రకటించియే తీఱవలయు" నని కృష్ణమాచార్యులు తమ 'సారంగధర' పీఠికలోఁ బ్రకటించిరి. సారంగధరునికథను నాటకీకరింప లేదను పేరేకాని శ్రీనివాసరాయలు దానివంటిది, ఒకవిధమున దానికన్న మించినది యగుకథను కల్పించి 'మైసూరు రాజ్యము' నఁ జేర్చిరి. అక్కడ సవతితల్లికుమారుని మోహించిన ఇక్కడ మేనత్త—ఒకమేనల్లునిగాదు—ఇద్దఱిని మోహించును. సారంగధరునివలె వీరిరువురును తిరస్కారమునకు ఫలముగా వధింపఁబడుదురు. సారంగధరకథకుఁ గలిగిన వ్యాప్తిని చూచి 'సుమనోరమసభ' వారి నిర్బంధము చేతనో, లేక వారికే దృష్టియందు మార్పు గలిగియో దీనిని వ్రాసియుందురు. అందులోఁ గల కోర్టు లాయర్ల విచారణాకోలాహలము ఇందును గలదు. అదియట్లుండె. ఇద్దఱిలో నెవరును నీతివేర రసమునుగాని, రసమును వేర నీతినిగాని ప్రాయశః చెఱిచినవారు గారు. మనుష్యజీవితమందు రెండును సమానమైన విలువగల తత్త్వములు. మఱియు పరస్పర సంబద్ధములు. ఒకటియున్నచోట రెండవది యుండును; ఉండవలయును. రసమయమైన కళాప్రపంచమున నీతిని మఱచిపోవలయుననియు తలఁచుకొనరాదనియు చేయువాదము వివేచనాఫలముకాదు. ఈరెంటిని ప్రత్యేకముగా, ఒకదానిమొగ మింకొకటి చూడనీక, తలుపులువేసి బిగించుటకు మనుష్యజీవితమున వేఱువేఱు చిన్నిండ్లులేవు. ఇవిరెండును ఒకదానికొకటి గౌరవమును, విలువను హెచ్చించు మిత్రములుగాని శత్రువులు గావు. రెంటికిని జీవితమునందు శాంతిని బెంపొందించుటయే పరమఫలము గావున ఒకటినొకటి వదలి బ్రతుకలేవు. ఈరెంటియన్యోన్యాశ్రయధర్మ మెఱిఁగి వర్తించుటయే లోకక్షేమమునకు సాధకము. ప్రాధాన్యమునుబట్టి పేరుమాఱు నంతే. మనకవు లిద్దఱును కళతో

నీతికిఁగల యీసంబంధము నేమఱకయుండుట వారి గ్రంథములకుఁ గల గౌరవవ్యాప్తులకు ముఖ్యకారణమనుటలో సందేహము లేదు.

కాని కళాసంసారమున నీతి తెరమఱుఁగు భార్యగానుండిపనిచేయవలయునేకాని ముందు పడి మొగముఁజూపి త్రోసికొనిరారాదు. అట్లయినచో కళ సొగసు చెడును. కనుకనాటకమునం దేనీతి ప్రవేశించినను దానికి కథతో సన్నివేశములతో ఎడతెగని సంబంధ మున్నట్లు కల్పింపవలయునేకాని, అదేపనిగా ఆకస్మికముగా తెచ్చి యతికించినట్లు చేయరాదు. అది పిలువనిపేరంటమువలె సహించుట కష్టము. ఇట్టిదౌర్బల్యము ముఖ్యముగా కృష్ణమాచార్యులరచనలలో నందందుఁ గానవచ్చును. వారి కాలమున హిందూసంఘమందు ప్రబలముగానున్న సాంఘికనైతిక రాజకీయసమస్యలను చర్చించి అందుమీఁద నిర్ణయమగు సిద్ధాంతమును వెలిఁబెట్టు పనికి వా రాకస్మికముగా తొడఁగుదురు. ప్రౌఢావివాహము, బ్రాహ్మణులు దేహవ్యాయామము చేయు నావశ్యకత, స్వదేశవస్త్రముల ప్రోత్సాహము, ఉప్పుపన్ను ధర్మముగాదనుట,— ఇత్యాదివిషయముల చర్చలు వీరినాటకము లందలి పాత్రములస్వరూపము, కథకాలము మొదలగువానితో పూర్తిగా మిళితముగాని యతుకులు.

ఆంధ్రవాఙ్మయము పాశ్చాత్త్యసాహిత్యసంపర్కముతో క్రొత్త క్రొత్త తెరువులఁ దిరుగుట కుపక్రమించినకాలమున ఆభాషలోలేనినాటకరచనకై, ఆకాలమున బహిష్కృతమగుఅభినయవిద్యకై తమశక్తియుక్తులనెల్ల నాజీవము ధారపోసిన కార్యశూరులు వీరిద్దఱు. వారు శక్తికొలఁది, అనుకూలము కొలఁది, అవకాశము కొలఁది తయారుచేసి కట్టియిచ్చిన సద్ది చాలునా చాలదా యని చూచుకొనవలసినది వారిమార్గమున ముందుకు నడవఁగోరువా రందఱు చేయవలసిన పని. నేను నాటకకర్తనుగాని, అభినేతను గాని ఇదివఱకును గాకున్నను రెంటియందును కొంత యనురాగము గలవాఁడనుగాన, ఇపుడు నేఁజేయఁ బ్రయత్నించిన దదే. కాని యిది వట్టి పైపరామరిక. లోఁతుకు దిగి చూడవలసినది, చేయవలసినది కొండంతకలదు. నాకన్న శక్తియు, అవకాశమును, అనుకూలమును గలవా రాపని కధికారులు.

---

## పంచమాంకము

### ప్రథమ రంగము

జయంతాశ్రమసమీపవనము

రామి—ఆహా! నిరంజనమహారాజుగారి గొప్పఁదనము నెంతని కొనియాడుదును. అమ్మహనీయుని సన్నిధిని నేననుభవించినశాంతిసుఖము, మున్నెన్నండును నెఱుంగ. వారిగురువులు, వారిస్నేహితులు, సంప్రదాయములు కేవల మలౌకికములు. కన్యాకుమారిలో వారి దర్శనమైనదిమొదలు నమ్మహనీయునియందుఁ జిత్తము లగ్నమైనది. విద్యాధికులమని మేము గర్వించుటయేగాని చదివినది విద్యయుఁగాదు. మేము పొందినపదవిలో నాధిక్యమును లేదు.

గీ. విద్య లెన్నైన నల బ్రహ్మవిద్యయగునె
సేవ లెన్నైనఁ బెద్దల సేవయగునె
శుద్ధు లెన్నైనఁ ద్రికరణశుద్ధి యగునె
బుద్ధు లెన్నైన సమరసబుద్ధి యగునె?

ఎన్ని కాస్మాపాలిటన్ సంఘములయందు, ఫ్రీమేసన్ గోష్ఠులయందు, హేగ్ లీగులయందుఁ గానరానియథార్థమైన యంతరంగైక్య మీ మహారాజు సన్నిధిలో నే ననుభవించితిని. అదుగో సూర్యుఁ డుదయించుచున్నాఁడు.

(తెరయెత్తఁబడఁగా నొకసుందరమైన స్త్రీ స్మృతితప్పియుండును. ప్రక్క నొక్క బ్రహ్మచారి తనకమండలువులోని జలము పైఁ జల్లుచుండును.) ఎవ్వరీనారీమణి? స్మృతితప్పిపడియున్నది. ఈబాలకుఁ డెవ్వఁడు? (అని సమీపించును.)

బాల—బాబూ! మీ రెవ్వరు? ఒక్కసారియిటు రండు. నేను జయంతమును వెడలి సమిధలకొఱకీప్రాంతములఁదిరుగుచుండఁగాఁ బైనుండి యొకవిమానము పోవుచుండెను. తలయెత్తిచూచునటుకు నద్దానినుండి యీమె జాఱిజాఱి విసిరికొట్టఁబడినట్లు నేలఁబడియెను. నాకేమి యుద్దోఁపక కమండలూదకము మోమునఁజల్లితిని. అంతకుమున్ను నిలిచియుండిన శ్వాస లాడఁజొచ్చెను. కాని యింకనుఁ బూర్ణముగఁ దెలివిరాలేదు. మీదగ్గఱ నేమైన మందున్న నామెను బ్రదికించి పుణ్యముకట్టుకొనుఁడు.

రామి—(మందునకై వెదకుచు) నేనును జయంతమునకే వచ్చుచున్నాను. ఆశ్రమమునఁ బెద్దలందఱు కుశలమా! నాకు వారిదర్శన మెప్పుడు చేయనగును?

వటుఁడు—మీ రీమెను బ్రదికింపుఁడు బాబూ! నేఁ బోవలయును. ఇంక నొక్క గంటసేపటికి జపావసానమున వారిని గోష్ఠీమందిరమునఁ గాంచవగును. పరమహంసరాజశేఖరు లంతర్ముఖులై యున్నారు. వారిపుడొరులతో సంభాషించుటయరిది. వచ్చినజిజ్ఞాసువులకు శ్రీవారలయనుమతంబున శారదాదేవియే దర్శనమిచ్చి సంశయములఁ దీర్చుచున్నది. నేఁ దడయరాదు. పోవలయు.

రామి—(ఆపడియున్న స్త్రీకిఁ జేయిచూచుచుండును.) ఏదీ నామందుసీసా? (అని లోపలజేబులలోను, జేతిపెట్టెలోను వెదకుచుండును.) నేనును వత్తునుండుము.

వటు—క్షమింపుఁడు. నేఁ డెవ్వరో భక్తులు వత్తురనియు, వారివారిస్నానపానములకై వసతులుకల్పింపవలయుననియు మావిద్యార్థిబృందమునకు శ్రీశారదాదేవిగారి యుత్తరువైనది. నేఁబోయివచ్చెదను. ఈసతీమణిక్షేమము మీరు విచారించుకొనుఁడు. (అని పోవును)

రామి—బాల్యచాపలమెఱుఁగక యీవటుండు గుర్వాజ్ఞానిర్వహణమునకై వెడలిపోవుచున్నాఁడు. ఆహా గురుశిక్షలోని నిస్పృహత! మఱచితి. నాయదుగు జేబులోనే యున్నది. (అని మందుసీసాతీసి ఆమెకు వాసనచూపును)

లలిత—(కొంత తెలివి తెచ్చుకొని) శ్రీనివాసా! శ్రీనివాసా! ఎంతపని చేసితివి? నీపీతాంబరము, నీకౌస్తుభరత్నము, నీశంఖచక్రములు, నీనామంబులతో నాయెదుట సాక్షాత్కరించి యందఱకన్నులు కప్పి విమానము నుండియెత్తి క్రిందపడవైచితివి, అబ్బా! ఎంతదెబ్బ కొట్టితివి.

రామ—ఏమి యీ దైవచిత్రము. అమ్మా! మీరెవ్వరు? అయ్యో మాటలాడుచున్నను మనస్స్ఫురణలేదు.

లలిత—(కన్నులు మూసికొనియే) ఆర్తత్రాణపరాయణా నారాయణా! నీసుందరవదనారవిందము నొక్కమారు నాకన్నులవిందుగాఁ జూపరాదా! నిన్ను మఱచి తెరువుతప్పి తెరువచేసినందులకుఁ దగినశిక్షఁ జేసితివి. నీకరాఘాతముచే ధన్యురాలనైతిని. కొట్టినదెబ్బ మఱికొంతదృఢముగాఁ గొట్టి నీసాయుజ్యమైనఁ గలుగఁజేయవైతివి! ఎందును బొందని నాబ్రతుకెంత దుర్భరముగా నున్నది. వేంకటాచలపతీ! నీవేగతి.

రామి—(ఆమెప్రక్కనున్న చిన్నపొత్తము నెత్తిచూచి) మిస్: లలిత, యమ్. ఏ. మధుర. (ఆమెచెవిదగ్గఱ బిగ్గరగా) అమ్మా! లలితమ్మగారు! (అని ఆతురతతోఁ బిలుచును.)

లలిత—నాయనా! ఈపాపాత్మురాలి పేరు నీకెవరుచెప్పిరి? పాపము పుణ్యకార్యమని నన్నుఁ బ్రతికించితివి కాఁబోలు.

రామి—మీకు స్మృతితప్పిన సమయమున మీజాడ తెలియునేమో యని యీ చిన్నిపొత్తమును జూచి యిందున్నదియే తమపేరనుకొంటిని.

లలిత—నేనింకఁ బ్రతుకఁజాలను. లోకముఁ జూడఁజాలను. నన్నింకఁ బలుకరింపకుఁడు. (అని మరల కన్నులు మూసికొనును)

రామి—(స్వగతము) సృష్టియొక్క శబలత! పెక్కుజాడలఁ బోవునట్లు జీవుల సృజించి మహానాటకమాడుచున్నాఁ డీశ్వరుఁడు. (ప్రకాశముగ) అమ్మా! లలితమ్మగారు! ఇంత తెలిసిన విదుషీమణు లీలాగుఁ దెగువచేయరాదు.

లలిత—(బదులు చెప్పకయే యూరకొమ్మని హస్తసంజ్ఞమాత్రముచేసి రెండుచేతుల జోడించి పైకెత్తి నమస్కరించుచు నేదియో గొణుగుకొనుచుండును.)

రామి—ఆమె యేమియో ధ్యానము చేయుచున్నట్లున్నది. నేనును గొంతసేపు నిరీక్షించెదను. (అని చిన్నిపొత్తము తిరుగవేయుచుండఁగా నొక లేఖ జారిపడినది.) (జాబుసంచిలోనుండి తీసి యిటునటు త్రిప్పిచూచి,)

ఇట్లు మీ ప్రియమైనమనుమరాలు

లలిత

ఇది తనతాతగారికో, యమ్మమ్మకో వ్రాసిన జాబువలె నున్నది. ఈజాబేమయిన విశేషములు తెలుపునేమో! చూచెదగాక.

శ్రీ రామ

పూజ్యులైన తాతగారిసన్నిధికి,

మీయెడ సర్వదా కృతజ్ఞురాలను మనుమరాలు లలిత నమస్కరించి వ్రాయు జాబు. నాతల్లి నన్ను భూమిమీదపడవైచిదినంబున కరిగిననాటనుండియు నన్నల్లారుముద్దుగఁ బెంచి చదువుచెప్పించితిరి. సాటిబాలికలలో నత్యుత్తమముగఁ బరిగణింపఁబడునట్లు ఎమ్. ఏ పరీక్షలోఁ బ్రథమతరగతియందు త్తీర్ణనైతిని. నేఁ గోరిన నగలు, చీరలు, పుస్తకములు, వస్తువులు మొదలగువానినన్నింటి నిచ్చి నా ముచ్చటలనెల్లఁ దీర్చితిరి.

అనురూపుఁడును, సమ్మతుఁడును నగువరునకిచ్చి నాకుఁ బెండ్లిచేయ నిశ్చయించితిరి. జీవులస్వతంత్రులంట నాతఁడు మరియొకసుందరిని వివాహమాడి తరువాత కొంతకాలమునకు క్షయరోగపీడితుండై చనిపోవుటయు, నాఁడుమొదలు నా కితరులపై మనస్సు ప్రసరింపక పోవుటచే మీరును బంధువులు నన్నెంత బలవంతము చేసినను వివాహమునకు నే సమ్మతింపక పెంకెపట్టుపట్టి విద్యాగోష్ఠితో నిరువదిరెండు సంవత్సరములు కడిపినదాననైతిని. ఆలస్యమైననేమి లెమ్ము. ఇఁకనైనను బెండ్లాడుమనుచు మీపరోక్షమున బంధువులు నన్ను బాధపెట్టుచున్నారు. ఒక్కమాఱొక్కరికై నిర్ణయించుకొనిన నన్ను మఱియొకనికి నిచ్చుకొనుట నా మనస్సు

నకు సరిపడలేదు. మీదయవలన జీవనోపాయమునకు నేసంపాదింప నక్కరలేకున్నను మనశ్శాంతిలేని జీవనము నాకు దుర్భరమైనది. మనమతమునం దేమేని చిత్తశాంతి కలదేమోయని చూచితిని. అమెరికాదేశపు నారీమణి మా దేశమున యావజ్జీవము బ్రహ్మచర్యముతో నుండు స్త్రీమణు లుందురనియు నటకు నేవచ్చినవారు నన్నత్యాదరముతో నాదరింతురనియు నాతో మున్నె చెప్పినది. ఇంటిపోరు తప్పించుకొనుటకును నక్కడ శాంతిననుభవించుటకును మంచిమార్గ మిదియయని నేఁడామె యమెరికాకు మఱికొందఱతోఁ బయనమై పోవుచుండ నే నామెను బ్రార్థింప నందుల కామహానుభావ సమ్మతించి న న్నచటికిఁ దీసికొనిపోవుచున్నది. ఇప్పుడే వేంకటాచలశిఖరము కానవచ్చుచున్నది. నాయాసమా [illegible]. నన్ను మఱచిపొండు. నా కడపటికోర్కె [illegible] కాలము శారదాదేవికృత సత్యసారమునుండి యొక [illegible]పద్యములు మిక్కిలి ప్రియముతోఁ జదువుచుంటిని. ఆగ్రంథమును నాకొక సాధువిచ్చి తనసంగతి చెప్పక యదృశ్యుఁ డైనాఁడు. దానినంతయు చక్కని యాంగ్ల పద్యములుగ వ్రాసి పద్ధతి సిద్ధపఱచి నా చేపెట్టెలో మఱచివచ్చితిని. నాయందు దయగలదేని యాగ్రంథము ముద్రించి సాధువుల కుచితముగఁ బంచిపెట్టుఁడు. ఆశారదాదేవిజాడ నా కేమియుఁ దెలియలేదు. ఆమె దర్శనమే నాకు లభించియుండినట్లయిన నాచరిత్ర వేఱుగనుండి యుండెడిది. వార్ధకపుదశయందు మీకు మనస్తాపము గలిగించినందులకు మన్నింపుఁడు. ఇవే నా సాష్టాంగనమస్కారములు.

ఇట్లు: విన్నవించుదీనురాలు,
మీమనుమరాలు,
లలిత.

(ఆకసమువంకకుఁ జూచుచు) రామచంద్రప్రభూ! జగన్నాటక సూత్రధారుఁడవు: నీవ! నీమహానాటకము ననుకరించుచుఁ గవులు రచించునాటకముల లెక్క యేమి? ఈ సాధ్వీమణినిఁ బ్రదికించునుపాయము నా కనుగ్రహింపుము. ఈమెయుఁ బశ్చాత్తప్తయైయున్నది. వేంకటేశ్వరా! జీవులను శిక్షించి దిద్దుటలో నీకు సాటి యెవరు? (అని యొక్క నిముసము ధ్యానించి) ఈయుపాయము చేసిచూచెద. ఎట్లును నేను జయంతమున కేగుచున్నానుగదా! (ప్రకాశముగ) అమ్మా! లలితమ్మగారు! చెంతజయంతాశ్రమమునఁ దపమొనరించుచున్న శ్రీ శారదాదేవిగారు మిమ్ము రమ్మనుచున్నారు.

లలిత — ఈదీనురాలికి నంతపుణ్యమా! శారదాంబ నన్నుఁ బిలువఁబంచెనా? ఇది స్వప్నముకాదుకదా! మహానుభావా! నీవు దేవదూతవు. శారదయనునక్షరత్రయమే నాజన్మమునకు విశ్రాంతి హేతువుకాఁగలదు. ఆమెదర్శనమున ధన్యురాలనై తరింతును.

రామి — (స్వగతము) ఈమె మనస్సింకనుఁ గుదుటఁబడలేదు. ఇంక నేమాటమీద నెటులుతిరుగునో, మాటలాడక శారదాదేవిసమీపమునకు నీమెను జేర్తును. (ప్రకాశము) అమ్మా! నావెంటరండు. మిమ్ముల నామహనీయురాలికడకుఁ జేర్చెదను.

లలిత —

క. శారద శారద శారద
శారద శ్రీశారదాంబ శరణము నాకున్
శారద శారద శారద
శారదయే తారకంబు సర్వం బిలలోన్.

లలిత యనుసరింపఁగా రామిరెడ్డి జయంతాశ్రమమునకు వెడలును.

(అందఱు నిష్క్రమింతురు)

తెర వ్రాలును.

## ద్వితీయరంగము

### జయంతాశ్రమము

(ధ్యాననిష్ఠలో నున్న శారద కన్నులుతెఱచి యీ క్రిందిపద్యములు చదువును.)

శారద —

క. మామేకం శరణం వ్రజ
నామరగక నిన్నుఁ బశులు నానాధర్మా
రామాంతస్సంచారము
గామించుట గోపబాలకా! యేమందున్?

క. దోషములఁబాపి నిజపద
భూషల మముఁ జేయనెంచి పుణ్యాత్ముల సం
తోషమునకుఁ దగువేషము
శేషాచలవాస కలుగఁజేసితి జేజే

జ్ఞానాంబ (ప్రవేశించి శారదాంబకు నమస్కరించి)

క. నీభక్తులు నామిత్రులు
నీభాగ్యంబెల్ల నాది, నీవే నేనం
చే భగవంతుని నమ్మితొ
యా భగవంతుండె ప్రోచు నమ్మామునలన్.

శారద — జ్ఞానాంబా! నీసర్వసంశయములు తీరినవికదా!

జ్ఞానాంబ—మీ పరిపూర్ణానుగ్రహము నాపైఁ గలుగ నాకింకను గొఱంతకలదా!

క. నతిఁ జేసితి నుతిఁ జేసితి
గతినీవని వేఁడుకొంటిఁ గాల్గొం గడుపున్
సతతంబు భక్తిఁ బట్టుచు
బతిమాలితి నంతలోన బ్రహ్మంబయితిన్.

బాలకుఁడు (ప్రవేశించి శారదకు నమస్కరించి)

తల్లీ! అనంతశయనము కళాశాలనుండి యిరువురు విద్యార్థినులు మీదర్శనార్థమువచ్చి వాకిట నిలిచి యున్నారు. దేవిగారు తామ్రపర్ణితీరమునకు దయచేసి నప్పుడు వారు మీదర్శనముఁజేసితిమని చెప్పిరి.

శారద—ఓహో! వారలా! అంబా సుమిత్రలా! నాకొఱ కింతదూరము వచ్చిరా! రమ్మనుము.

బాల— చిత్తము (అనిపోయి విద్యార్థినులను లోపలఁ బ్రవేశపెట్టును.)

అంబ—సుమిత్ర: (శారదకునమస్కరింతురు. జ్ఞానాంబ లోపలికిఁబోయి తివాసిని దెచ్చివేయును)

(అంబ సుమిత్రలు తివాసిపైఁ గూరుచుందురు)

శారద—సుమిత్రా నీచదువుచక్కఁగ సాగుచున్నదా!

సుమిత్ర--మీదర్శనమైననాటినుండియుఁ జదువు మాటకేమిలెండు. పూర్వ సంస్కారమునుఁబట్టి పరీక్షలలో గృతార్థురాలనైతిని. కాని మీనుడులే మాటిమాటికి జ్ఞప్తికివచ్చుచున్నవి. మీయుక్తులు నచ్చునవికాని వాని యందుఁ బ్రమాణబుద్ధి కుదురుటలేదు. అట్లనుటచే న న్నన్యథా తలపకుఁడు. మీయందుగౌరవము, మీ దర్శనము నందుఁ గుతూహలము నంతకంతకు వృద్ధియగుచున్నవి.

అంబ — సుమిత్రా! ఇక్కడకూడ నీయస్తవ్యస్తపుమాటలేలనే!

గీ. సులభశైలి నొన సూక్తివిరోధముల్
పలుకుచుంట గొప్పప్రజ్ఞయండ్రు
తెలివిమాలినట్టి దీనుల బ్రదుకిట్లు
భవము దాటరాదు భ్రాంతిపోదు.

సుమిత్ర—అమ్మా! ఈయంబకవిత్వమంతయు నాపైదనే ప్రయోగించుచున్నది.

శారద—ఏమీ! అంబ యింత యసాధారణ కవయిత్రియగుచున్నదా! నే నప్పు డిచ్చినసమస్యలఁ బూరించితివా అంబా!

అంబ—తల్లీ! తెచ్చితిని, చిత్తగింపుఁడు.

౧. "మూడులేనికొంప ముండ్లకంప"

గీ. సారహీనమైన సంసారమందు సా
రత్రయంబు మిత్రరత్న మనిశ
సరస సాధుగోష్ఠి సారసాక్షియయాట
మూడు లేనికొంప ముండ్లకంప.

౨. "సంసారము దగులుకొనియె సన్యాసులకున్"

క. హింసించుచు వైరులను బ్ర
శంసింనుచుఁ బ్రియులఁ బకుంశాసించుచు నా
కంసారిన్ స్మరియింపమి
సంసారము దగులుకొనియె సన్యాసులకున్.

౩. "భవరోగార్తున కౌషధంబు భగవద్భక్తాంఘ్రి [సంసేవయే"

మ. ఎవనిం భార్యయుఁ బుత్రులుం
హితులు నెంతేదుష్టకర్మంబునం
దవునంచాగి, నిరంతచింతమునుగం
హాస్యాస్పదుం జేయఁ దా
నవశుండై పడియుండు మెట్టులిడుఁ
సర్వారంభముల్ వీడు నా
భవరోగార్తున కౌషధంబు భగవ
ద్భక్తాంఘ్రి సంసేవయే.

శారద—కుమారీ! నీకవిత ప్రశంసార్హము. సమస్యలఁ గడుఁజక్కఁగను, రసవంతముగను బూరించితివి.

సుమిత్ర—అమ్మా! సమస్యలమాట కేమి? దీనికవిత్వము మొత్తముమీద వికటకవిత్వముగాఁ దేలినది. లోకమును నిందించుటకును, నవనాగరకులు మేలనుకొను విషయములు ఖండించుటకును గలికలుష మనుగ్రంథము నొకదానిని వ్రాయుచున్నది.

శారద—బిడ్డా! అనితరసులభమైన కవితాధార పరమేశ్వరి కటాక్షించినపుడద్దానిని భగవద్భాగవత గుణకీర్తనంబునకుఁగాక పరిహరింపఁదగిన పరాపవాదంబునకు వినియోగింపరాదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని శ్రుతులు చాటుచుండ నాగ్రహముతో నేకదేశముగ సృష్టిని ఖండింపరాదు.

చ. కలియుగలక్షణంబుఁగని
కాతరతం దపియింప నేల శ్రీ
నిలయుఁడు స్వస్వరూపమున
నెట్టుచుఁ గాలముచిత్రమూర్తియై
వెలయఁగ జీవసంతతికి
వెట్టియొ వేడుకయో కదా యిటుల్
కలవరపాటుచెందు టని
కాదు పరాకృతియేతదాకృతిన్.

అంబ—మహాప్రసాదము తల్లీ! ఇక భగవద్భాగవతగుణగణకథనమునకే నాకవనము వినియోగింతును. (సుమిత్రతో) నాసంగతిచెప్పి యమ్మగారిచే నన్ను మందలింపఁజేసితివే! నాకవిత్వము వికటమంటివి. నీ జన్మమే వికటము. (శారదవైపునకు దిరిగి) అమ్మా! మీదర్శన కుతూహలమనే సుగుణ మొక్కటి తక్కఁ దక్కిన దంతయు మాసుమిత్రకు నాస్తికప్రవృత్తియే.

సుమిత్రా ఏమీ, నీప్రశ్న లమ్మగారియొద్దఁ బెట్టరాదఁటే (శారదనుజూచి) అమ్మా! ప్రతిదినమును దీనివాదమును వినలేక చచ్చిపోవుచున్నాను. ఇక్కడి కెట్లును వచ్చుచున్నదికదా! మీరే దానితలతిక్కను దీర్చెదరని యూరకుంటిని. చెప్పరాదటే నీపూర్వపక్షము?

సుమి—అమ్మా! క్షమింపుఁడు. పెద్దలసేవఁజేసిన భక్తులచరిత్రముల వింటిని. శిష్యులను గడునీచముగ గురువులు చూచుటయు, శిష్యులును దమస్వరూపనాశ మొనరించుకొని యెట్టిపనులఁ జెప్పినను జేయుచుండుటయు నాకు సమంజసముగఁ దోఁచుటలేదు. అధికారలౌల్యము గల సామాన్యగురువులేగాక సుప్రసిద్ధులు, దపస్సంపన్నులునగు వసిష్ఠాదులుకూడ దిలీపునివంటి మహారాజాధిరాజుచేఁ బసులనాదులు చేయించినట్లు కానవచ్చుచున్నది. దీనితత్త్వముఁదెల్పి నాకు మనశ్శాంతినిఁ బ్రసాదింపుఁడు.

శారద—సుమిత్రా! వెట్టిదానవు. మనుహాభావుల యనుగ్రహ మెఱుంగమి నిట్లనుచున్నావు!

సీ. పథ్యాలఁబెట్టి నిర్బంధించు టదిచూడ
సర్వభక్షణసేయు శక్తికొఱకె
మంత్రదీక్షలును సన్మానసబోధలు
మఱుమాటలేని సమాధికొఱకె
విధి నిషేధములందు వేదముల్ నిల్పు ని
స్త్రైగుణ్యమైన పథంబుకొఱకె
అతిథిపూజాదిగృహాశ్రమక్లేశమ్ము
లవధూతఁ గాంచు హాయికొఱకె.

గీ. ఆర్యధర్మంబు స్వైరవిహార ముడిపి
నియమమున నిల్పి క్రమముగా నిజము తెల్పి
వాసనలఁ బెంచి త్రుంచుచు బల మొసంగి
యంతటను నిల్పుఁ బ్రీతి బ్రహ్మానుభూతి.

గీ. మేలుచేయునట్లు లాలించి లాలించి
తుదినిఁ గొంపముంచు దుర్జనుండు
కష్టపెట్టునట్లు కనిపించి కరుణించు
ముదము పండితోత్తముండు నిజంబు.

సు—(నమస్కరించి) తల్లీ నాపైఁ దమకుఁగల యనుగ్రహమునకుఁ దగినట్లు ప్రవర్తింప నాశీర్వదింపుఁడు. నాపూర్వాభిప్రాయముల వదలుకొంటిని. నన్ను మీచరణదాసిగ ననుగ్రహింపుఁడు.

శా—సుమిత్రా! భక్తిప్రపత్తు లంత సులభసాధ్యములుకావు సుమా!

అంబ—సుమిత్రా! నాగుబామువలె నామీఁది కెగయుదాన విచట నమ్మగారి సన్నిధి నీకక్క వినయము లేల? పెద్దలసన్నిధికి రాకయుండుట మేలుగాని వచ్చినపుడు నిష్కపటముగ సంచరించుట మంచిది. నామీఁద యొట్టుపెట్టుకొని చెప్పవే సుమిత్రా! నీమనసులోని సంశయము లన్నియుఁ దీఱెనవా!

సు—ఒట్టేల! నే నబద్ధమాడుదునా! అమ్మగారి పరమానుగ్రహమున నాకు సందేహములు చాల భాగము తీరినవికాని సంతతము బ్రహ్మానుసంధానమున నానందించు దేవిగారి శాంతికి మాటిమాటికి నాయధిక ప్రసంగమువలన భంగము గలిగించుటకు మిక్కిలి సంకోచించుచున్నాను.

శారద—కుమారీ! జిజ్ఞాసువులసందియముల దీర్చు ప్రసంగము మాశాంతికి భంగము కలిగింపదు లెమ్మ. నిర్భయముగ నీమనోగతమును వెలిబుచ్చుము.

సుమిత్ర—అమ్మా! సర్వసమర్థుఁడైనభగవంతుఁడు బ్రాహ్మణులనియుఁ బంచములనియు నిట్టిభేదములు కలిగించి దాని కనుగుణముగ శాస్త్రములను గల్పించుట న్యాయమేనా? ఆభేదమును మీవంటిపెద్దలు పాటించి పోషించుటయందలి యౌచిత్యము నూహింపఁజాలకున్నాను. ఈసంశయము నొక్కదానినిమాత్రము పాపి నన్ను గృతార్థురాలనుఁజేయుఁడు.

శారద—జ్ఞానాంబా! వింటివా! సుమిత్ర ప్రశ్న. భేదమున నైక్యదర్శన సిద్ధికలుగుట సామాన్యమా!

వటుఁడు (ప్రవేశించి శారదాంబతో) దేవీ! రామిరెడ్డియఁట, నిరంజనకుమారు నొద్దనుండి సందేశమును గొనివచ్చి యున్నవాఁడట. నేటియుదయము నేను సమిదాహరణార్థ మేగినపుడు విమానమునుండి జారిపడియుండిన సాధ్వీమణిని వెంటఁబెట్టుకొనివచ్చి మీదర్శనమునకై వాకిటనిలిచియున్నాఁడు సెలవా!

(అంబాసుమిత్రలవంకదిగి)

శారద—అవశ్యము రమ్మనుము. నిరంజనమహారాజుకుశలవార్తనువిని, పాపమా దీనురాలియవస్థను విచారించి మీప్రశ్నములకు సమాధానము చెప్పుదును.

అంబ—చిత్తముచిత్తము. ఆర్తత్రాణము ప్రథమకర్తవ్యముకదా!

(ప్రవేశము - రామిరెడ్డి - లలిత.)

లలిత—(శారద శారద శారదయనుపద్యమును గొణుగుకొనుచుండును)

రామి—(నమస్కరించి) తల్లీ శారదాదేవీ! నిరంజనమహారాజుగారు దేవేరితోను, మంత్రిగారితోను ననుచరవర్గముతో నేఁటిమధ్యాహ్నమునకు జయంతాశ్రమమునకుఁ బెద్దల దర్శనమునకై వత్తుమని సన్నిధిలో మనవిచేయుమని నన్నుఁబంపిరి. నన్నొకచెలికానిగా మన్నించి మహారాజుగారు నాకు మీదర్శనభాగ్యము కలిగించినారు.

శారద—మంచిది. సాధుసంసేవనం బపేక్షించు నీసౌజన్యమే నీకు సకల సన్మంగళములు సమకూర్పఁగలదు.

లలిత—(ఒడలెఱుంగక భూతావేశము కలిగినదానివలె నిలువఁబడియుండును. శారద అనుపద్యమును మాత్రము చదువుచుండును.)

శారద—(లలితవంక తేఱిపాఱఁజూచి దయతో) ఎవ్వరీసాధ్వీమణి.

రామి—దేవిగారి సన్నిధానమునఁదక్క లోకంబున నెక్కడ నొక్కనిముసమేని జీవింపజాలని స్థితియందున్న పరమభక్తురాలు. ఎదుటనున్నది మీరని

తెలియకయే మీనామముమాత్రము స్మరణముచేయు చున్నది. దీనివలన నీమెచరిత్ర తెలియనగును (అని జాబిచ్చును)

శారద—(జాబునుచదివి) ఈశ్వరుఁడీమె నను గ్రహించుఁగాత.

రామి—లలితాంబగారూ! మీరు స్మరియించు చున్న యక్షరత్రయ మంత్రమూర్తి మీయెదుట సాక్షాత్కరించియున్నది, నమస్కరింపుఁడు.

లలిత—శారదాదేవీ! నీవేగతి (అని సాష్టాంగ నమస్కారముచేసి యీక్రింది పద్యమును జదువును)

సీ. పోయినప్రాణము న్నిలిపి
ప్రోచితివమ్మరో నీదుసేవకే
కాయము నప్పగించితిని,
జ్ఞానమునిత్తువో, భక్తిగూర్తువో
మాయజగమ్మునమ్మ నను
మానము లేదిక నీదు దాసినై
శ్రేయముగాంతు సన్నిధి,
నిరీక్షణసేయుచు నీమహత్త్వముఙ్.

(అని చేతులుజోడించి శారదవైపుఁజూచుచు నిలఁబడును)

శారద—కుమారీ! లలితా! నీవు నిర్భయముగ నెమ్మదిగ మాయాశ్రమంబున నుండవచ్చును. నీవిషయ మంతయు నామూలాగ్రముగ నిదివఱకేవింటిని. సాధుగోష్ఠిలో మెలఁగుచుండిన, నీకుఁ బరిపూర్ణశాంతి చేకూరఁగలదు. విద్యార్థినులిచట నాకై వేచియున్నారు. నీవుకూడ వారితోఁగలిసి కూరుచుండి బోధను నాలకింపుము.

లలిత—చిత్తము. (అనివచ్చి యంబా సుమిత్రల యొద్ద కూరుచుండును.)

శారద—అందఱునువినుఁడు. బ్రాహ్మణాదిభేదములు పాటించుటయందలి యౌచిత్య మేమని సుమిత్ర యడుగుచున్నది. విమర్శకులందఱును భేదమనఁగానే తొలుత బ్రాహ్మణాదిభేదములనే యెంతురేల? దీనికంతకును గారణము బ్రాహ్మణులును వారిచే రచింపఁబడిన శాస్త్రములే యందురు. అన్నింటఁగలభేదమును మాత్రము సహింపవచ్చునా? స్వామి దాసభేద మెంతురేల? ధనికదరిద్రభేదము, సురూపకురూపభేదము, నుచ్చనీచభేదము, మానావమానభేదము, పండితమూఢభేదము, సుఖదుఃఖభేదము, శీతోష్ణభేదము, ప్రాక్పశ్చిమభేదములు మొదలగువానివిషయ మేమి? కాఫీ తేయాకు తోటల ఖామందులకును బనివాండ్రకును, యంత్రశాలలయజమానులకును, గూలివాండ్రకును భేదము పాటింపవలదా!

ఇన్నిభేదములు, ప్రతిమానవుని బ్రతిక్షణమును బాధించుచుండ నేకదేశముగ నొకభేదమునుమాత్రము తొలఁగింప నుత్సాహంబున నుద్యమింపనేల? భేదములు మానవలయునను ప్రవక్తలను, దదనుచరులను బరిశీలించినఁ గొలఁదియు, వారు తీసివేయఁదలఁచిన యేదే నొకభేదమునుమాత్రము పాటింపరేకాని, తదితరభేదముల నన్నింటినిఁ బాటింతురు. సర్వజనులను, సర్వకాల సర్వావస్థలయందు బాధించు నీద్వంద్వరూపమైన భేదమునకుఁ గర్త యెవ్వఁడు?

సుమిత్ర—బ్రాహ్మణులును. వారువ్రాసిన శాస్త్రములునని వేఱచెప్పవలయునా!

శారద—కుమారీ! ఏల పొరపడెదవు? సృష్టిలో భేదమున కంతకును, బ్రాహ్మణుఁడే కారకుఁడా! వేళ్లు క్రిందికిఁ బోవుటకును, వృక్షముపై కెదుగుటకును, నతఁడే కారకుఁడా! ఏమీ! చెట్టున నన్నియు నాకు లుండక, ఫలపత్రభేదము లుండుటకును, దోషమతనిదియేనా! పాపము! బ్రాహ్మణుఁ డరక్షితుఁ డగుట మీబోంట్లు సకలభేదములకుఁ గారణ మతఁడేయని తలంతురు కాబోలు. నే నడుగఁబోవుప్రశ్నకు సమాధానముఁ జెప్పఁడు? సుమిత్రా వినుచున్నావా! లలితా నీవేమనెదవు?

సుమిత్ర-లలిత—సెలవిండు. అవహితులమై యున్నాము.

శారద—నీవు నిదురించునపు డేభేదము కలదు? జాతిభేదమా! మతభేదమా! కులభేదమా! స్థలభేదమా! లింగభేదమా! గాఢసుషుప్తియం దేమిభేదము కలదు?

లలిత—ఏవిషయమునను నెట్టిభేదమును లేదు.

శారద—నీవు మేల్కొనినతోడనే కొందఱను జూచినఁ బ్రీతియు, మఱికొందఱను జూచిన ద్వేషమును; కొందఱియొక్క స్పర్శయానందము, మఱికొందఱిచెయి సోకినఁజీదర, కొందఱమాటలు చెవులకింపు, మఱికొందఱి పలుకులు చెవులకు ములుకులు. కొన్నివాసన లానందదజనకములు, కొన్ని వెగటు. కొన్నిరుచ్యములు, మఱి కొన్ని యసహ్యములు.

నీవు మేల్కొనియుండగా భేదముకలదు. నిదురించునప్పుడు లేదు. నిద్దురలో నీవును లేవు. భేదమును లేదు.

సుమిత్ర—నేనుండఁగా నుండి నేను లేనప్పుడు లేకుండు భేదమునకు నేనేకర్తనా!

శారద—సందేహమేమి? ఈభేదము చేయు దానవు నీవుకాక మఱియెవ్వరు? ఇంతదుస్సహముగఁ గనఁబడు భేదము నీవు కన్నులుమూసికొన్న మాత్రమున నింద్రజాలమునఁ బోలె నంతరించుచున్నది. నీవు కలిగించు నీభేదమున కొరకులెట్లు కారకులు చెప్పుము.

సుమిత్ర—తల్లీ మఱి యాభేద మెట్లుపోవుట?

శారద—భేదస్వభావము భేదమందలిబాధయు నీ వున్నంతవఱకుండును.

లలిత—My God! what shall I do to solve the problem of difference.

సుమిత్ర—తల్లీ! ఈ భేదదృష్టిపోయి సమరస మేర్పడుటకు నేనేమిచేయుదును?

శారద—You die. With you the difference dies.

సుమిత్ర—నేను చచ్చినయెడల నాతో భేదము నశించు ననెదరా.

లలిత—How can I die?

సుమిత్ర—నేనెట్లు చావఁగలను? (స్వగతము) నే నడుగఁబోవుమాట నీమెయునడిగినది. దీని కేమి సమాధాన ముండును?

శారద—If you cannot die we are here to kill you; rather the ego in you.

(అందఱపరికించి నీవు చావఁజాలనియెడల మేము చంపఁగలము. "నేను" జచ్చిననాఁడే యనఁగా నహంకారము పోయిననాఁడే భేదము దాఁటగలవు. నిద్దురలో వలెనే జాగ్రత్తయందుఁగూడ సుషుప్తిఁజెందు ధీరులు విశ్వము మఱచి భేదదర్శనంబుచేయకుందురు. శస్త్రవైద్యుని మత్తుమందుచే వ్రణితుండును, మదిరామదంబున రణరంగంబున భటుఁడును దాత్కాలికముగ నొడలు మఱచియుందురు కాని భక్తుఁడట్లు కాక భేదదర్శనంబొనర్చు జగంబును మఱచి యద్దానిని శ్రీహరితనువుగ గ్రహించికైవల్యము ననుభవించుచు నొడలు మఱచి యుండును.

సుమిత్ర-అంబ—చిత్తము. చిత్తము.

శారద—చక్కెరయొక్కటియే చిలుకగా, పండుగా, తేలుగా, వేఱువేఱునామ రూపముల తోనున్నటు లొక్కబ్రహ్మంబే పెక్కురూపముల నీవిశ్వముగఁ గానవచ్చును. తత్త్వమస్యాది మహావాక్యములు సద్గురుముఖంబున నెఱింగినభక్తులు తన్మహామంత్రపఠనామృతపానంబున ద్వంద్వాతీతులై బ్రహ్మతాదాత్మ్యమున నందురు.

చీఁకటిలోఁ జింతలతోఁపునందు నడుచు మనుజుండును, బాపికొండలనడుమఁ బడవపోవునపుడు భద్రాచలముపోవువాఁడును, రామదూతనో, రామునో బిగ్గఱగ స్మరించి భేదజన్యమైనభయమును, బాపుకొనుట యనుభవసిద్ధము. "ద్వితీయాద్వై భయం భవతి" రెండవవానికలన భయభేదములు కలుగును. అద్వైతానుభూతినిఁ బ్రతిపాదించు మంత్రముయొక్క సంతత మననమే భేదభయపరిత్రాణ మొనర్చును.

సనకసనందనాదులు, వాల్మీకి, వ్యాసుడు మొదలగు యోగులును, సులభ, గార్గి, దేవహూతి, మీరాబాయి, వెంగమ్మ మొదలగు యోగినులు, నీమార్గ మవలంబించియే నిశ్శ్రేయసము గాంచిరి.

సుమి—తల్లీ! నాసందియము తీరినది. ఇట్టి సమ్యగ్దర్శనసిద్ధి లేమింజేసి లోకమంతయు సంధపరంపరగా ద్వైతవాసనతోఁ గుందుచున్నది. అమ్మా! మాచెల్లెలు సుగాత్రి, పండ్రెండేండ్లబాలిక కలదు. ఈనడుమ నది మాతలిదండ్రులతోఁ గన్యాకుమారికిఁ బోయి వచ్చినప్పటినుండియు, దానిభక్తి శ్రద్ధలు క్రమముగా హెచ్చుచున్నవి. మీయొద్దకుఁ దన్నుఁ బిలుచుకొని పొమ్మని నన్నడుగుచుండును. పరమేశ్వరుఁ డెవ్వరి కెట్లు మహనీయుల సన్నిధానము ననుగ్రహించునో యట్లే యగుఁగాక, అని నేనును దానిని దీసికొని రాలేదు. నన్ను మీచరణదాసిగ ననుగ్రహింపుఁడు.

శారద—నీవు స్వతంత్రురాలవు కావు. నీభర్త నీమనో మండలాధిపతి యుద్యోగమునకై చదువుచున్నాఁడని వింటిమి. ఆతనియభిప్రాయ మెట్లుండునో! గొప్పబోధమును వింటివి. దానివలన నయ్యెడు చిత్తపరిణామ మగునుగాక. స్థూలధర్మము పాటించుట యవసరము. నీవుమాత్రము నీభర్తయొక్క మనస్సును గనిపెట్టి సంచరించి సుఖపడుము.

సుమిత్ర—మీ కటాక్షంబున నావిధంబును నాకనుకూలముండె. దేవీ! మిమ్ముల సేవించుటకై నేను వారియాజ్ఞ వేడి జాబును వ్రాసికొనియే వచ్చియున్నాను.

బాలకుఁడు—(ప్రవేశించి) అమ్మా సుమిత్రాదేవిగారికట, యొకకమ్మవచ్చినది. (అనిజాబును శారదాదేవిచేతికిచ్చును.)

శారద—(జాబును మాచి నవ్వుచు సుమిత్ర కందిచ్చును).

సుమిత్ర—(జాబును మాచుకొని సంతసించుచు) మీరేచూడవచ్చును.

శారద—వలదు నీదగ్గఱనే యుండనిమ్ము.

సుమిత్ర—అనుజ్ఞయైనచోఁ జదివెదను. భక్తగోష్ఠిలోఁ జదువఁదగని రహస్యము లేవియు నిందు లేవు.

(అని యీక్రిందిజాబును జదువును.)

ప్రేయసీ:

ఉభయకుశలోపరి. నీవత్యంతభయభక్తులతో వ్రాసినయుత్తరము చేరినది. శ్రీ శారదాదేవిని సేవించి తత్త్వము నెఱుంగ నాయనుజ్ఞను వేఁడితివి. ఈ యోగాభ్యాసము లందు మున్ను నాకంతవిశ్వాసము లేదు. కాని నేను సెలవులలో జన్మభూమికివచ్చినపుడు కన్యాకుమారిలో నాపూర్వమిత్రుఁ డన్నంభట్టుగారును (ఆయనయు నేనును లండనులో గొంతకాల మేకస్థలమున నివాసము చేసితిమి.) కలిసిమాటాడినపుడు శ్రీ శారదాదేవిగారిప్రభావము, శ్రీ జయంతాశ్రమమాహాత్మ్యమును వింటిని. నేను దిరిగి దేశము వచ్చువఱకు నీవు భయభక్తులతో శ్రీ శారదాదేవిగారి సన్నిధి నుండవచ్చును. ఆదేవిగారియనుగ్రహము సంపాదించుకొని బాగుపడుము. నా నమస్కారము లాయమకర్పించి నేను నాపరీక్షలు ముగియఁగానే దర్శనమునకు వచ్చెదనని నాపక్షమున మనవిచేయుము.

ఇంకొక్క విషయము. నీచెల్లెలిని సుగాత్రిని మామిత్రుఁ డన్నంభట్టుగారి కిచ్చివివాహముచేయ నిశ్చయించినామని మీ నాయనగారు వ్రాసినజాబు నేఁడే చేరినది.

నీకుశలము, మీయాశ్రమవాసుల క్షేమము తెలుపుచు వ్రాయుచుండుము.

ఇట్లు: నీప్రియుఁడు,

కుమారస్వామి.

శారద—మంచిది సుమిత్రా! నీవు నిశ్చింతముగ నుండుము. జ్ఞానాంబా! ఈమె పోషణభారము నీవు వహింపుము. సుగాత్రియు నన్నంభట్టును జేపట్టి ధన్యురాలు కాఁగలదు.

అంబ—(ఏమియో వ్రాయుచుండును.)

శారద—(అంబవైపునకుఁ దిరిగి) అంబ యేమి వ్రాయుచున్నది?

అంబ— మీబోధముయొక్క సారము వ్రాయుచున్నాను. చిత్తగింపుఁడు.

గీ. తెలిసి రామనామ మలసి సమాధియుఁ
దెలివితప్పి కర్మముల భజించు
పరమయోగిను లిల భవపయోధిని దాఁటి
నిత్యముక్తలౌట నిజము నిజము.

శారద—శుభము.

తెర వ్రాలును.

## తృతీయరంగము

### జయంతాశ్రమము

(జ్ఞానాంబ, లలిత ప్రవేశింతురు)

జ్ఞానాంబ—అమ్మాయీ! లలితా! జాగుచేసెద వేల? గోష్ఠీమందిరము నేఁడు నిరంజనాదుల యాగమనమునకై యలంకరింపఁబోవుదము.

లలిత—ఇదిగో! అక్కా! వచ్చుచున్నాను. ఈసమావేశసమయమున కలంకరించుటకై జరీపువ్వుల తోరణములఁ బర్ణశాలలో దాఁచి యుంచితిని. తీసికొని వచ్చెద. నీ వరుగుము. (ఉభయులును రంగస్థలమునకుఁ జెరియొకవైపునుండి నిష్క్రమింతురు.)

జయంతాశ్రమ పురోభాగము

(ప్రవేశము: అన్నంభట్టు, నిరంజనుఁడు, బుద్ధిమతి, డామాడోలీ)

అన్నం—మిత్రమా! మనము చూచివచ్చిన క్షేత్రము లన్నిటికంటెనుగూడ నీయాశ్రమారామ మెంత ప్రశాంతముగ నున్నది!

నిరంజ— సందేహమేమి? పరమహంసస్వామి ప్రభావము. ఋష్యాశ్రమములందు జంతువులు సహజవైరము మానుట ప్రబంధములఁ జదువుచుందుము. ఇయ్యాశ్రమమున నెట్టివిరుద్ధస్వభావము గలవారైనను, నెంత నాస్తికులైనను వారివారిపట్టుదలలు మాని సమరసైక్య భావము ననుభవింతురు.

అన్నం — శ్రీవారికటాక్షము నొందినమహనీయులు శ్రీ రాజశేఖరమహారాజుగారు. ఆరాజర్షికటాక్షము నొందిన నీకే నావంటి పరమనాస్తికునకు సమ్యగ్దర్శన మొసఁగు కౌశలము కలిగియున్నపు డామహనీయుని ప్రభావము వర్ణింప నలవియగునా? నేఁడు సుదినము.

గీ. ఎన్ని దేశాలు తిరిగిన నేమిఫలము
సందియముఁ బాపు సద్గురు లెందు నెందు
రద్దియే దివ్యదేశం బటంద్రు బుధులు
భక్తవరులకుఁ బ్రత్యక్ష పరమపదము.

సీ. కలవిశ్వ మంతటఁ గర్మార్హ మైనట్టి
మర్త్యలోకంబె సన్మాన్య మిందుఁ
దత్త్వాంధ మైయున్న ధరణికిఁ బెనుదివ్వె
గా వెల్గుభారతఖండ మందు
నధ్యాత్మవిదులు సదాచారఘనులచే
దీపించు నీయాంధ్రదేశ మందుఁ
గలినాయకుండు వేంకటనాథుఁ డుండు స
ద్ధామంబు శేషభూధరమునందు

గీ. భోగిరాడ్భూషణాంచితమ్మగు దిరుమల
శ్రీనివాస త్రిలింగాభిధాన కేత
మిది మహావిద్యఁ గాంక్షించునెల్ల భక్త
వరులు సేవింపఁ దగినట్టి పరమపదము.

నిరం—(స్వగతము) ఆహా! అన్నంభట్టుచిత్త మెంత భక్తిభరితమైయున్నది. (ప్రకాశముగ) ప్రేయసీ! చూచితే ఈ శేషభూధరం బెంత రమణీయముగ నున్నది! దూరమునఁ గాషాయకేతనములతో విరాజిల్లెడు నదియే జయంతాశ్రమము. ఇటు చూడుము. చేరువ నున్న కొండపై నెత్తుగ నుండి దుష్ప్రాపంబై కానవచ్చు గుహాద్వారంబు కంటివే. క్రిందుగ నున్న వృక్షశాఖ యొండు గుహాద్వారము నంటునట్లు పెరిగియున్నది. ఈశాఖ నవలంబించి శ్రీతరికొండ వెంగమాంబిక యాగుహలోని కేగియచట నేకాంతంబునఁ దప మొనరించి ధన్య యయి

వటు. మర్త్యులబారినుండి దూరముగ నుండుటకుఁ గాఁబోలు నామె యిట్టివసతిఁ గల్పించుకొనియె.

బుద్ధిమ — యోగినీనికేతనమా! నీకిదే నమస్కారము.

గీ. ఆంధ్రయోగిని యై లలితాంధ్రభావ
  వేంకటేశమాహాత్మ్యంబు వేడ్క వ్రాసి
  భక్తరాండ్రకు నెల్ల మేల్ బంతియయిన
  వెంకమాంబను సాటియే వెలసు లెందు.

నా భా! భవత్కరగ్రహణసత్ఫలంబునఁగదా సాక్షాత్పరమాత్మునింబోలు పరమహంసస్వామిని, శార్వతీపరమేశ్వరులంబోలు సత్తమామలను, సేవించు భాగ్యము నాకు గలిగినది. నేఁడు ప్రత్యక్షశారదాదేవి దర్శనభాగ్యమును లభించునుగదా!

డామా — (స్వగతము) నే నిన్ని దేశములు చూచి వచ్చితిని. అందఱును బాగుగఁ దెనుఁగుమాటినారు. పరికిఁ దెలుగులో తెనుఁగు మాటలశబ్దమునకు వ్యుత్పత్తి యేమని నిర్ణయించిరో, ఒకపిన్న, పెద్ద, బ్రాహ్మణుఁడు, భట్టు, దేవుఁడు, దైవము, స్నానము, సంధ్య, పండుగ, పర్వము, మఱి, యాచారమనునవి లేవుకదా! సర్వంజగన్నాథం. ఎక్కడికిఁబోయినను జీమలు జెఱ్ఱులు ప్రాకినట్లున్నది. అమ్మయ్యో! కొంపఁజేరు కొన్నాము.

గీ. చారు తైర్వచ్చడియను సాంబారుకూడు
  వాజ్యరహితంబుగాఁ దిన్న యాంధ్రుఁ డొకటఁ
  బప్పుపప్పళ మొదవ సంబరము పడెడు
  భంగి మాయూరు చేర నుప్పొంగె మనము.

వటుఁడు — జయము, జయము, మహారాజా! పరమహంసస్వామి గోష్ఠిలోనుండి మీరాక కెదురు చూచుచున్నారు.

నిరంజ — భాగ్యము. ఇదే జయంతాశ్రమము. (అన్నంభట్టునుజూచి) మిత్రమా! పెద్దలదర్శనముచేసి పవిత్రులమగుదుముగాక,

అన్నం — ఇదియంతయుఁ దమయనుగ్రహమే.

వటుఁడు — మహారాజా! ఇటు యిటు (అని యాశ్రమమునకు దారిచూపును) (వటునితో నిరంజనాదులు నిష్క్రమింతురు)

(తెర తెఱువఁబడఁగాఁ బరమహంసగోష్ఠి)

(పరమహంస, రాజశేఖరుఁడు, ధర్మాంబ, శారదాంబ, వారివారియాసనములపై గూరుచుండియుందురు. నిరంజనుఁడు, బుద్ధిమతి, అన్నంభట్టు, డామాడోలీ ప్రవేశింతురు)

నిరంజ — (దూరమునుండి గోష్ఠినిఁ దిలకించి, యానందముతో)

ఉ. నన్నుఁ గృతార్థుఁ జేయఁగ
  జనార్దనుఁ డద్దిర యిట్టివ్యూహముల్
  బన్నెను గన్నతండ్రివలెఁ
  బాలనఁజేసెను బూర్ణబోధ సం
  పన్నునిఁ జేసి శాంతిని
  దపం బొనరింపఁగ శక్తుఁ జేసె శ
  శ్వన్నుతిఁ జేసెదన్ గురుని
  శాంతిసుధాయిని శేషశాయినిన్.

(అని నమస్కరించును. బుద్ధిమతియు నమస్కరించును. పరమహంస యాశీర్వదించును.)

అన్నం — (ఆనందముతోఁ జేతులుజోడించి)

క. ఆడించితి పాడించితి
  వేఁడించితి వేసములను వేయించితి నన్
  జోడించితి నీభక్తుల
  తోడన్ నీతోడఁ బ్రీతితోడన్ నృపహారీ.

గీ. నమ్మఁదగినవారు నావా రెవరు లేరు
  నీదుభక్తవరులు నీవుఁ దక్క
  మిమ్ముఁ గొల్చినిల్చి మృత్యుంజయుండనై
  యాత్మమయత నుందు నాప్తమూర్తి.

(నమస్కరించును.)

పరమ — ఆనందః, ఆనందః ఆనందో బ్రహ్మ బ్రహ్మానందః (నిరంజనునితో) వత్సా! నీయాత్ర నిర్విచారముగఁ బూర్తియైనదా?

నిరంజ—తమయనుగ్రహవిశేషంబునఁ బరిపూర్తి యయినది. ఈతఁడు నా బాల్య స్నేహితుఁ డన్నంభట్టు.

పరమ—ఈతనివిషయ మంతయు వింటిమి, మంచిది. సుదర్శనుఁ డిఁక మా సన్నిధానమునఁ దపం బొనర్చుకొనఁగలఁడు. అతనికి విశ్రాంతి యవసరము. నేటినుండి యీ యన్నంభట్టు నీకు మంత్రికాఁగలఁడు.

నిరంజ—మహాప్రసాదము.

ధర్మాంబ—కుమారా! మీరు దంపతు లుభయులును నీ పిన్ననాటిసఖుఁ డన్నంభట్టును గురుదేవభక్తి గలవారగుట నాకానందము కలుగుచున్నది. గురునాథుఁడు మిమ్మందఱ ననుగ్రహించుగాక.

అన్నం—(సుదర్శనునితో జనాంతికము) మహాశయా! శ్రీమన్నారాయణుండె వేంకటేశ్వరుండై తన కృపాకటాక్షంబున నియ్యాశ్రమంబుఁ గాపాడుచుండు ననియు నాదిశేషుండే పరమహంసాభిధానంబున సద్గురుండై యియ్యాశ్రమం బధిష్ఠించియుండు ననియు, నా రాజశేఖరుండే యీరాజశేఖరరాజర్షి రూపంబున నవతరించె ననియు నాఁడు కల్యాణపురంబున సెలవిచ్చితిరి కదా! (శారదా, నిరంజనుల నిరూపించుచు.)

ఉ. చేసిన పూర్వపుణ్యమునఁ
జేకుఱె సజ్జనగోష్ఠి పూజ్యులన్
డాసితిఁ దొంటిశోకడ లడంగెఁ
బడంతిగఁ దోఁచుసత్తపో
రాశి యిదేమి? మిత్త్రుఁడు
నిరంజనుఁ డల్పుఁడె? యీర దేవసం
కాశులు వీరలన్ ముని
ముఖంబునఁ గాక యెఱుంగ శక్యమే.

పరమ—అన్నంభట్టా! ఈ నిరంజన శారదల వృత్తాంత మెఱుంగఁగోరుచున్నావా? ఆలకింపుము.

అన్నం—మహాప్రసాదము, సెలవిండు.

పరమ—ఇమ్మహానుభావ శారద పూర్వభవంబున సరస్వతీదేవి చూడామణి బ్రహ్మశాపవశంబున స్వస్థానముననుండి చ్యుతిగలిగి మహత్సేవాపుణ్యవిశేషంబున, భూలోకంబున, నీయాంధ్రదేశంబున, బినాకినీతీరంబునఁ సోమశిలాక్షేత్రంబున, నయోనిజగా జన్మించి, బాల్యంబుననే సకలకళావిశారదయై, మహాయోగినియై, కవయిత్రియై, బుధమనస్సంతోషదాత్రియై యుండియుఁ దనమనంబున శాంతిలేనిదై, సద్గురుకటాక్షభాగ్యమునఁగాక యాకొఱఁత తీరదని నిశ్చయించి, తద్దర్శనార్థినియై, తీవ్రవేదనపడుచు, దైవికముగ హంసోపనీతయై మాసన్నిధి కరుగుదెంచి మాచేఁదత్త్వోపదేశంబు గాంచి పరిపూర్ణురాలై యాశ్రితాళి ననుగ్రహింపఁజాలినది.

గీ. సరసిజాక్షుండు తన్నెపు కరుణఁజూడ
సకల సకలకలాప విస్తారగరిమ
నామసార్థక్యమునకు నై భూమిలోన
శారదాపీఠమును నిల్పు శారదాంబ.

(శారదాంబ లేచి పరమహంసకు నమస్కరించును.)

అన్నం—చిత్తము, చిత్తము.

పరమ—మహారాజకుమారుం డగు నీ నిరంజనుండును బూర్వభవంబున బ్రహ్మవాహనమైన హంసగనుండి, శాపవశంబునఁ జూడామణివలెనే స్వస్థానమున నుండి చ్యుతుండై యీ రాజశేఖరరాజర్షి తనయుండై, సకలకళాచతురుఁడయ్యుఁ, గాలవశంబునఁ గొంతకాలము భ్రాంతిందగులుకొని, దైవవశంబున నస్మత్సన్నిధానంబున కరుదెంచి, మన్నియోగంబునఁ దనతండ్రియొద్దఁ దత్త్వజ్ఞానోపదేశమువడసి, పూర్ణుండై, యనురూపయైన సాధ్వీమణినిం బెండ్లియాడి, గృహిణీసమేతంబుగ దీర్ఘయాత్రలు నిన్నుఁగూడి సేయుచుఁ దనకుఁ గలిగిన యోగసిద్ధిబలంబునఁ గామరూపుఁడై హంసగవచ్చి యీ శారదాదేవిని మాయాశ్రమంబునకుఁ జేర్చి, యదృశ్యుండై మరల నిరంజనుఁడై మిగిలియున్న యాత్రలఁ బూర్తిచేసికొని యిటువచ్చుట విదితమే కదా!

అన్నం—అనుగ్రహింపఁబడితిని. (లేచి శారదకు నమస్కరించి)

దండ. శ్రీమునినీపాద సేవారతిన్ సాధుసత్సంగతిన్
బుద్ధి శ్రీభారతిన్ నిన్ను భావించెదన్ భక్తి సేవిం

చెలఁగ భక్తి గావించెదఁగ నీదు సంకీర్తనల్ సాధు భక్తుండవై శక్తియుక్తుండవై పాపముక్తుండవై సిద్ధ వాగీశ్వరీ భక్తలోకేశ్వరీ యోగిసద్ధర్మ్య మజ్ఞాన విచ్ఛేదకం బార్తిసంహారకంబైన తత్సూక్తి నానం దవార్ధిం దగన్నిల్ప నీకుఁగ దగుఁగ దల్లి సద్దేమవల్లీ సుయోషిన్మతల్లీ నమస్తే నమస్తే నమస్తేనమః.

ఉ. నమ్మిన పుణ్యపూరుషులు
నాశము లేనిపదమ్మునన్నివా
సమ్ము ఘటింప సర్వము
నసారముగా మది నెంచి మించి స
త్యమ్ము స్మరింపుచుఁగ బరమ
ధార్మికవృత్తిఁ జరించుచుఁగ ద్వరే
ఘమ్ములవోలె సంతతము
భక్తులు గొల్తురు నీపదాబ్జముల్.

పరమ—భట్టా! శారద శిరోమణియగు నీ శారదచేఁ దత్త్వోపదేశము వడసి, పరిపూర్ణుఁడవు కమ్ము. నిరంజన కుమారునకు నీవు పరమమిత్రుఁడవై, మంత్రి వరుండవై రాజశేఖరునకు సుదర్శనుంబోలెఁ దలలో నాలుకవలె సంచరించి స్వధర్మపరిపాలనము నందుఁ దోడుపడుము.

అన్నం—మహాప్రసాదము. ధన్యుఁడనైతిని.

(శారదవైపునకుఁ దిరిగి చేతులు జోడించి)

ఆ. తల్లి రాజపుత్త్రివయ చేత నిన్నాళ్లు
వింటి బోధ మవల గంటి నిన్ను
బీజమంత్రములను బ్రీతిని శ్రీవిద్య
నొసఁగి ప్రోవ సుదతి! యొప్పు నంద్రు.

శారద—(పరమహంసకు నమస్కరించి, యన్నంభట్టువైపునకుఁ దిరిగి) వత్సా! పరమహంసము నీంద్రునిదర్శనముననే నీవు కృతార్థుఁడవైతివి.

క. ఘనసంప్రదాయరీతిని
మునిశిష్యులకట్ల వారు బుధజనుల కొసఁగ
వినిపింప నద్ది గురుముఖ
మునవే విన్నట్లు నీకు ముదమున వినుతున్.

అన్నం—మహాప్రసాదము.

సుద—నేఁడుకదా సుదినము.

సీ. ఆశ్రమంబులు నాల్గు నామ్నాయనిధిఁ బ్రోవ
హంస యిచ్చట రాజహంస యచట
ధర్మసూక్ష్మము స్థూలధర్మంబుఁ గలుపంగ
హంస యిచ్చట రాజహంస యచట
మణికాంతి శ్రీశిరోమణికాంతి యట రాజ
హంసంబు దీపించుహంస యిచటఁ
దంత్రశక్తిని మహామంత్రశక్తిని రాజ
హంస యచ్చట నిల్చు హంస యిచటఁ

గీ. బందుకొనినట్లు లుండి రాయంచమణియుఁ
దత్తదుచితంబుగాఁ గూర్ప ధర్మము లొగి
నచట నిచటను రాజ్యమందంత నార
కర్మభూమినిఁ బుట్టుజిజ్ఞాసువులకు.

సీ. శారదోపాస్తిని శారదాసూక్తిని
రాజహంసలకు సర్వత్ర శాంతి
సింహాసనంబున సిద్ధాసనంబున
రాజహంసలకు సర్వత్ర శాంతి
ముద్రాధికృతిని జిన్ముద్రాధికృతినిఁ జూ
రాజహంసలకు సర్వత్రశాంతి
అత్యంత సద్భక్తి నానందమునివృత్తి
రాజహంసలకు సర్వత్ర శాంతి
దానభోగంబుల జ్ఞానయోగంబుల
రాజహంసలకు సర్వత్ర శాంతి
అజ్యాన్నభుక్తి బ్రహ్మానందభుక్తిని
రాజహంసలకు సర్వత్ర శాంతి
మనుభక్తి సరసోక్తి మనుశక్తి గురుసూక్తి
రాజహంసలకు సర్వత్ర శాంతి
శేషాద్రిపతికృప శేషభూషణుకృప
రాజహంసలకు సర్వత్ర శాంతి

గీ. స్ఫోటమును వాక్యమును లలిఁ బోలుచుండు
ధర జయంతమ్మనను రాజధానిలోన
శారదాపీఠమున రాజచక్రమందు
రాజయోగంబు జరగు నిర్వక్రగతిని.

(నిరంజనుఁడు పరమహంసకు నమస్కరించును)

పరమ—తథాస్తు. ఆయుష్మంతా! నిరంజన కుమారా! కలికాలంబున స్వధర్మ నిర్వహణభారము వహించిన నీకొక్కవరం బీయ మాకుఁ గుతూహల మగుచున్నది. వేఁడుము.

నిరంజ—ధన్యోస్మి (అనినమస్కరించి చేతులు జోడించి)

ఉ. దీనుఁ డొనర్పుఁగాక యిపు
దేశము భక్తుల కాత్మవిద్య న
వ్వారికి క్షేమలాభములు
పార్థివుఁడుం గడుఁ గూర్పుఁగాత కం
సారిపదారవిందముల న
వ్యాహ మర్చనచేయు సాధువుల్
పారమహంస ధర్మమునఁ
బారము చేరుచునుండ్రు గావుతన్.

పరమ—తథాస్తు.

అందఱు మంగళహారతి పాడుదురు రాగము–కేదారగౌళ–అటతాళము.

౧. నాళీకనాభాయ నారాయణాయ
బాలగోపాలాయ పరమేశ్వరాయ
బ్రహ్మాండభాండోదరాయ ధీరాయ
బ్రహ్మాదివినుత విరాట్స్వరూపాయ
మంగళం మంగళం మావల్లభాయ

౨. రాధికానాథాయ రామానుజాయ
సాధుసంతోషాయ సర్వేశ్వరాయ
వేదాంతవేద్యాయ విబుధసేవ్యాయ
మోహితభక్తాయ మునివందితాయ
మంగళం మంగళం మావల్లభాయ

3. భూరికల్యాణాయ బుధసేవితాయ
సారసనేత్రాయ సద్గుణాయ
శ్రీగిరినిలయాయ శ్రీనివాసాయ
భోగీంద్రతల్పాయ పురుషోత్తమాయ
మంగళం మంగళం మావల్లభాయ

గద్యము

ఇది శ్రీమదమృతానందనాథ గురునాథబోధ సుధాబ్ధికన్యాధవపదాబ్జసేవాబద్ధ మనీషాజనితోభయ భాషాకవితాభూషాలంకృత విద్వత్కవితిలకాయమాన కనకావిర్భూత హంసవిజయం బను మహావిద్యానాటకంబునఁ బంచమాంకము సర్వము సంపూర్ణము.

---



చూడు, అమ్మా, చూడు  A. S E,

# విచిత్రవ్యక్తి

కె. వి. సుబ్బారావు

## ౧

అదేమంటే దానికి సమాధాన మెవరమూ చెప్పలేము. మనుష్యప్రకృతిని గురించి ఇదమిత్థమని సిద్ధాంతీకరించి సూత్రీకరించుట ఎవనితరము? గుణనిశ్చయ తెలుసుకోవడం, పోనీ అభ్యసించడమైనా సరే, ఎవడికిసాధ్యం? జన్మతః ముగ్గురమూ అందరికీ భిన్నముగాని జన్మపద్ధతి కలవాళ్లమే. ఎటువచ్చీ వాడూ మా మేనత్తకడుపునా, నేనూ, నాచెల్లెలూ మాతల్లికడుపునా పుట్టి భూమిమీద పడ్డాము. పుట్టింది లగాయితు పెరగడంలోగానీ, అభిరుచులలోగానీ, వ్యావర్తులలోగానీ, అన్నిటిలోనూ వాడిత్రోవే వేఱయిపోయింది. పాఠశాలలో చదువుకునేటప్పుడు కూడా ముగ్గురమూ ఒకేతరహాగా ప్రవర్తిస్తున్నా, వాడితో సంబంధించిన విషయాలకు అదోవిధమైన ప్రత్యేకత ఉండేది. నాజూకుతనము, సున్నితపు నెఱనీటు, సుఖకరమైన చొక్కా, ఏదో అనిర్వాచ్యమైన ఉత్సాహమూ వాడిచుట్టూ ఆవరించిఉండేవి. వాడు మాట్లాడుతూఉంటే కించిన్మందహాససమ్మిశ్రితమైన చల్లదనాల వెల్లువల్ని ఒకజ్యోత్స్నామూర్తి ఒలికిస్తూ ఉన్నట్లుండేది. వాడికన్నుల్లో ప్రవిమలకాంతులు అంతరాత్మసందేశాలను అందిస్తూ ఉండేవి. చైతన్యప్రాణాలు వాడితో సంచరిస్తూ ఉన్నవాళ్లను కూడ ఆప్లావితుల్ని చేసేవి వాడికున్న ప్రత్యేకత, బారెడుచేతులున్నవనీ కాదు, మూరెడుముక్కున్నదనీ కాదు—అదేదో మసకబొమ్మల్లే వాడు మాలో ఉంటే మేమూ ఉన్నట్లుండేది: లేకపోతే మేమూ లేనట్లుండేది. వాడొక కళాస్వరూపమంటే జనులు నమ్మరు; పోనీ మా కళ్లతో చూడనన్నా ఒప్పుకోరు; మీరు మనుష్యప్రపంచకంలోని వాళ్లు కారంటారు.

వాడు లలితకళలన్నిటిలోనూ పిండిలో పండైనాడు. అతిబాల్యంలోకూడా వాడికంఠస్వరం, హృదయంలో లలిత తంత్రులంటూ ఉన్న ప్రతిప్రాణినీ ముగ్ధమోహన పారవశ్యంలో ముంచిఎత్తింది. వాడు పాడమంటే పాడేవాడు కాడు. పాడితే వినేవాళ్లు విడవమంటే విడిచేవాళ్లు కారు. చిత్రలేఖనమూ అలాగే. చిన్నప్పటినుండీ ఏవోగీతలు గీస్తూఉండేవాడు. మాకు తెలీక అవి గీతలనుకునేవాళ్లం. చివరకు వాడే గమ్మత్తు చేస్తానని; ఆగీత అక్కడా, ఈగీత ఇక్కడా చెఱిపివేసేసరికి, తింటూతింటూఉన్న దానిమ్మపండు దిగజారి పడిపోగా క్రిందకు అడియాసతో చూస్తూఉన్న ఏచిలకో, విలాసంగా పూబోరల్లో మంచి మకరందం త్రాగి తూగుతూ వస్తూఉన్న మిళిందకుమారుణ్ణి, ఎగసి ముక్కుతో పట్టుకోడానికి మెడను టిక్కించుకొని చూస్తూఉన్న ఏగోరువంకో, గిరిశిఖరాన నిలిచి పడతాననే భయంలేక అందీఅందకున్న చెట్టుచిగురందుకునే ఏ పసిమేకగానో తయారయ్యేది. మేము విభ్రాంతితో అలాగే చూస్తూ నిలబడేవాళ్లం. పెద్దయింతర్వాత వాడు గొలికిన ప్రతిపదమూ అర్థవంతమైన కవిత్వంగా మారింది. వాడు గీసిన ప్రతిలేఖా సజీవమైన చిత్రకళగా కనిపించింది. వాడిమాటలకూ, వాడివ్రాతలకూ ఆక్షేపణ మేము కనిపెట్టలేకపోయినాం.

అర్ధరాత్రివేళ లేచి— అందునా ముఖ్యంగా చీకటిరాత్రుల్లో—ఊరంతా మాటుమణిగి ఉన్నప్పుడు, 'చీమచిటుకని అన్నా వినబడని' అప్పుడు, జలజలమని సులకరాలతో పలుకులాడుకునే చిఱుకాల్వకంతెనపైన కూర్చుని, గంటలకొలదీ ఆలోచిస్తూ, ఏకాంతంగా ఉండటం చిన్నప్పటినుండీ వాడికి చాలావేడుక; వేడుకగాదు వాడుక. చీకటంటే వాడికి భయంలేదుగానీ దురాత్ముడనేమాట విని భయపడ్డాడని నేనెఱుగుదును. కొండలనుచూచి ఎక్కి తిరగడమంటే వాడికి సరదాయే కాని నేనొకసారి మనుచరిత్రంలో "గ్రుద్దుక గోత్రాచలంబుల్" అని చదివేసరికి త్రుళ్లిపడ్డాడు. అంతేకున్న

తప్పు మనస్సు కలవాణ్ణి నేనెక్కడా చూడలే. ఒకసారి బజారుకువెళ్లివస్తూ త్రోవలో కత్తికోతలవాడొకడు చేయికోసుకుని, గాయమునుండి రక్తం కారుతుంటే, దాన్ని నాకుతూ దానిమీద తుబుకుతుబుకుమని పట్టెడు పట్టెడు ఉమ్మేసుంటూ వస్తూఉన్న దృశ్యాన్ని చూచి గలబరించిన ఒంటితో గబగబ ఇంటికి పరిగెత్తుకొని వచ్చేసరికి, వినోదానికని ఇంటిముంగర గారడీవాళ్లు పోట్లాడించిన రెండుపొట్టేళ్ల తలలు పగిలి రక్తం ఘోరంగా ధారలై పడుతూన్న దృశ్యంకూడ చూచి మావాడు మళ్లీ మంచందిగేసరికి పన్నెండురోజులు పట్టింది.

వాణ్ణి మేము దేవతామూర్తిగానే తలపోసినాం. బుద్ధెఱిగినతరువాత మా శ్యామల ప్రేమలత లావైపు ప్రాకుతూఉండడం గ్రహించీ నేను మారుచెప్పడానికి ప్రయత్నించలే. చెల్లెలని చెల్లెలుమాటలు కాకపోయినా, మా శ్యామల అందగత్తె అనే అందఱూ అనుకునేవాళ్లు. నాకేమీ తెలీదుసుమండీ. నేను మోటువాణ్ణి. మా రెండుకుటుంబాల్లో అభిప్రాయాలేకాక మాచేవాళ్లు కూడ వీళ్లిద్దరూ ఒకరికొకరు తగినవాళ్లనీ, సంసారం చాలాసౌమ్యంగాను సుఖకరంగాను ఉంటుందనీ అనుకున్నారు. పెద్దవాళ్లమాటకు వ్యతిరేకంగా చెప్పలేకో, లేక మా శ్యామలపై ప్రేమచేతో వాడుకూడా మాటాడలే. నాకూ అతనిలో క్రొత్తమార్పేమీ కనపడలే. వివాహం సలక్షుంగానే ఐంది. అంతా సవ్యంగానే ఉంటుందనుకున్నాం.

వివాహమైన రెండుసంవత్సరాలవరకూ విశేషాలేవీ లేవు. వాడేవో బొమ్మలూ, పద్యాలూ భారతి మొదలైన పత్రికలకు పంపిస్తూ ఉండేవాడు. సజీవమైన చిత్రకళ. ఎవరాదరించరూ? ఇతనిబొమ్మలు చూచీ, వ్యాసాలు చదివీ, ఆనందించి ఇతనిరూపాన్ని చూద్దామని వచ్చే కళోపాసకులను, చాలామందిని నే నెఱుగుదును. వాడు ప్రపంచకానికి ఆదర్శాలని ఎన్నో అందిస్తాడనీ, అన్నివిషయాల్లోనూ అనుమఱుగున పిందెలాగా ఉంటాడనీ అందఱమూ వివృతహృదయాలతో ఎదురుచూస్తున్నాం.

౨

మావేణూకూ-అసలు వాడిపేరు వేణుగోపాలం. మాఅమ్మను కన్న తాతగారిపేరుకూడా గోపాలరావుగారు కావడంచేత మాఅమ్మమ్మ వాడి నాపేరున పిలవడానికి వీలులేక వేణూ అని పిలుచుకునేది. మాకూ్కడా అదే అలవాటైపోయింది అందుకని వాణ్ణి ఆపేరనే తఱచు వ్యవహరిస్తూ ఉండేవాళ్లం — నాకూ మావూళ్లో చదువైపోయింది. B. A. పూర్తిచేశాము. నాకింకా చదువుకోవాలని ఉంది వాడికీ చదువుమీద, విద్యార్థిజీవితంమీదా అపేక్ష తగ్గకపోవటంచేతనూ, ఇంకా తన అభిరుచులకూ, అనుభవాలకూ, అభివృద్ధికీ, అనుకూలమైన ప్రదేశం ఇది కాదనిన్నీ, నెమ్మదిగా చెన్నపురి చేరుకుంటే అక్కడ తన ఆశయాలకీ, జీవితక్రమానికీ తగినవాళ్లుంటారనీ, నేను కూడ అక్కడ M. A. చదువుకుంటూ ఉంటే ఇద్దఱమూ సుఖంగా కాలం గడుపవచ్చుననీ తన అభిప్రాయం వెల్లడించి నాతో సంప్రతించాడు. ఇద్దఱమూ వెళ్లి నాన్నగారిని చూద్దామనుకున్నాము.

వాలుడుకుర్చీలో జేరగిలబడి సోలినట్లు మా నాన్న కూర్చునిఉన్నారు. మాఅమ్మ ప్రక్కనే కాఫీ కప్పూ, సాసరూ పట్టుకుని నిల్చిఉన్నది. కిటికిలోనించి హాయిగా గాలిపిల్లలు పరుగెత్తుకుని ఈదుకొని వస్తూ ఉన్నారు; ప్రక్కనేఉన్న మాశ్యామల ముద్దుమొగాన మూగిన ముంగురులు ఒక్కసారి ఊగించి వెళ్తున్నారు కూడాను. కిటికిలోనించి దూరంగా కనబడుతున్న తాటితోపులూ, అందులో ఒకచెట్టుపైకి తొండలా ప్రాకుతూఉన్న ఈడిగవాడూ, వాడికత్తులూ, అన్నీ ఊహాచిత్రాల్లోమల్లే కండ్లకు కట్టుతున్నాయి. అప్పుడే ఎక్కడనుంచో ఒకచిన్న గడ్డిపరకను నోట గఱుచుకొనివచ్చి మాకిటికీకమ్మలమీద వ్రాలి నిలబడిన ఒక పిచ్చుక కీచుకీచుమంటూఉన్నది మాకొంచెపు కిటికీలోనుంచీ అతిభూమమైన ప్రకృతిచిత్రాలన్నీ కనులకు కట్టినట్లు గోచరిస్తున్నాయి. మేము తటాలున లోపలికివెళ్లేసరికి అట్టే ఆగి మాశ్యామల మెఱుపువలె మాయమైంది

వేణువును చూచి. అదేమో దర్శనమాత్రాన్నే మెలగి పోతాయికాబోలు పరస్పర హృదయాల్లో ప్రణయ తంత్రులు. మాశ్యామలమగ్ధభావానికి నేనే ముగ్ధుణ్ణయి పోయాను.

"రండి! రండి! కూర్చోండి! సమయానికే వచ్చారు. అమ్మాయ్, మరిరెండు కప్పులతో కాఫీ పట్టుకురా తల్లీ!" అన్నారు నాన్నగారు.

మే మిద్దరమూ చెరొక కుర్చీమీదా కూర్చు న్నాము.

"వేణూ! ఏమిటోయ్! మొన్న బెజవాడ Exhibition లో నీబొమ్మకు ప్రథమ బహుమానం ఇచ్చారట కామా? మొన్న నీవు వ్రాసిన "మనోహరి" అనే కావ్యానికేగమా కావ్యపరీక్షలో మొదటిబహుమతీ ఇచ్చారట. ఒక్కసారైనా చెప్పేవేకాదు. నింపుకుండ తొణకదని, అలాగే నిలబడ్డావేం! నీవన్నా వెళ్లి రెండు కప్పులు కాఫీ పట్టుకురాక" అన్నారు నాన్నగారు అమ్మనుచూచి.

"కాస్తసేపు కూర్చుంటే అల్లుడు అరిగిపోతాడు కాబోలునేమండీ. రాకరాక ఎప్పుడో వాడు తటస్థ మనడం, మీరు మీకబుర్లతో వాణ్ణి అలాగే పం పెయ్యడం! అబ్బాయి! నువ్వూ బావా కలిసి లోపలికి రండేం కాఫీ ఇస్తాను."

"ఇదిగో" అని నాన్నగారంటున్నా వినిపించు కోకుండానే అమ్మ లోపలికి వెళ్లిపోయింది.

"ఆడవాళ్ల చాదస్తమంటే యిదే" నన్నారు నాన్నగారు.

*    *    *    *    *

ఆరోజుకు వేణూకూడా మాయింట్లోనే ఉండి పోయాడు. భోజనాలదగ్గఱకూడా అవేకబుర్లు—అంటే వాడిబొమ్మలూ, వాడిపద్యాలూ, వాడివ్యాసాలూను—భోజనాలవుతూ ఉండగానే ఏదోమాటల సందడిని నాన్నగారు.

"అవును. ఇక్కడ చదువు పూర్తిఅయిందికదా! వేణూ! ఇంకా ఏమిచేద్దామని నీ ఆలోచన? పోస్టు గ్రాడ్యుయేటు కోర్సు చదవాలని ఉందా? నాన్న యేమన్నాడు? అసలాయన్ని కదిపేవా యీసంగతి గురించి" అన్నారు.

"అనుకుంటూన్నమాటనే అడిగారు. ఎలాగా ఈవిషయాన్ని బయటపెడదామా అని బావా, నేనూ ప్రొద్దున్నుంచీ చాలా గుంజాటన పడి ఏమీతోచక ఇందాకటినుంచీ మూకీభావంతో ఉన్నాము. బావకు కూడా M. A. చదవాలని ఉందట. నాకైనా ఇక్కడ ఉన్నకార్యంలేదు. ఉన్నతసంస్థలకీ, అభివృద్ధి కరమైన త్రోవలకీ ఆస్థానమైనది చెన్నపట్టణము. అక్కడఉండి, అక్కడి నాగరికకళాజీవితంలోకూడ కొంతరుచి చూడవలెనని ఉంది. పేర్లువినడం, బొమ్మలు చూడడం వాళ్లనుగురించి చదవడమేకాని మహా పురుషులతో సాంగత్యసుఖం, వారి వ్యక్తిగతాంతర్జీవి తాల్లో బహిర్గోచరంగాని సారస్యం, ఈనాలుగుమైళ్ల ప్రపంచకంలోనే ఉండి అనుభవించడ మెవరివలనూ కామగనుక, కళాస్వరూపాన్ని అభ్యసించడానికీ, మహా పురుషులతో పరిచయంకలగచేసుకోడానికీ నేను కూడా చెన్నపట్టణం వెళ్దామనుకుంటున్నాను. నాన్న గారితో యీసంగతి ముచ్చటిస్తే, ఇప్పటికే వారు నా కొఱకు చాలా డబ్బు తగలేశామనీ, తెచ్చే దేమీ లేక పోయినా తగలబెట్టడంమాత్రం నాకు బాగా చేతౌననీ చీవాట్లుపెట్టేరు."

"వేణూ! అదేమిరా! అన్నయ్యే అలాఅంటాఁ?" అన్నది అమ్మ.

"ఆ! పదేండ్లు పట్టణవాసంచేసి నాగరికవిజ్ఞా నాన్నీ, మాటమర్యాదనూ బాగ గుర్తెఱిగేనని అను కుంటున్న మీఅన్నయ్య అన్నమాటే యిది. పదేండ్లు కాదు వెయ్యేండ్లు పట్టణవాసంచేసినా, మీఅన్నయ్యే కాదు, అన్నయ్య ఇంట్లో వాసాన్నికూడా "పీనాసీ! పలుకూ" అంటే పలుకుతుంది." అన్నారు నాన్న గారు.

"పోనీలేండి! మావాళ్లంతా పీనాసులు! మీరే మహామహామహామహా తెసుబాటు కలవాళ్లైతే! ఏదీ చూతాం, పిల్లల్నిద్దఱినీ, ముచ్చటపడుతున్నారుగా, పట్నం పంపిస్తామని అనండీ; చదువుచెప్పిస్తామనండీ! అనరేం?"

"అన్నా అనకపోయినా వెయ్యిపుటాలు వేసినా మా తెసుబాటుగుణం మీపుట్టినింటివాళ్లకు జన్మజన్మకీ రాదు."

"పోనీలేండి! మీరు కాశీనాథుని నాగేశ్వరావుపంతులుగారంతటివాళ్లు; సి. అర్. దాసంతటివాళ్లు. మళ్లీమాట్లాడితే కర్ణుడంతటివాళ్లు. మీతండ్రిగారు బలిచక్రవర్తి అంతటివారు. మీతాతగారు శిబిచక్రవర్తి అంతటివారు. ఇంకా ఇంకా మీవాళ్లంతా ఇంతవాళ్లంతవాళ్లు; కొండలంతవాళ్లు; గోనెలంతవాళ్లు సరేనా!" అన్నది మాఅమ్మ.

ఈవినోదకలహాన్ని వింటూనే నేనూ, వేణూ ఆరగిస్తున్నాము.

"ఎంత ఉడుకుమోత్తనమో, అన్నలనీ, అమ్మలనీ అంటే ఆడవాళ్లకి, ఈగవాలనీయరు వాళ్ల యిండ్ల మీద" అన్నారు నాన్నగారు.

"ఇంత చదివారుగాని మీయిద్దైనాగాని పిల్లల్ని పంపిస్తామనే మాటమాత్రం అనలేదు. ఇందులోనే తెలుస్తున్నది మీ తెసుబాటుతనం యావత్తున్నూ" అన్నది అమ్మ.

"ఓసిపోవే."

భోజనాలు ముగించుకుని సావిట్లోకివచ్చి కూర్చున్నాం. శ్యామల అదివరకే పేపప్లేంలో వక్కపొడీ, తునికవటాకులూ, సున్నం తెచ్చి చిలకలుగా చుట్టిపెట్టి వెళ్లిపోయింది. వాలుడుకుర్చీల్లో కూర్చుని వాటిని నములుతూ హాయిగా ప్రసంగించుకొంటున్నాం. నన్నూ, మాబావనీ చెన్నపట్నంపంపడానికి చివర కేలాగైతేనేం విశ్చయించారు. వేణూ, నేనూ నాలుగుగంటలకి టెన్నిస్ ఆడుకోడానికి వెళ్లేం. మళ్లీ తిరిగివచ్చేటప్పుడు వేణూ

"బావా! అయితే వెళ్లడం నిశ్చయమన్నమాటేనా?" అన్నాడు.

"కాకేమీ? ఇవ్వాళ మే ౧౦. ఎటుపోయి ఎటువస్తుందో అని ఆలోచించే ప్రెసిడెన్సీకాలేజీలో M. A లో seat తెప్పించుకొని అట్టిపెట్టుకున్నాను. నీవు School of Arts and crafts కు seat కోసం వ్రాయి. దానికి కొంచెం ఆలస్యమయినా ఫర్వాలేదనుకుంటాను అసలు నీపేరు వింటేనే చాలదుటోయ్."

## 3

ఆమర్నాడే వేణూకూడా ఎగ్మోరుకు ఉత్తరం వ్రాశాడు School of Arts and crafts లో తన్ను చేర్చుకోవలసినదిగా. ఇంకో మూడురోజులకు ఆప్రిన్సిపాలుదగ్గఱనుండి, మావాడు తమస్కూల్లో ఉపాధ్యాయుడుగా ఉండతగినవాడే కాని, విద్యార్థిగా ఉండతగినవాడుకాడనీ, ఐననూ క్రమశిక్షు అలవాటుపడటానికి కొన్నాళ్లు కళాశాలలో విద్యార్థిగా ఉండడమే మంచిదికనుక వేణూను తనవద్ద విద్యార్థిగా ఉంచుకోవడం తన కెంతో సంతోషమనీ, వేణూ అంతటివాడు తమకళాశాలకు రావడమే తమకొక ఘనత అనీ, ఇలాంటివగైరాలతో కొంతపొడుగున ఉత్తరం ఒకటి వ్రాశాడు. జూన్ నెలాఖరున కాలేజీ తెరిచారనగానే మేమిద్దఱు మూటాముల్లే కట్టుకొని వెళ్లి వాడికీ నాకూ సదుపాయంగా ఉండేటట్లుగా నాగప్పవీథిలో ఒకమేడమీదగది ౧౦ రూలకు అద్దెకుపుచ్చుకొని మా చెన్నపట్టణ జీవితాన్ని ప్రారంభించాము.

మావాడుకూడా School of Arts లో జేరి అక్కడఉండే విద్యార్థులకందఱికీ తానే ప్రాథమికశిక్షు నేర్పుతూ, అక్కడ గొప్పగొప్ప పేరెన్నికగన్న చిత్రకారుల్ని దర్శించుతూ, మహాపురుషులతో చెలిమికలుగజేసుకొంటూ, అందఱికూ తల్లోనాలుకలాగ మెలుగుతూఉండేవాడు నాచదువు పరీక్షలచదువు; వాడిది విశ్వమానవ జీవితకళారహస్యవిద్యావిధానం. నాకు చదవవలసిన పుస్తకాలెక్కువగా ఉండటంచేత—చదవకపోతే పరీక్షతప్పుతాననే భయంచేతకూడా—సాయం

కాలం బీచికి షికారుకువెళ్లిన ఏ రెండుమూడుగంటల్లో, లేక సినీమాకువెళ్లిన యేరెండుమూడుగంటల్లోతప్ప, నిద్రాహారాలకు వ్యయించిన సేపు మినహా తక్కినకాల మంతా నాచదువుకే వినియోగించినవాడ నవడంచేత వాడి అభిరుచులలోని, వాడి అనుభవంలోని ఆనందం కొంచెం కూడా నేను పొందలేకపోయాను. వాడిది ఏపుస్తకంలోనూ వ్రాయని విద్య అవడంచేతా, అంతు లేని విద్యఅవడంచేతా, వాడికి కూడా నాతో అట్టే కలిసిమెలిసి ఉండడానికి తీరుబడి అయ్యేదికాదు. ఈ విధంగా మాయిద్దరిస్వభావాలూ రెండుదారులు త్రొక్కి నయ్.

మేము పుచ్చుకొన్న ఇంట్లోనే రెండుగదు లున్నవి. ఒకటి నేను, యింకోటి వాడూ వాడుకుంటూ ఉండేవాళ్లం. మనోహరదృశ్యాల్తో నిండిన చిత్రాలూ, చుట్టూ నిలువుటద్దాలూ, రకరకాలైన Glass Painting లూ, ఒక్కొక్క అద్దంపైన ఇంపైనపద్యా లూ, పచ్చని పూలమొక్కలూ, పూచిన గులాబీ మొక్క లున్న తొట్లూ, ఎన్నోజాతులచిత్రమైనగవ్వలూ, రాతి పువ్వులూ, తనకు మంచివని తోచిన యిలాంటి అన్నిం టినీ తెచ్చి తనగదినిండా వాడు అలంకరించుకునే వాడు. ఎప్పుడూ తెల్లని జిలుగులు కట్టుకుని, రబ్బరు జోళ్లు వేసుకొని దేవతామూర్తిలాగా వర్తిస్తూ ఉండే వాడు.

మరి ఇంతవ్రాశావు, ఏమిచేశాడయ్యా మీవా డని మీరడిగితే నే నేమీచెప్పలేను.

వాడిని పిచ్చివాడని మీరంటారుగాక, నేను మాత్రం ఒప్పుకోను. ఒకవిధంగా చూస్తే వాడు నిజంగా పిచ్చివాడే— అందరిదృష్టిలోనూ.— తమతమ వ్యవ హారాలను తాము నిర్వర్తించుకొంటూఉన్న వ్యక్తులను, తనకు పనిలేదనిచేరవచ్చి, ఎవడోఒకడు, అనవసరంగా వారివారి నడవళ్లలో మంచిచెడ్డలను గ్రహించి, వారి వారి జీవితాల్ని కెలకడానికి వచ్చాడంటే ఎవడు సహించగలడు చెప్పండి? పైకి ఆడంబరజీవితాల్ని చెలామణిచేసుకుంటూ లోపల లొటారపు పెద్ద మనుష్యు లెందఱులేరు, కొంచెం ఎంచిచూడండి. వారి వారందరినీ తమలోపాయికారీగుట్టుల్ని పైకి లాగుతా నని మావాడిలాంటివాడు అభ్యర్థిస్తూవస్తే పోనీ పైకి లాగి లోకం మొగాన పారవేయకుండా తనమనసులోనే ఉంచుకుంటానని మాటఇచ్చినా—ఇతరులకు తనరహ స్యాలు తెలియనిచ్చేలౌకికు డెవడుంటాడు ఆలోచించండి. అట్టిరహస్యాన్వేషకార్యానికి దిగినవాడు వెఱ్ఱివాడా, వెఱ్ఱి న్నరవాడా?

కాని మా వాణ్ణి మాత్రం పండిపోయిన లౌకి కుడైనా సరే, ఎవ్వడూ ఇలాగని అనుమానించ లేదు. వాడినిచూచి వాడితో చెలిమిచేసినవారందఱూ తమరహస్యాలు దాచిపెట్టుకోదగిన పెట్టెగదా వీడి హృదయం అనే అనుకున్నా రనుకుంటాను;—ఇంకో విధమైన అపప్రథ ఏదీ వీడికి చుట్టుకోలేదుకనక— అంతటి దుర్లభమైన కార్యంలోకూడా జయశాలి ఐనాడు కనకనే వెఱ్ఱివాడని లోకం వాణ్ణి దూషించినా నేను ఒప్పుకోను.

## ౪

సంవత్సరాలన్నీ యిలా ఉంటూఉండగా, హఠా త్తుగా మేము కాపురమున్న ఇంట్లో ఒకముసిలావిడ చతుర్థీధనిష్ఠాపంచకాల్లో కాలగోచరమైంది. అందు చేత ఆయిల్లు ఆఱునెలలు పాడుపెట్టాలిసి వచ్చింది. మే మిక అక్కడ ఉండడానికి వీలులేకపోయింది. అందులో అలాంటివంటే మావాడికి ఇంతింతనరాని అళు కని మొదటనే మనవిచేసుకొని ఉన్నాను. కాని ముసి లావిడచావు మాకు ముప్పతిప్పలుతెచ్చిపెట్టింది. హఠా త్తుగా చెన్నపట్టణం లాంటి ఊళ్లో క్రొత్తబసలు దొరకా లంటే సాధ్యమవుతుందా? ఎంతగా విచారించినా మాయిద్దరికీ సరిపడ్డగది ఒక్కటీ దొరకలేదు. ఆరోజు నేనూ వాడూ కూడ సెలవుపెట్టి బసకోసం తిరిగేము. మాకాళ్లు శని వదిలిందేకాని, అదేమి పాపమో, నాకూ వాడికీ సరిపోయిన జాగా ఒక్కటీ అగుపడలేదు. Bells street లో ఉంది ఒకగది. ఒక్కడికే సరి పోతుంది. స్నానపానాదులకు కొంచెం ఇబ్బందిగా ఉన్నా ఒక్కడెలాగైనా జరుపుకోవచ్చు. కాని రెండో

వాడు వచ్చాడంటే కూర్చోడానికైనా స్థలం చాల దొగదిలో. తిరిగితిరిగి విసుగొచ్చి ఆగదిలోనే కూలబడి ఇద్దరమూ—ఎలాగా — అని ఆలోచిస్తూ ఉన్న సమయాన్ని, ఆయింటికే Egmore లో సుప్రసిద్ధ వర్తకుడైన లాల్‌గారున్నూ, వేణూ ప్రిన్సిపాలున్నూ కలిసివచ్చారు. వారింకా లోపలికి పోకముందే మమ్మల్ని చూచి ఆగి,

"హల్లో! మిస్టర్ వేణూ! నీవుకూడ ఇక్కడే ఉన్నావే. ఏగాలికి కొట్టుకొచ్చావిటూ? Nagappa వీథిలో అని చెప్పేవాడివికదూ మామకాం. ఇక్కడున్నావేం? ఏమిటి సంగతి" అన్నాడు ఆయన, అంటే ప్రిన్సిపాలుగారు.

"మేమున్న ఇంట్లో ఒకవృద్ధురాలు, పాపము, కాలగతి కన్నది. నక్షత్రం మంచిదికాదట. ఇల్లు ఆరు నెలలు పాడుపెట్టవలెనట. మేము అద్దెఇండ్ల వేటకు బయలుదేరి, ఎక్కడా ఒకటీ దొరకక్కపోతే ఇక్కడ కూలబడినా మీలాగా. మీ రిటు దయచేశారేం?" అన్నాడు వేణు.

"ఎబ్బే; ఏమీలేదూ—లాల్‌గారూ, ఇతన్ని ఎఱుగరనుకుంటాను. ఇతనే కె. వేణుగోపాలరావంటేను. మాస్కూల్లో క్రొత్తగా మీకు చూపదగిన భవ్యాలంకారము. ఇదివరకు మా విద్యార్థులేవో ఊహాచిత్రాలు వ్రాస్తేనే వాటిని చూచి మీరు చాలా మెచ్చుకునేవారు. అట్టి ఊహాలన్నీ సజీవంగా మూర్తీభవించిన దివ్యమూర్తి ఇతను. మీ మన్ననకు మిక్కిలి తగినవాడు. వేణూ! వీరి నెరుగుదువా? వీరే లాల్‌గారంటేను. మనకళాశాలాభివృద్ధికై పలువిధాల సహాయపడుతూ, అక్కరలకు ఆదుకుంటూ, మనకు జీవగఱ్ఱవలె ఉన్న మహనీయులు. వీరు నీకెంతయూ పూజ్యులు—"

అని ఇలా వాళ్లిద్దఱికీ జోస్తీ కలిపేరు. లాల్‌గారు అభివాదనపూర్వకంగా తన చేతిని ముందుకు చాచారు. వేణు దానిని చేకొన్నాడు.

"మహాశయులకు వందనములు—మీమన్ననకై వేచియున్న నమ్ము ధన్యుని చేయుదురుగాక" అన్నాడు.

"నాయనా! ఈతడెవరు?"

"మాబావ! Presidency Collegeలో చదువుకొంటున్నాడు. మేమిద్దఱమూ కలిసేఉన్నాం."

"అయితే మీరింక యీవేట చాలించి కొంచెం విశ్రమించండి. బస దొరకలేదని ఏమీ బెంగపడవద్దు. ఎగ్మోరులో హాయిగా యిద్దఱూ మాయింట్లోనే ఉందురుగాని రండి! మీకు తగిన సౌకర్యాలన్నీ చేస్తాను. మీలాంటి పిల్లలను ప్రోత్సహించకపోతే చెన్నపట్టణానికే చెల్లని అవమానం" అన్నారు లాలుగారు.

"మీ అభిమానమున కెంతయు కృతజ్ఞులము. కాని మాకు కాలేజీకి దూరంగా ఉంటుంది ఎగ్మోరంటేను. అదీగాక చాలామంది మేమెరిగిన స్నేహితులిక్కడే ఉన్నారు. వారిని విడిచిపెట్టి రావడానికి కొంచెం ఇదిగా ఉంటుంది; క్షమించి—" అన్నాను.

"ఇదీ లేదు, అదీ లేదు, ఎక్కడఉంటే అక్కడే స్నేహితులు కూడుతారు ఇంతకూ మీకు స్నేహితులు కానివాళ్లెవరూ? మీమంచితనమే అందఱినీ మీకు స్నేహితులుగా చేస్తుంది" అన్నారు లాలుగారు.

నాకు అనవసరమైన అభిమానబుణంలో పడిపోతామేమో అని చాలా భయం వేస్తున్నది. లాల్‌గారికి మా అభిమానదురభిమానాలవల్ల లాభనష్టాలు లేకపోయినా మామనస్సు కొట్టుకోక తీరదుగా మఱి.

"ఇదిగో ఇంకా ఏమిటి ఆలోచిస్తున్నారు. మీరు చిన్నపిల్లలు. మీకు తెలీదు. నన్నెవరడగమన్నారు చెప్పండి మిమ్మల్ని—మీమంచితనమే, మీ సరళస్వభావమే, మీ విమలహృదయాలే నావాత్సల్యాన్నింతగా ప్రేరేపిస్తున్నవి. మీకేమీ సంకోచం వద్దు రండి!" అన్నాడు లాల్.

"అలాచేస్తే మాత్రం మీకేం కష్టముంది లాల్‌గారిల్లు చాలావిశాలమైనదే. వారిని గుఱించి మీకింకా తెలీదు. మీకేకాదు, చాలామందికి వారి ఉదారహృదయంలో చోటుంది వారికేమైనా ఇబ్బందిగా ఉంటుందేమో అని ఆలోచిస్తున్నారేమో? మీతో ఇంకో

ఇద్దర్నీ తెచ్చుకున్నా వారికి ఆశ్రయాన్నివ్వడానికి ఏమీ అభ్యంతరం ఉండదు." అన్నాడు ప్రిన్సిపాలు. ఇద్దరూ మామొగాలవంక చూస్తున్నారు. అమితమైన భయం ఒక్కసారిగా మీదబడితే ఎలా స్తంభిస్తుందో, అమితమైన దయారసం వచ్చి ముంచేసినా అలాగే హృదయం ఉక్కిరి బిక్కిరి అవుతుంది. మాకేమీ చెప్పడానికి తోచలేదు. అసలు నాకు వెళ్లడానికి ఇష్టంలేదు. కాని గట్టిగా చెప్పలేనామాట. చివరకి

"మీ ఇష్టప్రకారమే కానీయండి. నేనిక్కడ ఉండిపోతాను. వేణూ మీయింట్లో ఉంటాడు. నాకూ ఏమీ అభ్యంతరం లేదుకానీ అదేదో యీప్రాంతాలన్నీ నన్ను మచ్చికపఱచుకొన్నవి. వాటిని రోజూ చూడకపోతే కొంచెం కలతగా ఉంటుంది హృదయంలో." అన్నాను. వేణూ నావంక తేరిపారచూశాడు, అలాగన్నావేమన్నట్లు.

"సరే! అతనికి ఇష్టంలేనట్లున్నది. వేణూ! నీవైనాసరే! బలవంత మేమీ లేదు సుమా! ఇంటికోసం దేవులాడుకొంటున్నారు కనక ఎందుకు ఇబ్బందిపడతారని అన్నానంతే" అన్నాడు లాల్.

"నీకు స్కూలుకు దగ్గఱకూడానోయ్! పోనీ మీబావ నిక్కడే ఉండనీ! నీవురా! కావలసినప్పుడు వచ్చి చూచిపోదువుగాని. కొన్నాళ్లు ఒంటరిగా ఉంటే ఒంటరితనంలో సౌఖ్యంకూడా మీబావకు తెలుస్తుంది." అన్నాడు ప్రిన్సిపాలుగారు.

ఈతడవకూడా ఏమన్నా అడ్డుమాట చెప్పితే మర్యాదగా ఉండదనో, ఇల్లు దొరకని శ్రమచేతనో, కాక ఈబాధ చప్పున వదుల్చుకొందామనే అభిప్రాయం చొప్పునో

"చిత్తం! అలాగేనండి" అన్నాడు వేణు.

"అయితే, రేపుశనివారం, మీకు కాలేజీ ఉండదుకనుక, కారును పంపిస్తాను. మీరందులో మీసామానులను తెచ్చుకోవచ్చును. మీకోసం ఎదురుచూస్తూ ఉంటా" నని చెప్పి లాలూ, ప్రిన్సిపాలూ లోపలికి వెళ్లిపోయారు.

అన్నాడే గాని ఈయన కీసంగతి జ్ఞాపకముండి చస్తుందా అనుకున్నాం. తర్వాత ఇంకోఇల్లేదైనా చూసుకోవచ్చుననీ ఇంటివాడు తొందరపెట్టుతూ ఉన్నందున అప్పటికి మాత్రం సామానైనా క్రొత్తగదిలోకి చేర్చేకుందామనీ, మర్నాడు ప్రొద్దునపూట సర్దుకుంటూ ఉండగా, పది గంటలవేళకు వీథిలో మోటారుహారన్ చప్పుడైంది. నాకు గుండెల్లో గుబులువేసింది. కాని మాటమర్యాద పోతుందనే భయంచేత, నాసామాను మాత్రం క్రొత్త గదిలో బెట్టించుకొని, వద్దంటూన్నా వేణూను "ఏదో మాటకరసకు గదితీసుకున్నాను గాని ఎప్పుడూ నీదగ్గరే ఉంటా" నని నచ్చచెప్పి వాణ్ణి లాల్ గారింటికి పంపించాను. వాడు వెళ్లేవరకూ లేదుగాని, దృష్టిపథం దాటి వాడు లేడని తెలిసేసరికి, మనసు బరువుగా ఉన్నదనిపించి, అదేదో విధమైన గుబులు మనసులో ప్రవేశించింది.

౫

మా లెక్చరర్లను నేనంటే చాలా ప్రేమగా ఉండేది. రేపటికి చెప్పవలసిన పాఠాలు అన్నీ యీరోజునన్నే చదువుకొని వెళ్తూ ఉండేవాడిని. అందుబాటులో ఉన్న ప్రతివార్తాపత్రికా, పుస్తకమూ చదివి విషయాన్ని అవగాహనకు వీలయ్యేటట్టు టూకీగా నోట్సు వ్రాసుకొని రిఫరెన్సుకు అట్టిపెట్టుకొని, సాధ్యమైనంతవరకు ఆధునికవిజ్ఞానాన్ని ఎఱుకలో ఉంచుకునేవాణ్ణి. లెక్చరర్లు వృత్త్యనుసారంగా ఎన్నేండ్లు పాడినా అదేపాటగనుక క్రొత్తవిషయాలతో ఆట్టే జోక్యం కలుగచేసికోరు. ఎలాగైనా వాళ్లను చెప్పలేదనీ, క్రొత్తవి నేర్చుకోలేదనీ నిలవదీసి పరీక్షించి అడిగేవారుండరు గనుకనూ, నెలనెలకూ జీతపురాళ్లు రావడానికి ఏదో ఇంత టపటపమనిపించి కాలక్షేపం చేస్తేగాని వీలుండదుగనుకనూ, కొంతమంది అధ్యాపకులు, పని అయిందనిపించడానికి కాలేజీకి వచ్చివెళ్తూఉంటారు. వాళ్లను కొంచెం బుద్ధిమంతుడైన కుఱ్ఱవాడేదైనా అడ్డుప్రశ్నవేస్తే తగిన సమాధానం చెప్పడానికి వాళ్లకు తోచదు. పైగా చిరాకు, అడిగినవాడిమీద గొంతువరకూ కోపం.

నేను వాళ్లడిగిన ప్రశ్నలకు సరిగా సమాధానం చెప్పడమేకాక, నాకున్నవీ, ఇతరవిద్యార్థులకు తట్ట నివీ అయిన సందేహాలు అప్పుడప్పుడు అడుగుతూ ఉండ డంచేత, విద్యార్థులకే గాక, అధ్యాపకులకు కూడా నే నంటే ఒకవిధమైన రుచియేర్పడింది. కాలేజీలో అర్థం గాని సందేహాలు కొందరు నాస్నేహితులు వచ్చి న న్నడిగి తెలుసుకుంటూఉండేవారు.

మాక్లాసే చదువుతూ, అందరు లెక్చరర్ల మన్ననలకూ పాత్రమైనది సుధాచంద్రిక అనే అమ్మాయి కూడాను. ఆమె కెంపెదవులపైన దరహాసచంద్రికలూ, ఆమెసుధారూపమూ సార్థకపరుస్తూఉంటాయని ఆమె న్నామాక్షరాలను. "తుమ్మెదరెక్కల దొంగిలించును కాంతు" లనుట కవిసమయమే కాని ఆమె దీర్ఘమైన నీలపుజడ వెన్నుమీద జీరాడుతూఉండడం చూచిన ప్రతివ్యక్తికీ ఆశో, నిరాశో, పిచ్చిదో, వెఱ్ఱిదో, ఏదో ఒక తియ్యనితలపు మనస్సులో చొరబడక మానదను కుంటాను. ఏమంటే వెనుకనుండి చూచిన కొంచెం పొడుగుజడగల దుకూలధారిణియను ప్రతివ్యక్తీ కొంచెం బాగుంటారంటాను. సదరు దుకూలధారిణుల ఎదుటి రూపం, వెనుకటిదానితో ప్రతీవ్యక్తియెడలా అను రూపంగా ఉండదనికూడా అంటాను. కాని చంద్రిక సౌందర్యపిపాసువుల నేత్రతృష్ణ ననంతముగా చేయ గలిగిన సర్వాంగలావణ్యవతి. కొందరు ఒకసారిచూచి తిరిగిచూస్తేగాని తీరదనిపిస్తారు. కొందరు ఒకసారి చూడడానికైనా ఎందుకనిపిస్తారు. కాని మాచంద్రిక ఒకసారిగాదు, వేసార్లు నిలబడిచూచినా తనివితీరని సోయగం గలదంటాను. మంచిరూపరేఖ గలవారికి మంద బుద్ధి నైజగుణము. కాని మాచంద్రిక ఎంతసురూపము కలదో అంతకుశాగ్రబుద్ధి. ఆమె మంచిని ప్రేమిస్తుం దనీ, సౌజన్యానికి దూరంకాదనీ, భద్రమతులను గౌర విస్తుందనీ,— ఆమె చుట్టూఉండే గాలిబాలికలు చెప్పు కుంటూ ఉండేవారు. కాని ఆమెలో కొంచెం కల గలుపుగావచ్చిన గుణం చిలిపితనం. అది స్త్రైణసహజ మేమో అనుకుంటాను. కొంచెంతూలుపాటుగల లెక్చ రర్లను, అడ్డుప్రశ్న వేసి, బోల్తా కొట్టించడమంటే ఆమెకు సరదా! నాకూ క్రొత్తలో యీసరదా మిక్కుటంగా ఉండేది. అందుకని ఎప్పుడైనా వృద్ధాధ్యాపకులను తిక మకపెట్టినప్పుడు నేను మనసులో ఆమెచమత్కృతికి మెచ్చుకుంటూ ఉండేవాడను.

ఒకనాడు—

"ఆల్ ఇండియా డిబేటింగ్ కాంపిటీషన్స్" కు మాకాలేజినుండికూడా విద్యార్థులను పంపుదా మను కొన్నారు. ఆపోటీలలో పాల్గొనదలుచుకొన్న మా కాలేజీలో విద్యార్థులెవరేనా ఉంటే వాళ్లనందరినీ వారిపేర్లివ్వమన్నారు. దాదాపు పదిమంది పేర్లిచ్చారు. నాస్నేహితులు కొందరు తమపేర్లతోబాటు నాపేరు కూడా కలిపిఇచ్చామని నాతో చెప్పారు. ఎందు కీశిక్ష. లనుకుని నాపేరిచ్చినందుకు నామిత్రులపైన విసు క్కున్నాను. పోటీలరోజు వచ్చింది. "స్త్రీ స్వాతం త్ర్యము వాంఛనీయమా, కాదా" అనువిషయాన్ని చర్చనీయాంశంక్రింద ఇచ్చారు. నామిత్రు లందరూ స్త్రీస్వాతంత్ర్యం వాంఛనీయమనే చెప్పారు. నేను కొంచెం చాదస్తులబిడ్డననవడంచేత, స్త్రీ స్వాతంత్ర్య మవాంఛనీయమని నాకుదోచినట్లూ, సభ్యులమదికెక్కు నట్లూ ౧౫ నిముసాలు మాట్లాడి విరమిం చాను. అధ్యక్షుల సన్నిధికి స్త్రీ సభ్యు ల్లోనుంచి ఒకచీటివచ్చింది. ఇప్పుడు చెప్పబడిన ఉపన్యాసాన్ని ఖండిస్తూ తాను మాట్లాడడానికి సెల వొసంగవలెనని అభ్యర్థిస్తూన్నట్టు ఒకవ్యక్తి పంపు కొన్న చీటీ అది. దానిని చదివి అధ్యక్షు డందరికూ వినిపించి పేర్లపట్టికలోలేని క్రొత్తవారు మాట్లా డుట కనుమతి నిచ్చెదరా అని సభ్యులను అడిగిరి. సభ్యులు, తమ అనుమతి సూచించగా చీటీపంపిన వారెవరో వచ్చి మాట్లాడవచ్చునని చెప్పి వారు ఆసీనులైనారు. స్త్రీసభామధ్యంనుండి అందరికూ విస్మయం కలిగేటట్టు చంద్రికే లేచి వచ్చింది. నేను చెప్పిన ప్రతివిషయాన్ని ఖండింపప్రయత్నిస్తూ, సభ్యు లందరినీ విశ్వసింపజేసే వాగ్ధాటితో ఆమె ఒకఅరగం టసేపు మాట్లాడింది. చెప్పినదానిలో సమర్థించదగిన అం శములున్నా లేకపోయినా మాట్లాడింది చంద్రికఅవడం



కృష్ణ షష్ఠి

(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీన చిత్రసంగ్రహమునుండి)

చేత అందఱూ సంతోషించారు. తుదకు అధ్యక్షులు నైమాయకుల అభిప్రాయం యీవిధంగా ఉన్నదని వెల్లడించారు:

“ఈరోజున మాటలాడినవా రందఱును, తమ తమ వైదుష్యమును వంచనలేకయే వెల్లడించిరి. ఒకరిని మించినవా రొకరువలె కన్పట్టుచున్నారేకాని సమర్థతా సమర్థతలు వివేచించుటకు ఒక్కరును తావొసగకున్నారు. కాని ఇరువురను తప్ప ఎంచిచూపుటకు మా కవకాశము లేనందున చివర మాట్లాడిన ఇరువురను అర్హులుగా నిర్ణయించుచున్నాను.”

మఱునాడే నన్నూ, చంద్రికనూ ఢిల్లీకి అఖిల భారత పరీక్షలకు పంపిరి. వెళ్లినది క్రొత్తప్రదేశమగుట చేతనూ, ఒకేబండిలో కలిసి ప్రయాణంచేయుటవలననూ, ఒకే కాలేజితరఫున వచ్చినవారమగుటచేతనూ, రాబోవు పరీక్షలనుగుఱించి మాటాడుటక్కై కొంత మాకు ప్రసంగింపక తప్పిందికాదు.

“ఏమండీ, చాలావిచిత్రంగా జరిగింది యీ సంఘటనం. ఏదో మీమాటలను ఎదుర్కోరావడమున్నూ, నేనిల్లా ఇందులో చిక్కుపడడమున్నూ తటిస్థించింది. ఢిల్లీకి వెళ్లాలిసివస్తుందని కల్లోనైనా అనుకోలేదు సుమండీ” అన్నది చంద్రిక.

నేను ఆమెతో ఎదురుబడి మాట్లాడడానికి కొంచెం సంకోచించీ పలకకపోతే బాగుండదనుకున్నాను.

“నేనున్నూ అనుకోలేదండీ! నే నీవిషయంలో అసలు జోక్యమే పెట్టుకోదలచుకోలేదు. ప్రసాదరావూ వాళ్లూ కలిసి నాపేరుకూడా ఇచ్చారట. వేదిక ఎక్కేవరకూ నాపేరు ఉపన్యాసక పట్టికలో ఉన్నదనే ఎఱుగను” అన్నాను.

“ఇంతమంది హేమాహేమీలుండగా ఎందుకని తొలిగి ఊరుకొన్న మననిమీదే పడింది యీ ప్రయాస. ఇదంతా లేనిపోని భేషజం సుమండీ! మనసులో ఒక మాట ఉంచుకొన్నా పాయింటుకోసం మనం వేఱుగా మాట్లాడకలసిఉంటుంది. హృదయంలో బయలుదేరని భావాలను, ఎంతవాగ్ధాటిగలవాడికైనా, ఎదుటివారికి కల్లబొల్లిమాటలు చెప్పి నమ్మించడం దుస్సాధ్యం! ఏమంటారు?” అన్నది. ప్రత్యుత్తరం అభ్యర్థించిన దానిలాగా చూస్తూ ఊరుకుంది.

“మీరు దేన్నిగుఱించి మాట్లాడుతున్నారో నాకు తెలియటంలేదు. కొంచెం వివరించి చెప్పితే తెలుసుకోడానికి ప్రయత్నిస్తాను.” అన్నాను వినయంగా.

“నాచేత చెప్పించడానికి అలా అన్నారుకాని మీకు తెలీకనా? అయినా ఒక్కసంగతి అడుగుతాను చెప్పండి. నిన్ననూ “నస్త్రీస్వాతంత్ర్యమర్హతి” అని అంతగట్టిగా మీరు వాదించినారుకదా! హృదయమునుండి ఊడిపడిన మాటలో, నాలుకతుదినుండి తెగిపడిన మాటలో కొంచెం సూక్ష్మదర్శికి ఎవరికేనా తెలీకపోదు. స్త్రీహృదయమని మీరు తూష్ణీంభావంతో చూచినా సరేగాని, నా అంతరంగంమాత్రం మీ రవి హృదయపూర్వకంగా అన్నమాటలని ఒప్పుకోవడంలేదు. అటుగాక “నీఅభిప్రాయం తప్పు. నే నవి మనఃపూర్వకంగా అన్నమాటలే” అని మీరు గట్టిగా చెప్పిన, మీయంతటి స్త్రీవిరోధిని ఎక్కడా చూడలేదని నేను తలచవలసివస్తుంది” అన్నది సుధ పరీక్షగా.

“మీచేత అలాగ తలచబడుట కెంతేని విచారిస్తున్నాను. స్త్రీలయెడ నాకెంతయూ గౌరవభావం కలదు. కాని స్త్రీలకు కావలసిన, ఉండవలసిన స్వాతంత్ర్యం వేఱు. లోకం కావలెనని ఘోషిస్తున్న విధం వేఱు. సాధారణంగా స్త్రీస్వాతంత్ర్యాన్ని గుఱించి మాట్లాడేటప్పుడు అందఱు ఒక్కవిషయాన్ని గుఱించి మఱచిపోతారు. స్వాతంత్ర్యమువలన లాభములు, లేకపోతే నష్టములు, దానివిలువ, స్త్రీవ్యక్తిఘనత, స్త్రీలయెడ చూపవలసిన గౌరవము, పురుషుని బాధ్యత, ఇటువంటి అనవసరపు విషయాలమీద గొంతుచించుకొని, బల్లలు పగలగొట్టి, చివరకు “ఎటువంటి స్వాతంత్ర్యము స్త్రీకి ఉండతగినది.” అనే విషయం విస్మరిస్తారు. గొంతుక బొంగురుపోవడంచేతనూ, అక్కడక్కడ

సభ్యులు ఉలికిపడి, ఎగిరిపడి, భయపడటంచేతనూ, అధ్యక్షుడికుర్చీ, ముందటిబల్లా రెండుమూడుసార్లు గజ గజలాడడంచేతనూ వాడిని మహోపన్యాసకుడంటారు. ఈవిషయాన్ని గురించే నేనునొక్కి చెప్పినాను. ఎటువంటి స్వాతంత్ర్యం స్త్రీకి ఉండతగినదో, దానినిగురించి నా వెల్లడించిన ఊహలు మీమనస్సునకు వ్యతిరిక్తములుగా దోచినచో, మీమనస్సు నొప్పించినందుకు చింతించు చున్నానని తెలుపుచూ, నాయభిప్రాయములే ప్రశ స్తములని వక్కాణించుటకునూ, మీరుకూడ వాని నామోదించిన బాగుండునేమో యని సూచించుటకునూ సాహసించుచున్నాను."

"మోహన్, అయితే ఒక్కమాట, స్త్రీ జీవి తంలో మనం ముఖ్యంగా ఆలోచించవలసిన సమస్య వివాహం. దానితోనే ఆమెజన్మ ధన్యమౌతుంది. దాని తోనే పరమేష్ఠియొక్క అనంతసృష్టిలో తానుకూడ భాగధేయ మయ్యే అర్హత ఆమెకు కలుగుతుంది. ఆ పరిణయకార్యమే ఆమెకు గౌరవం చేకూరుస్తుంది. లేక పోతే అది ఎప్పుడు 'అనాఘ్రాతపుష్పం' వలెనే ఉండి, నిష్ఫలమైన జీవితాన్ని వెళ్లబోసి చివరకి ఎండి తొడిమ ఊడి నేలపాలు గావలసినదే. అట్టి మహావిషయంలో, స్త్రీకిసంబంధించిన విషయంలోనే ఆమెకు స్వేచ్ఛ ఇవ్వకపోతే ఇంకా మీరు ఏవిధమైన స్వేచ్ఛ ఇస్తే ఆమె జన్మ తరిస్తుంది. నిన్నటిఉపన్యాసంలో అట్టిది కూడదనికదా మీరు చెప్పినారు." అన్నది సుధ చులుగ్గా.

"సుధా! అసలు తక్కువకేడంబర మెక్కువ అయిన ఆధునికులఉపన్యాసధోరణి నీకుకూడా బాగా అలవడ్డది. స్త్రీకి వివాహవిషయంలో స్వేచ్ఛఉండవలె ననే మాట తేల్పడానికి, వివాహాన్నిగురించిన ఆమైలు న్నర ఉపన్యాసమెందుకు? నీవడిగినమాటకు సమాధాన మప్పుడే చెప్పియున్నాను. అప్పు డర్థంకాకపోతే తిరిగి చెప్పడానికేమీ అభ్యంతరంలేదు, విను. అసలు భౌతిక సృష్టి అంతటిలోనూ బుద్ధిబలములోనైతేనేమి, కార్యో త్సాహంలోనైతేనేమి, విజ్ఞానవివేచనలోనైతేనేమి, జీవితరహస్యాలు విచారించడంలోనైతేనేమి, స్త్రీ ప్రకృతికన్న పురుషప్రకృతి పైస్థాన మాక్రమిస్తుందని అందరూ ఒప్పుకున్న సంగతి. అలాగన్నానని స్త్రీలలో మాత్రం కార్యశూరులు, మనీషిణులు, కవయిత్రులు లేరని చెప్పను. ధీబలము, కర్మవీరత్వము అన్నీ పురు షుల సొమ్మే అయితే స్త్రీలోకంలో వీళ్లెలా కలిగే రంటే ఒకటేసమాధానమిస్తాను. భూమిమీద పొడమిన ప్రతివ్యక్తికీ స్త్రీత్వము, పుంస్త్వము, రెండునూ ఉంట వని నేనంటాను. పురుషుడని తెలియబడ్డవానిలో కూడ స్త్రీత్వమున్నదనీ, స్త్రీయని తెలియబడ్డదానిలో కూడ పుంస్త్వమున్నదనీ నాభావము. అలాక్కాకపోతే స్త్రీ పురుషులకు సంబంధమే ఉండదని నాతలపు. కాని స్త్రీత్వము పురుషునిలో ఎంతఎక్కువయితే అంతగా వాడిపౌరుషము నశిస్తుంది కనుక అంతగా కర్మశూర త్వము, తెలివితేటలూ, అన్నీ వానిలో క్షీణిస్తవి. అలాగే స్త్రీలోకూడ పుంస్త్వ మెంతఎక్కువయితే అంత స్త్రీసహజమైన దౌర్బల్యలౌల్యచాంచల్యాలు నశి స్తవి. కనుక, పౌరుషవతులైన ఝాన్సీలు, మీరాలు, మొల్లలు మొదలైనవా రుద్భవించారు.

స్త్రీ వివాహవిషయం ఆమెకే వదలివేయడం అసమంజసమూ, హానికరమూను. పద్ధెనిమిదేండ్లకు ఆమె లోకజ్ఞానమంతే సమార్జించియుండదు. కేవలం వయో విలాసోద్రిక్తభావాలతో పొర్లుతూన్న మనస్సు కలిగిఉంటుంది అలాంటప్పుడు ఆమెమనస్సుకు యుక్తా యుక్తవివేచన ఉండదు. ఆమెమనస్సెప్పుడూ మిళిందా గమనం నిరీక్షిస్తున్న ప్రఫుల్లప్రసవంలాగ వయః తృష్ణతో, సుఖసమాసక్తి కాంక్షిస్తూ ఉంటుంది. అటు వంటిసమయంలో ఆమెమనస్సు బహిరాడంబరములచే మోసగింపబడుటకు ఎంతైనా అవకాశం ఉంటుంది. కనుక కావలసినంత లోకజ్ఞాన మదివరకే తమతమ జీవిత పుటోలములలో సంగ్రహించుకొని, ప్రపంచకములోని బాగోగులు చక్కగా గుర్తెరిగిన తలిదండ్రులే ఆవిష యాన్ని బాగా ఆలోచించేస్థితిలో ఉంటారు. ఒకవేళ తండ్రి ధనతృష్ణకలిగి కారానిపని చేయజూచినను, ఆమెను పుట్టించిన స్త్రీప్రకృతికి ప్రతినిధియైన తల్లి

అట్లు చేయనీయదు. కనుక యౌవనోద్రిక్తభావములకగ్గమగు మనస్సునకంటికింపుగా కనబడిన ఎవరో బయటి బటారపుబయకారిపాలై ఆమె బాములుపడుటకంటె, యుక్తాయుక్తవిచక్షణ కలిగిన తలిదండ్రు లెన్ని చేసిన మగవానితోడనే ఆమె సుఖపడగలదని నా విశ్వాసము. అందువలన వివాహవిషయమైన స్వేచ్ఛ ఆడుదాని కీయదగదని చెప్పితిని" అన్నాను.

"పైపైమాట లెన్ని చెప్పినా, మోహన్, ప్రధాన విషయందగ్గఱ కొచ్చేసరికి అందఱూ పట్టీలుకొడ్తారు. మీ రిన్ని మాటలు చెప్పినారుకదా, నేనొక్కటే విషయమడుగుతాను, జంకక కొంకక సమాధాన మివ్వండి. ఇప్పుడు నేనే ఉన్నాను. నా బాగోగులను గుఱించి, నా భవిష్యత్తును గుఱించిన సాధకబాధకాలను గుఱించి నేను పూర్ణముగా ఎఱిగిఉన్నాను. నా మనస్సులో ఒక ప్రేమమూర్తిని నెలకొలుపుకొని ఉన్నాను. అతన్ని బలవంతంగా ఊడబెఱికి పాఱవేద్దామన్నా నాకు సాధ్యం కాదు. ఇంకొకనిపైకి నా మనస్సుపోదు. అతన్ని చూడని నిముషం నాకు జీవితంలో హాలాహలబిందువై విషాశ్రులను రగులుస్తుంది. అతని వదనజ్యోతి చూడక నా జీవితం గాఢాంధకారబంధురమై పోతుంది. నేను కాళరాత్రికన్నా, ధ్వాంతరేఖకన్నా, ఘూకరవంకన్నా ఉదాసీన వ్యక్తినౌతాను. అలాంటి నా హృదయనిక్షేపాన్ని, నా ప్రణయమూర్తిని కాదని, క్రూరంగా మా తలిదండ్రు లెవరినో నాకంటగడతా రనుకోండి. ఎందుకొఱకై యీ నా స్త్రీజీవిత ముద్దేశింపబడిందో ఆ భగవదాశయం నెఱవేఱిం దంటారా?"

అని రెండుచేతుల్లో తన ప్రేమమయవదనాన్ని నిక్షేపించుకొని నావంక నిలువునా చూస్తూ ఊరుకుంది సుధ. నాకామె నేత్రాలల్లో నుండి ఆమె హృదయమునందేమో విచిత్ర భావాలు తరంగితమౌతున్నట్లూ, అవి నా ఆమోదాన్ని అభ్యర్థిస్తున్నట్లూ, నేను కాదన్నక్షణాన ఆమె హృదయంలో ఒక ఝంఝామారుతం రేగునన్నట్లూ స్ఫుటమైన వ్రాతలు కనబడ్డవి.

నాకు నిజంగా వాగ్బంధనమైంది. సాధారణంగా మాట్లాడినంతసేపూ స్త్రీపురుషబాంధవ్యాన్ని గుఱించిన సంభాషణ ఒక స్త్రీతో ఒక పురుషుడు చేయతగి ఉంటుంది కాని ఎప్పుడు చర్చ వ్యక్తినిర్దిష్టమౌతుందో అప్పుడు కొంచెం అజాగ్రత్తగా తూలిపడిన ప్రతిముక్కా విపరీతావస్థలు తెస్తుంది. అందుకని నేను ఆవిషయం సాధ్యమైనంత త్వరలో ముగింపదలచి "ఔను" అన్నాను.

తఱవాత చెప్పదగిన మాటామంతులుకానీ, వింతలుకానీ లేకనే ఢిల్లీ చేరినాము. పరీక్షల్లో చాలామంది పాల్గొన్నారు. కాని భగవదనుగ్రహమునా, అదృష్టవశమునా మాకాలేజీమర్యాద నిలుపగలిగినాం. మేమే విజయులమైనాం. వెంటనే ప్రిన్సిపాలుగారికి మేము గెలిచినట్లూ, మర్నాడు బయల్దేరి వస్తున్నట్లూ టెలిగ్రామిచ్చాము. ఉత్తరదేశాల్లో ఆంధ్రులంటే కొంచెం గౌరవిస్తారు. మేము మాట్లాడినతీరు వాళ్లకు నచ్చినట్లుంది. అందువలన మమ్మెంతో పెద్దగా గొప్పజేసి బ్యాండులతోనూ, విజయధ్వనులతోనూ ఊరేగించినారు. ఊరేగింపులో నేనూ సుధా ఒక కారులోనే, ఒక సీటులోనే కూర్చోవలసివచ్చింది. నిజానికి మనసువిడిచి చెబుతున్నాను; ఏమన్నా అనుకోండి, మీరు తర్వాత. సుధను ఆనుకొని ఆమె ప్రక్కనే కూర్చునేసరికి ఒడలు గగుర్పొడిచింది. ఆమె సంగతి నేను చెప్పలేను. ఊరేగింపు ఐనదాక నాకు మనసులో మనసు లేదు. సుధా హృదయంలో ఏమిగా నా రూపం చిత్రింపబడుతున్నదో అని అంతరంగం ఊరికే ఉబలాటపడుతూ ఉంది. ఊరేగింపు అయినది. సాయంకాలమైనది. మఱునాటి ప్రొద్దుటివరకు బండి లేదు. అందువలన ఒక సత్రంలోనికి పోయి ఒక గదిలో మా సామానులన్నీ పడవేయించుకొని ఆరాత్రి అక్కడ గడపడానికి నిశ్చయించుకొన్నాం.

నా హృదయస్థితి నాకే అగమ్యగోచరంగా ఉంది. ఇంతకన్నా విప్పిచెప్పే సమర్థత నాకు లేదు. ఏలనంటే తన్నుగానీ, తానుగానీ ఎఱుగని పరాయిచోట పరయువతితో, ఒక్కగదిలో దైవ ఘట్టున నన్ను తారసిల్ల చేసిన విచిత్రానికే నా మనసు చాలా నిర్ఘాంతపోయింది.

హోటలునుంచి తిరిగిరాగానే ఇరువురమూ ఎడమెడముగా ప్రక్కలు పఱచుకొన్నాము. ప్రొద్దున కారులో సుధామయమైన సుధాశరీరస్పర్శమైనకడనుంచి నాకు పిచ్చియెత్తినట్లున్నది. ఆమె మొగమును కన్నెత్తి చూచి ఇదివరకువలె స్వేచ్ఛగా సంభాషించుటకైన నాకు ధైర్యం చాలటంలేదు. ఏదోతప్పుచేసినదానివలె ఊరికే అంతరంగం కొట్టుకుంటూంది. అందుకని ఆమెతో ఆగదిలో ఆరాత్రి ఒంటరిగా ఉంటే నా మనస్సు బాధపడుతుందనుకొని ఏలాగైన మనస్సుకు వేఱొకవ్యావృత్తి కల్పిద్దామనుకొని

"సుధా! నేను సినీమాకు వెళ్తున్నాను" అన్నాను.

సుధ తన నవ్వుమొగమును అట్టె పైకెత్తి వాడిగా చూస్తూ,

"నన్నొంటరిగా విడిచేనా? మోహన్! ఇదే మీజాతిలోనూ, మాజాతిలోనూ ఉన్న తారతమ్యం. అనురాగాంకురాలలముకొన్న వంటే స్త్రీ హృదయం తన ప్రేమను గెలిచినవాడికి తనసౌఖ్యం, తనజీవితం, తనసర్వస్వమూ ధారవోయడానికి వెనుకాడదు. అతనికి సుఖం సమకూర్చడానికి ఆత్మార్పణం చేయడానికైనా ఏమీ జంకదు. కాని మగజాతి కానీతి లేదు. కండ్లముందరఉన్నంతసేపే ఏసరదాఐనా పడుతుందిపురుషహృదయం. చూపుదాటినతరువాత దానిదారి అదీ, దీనిదారి ఇది."

అని కొంచెంసేపు ఊరుకుంది ఎగాదిగా నావంక చూస్తూ సుధ. ఆమెకన్నుల్లో నీలినీడలు నాహృదయం మీదికి ప్రాకుకుంటూ వచ్చాయి. నేను సినీమాకు వెళ్లే ప్రయత్నం విరమించుకొని నాప్రక్కమీద కూలపడ్డాను. మాయిర్వురి నడుమ లాంతరు పెద్దగా వెలుగుతూఉంది. కిటికీలోనుండి చల్లని పిల్లగాలులు లోపలికి పారాడుతున్నాయి. ఆకాశంలోనుంచి కోమల మరీచికలను కిటికీనుండి జాబిల్లిబుడుత పారబోస్తున్నాడు. పాలసముద్రంలో తేల్తున్న ఎఱ్ఱతామరపువ్వులాగ, తెల్లని దుప్పటి పఱచిన పఱుపుమీద, గులాబీరంగుసిల్కుచీర ధరించి సుధాచంద్రిక పరున్నది. జాబిల్లికిరణాలు ఆమె పైడిబుగ్గలగుంటల్లో పడి పొర్లిగింతలు పెడుతూ, కాంతులతో వాటిని నిండిస్తున్నాయి. ఆమెఉన్నతవక్షం లాలనను ఆశిస్తున్నది. ఆమెసురూపానికి చిలుకప్రక్క గోర్వంకలాగా ఇంకోటి ఏదైనా ఉంటే బాగుంటుందనిపించింది నాకు.

* * * * *

పనికట్టుకుని మళ్లీ ఇంతదూరం డబ్బుఖర్చుపెట్టుకుని ఎలాగూ రాముగనుక వెళ్లేటప్పుడే బొంబాయిమీదుగా వెళ్లి ఆమహానగరంకూడా చూచిపోదామనుకున్నాము. సుధప్రసన్నవదనం చూస్తూనే బొంబాయి చేరినాము. ఆనగరములోని వింతలు, విశేషాలూ ఇద్దఱం కలిసి చూచి ఆనందించాము. బొంబాయిలోఉన్న సాయంకాలం సముద్రతీరానికి షికారుకు వెళ్లేము. అక్కడ ఇసుకతిన్నెలమీద నడుస్తూ సుధ తన ముద్దుపాదాలతో ఇసుకరేణువుల్ని ఎగరదంతూ విలాసంగా మబ్బుతునకలాగ నడుస్తూవుంటే, ఆమెచేయి పట్టుకొని నేనూ, నాచేయి పట్టుకొని సుధా పరస్పరం హాయిగా పల్టీలుకొడుతూ ఉన్న జలపక్షుల్ని చూస్తూ విహరిస్తున్నాము. చిన్నచిన్న డింగీలు తీరాన్నే కెరటాలమీద కేకిసలుకొడుతూ ఉన్నాయి.

ఒక్కసారి అలాషికారుగా సముద్రంమీద తిరిగివద్దామంది సుధ. నాకున్నూ బోటుషికారంటే రసదాయే. బోటు నడపడం పట్నంలో ఉండగా అప్పుడప్పుడభ్యసిస్తూ ఉండేవాణ్ణి. సరేనని ఒకచిన్నడింగీని నీటిలోపలికి తోసి ఇద్దఱమూ ఎక్కాం. శుక్లపక్షపు చంద్రుడు ఆకాశమెక్కి చూస్తున్నాడు. సముద్రపు నీటిమీదినుండి చల్లని తుంపురలతో గూడిన పైరగాలి వస్తూఉంది. కెరటాలు సాగరగర్భంలోనుండి బయులుదేరి పడవను తూగుటుయ్యాలమాదిరిగా ఊగిస్తూ సరిగా ఊగకపోతే దాన్ని చిన్నచిన్న చపేటాలుకూడా కొడుతూఉన్నాయి. పడవ రంయిమని వడికి బడి కొట్టుకొనిపోతూఉంది. చుక్కాని గట్టిగా పట్టుకొని కూర్చున్నాను. ఎదురుగా బల్లమీద సుధ నావంకా, చంద్రుడి

వంకా, కెరటాలవంకా చూస్తూ కూర్చుని నన్నొకపాట పాడమన్నది. నేను

“ఆపలేనేయెంకి ఈపడవయిసురూ,
పాడలేనే యెంకి ఈగాలిరొదలో”

అని యెత్తుకున్నాను. సుధ సావధానంగా విని నెమ్మదిగా లేచింది. చేతులెత్తి వళ్లువిరుచుకొని వచ్చి నా ప్రక్కనే కూర్చున్నది. నేను జరిగి ఆమెకు చోటిచ్చాను.

“మోహన్! చాలా చలిగాఉన్నదోయ్; అబ్బా” అని మళ్లీ సుధ వళ్లు విరుచుకొన్నది. ఆమె ఉన్నతవక్షం, ఆమె ముద్దుమొగం, ఆమె వయ్యారం నామతిపోగొట్టింది. ఆమెకండ్లవంక చూచాను. ఆచూపుల్లో చెప్పరాని ఆవేగం, మీదపడదామన్నంత ఉద్రేకం నాకు గోచరించింది. నన్ను నేను మరచిపోయినాను. అంతలో వేగంతో పోతూఉన్నపడవ అంచుమీదనుండి ఆమె సముద్రపునీళ్లను అందుకొనటానికేమో అన్నట్లు వంగింది. మఱునిముసంలో హఠాత్తుగా “మోహన్! అయ్యో” అని వినిపించింది. చుక్కానివిడిచి ఒక్కగంతువేసి ఆప్రేమమూర్తిని చేతుల్లో పట్టుకొన్నాను. భయపడిందికాబోలు సుధ, కాస్సేపు సొమ్మసిల్లి నాతొడమీద పడుకుంది. ఆమెముఖంవంకి నే తేరిపార ఆసతో చూస్తూ నిగ్గుటద్దాలవంటి ఆమెచెక్కలు దువ్వుతూ కొంచెం దగ్గఱకు చేర్చేసరికి ఆమెకు తెలివివచ్చింది. చప్పున లేచి “మోహన్, మీ ఉపకారానికి కృతజ్ఞను. పడిపోవాల్సిందే సుమా. మీవల్ల బ్రతికాను. చాలా ప్రొద్దయింది. పడవత్రిప్పండి” అంది. పడసంగతేమఱచిపోయినాను నేను. చూస్తినిగదా, మహాప్రమాదావస్థలో పడ్డాము. మాగొడవలో చుక్కాని పట్టు తప్పి పడవ సముద్రపుప్రవాహపు టురవడిలో బడి ఎక్కడికో కొట్టుకొనిపోతున్నది. ఎటుచూచినా చేరెడునేలైనా కనపడదు. గొంతుదించుకొని అఱచినా మార్మ్రోతకూడా పుట్టని నీటిబయలు. ఎంతగా ప్రయత్నించినా చుక్కాని నిలవడంలేదు; గాలిరేగింది. తరంగాలు దొంగడలైనవి, ఏమూలనుంచో ఒకచిన్న మేఘం బయలుదేరి జాబిల్లినీ, ఆకాశాన్నీ మింగేసింది. అంతా అంధకారం. అంతకంతకు భోరుమంటూ కెరటాలు చెలరేగి మాచిన్నపడవను తలక్రిందులు చేస్తున్నాయి. ఒక్కొక్క కెరటం విఱిగి పడవలోకి కూడా వచ్చిపడుతూన్నది. సుధకు బయటి తుపానుకంటె వేయిరెట్లుగా మనసులో తుపాను రేగిందికాబోలు. ఒక్కసారి హఠాత్తుగా

“మోహన్”

అని వచ్చి గట్టిగా నన్ను కౌగలించుకొన్నది. తుపాను అంతకంతకు ఎక్కువైంది. మేము జీవితాలమీద ఆశవదలుకొన్నాం, ఒకరినొకరుగట్టిగా కౌగిలించుకున్నాం. విఱిగి మామీదపడి కూడా కెరటాలు మాయిద్దఱిదేహాలు ఒత్తుకుని ఉన్న భాగాన్నిమాత్రం తడపలేకపోతున్నాయి. చివరకు హోరుమని ఒకేపెద్దశబ్దతో ఒకగాలి తాకు, భోరుమని ఒకపెద్దకెరటపు పెల్లవిఱుపు.

“సుధా” “మోహన్” “సుధా” “మోహన్” “సుధా”

*　　*　　*　　*　　*

“సుధా” అని గట్టిగా అరుస్తూ లేచి కూర్చున్నాను. నాకేకకు ఉలికిపడి సుధకూడా లేచి కూర్చుంది.

“సుధా” చాలా విచిత్రమైన కలవచ్చింది. నేను పట్నం వెళ్లినట్లు, నీవు ఇంకా ఇక్కడే ఉన్నట్లూ, మీవాళ్లు నిన్నుగుఱించి నన్నడిగినట్లూ, నేను వాళ్లతో “మీసుధ విమానంమీద వస్తుందని చెప్పినట్లూ వాళ్లు నమ్మనట్లూ, అయితే “ఇదుగో; పిలుస్తా చూడం”డని, నేను గట్టిగానిన్ను పిలిచినట్లూ—ఇదీ విషయం—లైమెంతైంది.”

సుధ రిస్టువాచి చూచింది. బండి కింకా గంటే టైముంది. లేచి త్వరగా కాల్యాలు తీర్చుకొని కాఫీ త్రాగి ఢిల్లీస్టేషను చేరుకున్నాము.　　　(సశేషము)

# మాయమనుషులు

హనుమ దింద్రకంటి

*

రంగురంగుల ఇంద్రచాపం
రాణివాసం విడనివాడికి
రత్నమంటూ పేరుచెప్పి
రాయి వేస్తారా?

ఏటిమళుపుల రెల్లుపువ్వుల
ఇల్లుకట్టిన ప్రేమయోగిని
పట్నవాసం దుమ్ములోనూ
బతక మంటారా?

రంభఒడిలో ఇంద్రుమెడలో
రాగరస మొలికించి నవ్వే
కొత్త హరిచందనపు పువ్వుల
కొల్లగొడతారా?

దేవదేవుని అమృతహస్తము
తీర్చిదిద్దిన పాలపిట్టను
మచ్చువెట్టి మాయచేసి
మంటి కేడ్చారా?

కర్మవశమున స్వర్గలోకపు
గాలివానకు జారిపడిన
కవికుమారుని కలంమీదా
కుట్ర చేస్తారా?

'వెన్నెలకుప్పలు'

---

నవ్వుతాలు లేని చిత్రమును వ్రాయమనగా మా హాస్యచిత్రకారు డీచిత్రమును వ్రాసెను



# భట్టికావ్యకర్త యెవరు?

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

(సంస్కృతవాఙ్మయచరిత్ర ద్వితీయభాగములోనిది)

పతంజలిమహాభాష్యవ్యాఖ్య లగు త్రిపదీ దీపికలును, వాక్యపదీయమును, సుభాషితత్రిశతియు, భట్టికావ్యమును రచియించిన యతఁడు భర్తృహరి యని విద్వల్లోకసంప్రదాయము. ఇందు భట్టికావ్యమే భట్టియను కవిదేకాని భర్తృహరిది కాదని కతిపయవిమర్శకమతము. వాక్యపదీయాదికర్త యగు భర్తృహరికంటె సుభాషితత్రిశతీకర్తయైన భర్తృహరి వేఱని యేకదేశిమతము.

భాష్యవ్యాఖ్య లిపుడు కనరావు గాని, కనవచ్చెడి వాక్యపదీయాదులందు గ్రంథకర్తృవిషయమేమియు లేదు. ఈగ్రంథములఁ గనవచ్చెడి గ్రంథాంతగద్యలు లేఖకులును, వ్యాఖ్యాతలును జేర్చినవి కాని గ్రంథకర్తవి కావని వానివైవిధ్యమే చెప్పుచున్నది. అయినను, వారు తమనాఁటి సంప్రదాయమును బట్టియే యట్లు గద్యలు వ్రాసియుందు రని యంగీకరింపవలసియున్నదిగాని, గ్రంథకాలమునకును, వ్యాఖ్యాకాలమునకును అంతరము మిక్కిలిహెచ్చుటచే నందు కొంత కింవదంతి చేరకపో దనిమాత్రము విశ్వసింపవలసియున్నది. ఇందు కితనిఁగూర్చి లోకమున విస్తరించిన పుక్కిటిపురాణగాథలే నిదర్శనము.

భర్తృహరిని భట్టివిక్రమార్కులతోఁ జేర్చియు, విక్రమార్కునిసోదరుని గావించియు, ఒకానొకదేశమునకు రాజుఁగావించియు, భార్యాదుశ్శీలము కారణముగా సంసారవిరక్తుని జేసియు, ఏవో కథలు వ్యాపించుట మన మెఱుఁగుదుము. అందు తన చెవిని బడిన యొకకథ నమ్మియే సుభాషితత్రిశతికి వ్యాఖ్య నిర్మించిన ఆవంచ రామచంద్రపండితుఁడు, 'విప్రేణాభూతపూర్వ' మనుచు, ఒకబ్రాహ్మణుఁ డిచ్చినపండు తిని భర్తృహరి సంసారవిరక్తుఁ డయ్యె నని వర్ణించియున్నాఁడు. కథ లిట్లుండ వ్యాఖ్యాతలును, మూలలేఖకులును వ్రాసిన వీక్రిందివిధముగా నున్నవి:

౧. త్రిపదీ దీపికావ్యాఖ్యలు హరినిర్మితము లని కైయటుఁడు.

౨. వాక్యపదీయము హరిప్రణీత మని వ్యాఖ్యాత హేలరాజు.

3. 'గురవే భర్తృహరయే శబ్దబ్రహ్మవిదే నమః' వాక్యపదీయ టీకాంతమున పుణ్యరాజు.

౪. 'శ్రీభర్తృహరియోగీంద్ర విరచిత సుభాషితత్రిశతీ సంపూర్ణా' అని యొక లేఖకుఁడు.

౫. 'ఇ త్యాచార్య భర్తృహరి ప్రణీతం పురుషార్థదశకం సంపూర్ణమ్' అని యింకొకఁడు.

౬. 'వ్యాఖ్యానే భట్టికావ్యస్య శ్రీధరీయే మనోహారే' అని శ్రీధరపండితుఁడు.

౭. 'శ్రీమద్గోవింద దీక్షితసూను విక్రమార్కావరజ భట్టిమహాకవి విరచితే' అని యొకలేఖకుఁడు.

౮. "భట్టిటీకాం ప్రకురుతే భరతో ముగ్ధబోధినీమ్" 'భర్తృహరి ర్నామ కవిః శ్రీరామకథాశ్రయం కావ్యం చకార' 'ముగ్ధబోధిన్యాం, భట్టిటీకాయామ్' అని భరతపండితుఁడు.

౯. 'ఇతి భర్తృకావ్యటీకాయాం జయమంగళాయామ్' అని యొకవ్రాఁతప్రతి.

౧౦. 'వలభీవాస్తవ్యస్య శ్రీస్వామిసూనో ర్భట్టిమహాబ్రాహ్మణస్య మహావైయాకరణస్య కృతౌ భట్టికావ్యే' అని యింకొక జయమంగళతోడి వ్రాఁతప్రతి.

౧౧"...కృతసమ్భారవిధిః పతిః ప్రజానామ్ ౩౧." ఇతి భట్టికావ్యే ఆదితః ద్వావింశస్సర్గః. అని యింకొకప్రతి.

౧౨. "శ్రీస్వామిసూనుః కవి ర్భట్టినామా రామకథాశ్రయం కావ్యం చకార" అనియు, కడపట, పైని ౧౧ వ ప్రతిచూపిన ౩౧ వ శ్లోకముతరువాత నాలుగు శ్లోకములును, వానికి వ్యాఖ్యానమును జయమంగళ వ్యాఖ్యతోడి ముద్రితపుస్తకము చూపుచున్నది. అందలి భ్రాంతిహేతువులయిన కడపటి రెండుశ్లోకములు.

"వ్యాఖ్యాగమ్య మిదం కావ్య
ముత్సవ స్సుధియా మలమ్,
హతా దుర్మేధస శ్చాస్మిన్
విద్వత్ప్రియతయా మయా."

"కావ్య మిదం విహితం మయా వలభ్యాం,
శ్రీధరసేన నరేంద్రపాలితాయామ్,
కీర్తిరతో భవతా న్నృపస్య తస్య
ప్రేమకరః క్షితిపో యతః ప్రజానామ్."

దీనిటీకలో శ్రీధరసూనునా నరేంద్ర నామ్నా... అతఏవ కావ్యవిధానాయ యా కీర్తిః సా తస్యైవ రాజ్ఞో భవతాత్.

ఇందు మొదటి రెంటిలోని 'హరి' భర్తృహరి యని మూఁడవది స్పష్టపఱచుచున్నది. మూఁడవసంఖ్య చెప్పిన శబ్దబ్రహ్మవేత్తయు, నాల్గవది చెప్పిన యోగవేత్తయు, అయిదవది చెప్పిన యాచార్యుఁడును భర్తృహరి యని విశ్వసింపవచ్చును. ఆఱు, పది, పదునొకండుసంఖ్యలు భట్టికావ్య మన్నదానినే తొమ్మిదవది భర్తృకావ్య మన్నది. పన్నెండవసంఖ్య చూపిన కడపటిశ్లోకములితరపుస్తకములం దెందును లేవు. జయమంగళా వ్యాఖ్యతోడి పుస్తకములలోనైనను బెక్కింటనున్నవి కొన్నిట లేవు. ఈశ్లోకములను బట్టి భట్టికావ్యకర్త భర్తృహరి కాఁడని యాధునికు లనుచున్నారు. అంతే

కాని, యివి భట్టికావ్యమూలకర్తవా, జయమంగళునివా అని యాలోచింపలేదు. శ్రీధరసేన — శ్రీధరసూను — శ్రీస్వామిసూను అనుపాఠభేదములగతి యాలోచింపలేదు. ఈవిషయములు పరీక్షించిన యెడ నిజము తేలునుగదా!

కవి యెవఁడైనను, మొదటిశ్లోకములో నున్నట్లు "నాపుస్తకము వ్యాఖ్యానములేక తెలియరాదు. దీనిని గొప్పపండితులు చదివి సంతోషించినఁ జాలును. శాస్త్రజ్ఞానము లేని దుర్మేధసుల నిందఁణఁచివైచితిని" అనుభావము వెల్లడించునా? తాను రచియించిన కావ్యము నీవిధముగాఁ బ్రశంసించినకవి యెవ్వడైన నుండునా? ఆహా! ఏమి యాశయము! కావున నిది మూలకర్తది కాదనుట కేదైన నాధార మున్నదేమో చూతము.

భామహుఁడు తనకావ్యాలంకార ద్వితీయపరిచ్ఛేదమున కావ్యప్రసంగము కావించుచు నానాధాత్వర్థగంభీరయు, యమకవ్యపదేశినియు నగు ప్రహేళిక సుఖబోధ్యము కాదనుతలంపుతో, ఇట్టి కావ్యములుకూడ శాస్త్రములవలె వ్యాఖ్యాగమ్యము లైతే, పనివల్ల మంచివిద్వాంసులు సంతోషింతురు గాని ప్రజ్ఞచాలనివా రణఁగిపోవుదురుగదా! అనుభావము వెల్లడించుచు

"కావ్యాన్యపి యదీమాని
వ్యాఖ్యాగమ్యాని శాస్త్రవత్,
ఉత్సవ స్సుధియాం మేవ
హన్త దుర్మేధసో హతాః."

అనుశ్లోకము చెప్పెను. ఈశ్లోకార్థ మన్నివిధముల భట్టికావ్యమునకు సరిపడుట చూచి, జయమంగళుఁడు తా నట్టి కావ్యమునకు వ్యాఖ్యవ్రాసి వన్నెతెచ్చితి నన్నయుత్కర్ష ప్రకటించుకొనుటకై ఈయర్థమే, ఈమాటలే వచ్చునట్లు వ్యాఖ్యాగమ్య మిత్యాదిశ్లోకము కల్పించెనని విస్పష్టముగా గోచరించుచుండ నిది మూలకర్తది కాదు, వ్యాఖ్యాతదే యనుటకు సందేహ మేమి? ఈభామహశ్లోకము చూడకపోవుటచే విమర్శకులు 'వ్యాఖ్యాగమ్య' మిత్యాదిశ్లోకము మూలకర్తదని భ్రాంతిపడియుందురు.

ఇఁక రెండవశ్లోకము. మూలమునుబట్టి శ్రీధరసేనుఁడు పాలించు — వ్యాఖ్యనుబట్టి శ్రీధరపుత్రుఁడైన నరేంద్రుఁడనురాజు పాలించు—వలభీపురమున నేనీకావ్యము రచియించితిని. అందుచే దీనికీర్తి యారాజున కగుఁగాక — అనుభావము తెలుపుచున్నది. వ్యాఖ్యానమునుబట్టి మూలములోనిది 'శ్రీధరసూను' పాఠమే యని నమ్మవలెను. దానిని బట్టి విమర్శకు లూహించు శ్రీధరసేనులు రారు, నరేంద్రరాజు వచ్చును. వలభీశాసనములలో నరేంద్రసంజ్ఞకలరాజు కనరాఁడు. పోనీ! శ్రీధరుఁడే శ్రీధరసేనుఁ డందమన్నను, అతఁడు నరేంద్రరాజు కాఁజాలఁడు. పోనీ! నరేంద్రరాజు గూడ వలభీరాజవంశములో

నుండియుండునని యంగీకరింతమన్న, వారు చెప్పిన క్రీ. ౫౦౦ — ౬౫౦ నడుమ నతఁడు లేకపోవుటచే నతని కంకితముగా భట్టికావ్య మాకాలమునఁ బుట్టుట పొసఁగదు. ఇంక—

'నరేంద్రరాజున కీకావ్యరచన కీర్తి యగుఁగాక' యనెడిభావము విమర్శింతము. అతనికి యశ స్సెట్లువచ్చును? గ్రంథమున కతనిపేరు పెట్టుటచేతనో, అవతారికలో నతనిచరితము వర్ణించుటచేతనో ఇవి రెండును గనఁబడవు. కవి భట్టి, కావ్యము భట్టికావ్యము. ఇఁక నరేంద్రునిపే రేది? 'కీర్తి రతో భవతా న్నృపస్య తస్య' అనుపాద మింకెట్లు సార్థకమగును? ఆకీర్తి రావలెనన్న నిది నరేంద్రకావ్యము కావలెనుగాని భట్టికావ్యము కాఁగూడదు. అందుచే భావమును బొసఁగకున్నది. కావున ముద్రితభట్టికావ్యమునఁ గనవచ్చు కడపటినాలుగుశ్లోకములును మూలకారునివి కావనియు, వ్యాఖ్యాతయైన జయమంగళుని వనియు స్పష్టమగుచున్నది. ఆనాల్గింటిలో మొదటిమూఁడింటిని, తన వ్యాఖ్యానమహిమ ప్రకటించుకొనుటకును, కడపటి శ్లోకమును దానేదో విన్న చరిత్రాంశము చేర్చుటకును మిక్కిలి యర్వాచీనుఁడైన జయమంగళుఁడు కల్పించె ననుట సాహసము కాఁజాలదు. వెనుకటి ౮—౧౨ సంఖ్యలు చూపిన గ్రంథారంభవచనములు పోలియుండుట చూడఁగా, ముగ్ధబోధినీవ్యాఖ్యనుజూచియే జయమంగళ పుట్టిన దని తెలియుచున్నది. దీనిని జూచియే యది పుట్టినచో, ఈశ్లోకములు దానిలోఁ గూడఁ దప్పకయుండును. ముగ్ధబోధిని క్రీ. ౧౮౭౮ లోనిది. శ్లోకములు కల్పించిన జయమంగళ దానితరువాతి దగుట తప్పదు.

అయితే మఱి భట్టికావ్యకర్త యెవరు? భట్టియే. భర్తృభట్టిశబ్దముల సంబంధమును జయమంగళుఁ డాలోచింపలేదు. అతనినిబట్టి విమర్శకులు పరిశీలింపలేదు. భర్తృహరియే భట్టి యని మన మిపుడు గ్రహింపఁగలము. కాత్యాయనకృతి కాతీయమైనట్లు, కుమారిలభట్టమతము భట్టమతమైనట్లు, భర్తృహరికావ్యము భర్తృకావ్య మైనది. నిజముగా నీవాడుక యున్నదనుటకు ముగ్ధబోధినిమాటలే ప్రమాణము. పైవాడుకయే నిజము కాకపోతే, ముగ్ధబోధిని భర్తృహరి కవి యని చెప్పి, కావ్యము భట్టికావ్య మనునా? తొమ్మిదవసంఖ్య గల పుస్తకము స్పష్టముగా 'భర్తృకావ్యటీకాయా' మన్నది. నామైకదేశన్యాయమునుబట్టి కైయటాదులు హరి యన్నట్లే, ఆకాలమున భర్తృహరికావ్యము భర్తృకావ్యమని పాఠకులు వ్యవహరించుచు వచ్చిరనుట విదితము. దీని మొదటిపేరు రావణవధ. జయమంగళ వ్యాఖ్యలో 'భట్టిమహాబ్రాహ్మణస్య కృతౌ రావణవధే' యను మాట లున్నవి. ఆకాలమునఁ బ్రాకృత మెక్కువగా లోకమున వాడుకలో నుండుటచే భర్తృకావ్యములోని భర్తృశబ్దము 'భట్టి'గా మాఱినది. దానినిబట్టి భట్టికావ్య మనెడి వ్యవహారము క్రమముగా స్థిరపడినది.

ఇది నిజమైన భట్టికావ్యసంజ్ఞాస్వరూపము. ఇఁక—

'భర్తృ'శబ్దము భట్టియగుటకుఁ బ్రాకృతవ్యాకరణములే కాదు, పూర్వప్రయోగములును బ్రమాణము లగుచున్నవి. భర్తృదారకః= భట్టిదారఓ, భర్తుః=భట్టిణో, ఇత్యాదు లుదాహరణములు. ఇట్లు సిద్ధమైన యీభట్టిశబ్దము, అత్యంతార్వాచీనకాలమున భట్టియనెడి యొకకవి వేఱుగా నుండెననెడి భ్రాంతికి మూలమయినది. ఈభ్రాంతికి విక్రమార్క-భట్టి భర్తృహరులతోడి పుక్కిటిపురాణగాథ లాధారములైనవి. భట్టిసంజ్ఞకల వేఱొకపురుషుఁ డుండిన నుండవచ్చును గాని, భట్టికావ్యములోని భట్టిమాత్ర మతఁడు కానేరఁడు. అతఁడు తప్పక భర్తృహరియే యని పైవిచారణనుబట్టి నమ్మవచ్చును. నిఘంటుకర్తయైన సర్. మోనియర్ విలియమ్స్ పండితుఁడుగూడ భట్టిశబ్దమున కర్థము వ్రాయుచు, భట్టి, భర్తృస్వామి, హరి, భట్టిస్వామి, స్వామిభట్టశబ్దముల వ్యవహరింపఁబడెననియు, వాక్యపదీయ భట్టికావ్య సుభాషితత్రిశతులు రచియించెననియు విశదీకరించెను. కావున భట్టికావ్యకర్త భర్తృహరియే యను విద్వల్లోక సంప్రదాయమే స్థిరమగుచున్నది. ఇఁక నితనితండ్రిమాట—ఏడు, పండ్రెండు సంఖ్యలగద్యలలోని, గోవింద-శ్రీస్వామిశబ్దములు సమానార్థకములు, పర్యాయములు నగుట నిందేదేని యితనితండ్రిపే రగునేమో! ఇతని భ్రాత విక్రముఁడఁట. అట్టివాఁ డుండెనేమో! ఇతని నివాసగ్రామము వలభీపురమేమో! ఈమూఁడింటికిఁ దగినయాధారములు లభింపలేదు. ఇందు సత్యమున్నను లేకున్నను, ఇవి యింకను విచారణీయములు. వీనికిఁగూడఁ బైపుక్కిటిగాథలే యాధారములేమో యనియు సంశయము కలుగుచున్నది.

---



# జవాహరిలాలు

“ భారతయువజనాదర్శమూర్తి :
సహజనాయక శిరోమణి :
దీనజనబంధువు :
నిరంతర స్వాతంత్ర్య సమరయోధుడు. ”

‘ రఘు ’

భారత రాజకీయ ప్రపంచంలో దివ్యసుందర మూర్తి జవాహరిలాలు. మూర్తిగొన్న భారత యువజనోద్యమాదర్శము. భారతీయస్వాతంత్ర్యమువలచి వలపించుకొన్న సహజనేత. పరంపరాగత ఐశ్వర్యగర్విష్ఠులపాలి ధూమకేతువు. అపరదరిద్రనారాయణుడు. పుట్టుభోగియై అవతరించి చెరసాల చీకటి కొట్టులలో నవయుచున్న ఆ అవతారపురుషుడే నేడు భారత రాజకీయాకాశమున వెలుగుచు విశ్వప్రపంచదృష్టి నాకర్షించుచున్న వీరపుంగవుడు !

* * * *

అతిలోకసుందరమైన ఆనందభవనమున పుట్టుక. అదృష్టమూర్తులగు నప్సరోదేవతలపరంజిగిన్నెలతో యుగ్గుద్రాపినారు. లోకోత్తర మహాశ్రీలు ఆతనికి జన్మోత్సవమున కానుకలు పెట్టినారు. ఆ గర్భశ్రీమంతుడగు పుట్టుభోగియైనాడు.

* * * *

ఆనందభవనమున ఆనందచపలమగు బాల్యము గడచినది. రాకుమారులతో రాచవీథికి కొదువరాకుండ చదువుసాగినది. అడిగినదే తడవుగా సమస్తసౌకర్యములు సమకూర్చినాడు ముద్దుకొడుకునకు మోతీలాలు.

ప్రతివారు ఈటన్ క్రీడారంగముల నాటలాడవచ్చు. చరిత్రప్రసిద్ధములగు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయ భవనాంతరముల విహరింపవచ్చు. ఆక్స్‌ఫర్డువాయువుల నాహరింపవచ్చు. కాని, వారు జవాహరిలాలులు గాలేరు. “ ఈతనిలో నేదో అసాధారణమైన గొప్పదనంవుంది. ముందేదో ఈతనికి మహాభవిష్యత్తు వుంది ” అనే ఆయన సతీర్థ్యులందరు ఆశ్చర్యపడ్డారు.

* * * *

పండిత పుత్రుడు శుంఠ అంటారు. “ పుత్రాదిచ్ఛేత్పరాజయం ” అనేదికూడా ఆర్యోక్తే. ఈ మహాదృష్టం మోతీలాలుకు పట్టింది. తేజోమూర్తి, వివేకనిధి అయిన మోతీలాలును మరిపించాడు జవాహరి. స్వయం వ్యక్తిత్వంతో ప్రపంచంలో శాశ్వతగౌరవస్థానం సంతరించుకొన్నాడు. తల్లి రొమ్ముకు హత్తుకొన్నది. తండ్రి బుజ మెక్కించుకొన్నాడు.

అసూయాపరులాతనిగౌరవమును తండ్రిగౌరవమునకు, వంశమర్యాదకు తాకట్టుపెట్టవచ్చు. వీనినెల్ల

తుటారించి, సమస్తాగ్నిపరీక్షలకాగి, స్వశక్తిని స్థాపించ గల దివ్యజీవన మాతనిది. జవాహరిలాలు భారతమాత పూర్వపుణ్యమున జనించిన జవాహరియే. అప్రతిద్వంద్వి యగు యువక చూడామణి.

* * * *

గౌరవ ప్రతిష్ఠలకు తగినంత మహోన్నతమూర్తిగా దాయనది. పలచని కాయపారు మనిషి. మూసలో కరగిపోసిన పట్టుదల, అజేయమైనశక్తి ఆతడు. నిర్లక్ష్యము, ఆత్మవిశ్వాసముల కాటపట్టు. శిరమువంచు టెరుంగని పౌరుషము, మాటబడని అభిమానమున కాతడు పెట్టినది పేరు. ఇతరు లాతనిగాంచి చిన్నచూపు చూడ వచ్చు. దురభిప్రాయపడవచ్చు.

ఒక్క క్షణమాతనిగూర్చి యోచించినచో నీ దురభిప్రాయములన్నీ పటాపంచలు గావలసినదే. ఢీకొనబోయినవారుకూడ దాసులు కావలసినదే. ప్రతిస్పర్ధి అంగీకరించుగాక, నిరసించుగాక, కాదనరాని దా సుధీనిధి వాదకౌశలము.

* * * *

విశ్వవ్యాపకమైన విశ్వాసము, భయంకరమైన ఖండితవాద మాయనకు పెట్టనినగలు. బలవద్విరోధికూడ జవాహరిలాలు సత్సంకల్పమును సంశయింప లేడు. యౌవనోత్తేజితశక్తి, సాహసోపేతభావన, నిర్భయ సహజకల్పనాశక్తి, సునిశిత దీక్షలతో నిద్రాముద్రితమైన, దాస్యబంధితమైన భారత రాజకీయరంగమున నూతనశక్తిని సృష్టించినాడు. ఆతని నిశాత దీర్ఘ దృక్కు లేవియో అజ్ఞాతస్వప్నములు పల్కరించును. సంపుటితాధరములు సనసన్నవిప్పార, తీక్ష్ణ నేత్రాంచలములు ప్రసన్నతాజ్యోతులు ప్రసరింప ఆయన అగాధ వక్త్రము చిరునవ్వులు తరుచు చిలకరించును. లేత చిగురాకుచేతులు మలిచితీర్చిన యడుగులు, సుఖస్వప్నముల చూరలాడు మనస్సు నేడొక భయంకర శాంతిరహిత చిహ్నములతో మరుగుపడిపోయినవి. ఆ కళంకిత భైరవ మూర్తియే భారత పరాధీనతానివారణమునకు పోరాడుచున్న వీరజాతికి ప్రతిచ్ఛాయ.

సుఖస్వప్నములు కరగిపోయినందుకు, వ్యక్తి స్వాతంత్ర్యము నశించినందులకు పండితుడు దుఃఖించడు. పట్టువదలనిదీక్షతో పరమావధిని చేరుటయే ఆవీరవ్రతుని పరమార్థము.

ముకుళీకృతమైన ఆ యధరమండలమున నింత సొలకనవ్వు, అభయంకర నేత్రగోళముల నిందుకంత మార్దవము కల్పించుటకు చాలమందికి ఆశ. ఆ ఆనంద సౌందర్యముల చూరలాడవలెనని కోరిక. అది విశాలాకాశమును చీల్చుకొనివచ్చు నింద్రధనుస్సు.

* * * *

జవాహరిలాలుపండితుని నవజీవన పరిణామమును గుర్తించుట దుస్సాధ్యం. పసిపిల్లవానివలె పారాడగలడు. బాలురతో దాగుడుమూతలాడగలడు. మూపున చిన్నబిడ్డ నెక్కించుకొని పిల్లపటాలమునకు నాయకుడై యూరేగించగలడు.

నాయకుని నిజమైన స్వరూపము దర్శింపవలెనన్న ఆతని నిత్యజీవనమే సాధనము. అప్పటి నిశ్శబ్దాలోచనలు గుర్తించి, అగాధభావనల లోతులు తడవి, జీవనస్రోతస్సులలో ఉబికివచ్చు భావస్వప్నముల పాదు లెరింగి, అపరిరక్షితనగ్నగలిభేదముల ఆకళించికొని నిత్యజీవనమునందలి సూక్ష్మాంశముల చూడగలిగిననాడు గాని నాయకుని విలువ దెలియదు.

* * * *

జవాహరిలాలు చారిత్రకకర్తమాత్రమే కాదు, ఆతడు నిర్మాత. చేజిక్కిన యవకాశముల కాకృతి నీయగలవారు పెక్కుగుండవచ్చును. కాని, వానిలో జీవశక్తిని చొప్పించి కార్యరంగమున నడుపు నాయకులు తక్కువ. జవాహరిలాలట్టివాడు. పండితునికెంత విప్లవదృష్టి యున్నదో అంతటివిప్లవశక్తి యున్నది. అందరు విప్లవకారులలోవలెనే అతనియందుగల శక్తి అసాధారణమైనది, అతిమానుషమైనది.

కలముబట్టి కర్తవ్యము వ్రాయుటమొదలు సభావేదిక నెక్కి శాసించుటవరకు అంతయు సహజనిర్మాణమే! ఎంగిలిపొంతలులేవు. సభావేదికనుండి సట్టున

లంఘించి ఏశాలాకోణమునను సద్దుచేయువారి సవరింప గలడు. మనోహరదివ్యోత్సవమధ్యమున మోటారుకారు నుండి సుభేలునందునకి సైకిలునెక్కి తన దర్శనమునకై తగ్గిసమగ్గిసలాడుచు, త్రొక్కులాడు గుంపులలో దూరి దారిచేయగలడు. అవి మనస్థూలదృష్టికి అందమైన తమాషాలే కావచ్చును. కాని సత్యాన్వేషియగు విమర్శకుని కవి అవ్యక్తిపారవశ్యవైభవమునకు, సమయజ్ఞతకు మచ్చుముక్కలు.

* * * *

అఖిలభారతమున రాజకీయ భావనాక్రియల కైక్యత కల్పించినవాడు గాంధిగారికి పిమ్మట జవాహరిలాలే! ఆయన భారతదేశమున కమోఘసేవజేసినాడు. పండితునిసేవలలో మేరుమందరములవలె స్పష్టముగా గోచరించునవి రెండు. భారతదేశపరమప్రాప్యము సంపూర్ణస్వాతంత్ర్యమని ఎత్తిచూపిన దీధీరుడు. దానికి సామ్యవాదచ్ఛాయలు చిత్రించుటకు ప్రయత్నించిన దీతడు.

యూరపుఖండపర్యటన మాయనకు సామ్రాజ్యవాద రహస్యమును చాటి చెప్పినది. మద్రాసుజాతీయ మహాసభలో మహాత్ముని కెదురు కత్తికట్టి తన సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానమును నెగ్గించుకున్నాడు. భారతీయ స్వేచ్ఛాసమరమునకు క్రొత్తనెత్తురుబోసినాడు. లాహోరుమహాసభలో తన ప్రతిపక్షులనుగూడ వల్లె యనిపించి తన విజయగీతమునకు పల్లవి పాడించినాడు.

భారత రాజకీయనాయకులలో—ప్రపంచనాయకులలో గూడనేమో—జవాహరిలాలు పండితుడు అపరూప అదృష్టశాలి. కలకత్తా నగరమున జరిగిన జాతీయ మహాసభకు మోతీలాలుపండితుడు అధ్యక్షుడు. వంగమాత నెహ్రూపండితుని కొసంగిన గౌరవము నిరుపమానము.

మరసటియేడు లాహోరుమహాసభకు కుమారపండితు డధ్యక్షుడైనాడు. పాంచాలరాజ్యము తనగుండియ లారవిప్పి ప్రేమామృతమును జవాహరిలాలుపండితుని పై కురిపించినది. కోటానుకోటులుగా భారతీయులు గుంపులుగూడి మహాభారవాహకుడుగానున్న యువకసింహమునకు స్వాగత మొసంగిరి.

ఆనాటి మహోత్సవము నాటికి నలువదినాలుగేండ్లనుండి జరుగుచువచ్చిన స్వాగతోత్సవములకు, అధ్యక్షసన్మానమునకు తలమానికమని ప్రపంచ మబ్బిపోయినది. మనోహర శ్వేతాశ్వము నధిరోహించి, స్వదేశ స్వేచ్ఛాసంపాదనమునకు యోధమండలికి మహానాయకుడై ముందు నడుచుచుండ పొంగి పులకితుడు గాని తండ్రియెవరు?

మోతీలాలు తనకనుల ముందు జన్మతరించునట్లు చేయబడుచున్న ఈ అతిలోక గౌరవమునకు గద్గదువారి చెమరించినాడు. జన సామాన్యమునందొకడై తనకడుపు పంటపై ప్రేమార్ద్రదృక్కులతోబాటు పుష్పరాసులు, మంగళాక్షతలు చల్లి మురిసిపోయినాడు.

మహాసభా మధ్యమున స్వహస్తగతమగు అఖిల భారతమహాసభాధ్యక్షతను తండ్రి కుమారుని కప్పగించినాడు! ఎంతటి అదృష్టము! అపరూపము!! ప్రపంచమందిట్టి విచిత్రసంఘటన మాతండ్రిబిడ్డలకే గలిగినది దీనాడు. ఇకముందుండుమాట సంశయాస్పదము. నెహ్రూ కుటుంబము చరిత్రమున స్వర్ణఖండమును నిర్మించుకొన్నది తనకీరూపమున!

౧౯౩౩ లో పండితుడు కారాగార విముక్తుడగుటకు ముందె సామ్యవాదబీజములు విత్తబడియున్నను, “ఇండియా ఎక్కడనున్నది?” అను వ్యాసపరంపర చేత ప్రజాదృష్టి నాకర్షించినాడు. పతనోన్ముఖమైన సత్యాగ్రహోద్యమమున ప్రజాశక్తిని మేల్కొల్పినాడు ఆ ప్రబోధమే నేడు మూలస్వత్వ తీర్మాన రూపమున భారతదేశపు మాగ్నకార్టాచేసి వైచినాడు.

* * * *

గౌరవప్రాగల్భ్యమున కందము దెచ్చు వినయశీలుడు ఈ ఉదాత్తచరితుడు. దేశమంతయు బ్రహ్మరథము పట్టుచున్న మహానాయకు నెన్నడాయన మీడ లేదు. గాంధిగారియెడల తన కెన్ని అభిప్రాయభేదము

లున్నను ఆయనఅనుచరత్వమునకు నవ్వులనీళ్లు విడువ లేదు: శుద్ధస్ఫటికమూర్తియని మహాత్మునిచే మెప్పువడసినాడు.

* * * *

రాజోచితములైన మహాదానములు చేయలేదు. కన్నతండ్రి మోతీలాలువలె, దేశబంధువగు చిత్తరంజనునివలె దర్శనీయత్యాగములు చూపించలేదు. కాని వారి కెందును దీసిపోని గుప్తదాత. జవాహరిలాలు ఎడమచేయి యెరుగకుండ కనకవర్షము కురిపించినాడు. అంతరంగికమిత్రులే, నిరతానుచరులే ఆయనత్యాగమునకు సాక్షులు. ఆయనతో కలిసి చదువుకొన్న దరిద్రనారాయణులా మహాప్రవాహమునకు శరణ్యులు.

* * * *

జవహరిలాలుపండితునికి గలిగిన గౌరవప్రతిష్ఠ లేయాకాశమునుండో వూడిపడినవికావు. శాసనసభాసభ్యత్వముననో, అసెంబ్లీమృదుల హంసతూలికా కల్పితాసనాసీనతవలననో సంపాదించుకొన్నవి కావు. జీవనయుద్ధమున హోరాహోరి బోరాడి తత్ప్రహరణకిణాంకములు సాక్ష్యముగా గడించుకొన్నాడు. లాతీ దండప్రహరణమున భారతజాతీయ యుద్ధసైనికదళమున దీక్షగొన్నాడు. అయోమయ శృంఖలాధారణమున కారాగాప్రవేశ మొనర్చి పరీక్షా శుద్ధుడైనాడు. ౧౯౩౧ లో పితృదేవుని చరమసందర్శనమునకు, తిలోదకప్రదానమునకు కారాగారవిముక్తుడైనాడు. దుఃఖవిశీర్ణయగు మాతృదేవతకై యొకవంక, దుస్స్వాస్థ్యవ్యాధిపీడితయగు సతీమతల్లికై యొకవంక పొగులుచు నవయుచున్నాడు. కొందరు ప్రేక్షకులు వేల్సు రాకుమారునికి పండితుడు సతీర్థ్యుడగుటవలన నింత గౌరవము సంపాదించినాడని భ్రాంతిపడుచున్నారు.

కాని, కటికచీకటిరాత్రుల గమనింపక, శీతబాధను పాటింపక, గుంపులు గుంపులుగా రైల్వేస్టేషనులలో ఖైదీయగు పండితుడు రైలులో రాకపోకలు సేయుచుండ దర్శింపగోరు కృషీవలులకు, కార్మికులకు ఒకనాడు భారతసార్వభౌముడుగానున్న వేల్సు రాకుమారునితో పండితునికిగల చెలికారము తెలియునా? వట్టి భ్రాంతి. పండితుడు దరిద్రనారాయణుడు, పతితజనబాంధవుడు, ఆపన్నరక్షకుడని వారి విశ్వాసము. ఆయన వారి దారిద్ర్యమున, వారి కష్టనిష్ఠురముల భాగస్వామి. వారిదారిద్ర్యాంధకారమును పటాపంచలుచేయు చండభానుడు కష్టసముద్రమునుండి వారి జీవననౌకల గట్టెక్కించు కర్ణధారుడు. తన చిరునవ్వులతో క్షుత్పిపాసాజనితమైన దీనజనదుఃఖమును తుటారించి ఆనందచంద్రికల వెదజల్లు అమృతరాశి పండితుడు. జవాహరిలాలు పుట్టు భోగియైనను దరిద్రనారాయణులలో నొక్కడై వారితో కలిసిమెలసి, వారికి ప్రతినిధియై చరించినాడు. ఆమహాత్యాగమే, ఆదీనజనప్రీతియే, ఆ అనాధసేవాపరతంత్రతయే పండితుని జయాంకములు, జీవనసూత్రములు. అవియే నేడాయనను అంతర్జాతీయ చక్రవాళమున విద్యుత్తారగా వెలిగించుచున్నవి.

ఎవరెన్ని అపవాదు లంటగట్టుదురుగాక, అతడు స్వయంవ్యక్తమగు సారభూతసాలగ్రామము. ఎన్ని వ్యతిరేకశక్తులు ఎదురొడ్డునుగాక అతడు అజేయశక్తిమూర్తి. ఎవరెన్నివిధముల అధిక్షేపింతురుగాక, అతడు దీనజనబాంధవుడు; సామ్యవాది.

ఎన్ని నిరోధమేఘములు లాచ్ఛాదించినను శక్తిత్రయసంపన్నుడగు నాయువకసింహము, దీక్షాబద్ధుడగు కార్యసాధకుడు తన పరమావధిని చేరకపోడు.

అది ప్రకృతి సహజేచ్ఛ! భారతీయేచ్ఛ!!

[—ప్రజామిత్ర, 6-3-1936.]

# "అస్త్రశస్త్రసహాయనిమిత్తే…!"[౧]

భావరాజు వేంకటకృష్ణరావు

[ఇది చారిత్రాత్మకమైన కథ. ఇందలి ప్రధాన పాత్రలు చారిత్రకమహాపురుషులు. కథావస్తువునందు కల్పన యెంతకలదో, చరిత్రకూడ నంతేకలదు. ఇది వేయేండ్లకు ముందు నాటిమాట. నా డెట్లు జరిగెనో చూచి వచ్చినట్లు వర్ణించుట కేవలము అసాధ్యమైనపని. అట్టి దానిని పూనుకొనుట నిక్కముగ సాహస మనిపించుకొనును. అయినను సహృదయ పాఠకలోకముయొక్క ఆదరమును అపేక్షింతును.

అఖిలాంధ్రదేశమును పాలించిన చాళుక్యనృపాలురలో గుణగవిజయాదిత్యుడు అందరికంటె కడుప్రసిద్ధుడు. ఆతనికాలమున చాళుక్యవంశమునకు కులవైరులగు రాష్ట్రకూటులు పెక్కుమారు లోడింపబడి, భంగపాటునొందిరి. అప్పు డొకసారి రాష్ట్రకూటులరాజధాని, మాన్యఖేటము, ఆంధ్రాధీశునిచే నుగ్రకోపమున విధ్వస్తము గావింపబడెను. రాష్ట్రకూట రెండవకృష్ణరాజు చేతులు ముకుళించుకొని వచ్చి, వినమ్రుడై వేడుకొని, గుణగవిజయాదిత్యునివలన నపహృతరాజ్యమును మరల ప్రతిగ్రహించెను. రాష్ట్రకూటులకు చాళుక్యులతో సంబంధబాంధవ్యములుండెను. కృష్ణరాజు విజయాదిత్యునికి మేనమఱది. విజయాదిత్యుని తల్లి శీలమహాదేవి కృష్ణరాజునకు మేనత్త

కృష్ణవల్లభునికి తోడువచ్చిన పాండ్య, కోసల కళింగభూమిపతులుగూడ పరాజితులై, కానుకలను, అప్పనములను అర్పించి, [౨] వేంగీశ్వరుని యనుగ్రహమును సంపాదించుకొనిరి. కోసలేంద్రునకు, రెండవకృష్ణరాజు సగ్గరచుట్టము, కళింగాధీశునకును వేంగీమహీవల్లభునకును మొదటినుండియు బద్ధవైరమే! కాళింగగాంగరాజులు ఆంధ్రసామ్రాట్టుల నెదిరించి నిగ్రహింపజాలక యెల్లప్పుడును లోలోన కుములుచుండిరి. పటుసాహస విక్రమాఢ్యుడైన గుణగవిజయాదిత్యుడు బ్రతికియున్నంత కాలము, ఆతని శత్రువు లెవ్వరునుగూడ నాంధ్రమహాసామ్రాజ్యముపై గన్నెత్తి చూడజాలకపోయిరి. ఒకనాడు విజయాదిత్యుడు, పినాకినీ నర్మదామధ్యస్థమైన అఖిలదక్షిణాపథమును చక్రవర్తి పదవితో, నేకచ్ఛత్రాధిపత్యముగ నేలెను.

ఆతడు నలువది నాలుగేండ్లు, క్రీ. శ. ౮౪౪ మొదలుకొని ౮౮౮ వఱకు పరిపాలించెను. ఆతని యవసానకాలమున నాతని తమ్ముడైన యువరాజ విక్రమాదిత్యుని కుమారుడు చాళుక్యభీముడు రాజ్యాభిషిక్తుడు కాకుండ, దాయాదులును వైరిరాజులును వేయిపన్నాగముల బన్నిరి. పినతండ్రి మల్లరాజొకవంకను, మేనమామయగు కృష్ణవల్లభు డొకవంకను, క్రేటువడిన త్రాచులవలె పగబూని కోసలకళింగభూధవులసాయము గొనివచ్చి చాళుక్యభీముని పట్టాభిషేకమునకు విపర్యయము గలిగింపదొడగి, పూర్ణముగ విఫలమనోరథులైరి.

పిమ్మటవారు నల్దెసలనుండివచ్చి, యాంధ్రదేశముపై బడి, చాళుక్యభీముని పదచ్యుతిని జేయ దలపడిరి. అపుడాంధ్రదేశమునందు ముఖ్యముగ వేంగీవిషయము ఘోర సంగ్రామరంగముగ బరిణమించెను. అట్లు నిరంతరయుద్ధములతో మూడేండ్లు వరుసగా గడచిపోయెను. తుదకు రాష్ట్రకూటబలములనెల్ల ఖండించి, దాయాదకులద్రోహులనందఱిని దేశమునుండి పాఱద్రోలి శత్రునిర్మూలనము గావించి, రాజచాళుక్యభీముడు. 'సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధనమహారాజాధిరాజు' అను అభిషిక్తనామముతో ముప్పదియేండ్లు, అరిరాజభయంకరుడై, నిజప్రజానురంజకముగ, సుస్థిరైశ్వర్యముతో నీయావదాంధ్ర

---

౧ ఈపదము చాళుక్యభీముని పండిపాకతామ్రశాసనములోనిది.

౨ "వేంగి," "ఆంధ్ర" అను నీరెండుపదములును పూర్వకాలమున పర్యాయపదములుగా వాడబడెను.

భూమిని సంరక్షించెను. ఆతడుకూడ గుణగవిజయాదిత్యునివంటి పరాక్రమశాలి, చక్రవర్తిపదవితో భూచక్రమునేలినవాడు. ఆతనిపట్టాభిషేకము జరిగినమూడవ యేటినాటిది అనగా, క్రీ. శ. ౮౯౫-వ సంవత్సరము నాటి దీకథలోని వృత్తాంతము. —భా. వేం. కృ.]

## ౧

గుణగాంకవిజయాదిత్యుని చమూపతులైన బ్రాహ్మణయోధవీరులలో వాజసనేయబ్రహ్మచారి విద్దశర్మ కడుసుప్రసిద్ధుడు. ఆతడు ద్రోణాచార్యునివంటి పరాక్రమముగలవాడు. ధనుర్విద్యాపారంగతుడు. బలయుతబలదేవతుల్యుడు. శతానేకసమరసంఘట్టములందు శౌర్యమూర్తియై వెలిగి ప్రభువునకు సర్వదా జయముగూర్చినమేటి వీరఘనుడు. ఇపుడాతడు వృద్ధుడైనాడు. ఇంచుమించుగా ఎనుబదిసంవత్సరములు వయసుచెల్లినవాడయినను విద్దశర్మ ఏబదిసంవత్సరములు దాటనివానివలె గన్పించును. చిన్ననాటను వేదవేదాంగముల నభ్యసించెను. కులవిద్యతోపాటు పితృపితామహులవలె శస్త్రాస్త్రవిద్యల నభ్యసించి, శస్త్రజీవియై కాలముగడపి గణుతికెక్కెను. కాని దైవవశమున నాతనిహృదయము దుఃఖభరమున క్రుంగిపోయెను. అంతట నాతడు శస్త్రాస్త్రములను త్యజించి, విరాగియయ్యెను. ఆతడు రేనాటిసీమయందు పంపానదియొడ్డున స్వగ్రామమందు స్వకర్మానుష్ఠానపరుడై, షట్కర్మనిరతుడై తపముజేసికొనుచు జీవయాత్ర గడుపసాగెను.

ధన్యులైన యాతని ముగ్గురు తనయులును చాళుక్యనృపాలునిసైన్యమునందు దండనాయకులై ప్రసిద్ధివడసి, సంగ్రామరంగములందు స్వామి కార్యనిర్వహణనూర్వహులై, నిశ్శంకతో ప్రాణము లర్పించి, యశఃకాయులయిరి. ఆవృత్తాంతము లిట్లుజరిగియుండెను. జ్యేష్ఠుడైన తూర్కశర్మ మహాసేనాని ప్రభుపాండురంగడు మన్నించిన మేటి వీరఘనుడు. "వెలలేనిబోయకొట్టములను సాధించువేళ, ప్రభుపాండురంగనిచెంత భీకరగదాయుద్ధము చేయుచు, జయజయధ్వానములు మిన్నుముట్టువేళ తూర్కశర్మ బలువైన కుంతపుపోటునకు నిష్కారణముగ కూలి, నిజస్వామి నాశీర్వదించుచు అసువులు విడచెను. ఆతడు ఇరువదియైదువర్షముల నూత్నయౌవనప్రాయమున వీరస్వర్గ మలంకరించెను. రెండవవాడు శ్రీధరుడు. సేనాపతియైన వినయడిశర్మ అశ్వసైన్యమునందు సాహిణియై ప్రసిద్ధికెక్కెను. విజయాదిత్యుడానాడు భీకరసంగ్రామ రంగమునందు, మంగిరాజు శిరము ద్రుంచువేళ, హయారూఢ రేవంతుడై ప్రభువుచెంత బోరాడి, తనవిజయకుంతమునకు మంగిరాజుశిరము గ్రుచ్చి మీదికి ఎత్తి ఆటోపమును జూపుతఱిమున వైరివీరునికరవాలమునకు గురియై నేలగూలెను. మూడవవాడు సబ్బిశర్మ, అగ్రజులను మించిన మహావీరుడు. అశ్వత్థామతుల్యవిక్రమ సంపన్నుడు. మహాబలశాలి. విజయాదిత్యుడు మాన్యఖేటమును దగ్ధము గావించునాడు గజసాహిణియై, ఏనుగుబలములతో కంచుతలుపుల బగులగొట్టించినాడు. సుభటనాయకవర్గమును, విక్రమింపజేసి పెద్దగవనిని జొచ్చినాడు. కాని యాకోలాహలమునందు శరాఘాతమునకు వివశుడై యేనుగునుండి జారిపడి మరణించినాడు.

ఇట్లు, ప్రాజ్ఞులై, కీర్తిగన్న మహాయోధవీరులగు ముగ్గురు కుమారులనుగూడ ప్రభుసేవకై దేశక్షేమమునకై, ఆహవరంగమున అర్పించి, నేడు ఆశోపహతుడైనాడు వీరుడు విద్దశర్మ. పొంగిపొరలి వచ్చుచుండిన పుత్రవియోగదుఃఖ భారము నాతడు ఆపుకొనజాలకపోయెను. అప్పటికి విద్దమయ్యకు ఏబదియేండ్లు దాటియుండెను. పుత్రార్థియై యాతడు నారాయణసమర్పణమైన యొకమహామంత్రము నుపదేశముబొంది, యద్దానిని తనయిల్లాలికిగూడ నుపదేశించి, కొంతకాలము నిష్ఠాగరిష్ఠుడై, తపమాచరించెను. శ్రీమన్నారాయణుని కృపవలన, కొన్నినాళ్లకు మనవిద్దశర్మకు, మహనీయతేజముతో వెలుగువాడు, రాజసతామసములు వాటమునొందిన రూపమువాడు, సర్వశుభలక్షణాంకితుడైనవాడు, కుమారుడు, ఒకశుభముహూర్తమున జన్మించెను. రంగేశుని కటాక్షవిశేషమున కలిగిన యాపాపనికి విద్దశర్మ 'రంగాధికక్కశర్మ' యని నామకరణము చేసెను.

ఏడేండ్లు నిండిననాడు తలితండ్రులు రంగశర్మకు సముచిత ఉపనయనాదికర్మకలాపములు నిర్వర్తించి, వేద వేదాంగవిదుని జేయుటకు, గురుకులవాస మొనర్ప పాకనాటిలోని యార్పుటూరునకు బంపిరి. ఆత డచ్చట పండ్రెండుసంవత్సరములు బ్రహ్మచర్యము నెఱపెను. రంగశర్మ మహామేధావి; మరియు నేకసంథాగ్రాహి. ఆకారణమున నాతడు, అస్వల్పకాలమున, ద్వివేదియై శాస్త్రజ్ఞుడై, ఘనతకెక్కెను.

బ్రహ్మవిద్యోపాసన చేయుకాలమున నాతడు కులక్రమాగతములైన శస్త్రాస్త్రవిద్యలనుగూడ నభ్యసించెను. విశాలవక్షమును, దీర్ఘము బలిష్ఠములైయున్న బాహువులును, మెఱపుబోలిన యాకార రేఖయును, రాజస తామసము లేకకాలమున వెలుగొందు మనోహరమైన వదనమును, సౌష్ఠవము నొందినసర్వాంగములునుగల యాతని గాంచినవారు అచ్చెరువందుచు, పలుమారు పరికించుచు, ‘భళిరే! ఇత డభినవపరశురాము డన్నట్లున్నాడు!’ అనుచు ప్రశంసచేయుచుండిరి.

రంగశర్మ గురుకులమును విడివచ్చినపిదప, జనకునికడ కొంతకాలము శుశ్రూష యొనర్చి, అపూర్వములు అమోఘములు నగు శస్త్రాస్త్రవిద్యలను అభ్యసించెను. ఖడ్గ, గదా, కుంత, కోదండ, మల్ల, ముష్టి యుద్ధములందు విశేషకౌశలము సంపాదించి బలువైనవాడని ప్రఖ్యాతి గాంచెను. కరి, తురగాగమములను అభ్యసించెను. చేత ఖడ్గము బూని, హయారూఢరేవంతుడైనపుడు, ఒక్కపెట్టున ఏబదిమందియైన యెదిరింపవచ్చిన పెనగి, చిత్రగతులవారినెల్ల గూల్పగల పటుసాహసవిక్రమాఢ్యుడని పేరుగడించెను.

తనయవసానకాల మాసన్నమైనదని యెఱిగి, విద్దయ్య, గృహస్థుడైనకుమారుని నుద్దేశించి, “వత్సా! ఏనును, నాపితృపితామహులును కూడ, వీరలక్ష్మీనివాసమైన రాజచాళుక్యవంశమును సంరక్షించుటకును, దానినీయాంధ్రదేశమున సుప్రతిష్ఠితము జేయుటకును, శస్త్రోపజీవులమై, సదా మాఖడ్గమును వినియోగించి కృతార్థులమైతిమి. నీఅగ్రజులు మువ్వురును బ్రాహ్మణధర్మముతో పాటు క్షాత్రధర్మము నవలంబించి, మన రాజచాళుక్యకుల కళ్యాణమునకై ప్రాణము లర్పించి, ధన్యులయిరి. నీవుకూడ మహనీయ తేజోవిలాసమూర్తివి. శౌర్యఖనివి కాన, నీపూర్వు లనుసరించి, చనినమార్గమును, నీవు కూడ ననుగమింపవలయునని నాయభిమతము. నీశస్త్రాస్త్ర వివేకమును, బాహుబలమును, బుద్ధిబలమును, విక్రమపటిమయును, రాజచాళుక్యకుల కళ్యాణపరంపరాభివృద్ధికై వినియోగించి, వాటికి సార్థకత గల్గించుకొనుము. చిరయశము నపేక్షించుచున్న నాహృదయము, ప్రభుసేవాయత్తమైన నాచిత్తము నిన్నుకూడ రాజసేవయు దేశసేవయు నొనర్పుమని యాదేశించుచున్నది. పితృవాక్యపరిపాలన మొనరించి విజయశ్రీసౌఖ్యము లందుకొనుము. నీకు సర్వదా జయమగుగాక” అనుచు దీవనపరంపర లిచ్చెను.

తండ్రియాజ్ఞ యొకవంక చిత్తమును చాళుక్యరాజధానియగు విజయవాడకు లాగుకొనిపోవుచుండ, మరియొకవంక నాముష్మికచింత మనరంగాధికక్క శర్మను, స్వకర్మానుష్ఠానమునకు నిశ్శంకతో దాగితీసెను. కొన్నిమాసములట్లు, ఆతనికి చిత్తసంక్షోభముతో గడచిపోయెను. తుద కాతడు కృతనిశ్చయుడయ్యెను. పైతృకమగు చెఱకుపన్నస పండ్రెండుపుట్ల ఎత్తుపట్టు క్షేత్రమును దున్నుకొనుచు, స్వకర్మానుష్ఠానపరుడై, గృహస్థాశ్రమమునందుండి, తపము జేసుకొనుచు కాలముపుచ్చసాగెను.

విద్దశర్మ మరణించిన కొన్నిదినములకే గుణగ విజయాదిత్యుడుకూడ దివంగతుడయ్యెను. ఆతనిచావు, దగ్గఱనున్న ఆప్తజనులకంటె దూరమున నున్న దాయాదద్రోహి వైరిభూపతులకు ముందుగా తెలిసెను. సమయమునకై పరితపించుచు వేచియున్న కృష్ణవల్లభుడు చాళుక్యరాజ్యవంశముపై పగదీర్చుకొన నిశ్చయించుకొనెను. తన్నాశ్రయించిన మేనమఱది మల్లరాజును, అక్షణమందు జని, అన్నరాజ్యసీమలను ఆక్రమింపమని సేనల నాయత్తపఱచి పంపెను. ఆతడు నోలంబరాజసేనాసమేతుడై, దక్షిణమునుండి యాంధ్రదేశమును జొచ్చి, యాదక్షిణసీమలను భస్మీపటలము

గావింతునని ప్రతినబూని, రణభేరి మ్రోయించెను. దక్షిణమున కందుకూరి పురాధీశ్వరుడును పాకనాటికి ప్రభువును కందుకూరి పాలకుడును, బీభత్ససదృశపరాక్రమసంపన్నుడును నగు, మహామండలేశ్వర పాండురంగ భూపాలుడు అపుడు జీవించి లేడు. మున్ను పలుసార్లు ఆ మహావీరుని విక్రమమునకు వెఱచియే కృష్ణరాజు సిగ్గుమాలి యంతవఱకు తలయెత్తుకొనజాలక పోయెను. పరాభవాగ్నిచే దగ్ధమైన కళింగభూపతి మానసక్షేత్రమున, నేను మరల వేంగీశ్వరుని ఎదురింపగలమను అడియాస గల్పించి, కృష్ణరాజాతని చాళుక్యనృపాలునిచే సురక్షితమైన దక్షిణకళింగమును ఆక్రమింప సన్నాహపఱచెను. ఆతనికి వెనువెంటనుండి సాహాయ్య మొనర్పవలయు ననియు, కయ్యమునకు గదలవలయుననియు కోసలేంద్రునికి ఆజ్ఞాపించెను. కృష్ణరాజు తానొక అక్షౌహిణీబలముతో చాళుక్యభీముని దర్ప మడపింప విజయవాడపైకి సంగరాటోపమున నడచెను.

౨

విష్ణువర్ధనునకు పట్టాభిషేకమున జలధారలచే దడిసిన శిరోజము లింకను దడియార లేదు. సంతోషస్వాంతులై వచ్చియున్న సామంత, మహామాండలికరాజలోకమునకు గలిగిన యానందమున దనివితీఱ లేదు. అపుడొక నాటి నిశీథమున వేగువాడొకడు, కోరమీసములవాడు, ఘోరభైరవగదవాడు, ఘనమైన దేహమువాడు, కాఱునల్లని మేనిబోయవాడు, భీకరవేషమువాడు తత్తడిపాటుతో చనుదెంచి, రహస్య సాంకేతికముల సహాయమున, హుటాహుటి వేంగిపురమున జొచ్చి, భీమభూపతిని మేలుకొలిపి, శత్రువుల సమరసన్నాహముల నన్నిటిని పూసగ్రుచ్చిన రీతి విన్నవించి మరల యాజ్ఞ గైకొని యథేచ్ఛను బోయెను.

మఱునాడుదయమున పెద్దకొలువు నిలుపవలెనని భీమభూపాలుడు ఆప్తమంత్రివర్గమునకు ఆనతిచ్చెను. ఆతడు స్నానసంధ్యాదికాలోచితకృత్యములు నిర్వర్తించి శుచిపట్టువస్త్రములను కటియందు దాల్చి, తిలకము దీర్చి, పునుగు జవ్వాది కస్తూరిరసమును గలిపినయట్టి శ్రీచందనమును మేన చెలువుగా బూసికొనెను. తగటు కుప్పసములను ధరియించి, తలకు చక్రవర్తిలాంఛనమైన వింతయుష్ణీషమును ఒప్పుగా గట్టి, దానిపై నవరత్నఖచితమైనట్టి పట్టబంధము గట్టెను. నవరత్నహారములు కంఠమున శృంగారముగ ధరియించెను. చెవులకు మణిమయూంచితకుండలములు, బాహువులకు భుజకీర్తులు, ముంజేతులకు మురుగులు గొలుసులు, వ్రేళ్లకు రత్నముద్రికలు పెట్టుకొనెను. నవరత్నఖచితమైన నడికట్టు మొలను దాల్చెను. కాలికి గండపెండేరమును దొడిగెను. బంగారు దుకూలము పైన గప్పుకొనెను. పావుకోళ్లను పాదములందు దొడిగి కొలువుకూటమునకు పయనమయ్యెను.

అంతట బంగారు జలపోతబోసిన వెండిబెత్తముల బట్టుకొను కటికవారు సారెసారెకు బరాబరులు సేయుచుండ, కొందరు వేత్రహస్తులు నిరుకెలంకుల నడచుచు, సందడిమూరమై చనునట్లు హెచ్చరించుచుండిరి. బంగారు గుబ్బతో భాసిల్లుచున్నట్టియు చుట్టును ముత్యాలసరులు వ్రేలాడుచున్నదియు నగు తెల్లపట్టుగొడుగును ఇలయేలికపై పట్టుకుని భటుడు వెనుక నడచెను. పృథ్వీశ్వరులకు ముందు కులక్రమాగతములైన సామ్రాజ్యచిహ్నములను బట్టుకొని భటులు భయభక్తులతో నడచుచుండ సర్వలోకాశ్రయుడు అంతఃపురమునుండి వెడలి కొలువుకూటమున కేతెంచెను.

అతిరమణీయముగ సింగారింపబడిన వేంగీశ్వరుని కొలువుకూటమున వెదజల్లబడిన కర్పూరరజము, పునుగు, జవ్వాజి, కస్తూరిరసములు గలిపిన కలయంపి ఘుమఘుమ తావులు నల్దెసలందు వ్యాపించెను. అందొక తావున పంచవన్నెలు ముగ్గులువెట్టిరి. దానిపై పంచవన్నెల పటములు పఱచిరి. అందొక పెద్దపీఠమును నిలిపిరి. దానిపై పంచవర్ణముల రత్నకంబళములనుగప్పి, వాటిపై కాంచన నవరత్నఖచితమైనట్టి సింహపీఠమును దిశలు వెలుగొంద నిలిపిరి. భీమనృపాలుడు డంబుమీర, మొగము జూచినమాత్రమున మూర్ధాభిషిక్తులు మోడ్పుచేతులు ఘటియించు రాజసమూర్తియై తేజరిల్లుచు, భట్టువారలు కీవలావల జేరి "చాళుక్య కులాబ్ధిసోమ!

సర్వలోకాశ్రయుండ! పరచక్రభీమ! పరగండరాక్షసుండ! విజయీభవ, దిగ్విజయీభవ! మానవ్యసగోత్ర పవిత్ర! భూపాలమేరు! కౌశికీవర ప్రసాదలబ్ధఘనసిద్ధైశ్వర్యవిభవ! విక్రమధనంజయ! విజయీభవ! దిగ్విజయీభవ! వనితాభిరామ! దుష్టకాలానలుండ! భువనైకదీప! ఆంధ్రక్షమాపాల! రాజమకరధ్వజుండ! అరిరాజభీమణుండ, సౌజన్యధవళ! విజయీభవ! దిగ్విజయీభవ! శౌచకందర్ప! త్యాగమహార్ణవుండ! విష్ణువర్ధనమహారాజాధిరాజ! రాజపరమేశ్వర! విజయీభవ! దిగ్విజయీభవ! అనుమ బిరుదుగద్యలు పఠించుచుండ, నేతెంచి సింహాసనముపై నధివసించెను.

ఆ యుర్వీశున కొకవైపున పట్టమహిషియు, వరుసగా ముగ్వురు రాజతనయులును కనకపుటాసనములపై సుఖోపవిష్టులైరి. మరియొకవైపున సమస్తసామంతాంతఃపుర, మహామాత్ర, అమాత్య, పురోహిత, శ్రేష్ఠి, సేనాపతి, దేవాంక, శ్రీకరణ, ధర్మాధ్యక్షకాది ఆప్తమంత్రివర్గము సముచితాసనములందు నమ్రతతో నుండిరి. ఆ పృథివీశ్వరునియిరుపార్శ్వములందు దివ్యాంగనలబోలు సుందరులు వెంజామరలు వీచుచుండిరి. ఆ సార్వభౌమునిముంగిట, నందందు, రాజచాళుక్యకుల క్రమాగతములైన శ్వేతాతపత్ర, ఏకమహాశంఖ, పంచమహాశబ్ద, పాలికేతన, ప్రతిఢక్కా, వరాహలాంఛన, పింఛ, కుంత, కనకదండ, మకరతోరణ, గంగాయమునాదిసమస్తసామ్రాజ్యచిహ్నములను భటులు పట్టుకొని నెలకొనియుండిరి. అందొకవంక బంధుజను లుండిరి. మరియొకవంక, నిఖిలశాస్త్రపారంగతులు, వేదవిప్రులు, వైశ్యులు, గాయకులు, కవులు, సుభటులు ఎందరెందరో సముచితాసనములందు కొలువుండిరి. ఒకవంక సకలదేశాధీశు లంపించిన సచివపుంగవులు ముకుళితహస్తములతో వినమ్రులైయుండిరి. పట్టమహిషీసమేతుడై మహారాజు కొలువుకూటమున కేతెంచి, సింహాసనముపై సుఖాసీనుడయినపిదప, వేదశాస్త్రజ్ఞులు, విద్వాంసులు నగు భూసురులు “అఖిలరాజ్యములు వశముచేసికొని యేకాధిపతివగుము, నేలు మీధారణీస్థలి” యంచు సమ్మోదముతో దీవనలిచ్చి ఆసీనులైరి.

కొలువునందు పూర్వమర్యాదల ననుసరించి, జరుగవలసినవినోదములు ముగిసినపిదప, సర్వలోకాశ్రయుడు, తన్ను పరివేష్టించియున్నవారిని గాంచి, తనకు వేగులవానివలన దెలియవచ్చిన సకలవృత్తాంతము నెఱుకపఱిచెను. పిదప కొన్నిముహూర్తముల కాలము నాప్తులతో ముందుజరుగవలసినకర్జ మాలోచించెను. అవల నొకసారి సకలసామంతరాజలోకము నుద్దేశించి ప్రియము చెప్పగా “ఈక్షణము మీరెల్లరు, మీమీరాజ్యములకరిగి, ప్రస్థానభేరి మ్రోగింపవలయు. మీవారెల్లరు, మీసాలెగాండ్రును, బంధువర్గమును, దొరలను, పడవాళ్లను బిలిపించి తక్షణము సంగరమునకై సైనము జొప్పింపవలయు. శౌర్యయుతులైన వీరరాహుత్తులను విలుకాండ్రను, దృఢవిలుకాండ్రను, దృఢకాయులైనయోధవీరులను, వివిధాయుధసామగ్రితో సన్నాహపఱచి, కదనమునకై వడిగ బిలిపింపవలయు. మీరును, మీవారెల్లరును మారాజవంశముపై గలభక్తి తేటపడునట్లు, మీమీ నియతితో నేతెంచి, మాకు విజయలక్ష్మికై వసముపదాక బాసటయై నిలువవలయు, ఇది మాయాజ్ఞ” అను ధీరవచనముల పల్కెను. అప్పుడు వారికంపటికి రమణీయములైనవస్త్రభూషణాదు లిప్పించి, విడియంబు లిప్పించి తరలిపొమ్మని యానతిచ్చెను.

పిదప చాళుక్యభీముడు, అమాత్యవర్గముదెస దృష్టి నిలిపి గంభీరస్వనముతో నెల్లవారలకు వినబడునట్లు “వీరులమని పేరుపెట్టుక బ్రతుకువారికందఱికి నిది నాయాజ్ఞ! బ్రతుకులపై నాస పాఱద్రోలి, ప్రభుసేవకై, దేశసేవకై వడిగ సంగరాటోపముతో బిరుదుగట్టి, ప్రతినబూని యీక్షణము యేతేఱవలయు నని, మీ యిలయేలిక రాజచాళుక్యభీము డర్థించుచున్నాడు. పిఱికిప్రేవులు విడిచి, శౌర్యోత్సాహములు మూర్తీభవించినరీతి కదనరంగమునకడలవలయు. కాశగట్టి,కత్తిపట్టినవానికి పగదీర్చుకొనజాలని పౌరుషముండిన ఫలమేమి యనుచు మీస్వామి యాదేశించుచున్నాడు” అనుచు ప్రకటనము గావింపుడు.

పిమ్మట నొకముహూర్తమాగి, మరల నిట్లని, యానతిచ్చెను. "మాయానతిని విషయమహత్తరజ అయుక్త, నియుక్త, స్థానాధిపతి, అధ్యక్షుకాది రాజపురుషులకందఱికి దెలిపి, విస్తారమైనదండును వడిగ సమకూర్పవలయు. కదనభూమికి వేగమే పైనమై రావలయు. శుభముహూర్తకాలములందు ప్రతిగ్రామము నందును పల్లెయందును, పట్టణమందును భేరీనికరము పెద్దదనూయిలను సకలజనములకు దెలియునట్లు, మ్రోగింపవలయు.

## 3

అంత సేన లాయత్తములయ్యెను. ఒక శుభముహూర్తమున విష్ణువర్ధనుడు తనయగ్రసుతుడు విజయాదిత్యునకు యువరాజపట్టబంధము గట్టి బలమైనదండు నిచ్చి, కృష్ణరాజు నెదుర్కొన పడమటిదిశకు బంపెను. పాండురంగప్రభునికుమారుడు నిరవద్యధవళునకు నఖిలసేనాధిపత్య మొసగి మల్లరాజును దునుమ దక్షిణమునకు బంపెను. వినయాదిశర్మపుత్రుడు స్వామిశర్మను కళింగ కోసలాధిపులను ఎదిరింప నియోగించి ఈశాన్యమునకు బంపెను ప్రకటశౌర్యమూర్తులు, వీరాగ్రగణ్యులనగువారిని, విశ్వాసపాత్రులైనవారిని దండనాయకులుగా నియమించి, వారికి ప్రభువుగా తనరెండవ కుమారుని ఇఱుమర్తిగండనికి పట్టముగట్టి రాజధానిని సంరక్షింప నియమించెను. మిగిలిన మన్నెనాయకులను, దొరలను, పడవాళ్లను, సేనలను, తనమూలబలములుగా నుంచుకొని రాజధాని వీడివచ్చి, చాళుక్యభీముడు అప్రమత్తుడై దేశక్షేమ మరయుచుండెను.

అచిరకాలముననొక్కపెట్టునదేశమంతయుమహాసంగ్రామక్షేత్రమయ్యెను. ఒకయేడు గడిచెను. రెండవయేడుగూడ గడచెను. మూడవయేడు సగము సాగిపోయెను. నేలయీని యొసగుచున్నట్లు, ఎప్పటికప్పుడు బలములు తరుగులేకుండ నెక్కడనుండియో సాగివచ్చుచుండెను. ఎడతెగనిమూకయుద్ధములకతన దేశము కలగుండువడియెను. సంగరసంక్షోభము పెల్లుగానుండుటచేత, చోరులభివృద్ధినొందిరి. కాటకములు ప్రబలెను. పంటలు లేకపోయెను. అంటురోగములు చెలరేగి వ్యాపించెను. శాత్రవబలములు నడచినమార్గములందు బావులు, చెఱువులు, గుంటలు, ఏళ్లు, అన్నియు విషప్రయోగమున నిష్ప్రయోజనములయ్యెను. మహాగ్రామములు ఒకదానివెనుక నింకొకటి, అగ్నిదేవుని కాహుతియయ్యెను. ప్రజకు నిలువనీడయు, కుడువకూడును కఱవయ్యెను. దురదృష్టవంతులైనప్రజలు దిక్కుగలిగియు దిక్కుమాలిపోయిరి.

౧ మొగలిచెఱువు చెంత యువరాజు విజయాదిత్యుడు కృష్ణరాజు బలముల నెదిరించి పూర్ణముగ నోడించెను. కాని యతడు సుడివాలు౨ పోటునకు మిక్కుటముగ గాయపడి, చావుబ్రతుకులనడుమనుండి యాహవరంగమును విడిచిపోయెను. అందువలన ఆతని మహావిజయము నిరుపయోగమైపోయెను. దక్షిణమునందును నైఋతియందును జయాపజయములు ఒక్కతీరుగా నుండెను. తుదకు మల్లరాజ, కృష్ణవల్లభుల రెండుసేన లేకమై నిరవద్యధవళుని సేనను శ్రీపర్వతము చెంత మార్కొని ఖండించివైచెను. శాత్రవబలమంతట రాజధానినిగూడ నాక్రమించుకొనెను. మూడుమాసముల లహోరాత్రములు శరవర్షము గురియుచుండ ఇఱుమర్తిగండడు రాజధానిని సంరక్షించెను. కాని దైవసహాయము లేకపోయెను. కోట వెలువడివచ్చి వల్లభదండనాయకులను ప్రతిఘటించి పోరుసల్పెను. చివరకు విజయము కనుమూపుమేఱలో నున్నసమయమున, పెదవంగూరు3 యుద్ధమున, నిస్సహాయుడై, అభిమన్యుకుమారునివలె దుర్మరణము నొందెను. అంతయు ముగిసినవెనుక విజయలక్ష్మి యాతని మృతకళేబరమును పరిణయింపవచ్చెను. అచ్చటగూడ జయము నిష్ప్రయోజనమయ్యెను.

---

౧ ఇది ఓరుగల్లునకు సమీపమున నున్నది.

౨ ఇది యొకవిధమైన చక్రాయుధము.

3 ఏలూరునకు సమీపమున గలదు.

దేశమంతయు శత్రువుల కైవసమయ్యెను. ఆంధ్ర సైన్యములు చెల్లాచెదరై పోయెను. చాళుక్యభీమునకు, పుత్రవియోగదుఃఖము దుర్భరము కాలేదు. పదచ్యుతు డగుదునని భీతికలుగలేదు. తన ప్రాణముకన్న, తన రాజ్యముకన్న, తనసుతులకన్న నధిక ప్రియతము లైన ప్రజలు, పడుచున్న అగచాట్లను చూచి యా రాజ చంద్రుడు సహింపలేకపోయెను. సర్వలోకాశ్రయు డన్న తనబిరుదము దబ్బఱయైనదని యాతడు పరితపించెను. ఆతడు నిద్రాహారములు మానివైచెను. మృదు హంసతూలికాతల్పముపై పవ్వళించు సుకుమార మోహనాకారుడు ఆదినములలో అహోరాత్రములు సైనికులతోపాటు చాపకూడు భుజించుచు, వట్టినేలను చాప పఱచుకొని శయనించెను. అప్పుడతని కొక్కటియే చింత. శాత్రవబలములను నిర్మూలనము గావింపవలయును. రాజ్యలక్ష్మిని మరల వశముచేసుకొని ప్రజను సుఖముగా బాలింపవలయును. కాని అడుగడుగునకు జగడము. ఎచ్చటచూచినను పరాజయమే! ఎచ్చటగాంచినను ద్రోహులే! ఎటు నడచినను శత్రుసేనలే! సుందరమై మహోన్నతమైన యాతని మంగళగాత్రము కుషోపవాసములచే శస్త్రాస్త్రఘాతములచే కృశించెను విష్ణువర్ధను డానాడు ఏకకళామాత్రుడై జీవము గడపినాడు. కాని యా రాజచంద్రునికి ఉత్సాహ ప్రభు మంత్రశక్తులు సన్నగిల్లలేదు. ధైర్యసాహసముల నాతడు విడనాడలేదు

ఇంతలో వర్షకాల మేతెంచెను. కృష్ణాగౌతములు పొంగి పొరలిపోవుచుండెను. ఇరుపార్శ్వముల నుండి వేంగిమండలమునకు రాకపోకలు దుస్సాధ్యములయ్యెను. సైన్యములను మరల గూర్చుకొని రణరంగమును ప్రవేశించువఱకు భీమనృపాలు డెందేని యొక దుర్గమదుర్గమందు తలదాచుకొనదలచెను. చెంతనున్న కొలనుపుర మాతని కాకష్టకాలమున ఆశ్రయమిచ్చెను. రహస్యముగ నాత డందుప్రవేశించెను.

కృష్ణవల్లభుని సేనానులలో బద్దరాజు కడునుద్దండుడు. ఆతడు ముదిగొండపురాధీశ్వరుడు. చాళుక్యభీమునకు నాతడు తొలుతసామంతుడయ్యెను, కొండొక కారణమున ద్రోహియై రాష్ట్రకూటవల్లభుని నాశ్రయించెను. ఆంధ్రదేశాధీశ్వరుని రహస్యములను, ఒకటొకటిగా కృష్ణరాజునకు వెలిపుచ్చెను. బద్దరాజునకు భీము డెచ్చట దాగెనో ద్రోహులైనకొందఱు రాజపురుషులవలన రూఢిగా తెలియవచ్చెను. అతడప్పుడు మల్లరాజుచెంతకు జని, "భీముని జంపి, యాతనిశిరము దెత్తును, ఏమియొసగి బహూకరింతు" వని బేరమాడెను. భీముని యుత్తమాంగమును గొనివచ్చినవానిని "దక్షిణాంధ్ర మండలమునకు అధ్యక్షునిచేసి, కటకాధిపత్యము నిత్తు" నని మల్లరాజు వాగ్దానమిచ్చెను. పాకనాటికి ప్రభువు అగుదునన్న అడియాసతో బద్దరాజు ఉత్సాహోదగ్రుడై పెద్దదండుతో పైనమై వచ్చి, కొలనుపురమును దుర్భేద్యముగ ముట్టడించెను.

కొలనుపురము, కొల్లేటియొడ్డుననుండిన నొక మహాభీకరమైన దుర్గము. అది మండువేసవియందు స్థలదుర్గ మనిపించుకొనును. నిండు వర్షఋతువునందు దాటశక్యముగాని జలదుర్గమై అలరారుచుండును. ఆదుర్గమిప్పుడు కానరాదు. శిథిలమై, సంపూర్ణముగ కాలగర్భమున జీర్ణమైపోయినది. ఏడునిలువులలోతును, నూటయిరవదిరాజహస్తములు వెడల్పును, మూడుక్రోసులు చుట్టుకొలతయు గల్గిన అగడ్త, బలిష్ఠమగు నాదుర్గమును కాలసర్పమువలె చుట్టియుండెను. అందు మృత్యుదేవతకు భృత్యులనదగు, ముదుసలిమొసళ్లు అసంఖ్యాకముగ కొకటి చొప్పున వేలకొలది యుండెను. కోటగోడలు దట్టములై, ఆకసము నంటుచున్నట్లు నలువదిరాజహస్తముల ఎత్తునకు లేచియుండెను. పుంజీభవించిన భువనగోళములవంటి గవనులు, రెండు వైపులందును వెనుకంచు తలుపులతో, గోపురద్వారములతో, భీకరములయిన వంకదారులతో శోభిల్లుచుండెను. కోటచుట్టుగల బయలు వెలిపాళెములవఱకు భీషణములయి, అడుగిడుటకు నయితము శక్యముగాని మాయదారులతో నిండియుండెను. అందు కొన్నిదారులు లోతుతెలియని ఊబిలోనికి తటాలున దింపును. కొన్నిదారులు శరములు, ఖడ్గములు, కుంతములు, బాకులు, కటారులు, సురియలు, పరిఘలు మున్నగు నాయుధములు, నిలు

వుగా, నడ్డముగా, వంకరగా, పాతిపెట్టబడిన లోతు తెలియని మాయగోతులలోనికి పడద్రోయును. అట్టి వనేకము లాకోటచుట్టును గలవు. త్రోవ తెలిసినవారి సహాయము లేకున్న నాప్రాంతమున నడుగుపెట్టుట మిక్కిలి సాహసము. ఆకారణమున నాదుర్గము శత్రువుల కసాధ్యమై యుండెను.

ముట్టడి ప్రారంభమై యప్పటికి మూడుమాసములు గతించెను. తానట్లు ప్రాకారముగ చెఱబెట్టబడుదునని భీమ నృపాలుడు కలనైన తలపలేదు. ఇపుడు లోపలనుండిన యాహారపదార్థములు, నిండుకొనవచ్చెను. బయటనుండి లోపలకు గ్రుక్కెడు నీళ్లుగాని, పట్టెడుతృణకణములు గాని లోనికివచ్చుమార్గము లేకుండబోయెను. నానాటికి శత్రువులు బలవంతులయిరి. భీమనృపాలునిసేనకు ధైర్య కంచుకము సడలునట్లయ్యెను. అట్లే యింకను మరి యొకమాసము చెఱబడి యుండినయెడల నిష్కారణ దుర్మరణమో పరాజయమో నిశ్చయమని విష్ణువర్ధనునికి గోచరించెను. తనసేనకు శౌర్యోత్సాహశక్తులు అంతరించకముందు, బద్దెరాజు బలముతో సాహసించి తలపడి దైవబలముండిన జయమో లేదేని చచ్చి వీరస్వర్గమో గొనవలయునని యాతని కపుడు నిశ్చయము దోచెను.

తనకై తమసర్వస్వమును సంతోషముగ త్యాగము చేసి, బ్రతుకుపై నాసవీడి, సమరమునకు సంసిద్ధులై యున్న పడవాళ్లను, మన్నెనాయకులను, సేనాసమూహమును, సేనాపతి, మహాసామంతామాత్యపురోహితాది ఆప్తమంత్రివర్గమును, చాళుక్యభీముడు తనసముఖమునకు రాబనిచెను. వారెల్లరు కొలువుకూటమునం దుచితాసనములం దుండి, బలిసి కొలువుండిరి. అపుడు వారిదెస పరికించి యారాజపుంగవుడు పరివేష్టించిన వీరకదంబకమును వారివారి నియోగముల ననుసరించి యుద్దేశించుచు, నందఱకిని యథోచితములైన సంజ్ఞలు, అడియాలములును గల్గించి సన్మానించెను. పిదప సకల సేనాసమూహమును సంగరాటోపమున నుండుట గాంచి సుహృష్టుడై, ఎల్లవారలకురణోత్సాహము విస్తరించి, రోషము ఘనీభవించి సాహసము వెల్లివిరియుటకునై, మృదు మధురగంభీరభాషణముల నిట్లని ఆనతిచ్చెను.

“ఓహో రణశూరులైన యోధవరులారా, అన్నలారా! మీకెల్లరకును శుభములు కలుగుగాక! సంతతరణోత్సాహులైన, బ్రాహ్మణవీరపుంగవులారా! మీకెల్లరకును సేమమగుగాక. మీకందఱకును మీబంధువులకును, మీకులస్వాములకును మారాజచాళుక్యవంశముపై గల భక్తిస్నేహవిశ్వాసములు, మద్రాజ్యసంరక్షణమందు మీకు గల నిరంతరసేవానురక్తియు, తరతరములనుండి మావంశకళ్యాణాభ్యుదయమునకు మూలకందము లగుచున్నవి. అక్కారణమున నేమును మత్కులమువారెల్లరమును మీకు సర్వదా కృతజ్ఞులము!

“నేడు మార్గశీర్షశుద్ధదశమి. ఎల్లి యేకాదశి. మహాపర్వదినము. అల్లదే పరికింపుండు! కోటకావల బద్దెరాజు విస్తారమైనదండుతో నిష్కారణముగ మనలను బంధించుచున్నవాడు. ద్రోహియై యాతండు మాకులవైరుల నాశ్రయించి మనలను పీడించుచున్నవాడు. మనపటువిక్రమసాహసములును నేటికి మూడుమాసములనుండి బంధించినాడు. మనకిపుడు పరీక్షాసమయమేతెంచెను.

“మీరును, మీకులమువారెల్లరు శతానేకసమర సంఘట్టములందు భీకరశౌర్యమూర్తులై విక్రమించి, పటుసాహసమున మాకు విజయలక్ష్మిని బలిమిమైగొన్న వారు! అట్టి ఆంధ్రమహావీరపురుషసంతతి మీరు! పరమహీపాలపరాజయోత్పాదనమైన మీపరాక్రమమునకు నిష్కారణముగ నపచారము కలుగబోరాదు! మనశత్రువులు యుద్ధసన్నద్ధులై వెడలివచ్చి విడిసియున్నారు. మన మింక నలసింపజనదు! మనమును ప్రతిరణము నేయవలయు. మీమీహస్తములందు మాకు విజయసాధనములై మెఱయుచున్న భీకర, శార్ఙ్గ, ఖడ్గ, కోదండ, కుంత, చక్రాయుధములదీప్తులు మాకు విజయాభ్యుదయములను పరంపరగ ప్రాప్తింపజేయు గాక!

“పగదీర్చుకొనుటకు బవరంబునేయ పాడి మీకు; భయదోగ్ర సంభూత పటురోషవహ్నితో పరబలము నఖిలమును భస్మీపటలము జేయుడు. లెండు, పయనము గండు. ఈ దారుణరణమందు జయముగొని ధరణీరాజ్య



ఏర్కాడునందలి యొకానొక రమణీయప్రదేశము

ఏర్కాడు 'దరిద్రుని ఉదకమండలము.' ఇది సేలంజిల్లాలో నున్నది. దీనిఎత్తు సముద్రమట్టమునుండి ఐదువేల అడుగులు. A. N .S.



ఉదకమండలము

A. N. S.

మును వడసెదమొందుము! లేదేని శాశ్వత నాకలోకనివాసమును గనియెదమొందుము.

“ఈరాత్రియే సంబరముతో కదనస్థలికి కదలిపోవలయు. వీరాగ్రగణ్యులై వెలసినమీకు శోధింప వచ్చెను శూరధర్మంబు నేడు. కదనవిక్రమముల కలనికి గదలుడు మీరు!”

చేత భైరవఖడ్గముబూని మొగము రోషముతో జేవురించి భీకరాకృతినొంద, అట్టహాసముతో దట్టించి పలికిన భీమనృపాలుని మాటలు, అఖిలసేనాసమూహమునకును రణోత్సాహముపెల్లుబ్బజేసెను. “మీపాదభక్తులమైన మాయందు శౌర్యంబు చావలేదు. శత్రువులపైబడి, తెగటార్చి మాస్వామివౌ నీబుణము దీర్చుకొందుము! సుస్థిరవిజయంబు సమకూర్చెదము నీకు! వినవయ్య మాప్రతిన సర్వలోకాశ్రయుండ! మము జూడు, మాశౌర్యపటిమజూడు! పగబూని, బద్దెరాజు క్రొవ్వణగించి, విడువక వానిబలమెల్ల జంపగాగలము! ఇత్తుము మేమెల్ల నీకొఱకు మాప్రాణములను! నీపాదములాన! నీకులదైవతము నాన!” అనుచు పౌరుషోత్సాహములు ముప్పిరిగొన, వీరులందఱు పెక్కుపంతములాడిరి.

ఆంధ్రోర్వీపతి నాడుపల్కిన వీరవాక్యములకు ఆంధ్రవీరుల రక్తనాళములు, ఉబ్బి పొంగిపోయెను. తనుకు కాలము నాటితో గడచిపోయెననుచు, ధరణీశు సముఖమున వీరులు నాయకులందఱు వివరముగా విందులు భుజియించిరి. తఱుచు రక్తమునతడిసినయట్టి జందెములను బిరుదుగా ధరియించిరి. రక్తగంధము నలదుకొని రక్తమాల్యములు ధరియించిరి. కయ్యమునకు గావలసిన సన్నాహములు చేసిరి.

ఆనాటిరేయి, ఎందుబోయినను పరువైనమా పేరు కల్ల చేయమని వీరాలాపములు వినబడెను. ఎల్లి మాకు మరణమో, విజయమో అనుచు సంగరాటోపమే కనబడెను. “అలుగులదీప్తికి అలుగక పోరు సల్పుదుము; *శరములదీప్తికి జడియక పగవారిలో జేరి యిట్లు దునిమెదము.” “సందడిరణమున శంకనొందక మా ఖడ్గహతులకు పరబలముల గూల్చివైచెదము” “శాత్రవవీరులు చుట్టుముట్టిన, భంగము నొందక బహుతరనైపుణ్యపటిమ ఇట్లు బవరంబుసేయుదుము” “మగబిడుదు జాతిన మాకు నపకీర్తిగాదె!” అను ధీరవచనములు, ప్రతినలు, అట్టహాసములు అందందు సేనాసమూహమునందు గానవయ్యెను. ఆ బవరంపు పెండ్లికొడుకుల చూచిన అప్పుడాంధ్రోర్వీశునకు మేన పులకలు జనించెను. ఆతడును సమరైకదీక్షాపరుడై భీషణప్రతిజ్ఞబూని, తనకులదైవతము, తనపేరింటివాడు, దక్షవాటి భీమనాయకుని పూజించుచు, మహాశస్త్రాస్త్రముల నుపాసించె.

## ౪

పరీధావి గడచిపోయెను, ప్రమాదిసంవత్సరము గతించెను. ఆనందకూడ నడచిపోవచ్చెను. మూడేండ్లు అహోరాత్రములు తనయిలయేలిక నొక్కతీరుగ నగచాట్లు పడుచుండుట, తపోనిష్ఠాగరిష్ఠుడైయున్న రంగాధికక్కశర్మ చిత్తవృత్తి నింతయు చలింపజేయలేదు. అట్లుండ మార్గశీర్షము ప్రవేశించెను. అపుడాతడు కృత్తివాసునిపూజయందు దీక్ష నించుక విరమించెను. ఆనాడు శుద్ధతృతీయతిథి. ఆరాత్రి లేతవెన్నెలకిరణముల కాంతియందు, భుజించి సుఖోపవిష్టుడైయున్న భర్తను తిలకించి, రంగశర్మయిల్లాలు, ఇంచుక కంట తడిపెట్టుచు “ఎఱుగనే యెఱుగరు గాబోలు! మీముద్దుల మఱది మాధవచమూపతి బిక్కనప్రోలు రణరంగమున, సందడియుద్ధమున బల్లెపుపోటునకు ఈల్గినగతి? మగకాసెకట్టి, కత్తిని చేబూనినందులకు ప్రభుఋణము దీర్చుకొని, సత్కీర్తి గనినాండు. దేశమునకై ప్రాణము లర్పించి ధన్యుడైనాండు. కాని నాకుమాత్రము తోడబుట్టువు.........కఱవయినాండు” అనుచు గద్గదిక నొందెను.

ఆపలుకులకు రంగశర్మ నిశ్చేష్టుడయ్యెను. సహజముగ నతిధీరమైన యాతనిహృదయ మపుడు కరగి నీరయ్యెను. ప్రయత్నము సలిపి, ప్రియురాలిదుఃఖము నుపశమింపజేయలేక పోయెను. ఒకింతసేపు ఆతరుణి యట్లు దుఃఖాశ్రువులురాల్చి; “ఆర్యపుత్రులు ఎంత

తపోనిష్ఠాగరిష్ఠాత్ములైనను అపత్సమయమున ప్రియురాలి దుఃఖమును బంచుకొని కృపకలిగి యూరడింపజాలరు? పోనిండు. మీ తెలుంగనిధర్మములు ఏమెఱుంగుదునె?" కులపత్ని యిట్లు పలికెనని కిన్కబూనకుండు. కుల మర్యాద పాటించి యైన మీరు రాజసేవనుజేయనొల్లరు గాబోలు? పూజ్యులయిన మామగారి యాదేశమును వారికే యొప్పజెప్పితిరి? చాళుక్యభీమ భూపాలునకు వాటిల్లినయాపద అఖిలాంధ్రభూమికినిగాదో? మీ శౌర్యము, మీవిక్రమసాహససఫూర్తి, మీ ఖడ్గకౌశలము, ప్రఖ్యాతములుగావె? మీ శస్త్రాస్త్రవివేకము, కరితురగాగముకౌశలము దేశకళ్యాణమునకు ప్రభుసేవకు విని యోగపడజేని సార్థకత యెందు వీనికి? రణరంగమున దుమికి పెడబొబ్బవెట్ట, పృథివీశులందఱు మీముందు భయమందిపోఁగలరు! కదనస్థలికి పయనముగండు. మీ తెలుంగని నీతిశాస్త్రములు లేవు. ప్రియసతి దుఃఖోపశమనమున కేమిలెండు. జననమరణములు జనులకు నిక్కము. పౌరుషాధికతగల్గి బ్రతుక టిదిలెస్స! మన రాజచంద్రునకు గులవైరమును దీర్ప గురుతరసాహసులు మీరు. మీ కులస్వామి ననుసరించి సన్మార్గమున జని ప్రభుఋణము దీర్చుకొనుండు. సర్వలోకాశ్రయుండు మీసాయమునకై యెదుర్లుచూచుచుండు! పరికించిచూడ ప్రభువునకు సాయపడువారు మీరుదక్క నొరులు లేరు. మీ పావనవంశమును వర్ధిల్లచేయ, మిముబోలియున్న అయువున్నంతుండీకందువొక్కండుజాలు. కదనభూమికై కదునడిగకదలుండిమీరు! అచ్చట జయమో, మరణమో కొనుండు. పందలక్రియ నింట గూర్చుండ పనిలేదు. రణరంగమున క్షాత్రవవిజయము సముహూరుమీకు! భైరవ ఖడ్గము వడినిచ్చుమీకు జయము. అఖిలశుభములు గలిగి వర్ధిల్ల గలరు మీరని యుపశ్రుతి వినవచ్చుచున్నది. మీ సాహససఫూర్తికి పరాక్రమమున వెఱచి శత్రుసైన్యములు చెదరిపోగలవు. లెండు. బవరంబుసేయ యైనంబుగండు, నామాటమన్నింపుండు" అనుచు వేయివిధములప్రాణ విభుని హెచ్చరించెను.

మహాపతివ్రత, వీరపత్ని, కులసతి పలికినభీషణ వాక్యములు రంగశర్మ నాపాదమస్తకమును కంపింప జేసెను. అతని మేన నొక్కసారి శ్రీవీరరక్తము చిమ్మ రించెను. రాజసేవలకు రణమే సుఖమని తోచెను. అంతట రోష మొక్కసారి అగ్నిజ్వాలవలె నెగసి యాతని దేహమును మహనీయ శౌర్యతేజముతో వెలిగింప జేసెను. సహజారుణములైన యాతని నేత్రాంచలము జ్యోతిర్మయములై తేజరిల్లెను

అతక్షణ మాతడు కవచియై, కోదండియై, ఖడ్గియై రణోత్సాహియై హుంకరించి, అశ్వమారోహించి, శర వేగముతో నిలువెడలెను. సంగరాటోపముతో జనుదెంచి కులదేవతలకును, ఇష్టదైవమునకును సాష్టాంగముగ నమస్కరించి, లేచి విజయాభ్యుదయమునకై చిత్త మేకాగ్ర మొనరించి ధ్యానించెను. పిదప నాతనికుల సతి కడ సెలవుగైకొనెను. అంత రంగశర్మ కులపాలిక ప్రాణేశ్వరుని కెదురుగా నిలిచి, మేన రక్తగంధ మలది రక్తమాల్యమును కంఠమున వైచి, ఆయుధము గైకొని దీవించెను. పిదప కైవార మొనరించి "జయ" వెట్టెను.

రంగశర్మ ఆరీతిగా నిల్లువెడలి నాలుగహోరాత్రములు మార్గాయాసము నెఱుగక, కార్యభారమును దలచుకొనుచు, సంరంభముతో రాజధాని విజయవాడ కేతెంచెను. తండ్రితాతలనాటినుండి యాతని నెఱిగిన వృద్ధరాజసేవకు లెవ్వరును రంగశర్మకు గానరాలేదు ఎదురొక్క లీయలేదు. రాజధాని యారీతి నుండుట జూచి యాతడు వెఱగందెను. రాజచాళుక్యభీముని సింహాసనమువై, వృద్ధుడు, ద్రోహి, కుటిలమతియు నగు మల్లరాజు అధిష్ఠించియుండెను.

బ్రాహ్మణవీరుని రాక నెఱిగింప, మల్లరాజు రోషించి యాతని "రయమున బంధింపుడు; వైబడి ఖండింపుడ"ని ఆనతియిచ్చెను. అవృత్తాంతము రంగ శర్మకోపమును మరింత రగుల్కొల్పెను. తన్ను బట్టవలచి వచ్చిన క్షుద్రవీరసమూహముపై దుమికి సింహనాదము చేసి ప్రళయకాల భైరవునిభంగి నొక్కడుగూడ తప్పి పాటిపోకుండ ఖండించి గూల్చివైచెను. ఆవార్త మల్ల రాజునకు దెలియునంతలో నాపద వాటిల్లగలదని యెంచి, ముందుకార్యము నాలోచించుచు, విజయవాడ

యం దొకముహూర్తమైనను నిలువరాదని, ఆకలి దప్పులనైన దీర్చుకొనక, హుటాహుటి వేంగీపురమునకు బైనమయ్యెను.

రంగశర్మకు వేంగీపురమందు గూడ ఎఱిగినవా రెవ్వరును గానరాలేదు తనసహపాఠులు, చెలులు, చుట్టములు, మున్నగువారు, కొందఱు హతులైరనియు, కొందరు దేశమువీడి, పాఱిపోయిరనియు, కొందఱు రాజద్రోహులై చరియించిరనియు విని, దుఃఖించెను. ఆమహానగరమున నాతనికి ఎవ్వడుహితుడో, ఎవ్వడు పగవాడో, కూడ తెలియదయ్యెను. ఆ బ్రాహ్మణవీరుని గాంచి, కొందరు తమలో గుసగుస లాడుకొనుచు, దూరమునుండి చూడ్కులు నిగుడించుచు, పోయిరి. మరి కొందఱు భీతచిత్తులై సందుగొందులబడి వడిగ బోయిరి. మరికొంద రాతనిమార్గమును వైఖరియును దవ్వుదవ్వుల నుండి పరికించుచు అనుసంధించుచుండిరి. ఆతనికంతయు నతి విచిత్రముగను, సంశయాస్పదముగను దోచెను.

ఆనాడు నవమి ఆనాటిసాయంకాలమున నాతడు భీమతటాకముచెంత నొకచింతలతోపులో విశ్రమించెను. పైనగాయుచున్న వెన్నెల, దట్టముగా బెఱిగిన యా తోటలోనికి జొరలేదు. అందంతయు గాఢాంధ కారము. ఆతోపు అతిభీకరమై యుండెను. సంక్షుభిత చిత్తముతో నాతడు కర్తవ్యముదోపక సంతాపము నొందెను. ఆకలిదప్పు లాతని వీడిపోయెను. రెండుదిన ములనుండి యాతడు ఆహారనిద్రల నెఱుగడు. అశ్వము నొకచెట్టునకు గట్టి రంగశర్మ నేలపై మృగాజినమును బఱచుకొని ఆలోచనాప్రవాహమునందు కొట్టుకొని పోయెను.

అంతట దవ్వులందు వికృతమైనసందడియయ్యెను. కండ్లు విప్పాఱజేసి, లేచి నిలువబడి, భైరవఖడ్గమును చేబూని సందడివచ్చినదిక్కు మొగమై పరికించెను. ముహూర్తములు కొన్ని గడచెను. అంతయు నిశ్శబ్ద మయ్యెను. రంగాధిశర్మ యెదుట వీరపురుషు డొకడు, కోరమీసములవాడు, భీకరాకారుడు, సాష్టాంగముగ బ్రణమిల్లి, లేచి, “ భూదేవులవధరింపవలయు ! మీ వృత్తాంతమునంతయు మహామాండలిక ఎఱియరట్టడి బంపినవేగులవాండ్రవలన నెఱిగిరి. ఎఱియరట్టడి నాత వాడిసీమ కధిపతి. తా మెఱుగకపోరు. మంచి కొండ విషయాధిపతి. కుసుమాయుధుడు తనసోదరుడు రణ దుర్జయుని, దండు సాయమిచ్చి మీకు సాహాయ్యము చేయ బంపెను. భీమనృపాలునిసేనలను మరల రణ భూమికి నడిపింపసాహసముగల దక్షు డెవ్వడును ఈ వేంగియందు గానరాడు. సేనలకు వెన్నువిఱిగినట్లయ్యె. మీ వృత్తాంతమును దెలిసినదాదిగా మీరు సర్వసేనాధి పతులై రాజకార్యము నిర్వహింప సమర్థులని ఎఱియ రట్టడి సందేశమంపెను. నన్ను గుండయరట్టడియని మావారుపిలిచెదరు. రాజ చాళుక్యభీముడు మెచ్చి నాకు వేంగివిషయాధిపత్యము నొసగెను. ఇదిగో మా తామ్ర శాసనము. సంశయింపవలదు. మీ రానతిచ్చిన ఎనిమిది ఝాములలోపల, ఏనూరుగజములు, నాలుగువేలవాజి గణము, ఇరువదివేలకాలిభటులు, శరములు, ఖడ్గములు, పరశువులు, బల్లెములు, బాకులు, కటారులు, విండ్లు వేల సంఖ్యలకొలదిగూర్చి, వేగమే రాగలరు. ఎల్లి ఈవేళకు కొవ్వలిగ్రామముచెంత, గుడిసానమ్మచెఱువు సమీప మున బయలునందు మాదండు విడిసి, మీరాకకై ఎదురు చూచుచుండును. మమ్మనుగ్రహించి సేనాధిపత్యమును స్వీకరింపుడు. వెండియు విశేషము కలదు! ఎఱి యమాండలికుండు తనమూలబలములను గూర్చుకొని పూర్ణిమనాటికి కృష్ణ కావలియొడ్డున అనంతునికొండదఱి విడిదిదిగియుండును. ఎల్లుండి విష్ణువర్ధనుడు బద్దెరాజుపై దలపడ సంకల్పించి నాండని విందును, మన మీకాలను పురయుద్ధమున విజయులమై, రాజధానిని జేరుకొనగల్గిన, మనకు శాత్రవవిజయము సిద్ధము. ఇంద్రకీలాద్రియెక్కి, కార్తికేయుని గుడిగోపురమువీద కరదీప మెత్తి చూప గల్గిన, ఎఱియమాండలికుండు, కృష్ణ దాటివచ్చి మన సేనతో గలియగలండు. అప్పుడీధరణీరాజ్యము మరల సర్వలోకాశ్రయునికి కైవసము కాగలదు.” అని వినయముగ, గంభీరముగ, విశ్వాసము జనించునట్లు విన్న వించెను.

ఆతని ప్రసంగమునంతయు నాలకించి రంగశర్మ నల్దెసలు పరికించెను, కొండొకసేపు వెఱగంది మాటలాడక యూరకుండెను. ఆలోచనయందు మునిగిపోయెను.

“తమయాజ్ఞకై వేచియున్నాడను” అని మాండలికగుండయరట్టడి మరల విన్నవించెను.

“నన్ను మీవాండనని ఎట్లు గ్రహింపగలిగితివీవు? మోసపోవుటలేదుగద నన్ను గాంచి?” అని రంగశర్మ ప్రశ్నించెను.

“భూదేవులు మన్నింతురుగాక! అశనపురమున నైదుదినములపూర్వము తాము గుంజ దేవభట్టారకులింట నుండిన నాటివృత్తాంతముల నన్నిటిని తలంపునకు దెచ్చుకొనుండు. తామిపుడు విశ్వసింపవచ్చును. రాజభీముని ముద్ర యిదిగో పరికింపుండు.” అనుచు మాండలికగుండయ వచించెను.

రంగశర్మ దీర్ఘనిశ్వాసమును విడిచి “లెస్స! మేలు! నన్నిపుడు వీడిపొమ్ము! ఏనిపుడు కొన్ని విషయములు యోచనచేయవలయు. ఎల్లి నీవుకోరినరీతి సైన్యాధిపత్యము నంగీకరింతును. దైవ మనుకూలించుగాక మన నృపాలునకు” అని శూన్యభావము తేటపడుదృష్టితో, శాంతముగ బలికెను.

మాండలికగుండయ మరల రంగశర్మకు సాష్టాంగముగ బ్రణమిల్లి, యొక్కత్రుటిలో మెఱపువలె చీకటిలోనికి అంతర్ధానమయ్యెను. ఆరాత్రి రంగశర్మ నిద్దుర బోలేదు. ఒకవంక చలి వడకించి గుమ్మడిమూట గట్టుచు నుండగ, నా చిమ్మచీకటియందు, ఆత డట్లె కృష్ణాజినముపై నాసీనుడై ఆలోచనలందు నిమగ్నుడయ్యెను.

ఆనాడు మార్గశిర్ష శుదదశమి. చంద్రోదయమయ్యెను. రంగశర్మ సేనాపతియై రణలక్ష్మి మూర్తీభవించినట్లున్న సేనాసమూహమును దిలకించి సుహృష్టుడయ్యెను. కాలరిపౌజులు బారులు దీర్చియుండ, పడవాళ్లు, దొరలు, నాయకులు ఖడ్గములతో, కైదువులతో, కటారులతో వినతు లొసగుచుండ పరికించెను. పొందికగా నమరినఅశ్వబలమును కలయగాంచి వీరరాహుత్తుల జోహారు లందుకొనెను. గుంపులుగాగూడిన గజసేన గాంచి, యా మదకుంజరములు నమస్కారసూచకముగా తుండములు పెకెత్తి ఘీంకృతులు చేయ సంతుష్టుడై తలపంకించి హుంకరించెను. పిదప నాయకవర్గమున కెల్ల, తగినట్టి కర్పూరతాంబూలమిచ్చి, శంభుతీర్థ మొసగి జయము గొనుడంచు ముదమందబలికెను. అంతట శుభముహూర్త మడిగి భేరిడమాయీలు పెల్లుగా మ్రోయింప నానతిచ్చెను. శాత్రవబలముల నెదుర్కొన నుపాయములను నాయకులకు పూసగ్రుచ్చినటులు దెలిపెను. దండునంతయు మూడుపాయలుచేసి మూడువైపులనుండి గదలుడని యానతిచ్చెను. సైన్యములు సంగరాటోపమున కదలువేళ పృథ్వీతలమెల్ల తల్లడమందెను. ముందు డమాయీలు, మురజలు, బూరలు, భేరీలు, కాహళములు, వంకిణీలు, కాలికొమ్ములు, శంఖములు, నరగలు, తప్పెటలు, రుంజలు మొదలగువాద్యములనాదములు విన్నవారికెల్ల వీనులు పగులునట్లుగ మ్రోగింపబడెను. ఆభీషణనాదము గగనంబుగప్పెను. దిశలు ప్రతిధ్వని లీనెను. మహాసైన్యము కదలి వడివడిగ కదలిపోయెను. అంతయు నొకక్షణములోపల మరల నిశ్శబ్దమయ్యెను. సేన లేదెక్కడను నడచెనో ఎఱుగరాకుండ బోయెను.

కొలనుపురమున కోడికూతవేళ రణభేరి మ్రోగెను. వైతాళికులు సేనల కుత్సాహము కలిగించుటకు భైరవీరాగాదుల నాలాపించిరి. సంగీతము ముగిసినవెనుక భేరీ, డమరుకాదిబహుళతర భీకరవాద్యములు చెలరేగెను. బూరలు, కాహళములు, శంఖములు పూరించి సైనికులు భీషణారావములు చేసిరి భటుల సింహనాదములు గావించుచుండ, మదకరులు ఘీంకారములు సల్పుచుండ అశ్వములహ్రేషలు నల్దెసలు వ్యాపించుచుండ, భీమనృపాలుడు సాహసమడర, కోటవెలువడివచ్చి, హుటాహుటి, నడిచి బద్దెరాజుసేనపై బడెను.

అప్పుడే వెలిపాళెముల చెంత రెండుపెద్దమూకలు సందడికయ్యమునకు దలపడినట్లు విష్ణువర్ధనుడు కాలరి వలన నెఱిగి, యిష్టదైవ మనుగ్రహించినాడని ఆనందపరవశుడై “జయ! హరహర! మహేశా! అని వీ

రాట్టహాసముజేసెను. వీరుల కుత్సాహము గలుగునట్లు ధవళకాండమును తన భీషణశంఖమున వింతరీతుల పూరించి సాంద్రనాదము చేసెను.

ఒక్క ముహూర్తము లోపల సందడిరణము ప్రారంభమయ్యెను. ప్రొద్దెక్కు కొలది పోరు భీకరతరమయ్యెను. ఆదారుణరణ క్రీడయందు ఘనతరోత్సాహులు కాలిమానుసులు అట్టహాసము చేయుచు చేత కరవాలములు, కటార్లు భిండివాలములు, సుడివాలములు గొని శత్రువీరులపై గదిసిరి. ఒకకాలు తెగినను హుంకరించి యెగిరి పోటుకారులైన పగఱమీదకు క్రోధావేశమున దుముకుచుండిరి. ప్రేగులు త్రెళ్లి బయటపడుచుండ నొకచేయి యెత్తిపట్టి రెండవచేత కుంతముబూని శత్రువులపై గవియుచుండిరి. ఒకతల తెగియును మహోగ్రులై తాము మున్నగన్పడినవారిని పొడిచి పడుచుండిరి. తెగిపడియును రోషము జేవురింప, క్రిందిపెదవి గఱచి, బొమముడివైచి చెన్నుచెదరక శౌర్యమూర్తులై కూలుచుండిరి. సాహసముగల విలుకాండ్రు బాణములు, తూణీరములు, అలుగులు వేలసంఖ్యలకొలది బఱపుచు వర్షము గురియుంచుచుండిరి. ఏనుగులగుంపులను అశ్వసమూహములను, మావంతులు రేవంతులు బవరమునకు బురికొల్పుచుండ, తొండములు తెగియు, తలలు గూలియు నీల్గుచు, పెనువృక్షములు వాయుహతిని గూలినట్లు ఘూర్ణిల్లు శబ్దములతో నేలగూలుచుండెను. అందు వీరాగ్రగణ్యులు తమతమవాహనములు కత్తి వ్రేటులకు, కుంతప్రపోటులకు చురికాగ్రఘాతములకు నేలగూలుచుండ, సాహసస్ఫూర్తి మెఱయ, సమీపవర్తులవాహనముల నధిరోహించుచు, నధికరోషముతో, పరిఘులు బూని పగవారిగుండియలు చీల్చుచుండిరి. తాము నొచ్చియు, నేడ్దీర్చుకొనబోక, సడలిన నేత్రకాండ్రను నడ్డుపడుచు పటిమతో పోరు సాగించుచుండిరి.

ఎచ్చట జూచినను పీనుగులపెంటలు, వరదలై పాఱురక్తప్రవాహములు. ఎందు గాంచబోయినను, బాధ నోర్వలేక నార్చుచు, బొబ్బలిడుచు తెగిపడిన పదాతులు, ప్రాణములు విడుచుచు ఘోరాకృతినున్న జంతువులు గుప్పతిప్పలై యుండెను. ముంజేతులు, వికావికలైన మొండెములు, బాహువులు, తొడలు, త్రెళ్లి వచ్చినశిరములు, ప్రేవులు మున్నగునవి ఖండఖండములుగా తెగిపడియుండెను. అట్టి వికటభీకరదృశ్యములతో భీషణారావములతో నొక్కపెట్టున ఘోరరణమయ్యెను.

అపరాహ్ణమయ్యెను గాని జయలక్ష్మియేరికిని వశముగాదయ్యెను. రణలక్ష్మివచ్చి యావేళమైనిల్చిన భంగి ఉభయబలములు పెనబొబ్బవెట్టుచు, ప్రకృపై నాసపాలు వ్రోలి, పటువిక్రమాఢ్యులై బవరము నేసిరి. మూలదళముల గొనితెచ్చి, కుంజరసమూహమును పురిగొల్పి, సాహసముతో విక్రమించినగాని జయము కైవసముగాదని బద్దిరాజు నిశ్చయించెను. ఒక్కత్రుటిలో మూలబలములు దెచ్చి పురికొల్పి కాలరిమూకను యిరుపార్శ్వములునుండి భీమభూపతిదండును దాకవలయునని యానతిచ్చెను.

ఆ సందడి సంగరకోలాహలమున, బద్దిరాజు దండనాయకులు గుఱ్ఱములపై నెక్కి, దుమికించుకొనుచు వచ్చి భీముని కదిసి చుట్టుముట్టాడిరి. ఆంధ్రోర్వీశుడపుడు భీకరసింహనాదము చేసి, దంతావళముపైనుండి ధనువు బూని శరపరంపరల బఱపి, శాత్రవసమూహమును చీకాకుపఱచెను. ఉభయనాయక వర్గముల యనుచరు లంతలో శత్రువీరుల వెన్నంటి పోరుచు ఘోరయుద్ధము జేసిరి. ఆసంకుల సమయమున పన్నిద్దఱువీరులు నొక్కపెట్టున భీమభూపాలుని ఎదిరించి, పెక్కువిధముల బాదివి, నేలగూల్ప దలపడిరి. ఆరాజశ్రేష్ఠు డపుడు రోషము ప్రకటించుచు, కాలాగ్నిరుద్రునివోలె, నార్చుచు శాత్రవబలమెల్ల తెగి కలతనొందు భంగి శరవర్షముల గురిపించుచు, రణకేళి సల్పెను. కాని అంతలో నొకడు ఛురికాగ్రమున భీమభూపతి భద్రగజమును డొంకెనపోటు పొడిచి, తుండమును ఖండించెను. వేరొకడు కుంభస్థలముపైకి కొదమసింగము మాడ్కి దుప్పించి ఎగిసి కుంతమును గ్రుచ్చెను. ఆవాడి పోటున నేగలేక నా భద్రగజము నేలగూలెను.

భీము డపుడు తటాలున నేలకు లంఘించి, పటు విక్రమముతో ఘోరభైరవఖడ్గముబూని, యవనాశ్వ మారోహించి, పైబడుచున్న రాహుత్తవర్గమును జంపి, సింగిణివిలుకాండ్రను, చిదుగఁగొట్టి, ఖడ్గఖేటకముల ఖండించి మించి, తనతనువున బాణములు శరములు, అలుగులు, బాకులు దాకకుండఁగ, నైపుణ్యముతో బాయఁ గొట్టుచు విచిత్రముగ సమరైకభైరవుఁడై పోరు సల్పెను. అట్లు కొంతసేపు సాగునప్పటికి దైవవశమున బాణ మొక్కటి యాతనిగొమ్మన దూసికొని బాధించి నేల బడ ద్రోసెను.

అయాపత్సమయమునందు చాళుక్యభీముని యనుచరవీరుఁడు, గండరగండ డొకఁడు, భటసమూహముఁదెచ్చి, శత్రుసైన్యముపై జయ్యన గడియ పురికొల్పి మనుజులలో మారిమసగినరీతి హుంకరించుచు యుద్ధము చేసెను. తనవారు పగవారిని కూలజేయుచునుండ "రణధూర్తులై వచ్చిన శత్రుచయమును గూల్పజాలని పౌరుష మది యేమిఫలము. ఆంధ్రవీరసంతతి మీరు. చాళుక్యరాజాన్వయవర్ధిత రక్తముగాదె మీనరములందు పాఱునట్టిది, కలుషాత్ముఁ డొక్కనిచే మనరాజు ఘాతనొంది మూర్ఛిల్లినాఁడు. నమ్మిన మీరాజును గావంగవలయు, రండోయి వీరఘనులార! పుణ్యాత్ములార!" అనుచు కదనస్థలమంతయు కంపించునటుల యెలుగెత్తియఱచెను.

అంతలో భీమభూపతి సేదదేరి, రక్తముపాఱకుండ కట్టుడిచేసి భీకరసింహనాదము జేసి పంతములు బలుకుచు వెన్నిచ్చి పాఱకుండ భటవర్గమును పురికొల్పెను. భీముడు చావలేదను వార్త శాత్రవవీచయమునకు రోషము కలిగించెను. అపుడు బద్దెరాజు వీరనాయకుల నల్గురైదురను సాయముగఁ గొనివచ్చి గండ్రగొడ్డండ్లతో, శూలములతో, సురియులతో క్రమ్మి, బాకుతో బొమ్మ పగులగొట్ట నుంకించెను.

అట్టి ఘోరవిపత్సమయమున రంగశర్మకు ఆంధ్రవీరునియార్తనాదము చెవిసోకెను. అపు డాతఁడు పటువిక్రమాఢ్యుఁడై కడుచోద్యముగ, శాత్రవరాహుత్తుల గుఱ్ఱపుమొగ్గరమును జొచ్చి, ఖండించుచుండెను. ఎవ్వాని క్షేమమునకై తాను జపము తపమును మాని, సమరకార్యము జరుపఁ చనుదెంచెనో, యట్టినమ్మినరాజు కూలనున్నాఁడని వినినంతనే, రంగాధిశర్మ గుఱ్ఱమును ఆ దిక్కునకు దుమికించి యెగసెను. ఒక్కక్షణములోపల తన్నెదిరింపవచ్చిన రాహుత్తులశిరములు గొట్టుచు, బొమ్మలు గ్రుచ్చుచు, ముంజేతులు నఱకుచు భుజశౌర్య మొప్ప సైంధవవధవేళ విక్రమించిన విజయునివలె పఱతెంచి, భీమభూపతిని చీకాకుపఱచుచున్న శాత్రవసమూహమునందు గొండభేదించు పిడుగువలె నుఱికెను. బద్దెరాజు గండ్రగొడ్డలిబూని భీమునిశిరము దెగవేయ నుంకించుచుండ నలువంకలను వీరభటులు ఖడ్గకుంతములతో పొడువఁదలపడుచుండ, వేటుపడిన కొదమసింహముమాడ్కి కనలి చిత్రగతి యుద్ధముచేయు నిజస్వామికి ఖడ్గసాహాయ్య మిచ్చెను. కనుఱెప్పపాటులో, రంగశర్మ ఖడ్గవీపులు మెఱసి బద్దెరాజును రెండుతునియలు చేసెను. పిదప కార్చిచ్చు భంగి కనలి కోపించి, మూగిన నాయకభటులనెల్ల ఖండించి వైచెను. ఎనుగుబలములను ఏనుగు, సరస్సును గలచివైచినట్లుగఁ గుండుపఱచెను.

బద్దెరాజుశిరము పైకెగసి కూలినపుడు రణధూర్తుఁ డొకఁడు తనసామంతరాగోలకు దానిని గ్రుచ్చి పైకెత్తి వైరిబలములకు పిఱికితనము గలిగించెను. విఱిగి, పాఱుచున్నమూకలను నరికట్టి, మరల స్థిరముగా నిలిచి పోరాడ చేయగల్గు సమర్థుఁడు శాత్రవసమూహమునందు గానరాలేదు. రంగశర్మ యావేళ సైనికులకు ప్రోత్సాహము గలిగించుచు "మీకోరమీసములు వడివేసి, మీ మగటిమి ప్రకటించి ప్రాణములపై నాసవీడి బవరంబు సేయుండు; వీరఘనులు మీరు; ఘనపవిత్రులు మీరు; వీరపుంగవులై వెలయంగగలరు మీరు. సమరంబు సేయుండు." అనుచు వీరాలాపముల నాడుచు, ఘోరభైరవఖడ్గము బూని, వీరధైర్యమున ద్వాదశసూర్యులొక్కమ్మడి ప్రబలినరీతి, చెలరేగెను.

* * * * *

ఒక్కముహూర్తమున మహోపజయముగా పరిణమింపవలసిన మహాసంగ్రామము, రంగాధిశర్మఖడ్గసాహా

యాయమున, అఖండవిజయముగా పరిణమించెను. కాలాగ్ని వలె నా బ్రాహ్మణ యోధవీరుని పరాక్రమము నల్దెసలు వ్యాపించి వైరిబలములను భస్మీపటలము గావించివైచెను. వైరిసేనలు వెన్నుచిన్ని రణభూమిని వీడి పాఱిపోయిరి. శౌర్యలక్ష్మి, రణలక్ష్మి, జయలక్ష్మి ముప్పురు నేకమై వచ్చి మగరూపు చెందినట్లు విక్రమించుచున్న రంగాధి కక్కశర్మను గాంచి చాళుక్యకులతిలకుడు అచ్చెరు వంది, సమ్మోదము నొందెను.

అప్పటికి సూర్యాస్తమయ మింకను కాలేదు. సమరాంగణము నాలుగుదిక్కులనుండి విజయసూచకమైన భేరి, మృదంగ, కాహళాది మంగళతూర్యనాదములు వినవచ్చెను. వైతాళికులు సంధ్యాసమయ మేతెంచుచున్నదని దెలుపుటకును, పీనుగు పెంటలతో రక్తప్రవాహముతో, భూతపిశాచ బ్రహ్మరాక్షసుల కాకరమైన రణభూమి విడచి సైనికులు తమతమవారి నందరిని తోడ్కొని, స్కంధావారమును జేరవలయునని దెలుపుటకు మంగళగీతములను గౌళిరాగాదులను మనోజ్ఞముగ బాడిరి.

## ౬

ఆనాటిసాయం సంధ్యాసమయమువేళ నాంధ్రక్షమాఖండలుని విజయస్కంధావారమునందు విజయసూచకమైన కోలాహలము వినబడుచుండెను. ఆ పృథ్వీశ్వరుని శిబిరప్రాంగణమున వివిధరాగరుచులచే నొప్పారుచుండిన పవనోద్ధూతవిజయపాలికేతనము ధ్వజముపై మంగళధ్వనులు వినవచ్చుచుండెను. వేంగీశ్వరునివిజయము క్షణములోపల దిశాంతములవఱకు వ్యాపించిపోయెను.

వీరలక్ష్మి విజయలక్ష్మి సమాలింగితుడైన చాళుక్యచూడామణి మంగళగాత్రము రక్తసిక్తమై బిరుదుజండెములతో, కడుశోభతో వెలిగిపోయెను. అపరదిశాపురంధ్రి సర్వలోకాశ్రయుని మహావిజయమున కుప్పొంగిపోయెను. ఆ మంగళగాత్రుని ఆశీర్వదించుచున్నట్లు, సాంధ్యరాగముతో శోభనపుటారతి యెత్తి నీరాజనమిచ్చెను.

శతసహస్రానేకకరదీపముల కాంతియందు ఆ వెన్నెలరాత్రివేళ, వీరపుంగవులైన సామంతమహామాత్ర దండనాయక ప్రభృతులు సముచితాసనములందు పరివేష్టించియుండ, నాంధ్రక్ష్మాపాలుడు చక్కగా నమర్పబడి సింగారింపబడిన పెద్దగద్దెపై సుఖాసీనుడై కొలువు దీరెను. వెనుకను భటుడొకడు ముత్యాల వెల్లపట్టుగొడుగును, బంగారుకుబ్బతో వెలుగొందు దానిని వింతగా బట్టుకొనెను, వేత్రహస్తులు ముందు కటికధరులై సందడి సద్దుసేయుచు నిలువబడిరి. క్రమాగతములైన సామ్రాజ్యచిహ్నములు అందందు మనోహరముగ నెలకొల్పబడెను.

“విష్ణువర్ధనమహారాజధిరాజు! సర్వలోకాశ్రయుండ! చాళుక్యభీమభూపాల! ద్రోహార్జునాపరనామధేయ! జయీభవ! దిగ్విజయీభవ! దక్షవాటిభీమనాయక వరకటాక్షలబ్ధసుస్థిరైశ్వర్యవిభవామరేంద్ర! సమరైకవీర! అసహాయవిక్రముండ! విజయీభవ! దిగ్విజయీభవ! గొండళసాహసుండ! విక్రాన్తచక్రాయుధ! శశికులపూర్ణిమాచంద్ర! చతురంగరామ! సాహససముద్రక! భీమభూపాల! జయీభవ! దిగ్విజయీభవ!” యనుచు భట్టువాడు బిరుదుగద్యలు పఠించెను. మహామాత్యుడు కనుసన్న చేయ, పరమభట్టారకుడు తనమనోభీష్టము దెలుపనున్ముఖుడై యున్నాడని యెల్లవారలకు దోచురీతి, వైతాళికు డొకడు వేదికముంగిట నిలచి కాహళమును బూరించెను.

చాళుక్యకులతిలకుడంతట కొలువు దిక్కు కృపావిశేషమున అపాంగదృష్టిని పరికించి యిట్లానతిచ్చెను.

“పరమాప్తులై వచ్చి, పటువిక్రమాఢ్యులై మాకు సమరకార్యము దీర్చి సమ్మోదముగూర్చిన మీకందరకిని మా రాజపురుషులు సముచితరీతి సత్కారము లొసంగగలరు! మీకందఱకు నఖిలశుభములు, సౌఖ్యము లొదవగూడుగాక! వెండియు నాలకింపుడు సుహృత్తములైన మా శ్రీచిత్తమును. అస్మత్కులకళ్యాణ పరంపరాభివృద్ధికై, అస్మద్దేశ సంతత్యాయురారోగ్యైశ్వర్యాభివృద్ధికై సమరము సేయవచ్చి, మాకు మహాపత్సమయము

నందు, ఖడ్గసహాయ మొనరించి, నిశ్శంకతో తనప్రాణమును మా ప్రాణసంరక్షణమునకై విని యోగపఱుప నేతెంచి, యేకవీరుడై ఖడ్గసహాయమాత్రమున శాత్రవనిర్మూలనము గావించి బలిమివాటించి మాకు విజయలక్ష్మిని కైవసము జేసినయోధవీరునికి వాజసనేయ బ్రహ్మచారికి, మాకాప్తుడగు విద్దశర్మచమూపతి ప్రియతనయునకు, ఈ రంగాధికక్క శర్మకు మాకృతజ్ఞతాసూచకముగ, సమ్మోదముతో 'సాహసరక్కసాంక' అను బిరుదమును ఉష్ణీషమునకు గట్టి అలంకరించువారము. మరియు నాయాజ్ఞ నాలకింపుము. మాపితృవ్యులు ప్రేమతో నొసంగిన సీభిండివాలమును 'కృతాంతజిహ్వ' పేరుగలదానిని ప్రేమతో నిచ్చువారము. మాకొనర్చిన ఖడ్గసహాయ నిమిత్తమంను ఏము మిక్కిలి సుహృష్టులమై, పాకనాటిసీమలోని పండిపాకగ్రామమును సర్వకరపరిహారముగ నగ్రహారము గావించి ఈ శుభముహూర్తమునం దుదకపూర్వముగ ధారవోయువారము."

ఆపలుకులు ముగియునప్పటికి సంతోషస్వాంతులై విద్వాంసులు, బ్రాహ్మణవీరులు వేదమును బహుముఖములనుండి జనువసాగిరి. పరమబ్రహ్మణ్యుడైన విష్ణువర్ధనుడపుడు రంగశర్మకు కర్పూరతాంబూలమిచ్చి కస్తూరి యిచ్చి, ఖడ్గమిచ్చి, దివ్యాంబరభూషణాదులిచ్చి యుష్ణీషమునకు వీరబిరుదుగట్టి, ఉదకపూర్వకముగ ప్రీతితో నగ్రహారము ధారవోసెను.

ప్రతిఫలమపేక్షింపని యాకుమారబ్రాహ్మణవీరుని మేను, నిజస్వామిచేసిన మన్ననసత్కారములకు పులకించెను. ఆతని నేత్రాంచలములందు కృతజ్ఞతాసూచకమైన ఆనందబాష్పకణము తొలకాడెను. రంగశర్మయపుడులేచి వినమ్రుడై, భక్తి, స్నేహ, సంభ్రమములు తొట్రువడుచుండ తన యిలయేలికను వేదోక్తముగ, విజయ పరంపరాభివృద్ధిగ నాశీర్వదించెను.

ఆంధ్రక్షమాధీశ్వరుని యానందము పొంగి పొరలిపోయెను. ఆతని దివ్యకోమల హృదయము, లతయై తీగెలుసాగి, మరల పల్లవించి, పుష్పించి, ఫలములిచ్చెను. అపుడాతడు కృపాంగదృష్టిని రంగశర్మనుద్దేశించి "భూదేవా! పరమాప్తుడవైన నీమేలు మఱువదగినదిగాదు. అల్పవృత్తితో మొదట నొసంగినది మమ్ము ఋణవిముక్తులను జేయజాలదు. కావున పండిపాకతోపాటు సాష్టాధికగ్రామములను మాన్యముగా ననుభవింపుము. ఏతద్విషయాధ్యక్షుడవై, మాకుప్రియభృత్యుడవై, పుత్రానుపౌత్రికముగ ఇష్ట సుఖోపభోగముల ననుభవింపుము." అని యానతిచ్చెను.

రంగశర్మ ప్రభువు పాదములపై మన్ననదృష్టి సారించి "మహాభాగ్య"మని, దీవనలిచ్చెను. అపుడతనికి, తన ప్రియురాలు, వీరపత్ని పలికిన ధీరవచనములు జ్ఞప్తికి వచ్చెను. పట్టరాని సంతోషమున నాతడు ఆంధ్రమహీపాలునకు దశలు మాఱుమ్రోతలిడునట్లు స్కంధావారము ప్రతిధ్వను లీనునట్లు జయవెట్టెను. ఒకక్షణములోపల అఖిలశాస్త్రపారంగతులగు విద్వాంసుల ఆశీర్వాదఘోషలు, అన్నియుగూడ, వీరభటులు ఆనందాతిరేకమున జేసిన జయజయధ్వానములలో మునిగిపోయెను. దిశాంతములందుమాత్రము "విష్ణువర్ధనమహారాజాధిరాజ, రాజపరమేశ్వర! జయీభవ! దిగ్విజయీభవ!" అను జయశబ్దమే కట్టకడపట వినవచ్చెను.

# శాలంకాయనులు

మారేమండ రామారావు

ప్రాచీనకాలమున వేంగిదేశము నేలిన రాజవంశములలో శాలంకాయనవంశము మిక్కిలి ముఖ్యమైనది. ఇక్ష్వాకువంశీయులకు పిమ్మటను, విష్ణుకుండినులకు బూర్వమును నీరాజులు ప్రాక్తీరమున ప్రబలులై యుండిరి. వీరు పరిపాలించినది ౧౫౦ సంవత్సరములేయైనను దేశ మాకాలమునం దనేకవిధముల నభివృద్ధినందెను. ఈశాలంకాయనుల చరిత్రమును గూర్చి పూర్వపండితుల యభిప్రాయములు గొన్ని యిటీవలి పరిశోధనాఫలితముల మూలమున సవరింపబడ వలసియున్నది. అప్పుడప్పుడు శాసనములను బ్రకటించినవారు సందర్భానుసారముగా జెప్పినవిషయములు దప్ప శాలంకాయనవంశచరిత్రము సమగ్రముగ నెచ్చటను గన్పించుటలేదు. ఈమధ్య నుత్తరదేశపుబండితులు కొందరు రాజవంశమును గూర్చి ప్రమాదభూయిష్ఠములును, సత్యదూరములును నగు సిద్ధాంతములను గావించియున్నారు.[1] నేడు లభించు చారిత్రకసామగ్రియాధారమున నీశాలంకాయనరాజుల చరిత్ర మీవ్యాసమున వర్ణింపబడును.

## ఆ ధా ర ము లు

ఈరాజవంశపుచరిత్రమును దెలిసికొనుట కింతవరకును బ్రకటింపబడిన వీరి యైదుతామ్రశాసనములు ముఖ్యాధారములు. సముద్రగుప్తుని అలాహాబాదు శిలాస్తంభశాసనమున వేంగిరాజగు హస్తివర్మ పేర్కొనబడియున్నాడు.[2] అతడు శాలంకాయన వంశజుడని పండితుల యభిప్రాయము. శాలంకాయనుల విజృంభణమును నిర్ణయించునెడ బృహత్పలాయనవంశీయుడగు జయవర్మకొండముడితామ్రశాసన ముపకరించుచున్నది.[3] ఇతర విశేషములు తాత్కాలికచరిత్రమునుండి తెలియనగుచున్నవి. శాలంకాయన శాసనములలో నీక్రిందివిశేషములు గలవు:

(౧) విజయదేవవర్మ ఏలూరుతామ్రశాసనము.[4] ఇది ప్రాకృతభాషలో నున్నది. దీనిలిపి ప్రాచీనపల్లవ శాసనముల లిపిని బోలియున్నది. ఈమహారాజ విజయదేవవర్మ చిప్పభట్టారకపాదభక్తుడు; పరమ మాహేశ్వరుడు; భగవచ్చిత్రరథస్వామి పాదానుధ్యాతుడు; అశ్వమేధయాజి.

(౨) శాలంకాయన మహారాజవిజయ నందివర్మ కొల్లేరు తామ్రశాసనము.[5] ఇతడు మహారాజ చండవర్మపుత్రుడు.

(3) మహారాజశ్రీ నందివర్మ పెదవేగి తామ్రశాసనము.[6] ఈరాజు మహారాజహస్తివర్మకు ప్రపౌత్రుడు; నందివర్మపౌత్రుడు; చండవర్మ మహారాజు జ్యేష్ఠపుత్రుడు; పరమభాగవతుడు. తన పదియవరాజ్యసంవత్సరమున త్రైలోక్యనాథుడగు విష్ణుగృహస్వామికి నాలుగుగ్రామములలో భూమిని దానముచేసెను.

(౪) మహారాజ శ్రీనందివర్మ (రెండవ)కంతేరు తామ్రశాసనము.[7] చిత్రరథస్వామి పాదానుధ్యాతుడును, పరమభాగవతుడును నగు నీరాజు తన కులగోత్రధర్మ

1. సుప్రసిద్ధపరిశోధకులగు కే. పి. జయస్వాలుగారు కీర్తిశాలిలో ముఖ్యులు. వీరి యభిప్రాయములను I. H. Q. p.p. 158-160 లోని "A note on the Salankayanas" అను వ్యాసమున నేను విమర్శించియుంటిని.

2. E.

3. E. I. V. p. 3I5.

4. E. I. IX. p. 56.

5. I. A. V. p. 175.

6. J. A. H. R. S. I-2 pp. 92 102 & భారతి, ఆగస్టు 1924.

7. J. A. H. R. S. V-I pp. 21-32.

యశోభివృద్ధికై మౌద్గల్యసగోత్రుఁ డను స్వామిచంద్రుఁ డను బ్రాహ్మణునికి కుద్రాహార విషయములోని కురువాశగ్రామములో పండ్రెండు నివర్తనముల భూమిని దానముచేసెను.

(౨) మహారాజ శ్రీ విజయస్కంద వర్మ (మొదటి) కంతేరుశాసనము8. చిత్రరథస్వామిభక్తుఁ డను నీరాజు తనరాజ్యారంభ సంవత్సరమున తన కులగోత్ర శ్రేయోభివృద్ధికై లేకునూరి గ్రామవాస్తవ్యుఁడును, మౌద్గల్యసగోత్రుఁడును నగు శివార్యునికి కుదూహార విషయములోని చిన్నపుర మను పల్లెను దానముచేసెను.

## శాలంకాయను లెవరు?

ఈశాలంకాయను లెవరు? ఎప్పటివారు? అను ప్రశ్నలకు ముందు సమాధానము నొసంగవలసి యున్నది. "శాలంకాయననామము వేదములలో పేర్కొనబడిన యొకఋషియొక్క పేరుగ గన్పించుచున్నది. ప్రవరకాండలో శాలంకాయన గోత్రములు రెండు గలవు. అందొకటి: ఆంగీరసబార్హస్పత్య భారద్వాజ ప్రవరాన్వితమై భారద్వాజగణమునకు జెందినది. రెండవది విశ్వామిత్రశాలంకాయన కౌశికప్రవరాన్వితమై విశ్వామిత్రగణమునకు జెందినది.9 'శాలంకాయన' యనుపదము పాణిని గణపాఠములో నదాది గణమునందును10, రాజన్యాదిగణమునందును గూడ నున్నది.11 శాలంకాయనుల నివాసస్థానము 'శాలంకాయనక' యను ప్రదేశము నొకటి యుండెడిది. 12 ప్రాచీనసంస్కృత వాఙ్మయములో శాలంకాయనపదప్రశంస యీవిధమున నున్నది. క్రీ. శ. ౨-వ శతాబ్దిలో మనదేశమును గాంచిన టాలెమీ యను యవనయాత్రికుఁడు "మైసాలోయ్ కి పైన 'సలకెనోయ్' అనువా రున్నారు. బెనగౌరణ్ అనునది వారి ముఖ్యపట్టణములలో నొకటి" అని తన భూగోళశాస్త్రమున వ్రాసియున్నాడు.13 ఈ 'సలకెనోయ్' అనువారే చరిత్రప్రసిద్ధులగు శాలంకాయనులనియు, 'మైసాలోయ్' అనునది మచిలీపట్టణమనియు, 'బెనగౌరన్' అనునది వేంగీనగరమనియు పండితుల యభిప్రాయము.14 దీనినిబట్టి శాలంకాయనులు క్రీ. శ. ౨-వ శతాబ్దమునసే కృష్ణానదీముఖద్వారము వద్దను, వేంగీపురప్రాంతముననుు నివసించుచుండిరని స్పష్టమగుచున్నది. ఇటుపై వీరెవరో నిర్ణయింపవలసియున్నది. ఇందులకు వీరిశాసనములు తోడ్పడగలవు. ఈశాలంకాయనులకును, పల్లవులకును సన్నిహితమగు సంబంధముండినట్లు తోచుచున్నది. పల్లవులవలెనే శాలంకాయనులును భారద్వాజగోత్రులు. వారివలెనే వీరును తమ శాసనములపై నందిముద్రిక నుపయోగించిరి.15 మొదటి పల్లవశాసనములవలెనే మొదటి శాలంకాయన శాసనమును ప్రాకృతభాషలో నున్నది.16 ఈరెండువంశముల రాజులును వర్మాభిధులే. శాలంకాయన పల్లవవంశములు రెండింటియందును నందివర్మ స్కందవర్మలుగలరు. సమకాలికులును, ప్రక్కరాజ్యముల యేలికలునై యుండినను వీరి కన్యోన్యము శాత్రవ ముండలేదు. ఈకారణములనుబట్టి పల్లవులును, శాలంకాయనులు నొకే తెగకు జెందినవారని చెప్పవచ్చును.17

## శాలంకాయనుల విజృంభణము

శాలంకాయనులు రాజ్యాధికారము నేవిధమున, నెప్పుడు పొందిరో యిటుపై చెప్పవలసియున్నది.

8. Ibid.

9. Ibid p. 24.

10. IV-i-99.

11. IV-ii-33.

12. IV-ii-53-

13. Geo. VII-i p. 19.

14. I. H. Q. IX-i p. 124. Raychaudari Pol. Hist. of Anc. Ind. p. 341 n. 4.

15. చూ. కంతేరుశాసనములు.

16. చూ. విజయనందివర్మ ఏలూరు ప్రాకృత శాసనము.

17. పల్లవులును, శాలంకాయనులు నొకేపూర్వికుని సంతతివారో, లేక సన్నిహిత వైవాహిక సంబంధము గలవారో యనుచురని కీ. శే. లక్ష్మణరావుగారి యభిప్రాయము. (J. A. H. R. S. V-i p. 29)

ఆంధ్రరాజులలో కడపటివాఁడగు చంద్రశాతి శాతవాహనుని కాలమున సామ్రాజ్యపు పశ్చిమదిశను 'చుటు'కులజులు నభీరులును, దక్షిణమున పల్లవులును, తూర్పున నిక్ష్వాకులును సామంతులుగ నుండిరి. క్రీ. శ. ౨౨౦ ప్రాంతమున నారాజు మరణించినపిమ్మట నీసామంతులు తమతమస్థానములలో స్వతంత్రులైరి. చుటునాగులతో సంబంధముచేసికొని వీరకూర్చవర్మ పల్లవరాజ్యమును స్థాపించెను. కృష్ణానది దక్షిణభాగమంతయు నతని తనయుఁ డగు శివస్కందవర్మ జయించెను. కృష్ణాతీరమున జగ్గయ్యపేట నాగార్జునకొండ ప్రాంతమున నిక్ష్వాకులు ప్రబలిరి. మచిలీపట్టణము వేంగీప్రాంతమున శాలంకాయను లుండిరి. క్రీ. శ. ౨౨౦-౨౬౦ నడుమ నిక్ష్వాకుల పరిపాలనము ప్రాక్తీరమున సాగెను. ఇంతకు ముందు పేర్కొనబడిన కొండముదిశాసనము కొంచెమించుమించుగ నీకాలమునకే చెందును అందు బృహత్ఫలాయన వంశజుఁడగు జయవర్మ కుడూహారవిషయములో దానముచేసెనని చెప్పబడియున్నది. ఈ కుడూహారవిషయము నేటి కృష్ణామండలములోని దివి, బందరు, కైకలూరు, గుడివాడ తాలూకాలకు సరియగునని పండితుల యభిప్రాయము.18 ఈప్రాంతమున క్రీ. శ. ౨-వ శతాబ్దినుండియు శాలంకాయనులు నివసించుచుండిరని యిదివరలో జెప్పియుంటిమి. శాలంకాయన రాజుల శాసనములు వారి రాజధాని యగు వేంగీపురమునుండి యొసగబడియున్నవి. ఈవేంగీప్రాంతమును వారి ప్రాచీన నివాసస్థానమే. ఈ సంగతుల నాలోచించి చూడగా నిక్ష్వాకులపాలన మంత్యమయినపిమ్మట, ననగా క్రీ. శ. 3-వ శతాబ్ది మూడవపాద మారంభమగునప్పుడు బృహత్ఫలాయనులు శాలంకాయనులను పారదోలి కుడూహారవిషయము నాక్రమించిరని తోచుచున్నది. ఈబృహత్ఫలాయనులలో జయవర్మ యొక్కఁడే మనకు తెలియుచున్నాఁడు. ఇతనికి పిమ్మట నీవంశ మేమయ్యెనో తెలియదు. ఇతని పాలనమునందుండిన కుడూహారవిషయమునే తరువాత శాలంకాయనరాజుల ధర్మములు చేయబడినవి. వారిలో మొదటివాఁడగు విజయదేవవర్మ అశ్వమేధయాగమును జేసెను. ఇది సామాన్యముగ విజయసూచకమైయున్నది. ఈకారణములను బట్టి శాలంకాయన విజయదేవవర్మ బృహత్ఫలాయన జయవర్మనో, లేక అతని సంతతి వారినో జయించి, కుడూహారవిషయమును స్వాధీనము చేసికొని, వేంగీపురము రాజధానిగా నొకస్వతంత్ర రాజ్యమును నెలకొల్పెనని నిశ్చయింపవచ్చును.19

## శాలంకాయనులు మాగధకులులా?

ఈ శాలంకాయనుల పూర్వోత్తరమును గూర్చి సుప్రసిద్ధపరిశోధకులగు కే. పి. జయస్వాలుగా రొక వింతసిద్ధాంతమును చేసియున్నారు. "మాగధకులమునకు జెందిన రాజవంశమొకటి పిష్టపురసింహపురముల నుండి పరిపాలనముచేసెను. పిష్టపురము కళింగమునకు రాజధాని. ఈమాగధకులపురాజులలో శక్తివర్మ మొదటివాఁడు. అతనితర్వాత చండవర్మయు, నటుపై నతని కుమారుఁడగు విజయనందివర్మయు రాజ్యమేలిరి. ఈ విజయనందివర్మ తన వంశనామమగు మాగధకులమును శాలంకాయనవంశముగ మార్చెను. ఈ వృత్తాంతము స్కందగుప్తునికాలమున జరిగెను. పై విజయనందివర్మ సంతతిలోనివాఁడగు విజయదేవవర్మ అశ్వమేధయాగమును చేసి తనస్వాతంత్ర్యమును ప్రకటించెను. దీనినిబట్టి యీ మాగధకులము సముద్రగుప్తునివలననో, యతని తరువాత గుప్తరాజులవలననో నెలకొల్పబడినది."20

అని జయస్వాలుగారి యభిప్రాయము. దీనిని సవిమర్శముగా బరిశీలింపవలసి యున్నది. పిష్టపురమునేలిన శక్తివర్మ రాగోలుతామ్రశాసనమునుండి తెలియవచ్చుచున్నాఁడు.21 దుబ్రేలుపండితు డీశాసనము క్రీ.శ. ౫-వ శతాబ్దిమధ్యభాగమునాటిదని నిర్ణయించియున్నాఁడు.22 అందువలన నాశక్తివర్మయు నాకాలమువాఁడే యగును.

18. J. A. H. R. S. V-i. p, 29.
19. చూ. I. H. Q. pp. 158-160 లోని నావ్యాసము.
20. History of India 150-350 A. D.
21. E. I. XII p. 2.
22. A. H. D. pp. 93-94.

ఇతడును, మరికొందరురాజులును క్రీ. శ. ౪౫౦-౬౧౦ నడుమ కళింగదేశము నేలిరి.[23] జయస్వాలుగారు పేర్కొనిన చండవర్మయు, నతని తనయుడగు నందివర్మయు నీకళింగరాజులుకారు. వారు శాలంకాయన రాజులు. పెదవేగిశాసనమున ప్రశంసింపబడియున్నారు.[24] అందు హస్తివర్మయు, నతని కొడుకు విజయనందివర్మయు, పౌత్రుడు చండవర్మయు, ప్రపౌత్రుడు విజయనందివర్మయు వరుసగా వేంగీదేశము నేలిరని చెప్పబడియున్నది. హస్తివర్మకు బూర్వము విజయదేవవర్మ శాలంకాయన మహారాజుగ నుండెను. ఈ విధమున శాలంకాయన వంశావళిలో శక్తివర్మకు తావులేదు. అతడు శాలంకాయనుడు కాడు. ఇతనిని శాలంకాయన వంశజునిగ పరిగణించుటలో జయస్వాలుగారు పొరబడిరనుట సత్యము. విజయనందివర్మ మాగధకులమును తన వంశనామమును శాలంకాయనవంశముగ మార్చెనను పై పండితుని యూహయు తప్పే. శాలంకాయన వంశపు రాజులలో మొదటివాడగు విజయదేవవర్మ "శాలంకాయన మహారాజ" యని వర్ణింపబడినాడు. అట్లే యీ వంశమున గడపటిరాజగు విజయస్కందవర్మ గూడ "శాలంకాయనస్య మహారాజ శ్రీస్కందవర్మణః" అని పేర్కొనబడినాడు.[25] వీరిర్వురికిని నడుమగల నాలుగుతరముల రాజులును 'శాలంకాయన మహారాజు' లే. అట్టియెడ నైదవతరమువాడగు రెండవ విజయనందివర్మ వంశనామమును మార్చుట సంభవము. శాలంకాయనవంశము క్రీ. శ ౪౫౦ లో నంతమయ్యెను. మాగధకుల మటుపిమ్మట బయల్వెడలినది. ఇట్టియెడ నీమాగధకులము మొదటినామమనియు, నయ్యది క్రీ. శ. ౩౫౦ లోనో ౪౦౦ లోనో నెలకొల్పబడెననియు, పిమ్మట శాలంకాయనవంశముగ మారెననియు జెప్పుట కేవలము హాస్యాస్పదము. జయస్వాలుగారివంటి పండితు డిట్లు సునిశ్చితములైన చరిత్రాంశములను తారుమారొనర్చుట శోచనీయము. ఆపండితులు విజయదేవవర్మ, రెండవ విజయనందివర్మకు దరువాతివాడనియు వ్రాసియున్నారు. విజయదేవవర్మ క్రీ. శ. ౪-వ శతాబ్ది ప్రారంభమునందుండెనని యిదివరలో నిరూపించియుంటిమి. ఆతనికి విజయనందివర్మ ప్రపౌత్రపుత్రుడు. కాన నీవిషయమునను జయస్వాలుగారి యూహలు సత్యదూరములని స్పష్టమగుచున్నది. ఈ చర్చవలన శాలంకాయనవంశము గుప్తుల దండయాత్రకు పిమ్మట నెలకొల్పబడలేదనియు, క్రీ. శ. ౪-వశతాబ్ది ప్రారంభముననే రాజ్యాధికారమును సంపాదించెననియు తెలియుచున్నది.[26]

## సవరణలు

ఈశాలంకాయనరాజుల చరిత్రమును తెల్పుటకు బూర్వము వీరి వంశక్రమమునుగూర్చి కొందరు పండితులొసంగిన యభిప్రాయములను సవరింపవలసియున్నది. శాలంకాయననందివర్మ కొల్లేరుశాసనమును ప్రకటించుచు ఫ్లీటుపండితుడు ఎలియటుగారు సేకరించిన శాసనసముదాయములో నీనందివర్మను, అతని యువరాజగు విజయబుద్ధవర్మ, లేక విజయతుంగవర్మయొక్కయు శాసనమొక్కటి గలదని వ్రాసియున్నాడు.[27] అయిన నతడు మరియొకసందర్భమున నీ యూహ తప్పనియు, పైనందివర్మయు, నతని యువమహారాజును పల్లవ రాజులుగాని శాలంకాయనులు గారనియు తన యభిప్రాయమును సవరించుకొనెను.[28]. పండితు లీసవరణను గుర్తింపక విజయబుద్ధవర్మను విజయనందివర్మపుత్రునిగ బరిగణించి శాలంకాయన వంశవృక్షమున జేర్చిరి.[29] అటులే విజయదేవవర్మనుగూర్చియు పొరపాటు జరిగినది. ఇత డశ్వమేధయాగమును జేయుటబద్ధమని త్రోసిపుచ్చి లక్ష్మణరావుగా రీతనిని హస్తివర్మకు బుత్రునిగను, శాలంకాయన రాజులలో రెండవవాని

23. Ibid "The kings of Kalinga."
24. J. A. H. R. S. I-2 pp. 92-102.
25. చూ. రెండవకంతేరుశాసనము.
26. I. H. Q. pp. 158-160.
27. I. A. V. p. 125.
28. Ibid IX. p. 101.
29. ఆ. సా. ప. ప. పే. 113-127; భారతి ఆగష్టు 1924. పే. 110; J. A. H. R. S. I.2 pp. 92-102.

గను, (ఎలియట్ శాసనములలో పేర్కొనబడెనని తలంపబడిన) మొదటి విజయనందివర్మకు దండ్రిగను పరిగణించియున్నారు.30 పెదవేగిశాసనమును మొదట ప్రకటించిన శ్రీ సోమశేఖరశర్మగారు విజయదేవవర్మ హస్తివర్మకుమారుడనియు, పై నందివర్మ కగ్రజుడనియు వ్రాసిరి.31 శ్రీ రాళ్లబండి సుబ్బారావుగారును వీరి ననుసరించిరి.32 పై పండితు లందరును ప్రాకృతశాసనము నుండి తెలియనగు విజయదేవవర్మ సంస్కృత శాసనములనుండి తెలియనగు నితరశాలంకాయన రాజు లందరికంటెను ప్రాచీనుడై యుండునని యంగీకరించియు నతనిని సంస్కృతభాషలోనున్న పెదవేగిశాసనమున పేర్కొనబడిన హస్తివర్మకు దరువాతివానిగ నిరూపించియున్నారు. ఇది వారి యంగీకారమునకే కాక పెదవేగి శాసనమునకు గూడ విరుద్ధముగ నున్నది. అందు హస్తివర్మ తనయుడు విజయనందివర్మయనియే కాని పై పండితు లూహించినట్లు విజయదేవవర్మయని చెప్పబడలేదు. ప్రాకృతశాసనమున పేర్కొనబడియుండుట వలనను, దానిలిపి ప్రాచీనపల్లవశాసనముల లిపిని పోలియుండుటవలనను విజయదేవవర్మ హస్తివర్మకు ముందుండవలెను గాని తరువాత యుండనేరడు. ఇతడు అశ్వమేధయాగమును జేయుట సంభవముగాదు. ప్రాచీన రాజవంశముల మూలపురుషులు విజయసూచకముగ నీ యాగమును జేసియుండిరి. విజయదేవవర్మ బృహత్పలాయనులను జయించి శాలంకాయనరాజవంశమును స్థాపించెను. ఇదేసమయమున విజృంభించిన పల్లవవంశపు రాజగు శివస్కందవర్మయు విజయసూచకముగ నీయజ్ఞమును చేసెను. ఇక్ష్వాకువాకాటకాదిరాజులు నట్లొనర్చియుండిరి. ఇట్టియెడ శాలంకాయన విజయదేవవర్మ యశ్వమేధయాగము నొనర్చుటలో నతిశయాంశమేమియు గన్పింపదు. శ్రీ రాళ్లబండి సుబ్బారావుగారొక సందర్భమున నీరాజు రాజ్యముచేయలేదనియు, మరియొకసమయమున నితడు హస్తివర్మ రెండవకుమారుడనియు వ్రాసిరి.33 ఇందులకు వీరు విజయదేవవర్మ ప్రాచీనతను గుర్తింపలేకుండుటయు, హస్తివర్మయే శాలంకాయనవంశస్థాపకుడని పొరబాటుగ నమ్ముటయు గారణములు. హస్తివర్మకుమారుడు నందివర్మయని పెదవేగిశాసనములో చెప్పబడియుండుటచే నుపాయాంతరము లేక వీరు విజయదేవవర్మను పై నందివర్మ తమ్ముడని తలచి యాయూహను సమర్థించుకొనుటకై యితడు రాజ్యముచేయలేదని వ్రాసిరి. విజయదేవవర్మ మొదటి శాలంకాయనరాజని యిదివరలో నిరూపింపబడినది. అతడు రాజ్యముచేసెననుట కతడశ్వమేధయాజియనియు, శాలంకాయనమహారాజనియు దెల్పు పెదవేగిశాసనము ప్రమాణము. దీనికి విరుద్ధముగ నున్న శ్రీ సుబ్బారావుగారి యూహలు సమంజసములు కావు.

## వంశావళి

పైవివరణలనుబట్టియు, శాలంకాయనరాజుల తామ్రశాసనములనుండియు వారి వంశక్రమము తెలియనగుచున్నది. ఏలూరు ప్రాకృతశాసనములోని విజయదేవవర్మ మొదటిశాలంకాయనరాజని యిదివరలో సకారణముగ నిరూపించియుంటిమి. ఇతడు క్రీ. శ. ౪-వ శతాబ్దిప్రారంభమున నుండియుండును. సముద్రగుప్తుని అల్లాహాబాదుశాసనమునుండి క్రీ. శ. ౩౫౦ ప్రాంతమున నొకహస్తివర్మ వేంగీదేశము నేలుచుండెనని తెలియుచున్నది. ఈ హస్తివర్మయు, పెదవేగిశాసనములోని మొదటిరాజగు హస్తివర్మయు నొక్కరేయని పండితు లంగీకరించియున్నారు. అప్పు డితనికిని విజయదేవవర్మకును గల యంతర మీ యిర్వురును ఒకరివెనుక నొకరు రాజ్యమునకు వచ్చిరని యూహించుటకు సరిపడుచున్నది. అందువలన హస్తివర్మ విజయదేవవర్మ పుత్రుడని యూహింపవచ్చును. ఇతనికి బిమ్మట పెదవేగిశాసనములోని నందివర్మ చండవర్మ, నందివర్మలను పేర్కొనవలసి యున్నది. కొల్లేరు శాసనమున చండవర్మయు, నతనిపుత్రుడగు నందివర్మయు పేర్కొనబడినారు. రెండవ కంతేరుశాసనమున నొక నందివర్మ ప్రశంసింపబడియున్నాడు. ఇందీతనికిగల పరమభాగ

30. J. A. H. R. S. V-i. p. 24,
31. భారతి-ఆగస్టు 1924 పే. 114.
32. J. A, H. R. S. I-2. pp. 92-102.
33. J. A. H. R. S. I 2. p. 94.

వతబిరుదము కంతేరు శాసనములోని నందివర్మకును, పెదవేగిశాసనములోని రెండవనందివర్మకును గాంచనగు చుండుటచే నీ మూడుశాసనములలోని నందివర్మయు నొకడే యని నిర్ణయింపవచ్చును. పెదవేగిశాసనమునందు వలెనే కంతేరుశాసనమునగూడ నీతనితండ్రి చండవర్మ యని చెప్పబడియుండుట యీనిర్ణయమును బలపరచు చున్నది. మొదటి కంతేరుశాసనములోని స్కంద వర్మకు నితర శాలంకాయనరాజులకును గల సంబంధ మేమియో తెలియుటలేదు. ఇతనియొక్కయు, రెండవ నందివర్మయొక్కయు శాసనము లొకచోట దొరకినవి. రెండిటను ప్రతిగృహీతలు మౌద్గల్యసగోత్రులే. వీని లిపిలో భేదమేమియులేదు. ఈకారణములనుబట్టి యీ స్కందవర్మ రెండవనందివర్మవెనుక రాజ్యమునకు వచ్చె ననియు, నతని కాపుత్రుడనియు నూహింపవచ్చును. లక్ష్మణరావుగారీస్కందవర్మ రెండవనందివర్మ కుమారుడని తలచిరి.34 శ్రీసుబ్బారావుగారితడు చండవర్మ జ్యేష్ఠపుత్రుడని తలచిరి.35 పెదవేగిశాసనమున రెండవ నందివర్మ "చండవర్మమహారాజస్య పుత్రోజ్యేష్ఠః" అని వర్ణింపబడుటచే వీరియూహ సత్యదూరమని స్పష్టమగు చున్నది. శ్రీసోమశేఖరశర్మగారీస్కందవర్మ పైనంది వర్మతమ్ముడని వ్రాసిరి.36 ఈయూహ పెదవేగిశాసనమున కనుకూలముగ నుండుటచే మిక్కిలి సమంజసమని స్పష్టమగుచున్నది. పైచర్చనుబట్టి శాలంకాయనవంశ వృక్షము మీక్రిందివిధమున నేర్పడుచున్నది.

విజయదేవవర్మ
|
హస్తివర్మ
|
మొదటినందివర్మ
|
చండవర్మ
|
రెండవనందివర్మ — స్కందవర్మ

## కాలనిర్ణయము

ఈశాలంకాయనరాజుల కాలనిర్ణయము వివాదాస్పదముగ నున్నది. వారిశాసనములలో దాతల రాజ్య సంవత్సరములేగాని శాలివాహనశకసంవత్సరములుగాని మరియొక శకవర్షములుగాని యొసగబడలేదు. అందు వలన నీరాజులకాలములను వారి శాసనములలోని లిపి స్వరూపమునుబట్టియు, వారికి నితరరాజవంశముల కును గల సంబంధమును బట్టియు నిర్ణయింపవలసి యున్నది. ఈసందర్భమున మనకు మూడు నిశ్చితాంశము లుపకరింపగలవు. అందు మొదటిది శాలంకాయన విజయదేవవర్మ ఏలూరుతామ్రశాసనము ప్రాకృతభాష లో నుండుట ప్రాకృతశాసనములు క్రీ. శ. 3-వ శతాబ్దితో నంతమొందుటవలన నీశాలంకాయనవిజయదేవ వర్మ క్రీ. శ. 3-వ శతాబ్ది తుదిభాగముననో, లేక ౪-వ శతాబ్దిప్రారంభముననో జీవించియుండెనని యూహింప వచ్చును. శాలంకాయనవంశచరిత్రమునగల రెండవనిశ్చితాంశము గుప్తరాజగు సముద్రగుప్తుడు దక్షిణాపథముపై దండెత్తివచ్చినపుడు హస్తివర్మ వేంగీరాజ్యపాలకుడుగ నుండెననుట. ఈహస్తివర్మ శాలంకాయనహస్తివర్మయే యని పండితులందరు నంగీకరించియున్నారు. పైగుప్త విజయయాత్ర క్రీ. శ. 3౫౦ ప్రాంతమున జరగియుండె నని పరిశోధకులు నిర్ణయించియున్నారు. మూడవ యంశము విష్ణుకుండివంశపురాజగు రెండవవిక్రమేంద్ర వర్మ వేంగిని పాలించెననుట. ఈయంశమును దెల్పు చిక్కుళ్లతామ్రశాసనము37 క్రీ. శ. ౫-వ శతాబ్దిమధ్య కాలమునాటి దని పండితుల యభిప్రాయము.38 దీనినిబట్టి క్రీ. శ. ౪౫౦ ప్రాంతమునకు శాలంకాయన వంశమంతరించె నని తెలియనగుచున్నది. ఇచ్చట కొందరు పండితు లీ శాలంకాయనరాజుల కాలమును గూర్చి యొసంగిన యభిప్రాయములను పరిశీలింపవలసి యున్నది. వీరు క్రీ. శ. 3౫౦-౪౫౦ నడుమ నుండిరని దుబ్రేలుపండితుని యభిప్రాయము.39 క్రీ. శ. 3౫౦

---

34. J. A. H. R. S. V-i. p. 27.
35. Ibid I-2. p. 94.
36. భారతి-ఆగస్టు 1924. పే. 114.
37. E. I. IV p. 139.
38. Dubreiul A. H. D. p. 89.
39. Ibid.

లో హస్తివర్మ రాజ్యమేలుచుండె ననియు, నతనికి పూర్వము విజయదేవవర్మ శాలంకాయన రాజ్యమును స్థాపించి రాజ్యముచేసెననియు, నది క్రీ. శ. ౪-వ శతాబ్ది ప్రారంభమునం దనియు చెప్పియుంటిమి. అందువలన డుబ్రేలుగారు శాలంకాయనరాజ్యప్రారంభమున కొసగినకాలము సరియైనది కాదని స్పష్టమగుచున్నది. కీ. శే. లక్ష్మణరావుగారు శాలంకాయనరాజులపాలనము క్రీ.శ. ౩౫౦ లో హస్తివర్మతో ప్రారంభమై ౫౦౦ లో స్కందవర్మతో నంత మయ్యె నని తలచిరి.40 వీరును హస్తివర్మయే మొదటిశాలంకాయనరా జని తలచియుండిరి. స్కందవర్మ క్రీ. శ. ౫౦౦ వరకును రాజ్యమేలె ననుటకు చిక్కుళ్ల శాసనము బాధించుచున్నది. అదియునుగాక వీరి పరిగణనమున యువమహారాజ బుద్ధవర్మకాలముకూడ చేరియున్నది. అతడు శాలంకాయన రాజు కా డని యిదివరలో చెప్పబడియున్నది. హస్తివర్మ ౩౫౦ లో రాజ్యమేలుట కారంభించె ననుట కాధార మేమియు లేదు. అత డాసంవత్సరమున వేంగీపాలకుడుగ నుండెననియే మనకు తెలియును. ఈతేదీ సముద్రగుప్తుని దక్షిణాపథదిగ్విజయకాలము ననుసరించి యూహింపబడినది. ఈవిషయమునను పండితులలో నభిప్రాయభేదము గలదు. ఈ దిగ్విజయకాలము క్రీ. శ. ౩౫౦ లో నని స్మిత్తుదొరగారును,41 ౩౩౫ లేక ౩౪౦ లో నని42 డుబ్రేలుగారును, ౩౪౫ - ౩౪౬ లో నని జయస్వాలుగారు43 నభిప్రాయపడినారు. ఈచర్చనుబట్టి హస్తివర్మ మొదటిశాలంకాయనరాజు కాడనియు, నతని పరిపాలనము క్రీ. శ. ౩౫౦ లో ప్రారంభము కాలేదనియు స్పష్టమగుచున్నది. శాలంకాయనులలో మొదటివాడగు విజయదేవవర్మ క్రీ. శ. ౪-వ శతాబ్ది యారంభమున నుండెననియు, కడపటివాడగు స్కందవర్మ క్రీ. శ. ౪౫౦ ప్రాంతమువాడనియు, పైనచెప్పబడిన విషయము సమంజసమనియు తోచుచున్నది. వీరిర్వురనడుమను నాలుగుతరముల రాజులుండిరి. తరమునకు ౨౫ సంవత్సరములవంతున లెక్కించినచో శాలంకాయనరాజుల కాల మీక్రిందివిధమున నేర్పడుచున్నది :

| | క్రీ. శ. |
|---|---|
| విజయదేవవర్మ | ౩౦౦-౩౨౫ |
| హస్తివర్మ | ౩౨౫-౩౫౦ |
| మొదటి నందివర్మ | ౩౫౦-౩౭౫ |
| చండవర్మ | ౩౭౫-౪౦౦ |
| రెండవ నందివర్మ | ౪౦౦-౪౨౫ |
| స్కందవర్మ | ౪౨౫-౪౫౦ |

## విజయదేవవర్మ

టాలెమీకాలమున ననగా క్రీ. శ. ౨-వ శతాబ్దిలో శాలంకాయనులు మచిలీపట్టణ వేంగీపురప్రాంతముల నుండిరి. క్రీ. శ. ౨౬౦ ప్రాంతమున నీప్రదేశమును పాలించిన యిక్ష్వాకురాజవంశ మంతరించెను. కొండముడిశాసనమునుండి వాని దాతయగు బృహత్ఫలాయన జయవర్మ శాలంకాయన విజయదేవవర్మకు ముందుండెనని తెలియుచున్నది. ఈజయవర్మ కుడూహారవిషయమున దానముచేసియుండుటచే నది యతని రాజ్యములోనిదని తెలియుచున్నది. అతడు పదిసంవత్సరములు రాజ్యమేలియుండెను. ఈకాలము పైశాలంకాయన రాజకాలనిర్ణయము ననుసరించి క్రీ. శ. ౨౯౦-౩౦౦ అగుచున్నది. మొట్టమొదటి శాలంకాయనశాసనములు వేంగీవద్ద దొరకినవి. అదియే వారికి రాజధానిగా చెప్పబడినది. దీనినిబట్టి క్రీ. శ. ౨౯౦ ప్రాంతమున బృహత్ఫలాయన వంశజుడగు జయవర్మ శాలంకాయనులను కుడూహారవిషయమునుండి తరిమి తాను దానినాక్రమించి పదిసంవత్సరములవరకును రాజ్యమేలెనని యూహింపవచ్చును. అటుపై నీజయవర్మయొక్కయు, బృహత్ఫలాయనులయొక్కయు ప్రశంస గన్పించుటలేదు. క్రీ. శ. ౩౦౦ నుండియు, ననగా జయవర్మ ౧౦ వ సంవత్సరమునకు బిమ్మట శాలంకాయన విజయదేవవర్మ రాజ్యమునకు వచ్చి యశ్వమేధము

40. J. A. H. R. S. V-1. p. 27.
41. Early Hist. Ind. p. 280.
42. A. H. D. p. 90.
43. Hist. Ind. 150-350. A. D. p. 139.

చేసెను. ఈకారణములనుబట్టి విజయదేవవర్మ బృహత్ఫలాయనులను జయించి, వారివంశమును నిర్మూలించి, వేంగిలో నొకస్వతంత్రరాజ్యమును నిర్మించి విజయసూచకముగ నశ్వమేధమును చేసెనని స్పష్టమగుచున్నది. ఇదేకాలమున వీరకూర్చవర్మయు, నతనిపుత్రుడగు శివస్కందవర్మయు పల్లవరాజ్యమును స్థాపించి విస్తరింపజేయుచుండిరి. పల్లవులును, శాలంకాయనులు నొకే తెగకు జెందినవారని యిదివరలో మనము నిశ్చయించియుంటిమి. ఈశాలంకాయన విజృంభణమునకు బల్లవుల తోడ్పాటుగూడ నుండెనేమో.

## హస్తివర్మ—గుప్త దిగ్విజయము

క్రీ. శ. 3౨౫ లో విజయదేవవర్మ మరణించిన పిమ్మట నతని తనయుడగు హస్తివర్మ వేంగీరాజ్యమునకు వచ్చెను. ఈరాజుకాలముననే గుప్తవంశపురాజగు సముద్రగుప్తుడు తనదిగ్విజయముల నారంభించెను. ఈసమయమున మధ్యహిందూదేశమున భారశివ నాగులును, ప్రకృతబస్తరురాజ్యమునను నైజాంరాష్ట్రమున చాల భాగమునను వారి బంధువు లగు వాకాటకులును,44 తూర్పుతీరమున శాలంకాయనులును, దక్షిణమున పల్లవులును ప్రబలులై యుండిరి. క్రీ. శ. 3౮౫ నాటికి సముద్రగుప్తుడు నాగవాకాటకులను జయించి యటుపై దక్షిణాపథముపై దాడి వెడలెను.45 ఈసందర్భమునం దీతనిచే కోసల, మహాకాంతార, గిరికొత్తూర, ఎరండపల్లి, దేవరాష్ట్ర, పిష్టపుర, అవముక్త, వేంగీ, పాలక్క, కాంచీ మున్నగురాజ్యముల రాజులు జయింపబడిరని యతని యల్హాబాదు శిలాస్తంభశాసనము తెల్పుచున్నది. ఈవిషయము ననువదించుటలో పండితులు భిన్నాభిప్రాయులై యున్నారు. సముద్రగుప్తుడాయా రాజులను వారివారి స్థానములలో నోడించెనా? లేక నందరి నొకచోట నోడించెనా? అతడు కాంచీపురము వర కేతెంచెనా లేదా యను సంశయములు వివాద్యములుగ నున్నవి. జయస్వాలుగారు "మనమీరాజుల పేర్లను గాంచినచో వారందరును కొల్లేరుసరస్సునకు దగ్గరనున్న యాంధ్రకళింగదేశములలోనివా రని స్పష్టమగుచున్నది. వీ రందరును చేరి సముద్రగుప్తు నెదుర్కొనిరి. తన కౌశలముచే వీరందరి నాగుప్తరాజోడించి, పిమ్మట విడిచిపుచ్చెను. అందుచే నీతడు బెజవాడ, రాజమహేంద్రవరములనుండియే వెనుకకు మరలెను. కంచికి పోవలసిన యవసర మీతనికి కలుగలేదు."46 అని వ్రాసియున్నారు. "కంచిరాజగు విష్ణుగోపుని రాజ్యము కృష్ణాతీరమువరకును వ్యాపించియుండుటచే, నత డీ గుప్తరాజు నచ్చటనే యెదిర్చియుండె" నని దుబ్రేలుగారి యభిప్రాయము.47 అల్హాబాదు శాసనమున పేర్కొనబడిన స్థలములన్నియు గళింగదేశములోనివే యనియు, సముద్రగుప్తుడు కళింగమునుదాటి దక్షిణమునకు పోలేదనియు డాక్టరు బుర్రా శేషగిరిరావుగారి వాదము.48 నడింపల్లి జగన్నాథరావుగారు పల్లవరాజ్య మీకాలమున పిష్టపురమువరకును వ్యాపించెననియు, నందుచే విష్ణుగోపుడు సముద్రగుప్తుని కచటనే తటస్థమయ్యెననియు, నాగుప్తరాజు పిష్టపురమును దాటి దక్షిణమునకు పోలేదనియు వ్రాసియుండిరి.50 ఈకాలమున బల్లవరాజ్యము కృష్ణానదిదక్షిణతీరమును దాటి యుత్తరముగ వ్యాపించియుండలేదని వారిశాసనములే తెల్పుచున్నవి. అప్పుడు పల్లవవిష్ణుగోపుని నోడించవలెనన్నచో సముద్రగుప్తుడు కృష్ణను దాటవలసియేయుండును. ఇందువలన దుబ్రేలు, జగన్నాథరావుగార్ల యూహలు నిరాధారములని తెలియుచున్నది. అల్హాబాదుశాసనములోని రాజులందరు నాకాలమున సుప్రసిద్ధులై యుందురు. లేనిచో దిగ్విజేతయగు తనయేలిక శక్తిసామర్థ్యములను పొగడుచు నాశాసనమును రచించిన హరిసేనకవి వారిని పేర్కొనియుండడు. అట్టి యీరాజులు కళింగదేశములోని కుగ్రామముల నేలుచుండిరని చెప్పు డాక్టరు శేషగిరిరావుగారి వాద

44. Jayaswal Hist. Ind. p. 50.
45. Ibid p. 134.
46. Ibid pp. 136-137.
47. A. H. D. p. 60.
48. భారతి V-i పే 780.
49. శారద-జూలై 1924 పే. 407-411.



కృష్ణసాని

(శ్రీ కాశీనాథంరావుగారి తంజాపుర ప్రాచీన చిత్రసంగ్రహమునుండి)

మెంతమాత్రమును సమంజసముగాలేదు. ఇక మిగిలినది జయస్వాలుగారి యభిప్రాయము. ప్రాక్కీరపురాజులందరును చేరి కొల్లేరుసరస్సువద్ద సముద్రగుప్తునితో యుద్ధముచేసిరనుటకు వీరు రెండుకారణములను తెల్పుచున్నారు. అందు మొదటిది అల్లాహాబాదుశాసనకృతికర్త సముద్రగుప్తుని దిగ్విజయములను వర్ణించుటలో నొక భౌగోళికశాస్త్రానుసారమగు వరుస ననుసరించెననుట; రెండవది యతఁడావేర్లను కవిత్వసౌకర్యము ననుసరించి చెప్పలేదనుట.50 ఈవిషయములు విమర్శార్హములు. కొల్లేరుయుద్ధప్రశంస యల్లాహాబాదుశాసనమున బ్రత్యక్షముగగాని, ప్రక్షిప్తముగగాని చేయబడలేదు. ఆయాక్షేపణ నూహించియే జయస్వాలుగారు క్రీ. శ. 8-వ శతాబ్దిలో రెండవపులికేశికాలమున కొల్లేరుసరస్సువద్ద యుద్ధము జరగియుండుటచే సముద్రగుప్తుని కాలముననుజరగియుండునని వ్రాసియున్నారు. కాని యీయూహ నిరాధారము. దుబ్రేలుగారు శాసనమున కొల్లేరుసరస్సే పేర్కొనబడలేదనుచున్నారు.51 ఇకమిగిలినది ప్రాక్కీరరాజు లందరు నొకచో జేరియుండిరా యను సంశయము. కొత్తూరు, ఏరండపల్లి మున్నగు దూరప్రదేశముల రాజులు దక్షిణముననున్న కొల్లేరుసరస్సువద్ద కేల రావలెనో తెలియుటలేదు. ఉత్తరమునుండి వచ్చు సముద్రగుప్తుడు వారి రాజ్యములను జయించియే వేంగికిరావలసియుండును. ప్రబలుడగు శత్రువు తమ రాజ్యములపై దండెత్తివచ్చుచుండ నీరాజులు తమరాజ్యములను వీడి కొల్లేరుసరస్సుకుపోవుట రాజనీతికి విరుద్ధముగను, హాస్యాస్పదముగను గన్పించుచున్నది. హరిసేను డీరాజులను పేర్కొనుటలో నొకవరుస ననుసరించెనను జయస్వాలుగారి మరియొక యూహ గూడ సమంజసముగ లేదు. అట్లయినచో మొదట మహాకాంతారపురాజగు వ్యాఘ్రరాజును, పిమ్మట కొల్లేరుసరస్సువద్ద రాజుగనుండిన మంతరాజును, తరువాత నుత్తరమున నున్న పిష్టపురపాలకు డగు మహేంద్రుడును, అటుపైనుత్తరమున ఎలమంచిలివద్దనున్న ఏరండపల్లి రాజును, పిదప దక్షిణమున నుండు వేంగీపాలక్క-పాలకులును, తిరిగియుత్తరమున నున్న దేవరాష్ట్రపు రాజును పేర్కొనబడి యుండరు. దీనినిబట్టి యీరాజులందరిని వారివారిస్థానములలో సముద్రగుప్తు డోడించెననియు, నల్లాహాబాదు శాసనమును రచించిన హరిసేన కవి వారిపేర్లను సౌకర్యము ననుసరించి పేర్కొనెననియు స్పష్టమగుచున్నది. అందువలన సముద్రగుప్తుడు కృష్ణానదినిదాటి కాంచీపురమువరకు నేగెననియే యూహింపవచ్చును.

క్రీ. శ. 345 ప్రాంతమున పిష్టపురమును, గోదావరీతీరమునందలి అవముక్తమును జయించినపిమ్మట సముద్రగుప్తుడు వేంగిపై దండెత్తివచ్చి శాలంకాయన హస్తివర్మ నోడించెను. అయిన నీదండయాత్ర కేవలము దిగ్విజయముకొరకే సాగింపబడియుండుటచే శాలంకాయనరాజ్యమునకు వాస్తవముగ నేవిధమగు హానియు గల్గియుండలేదు.

## ఇతరరాజులు

హస్తివర్మకు పిమ్మట నాతనిపుత్రుడగు మొదటి నందివర్మ వేంగీసింహాసనమునకువచ్చెను. పెదవేగిశాసనమున నతడు "వివిధధర్మప్రధాను" డని పేర్కొనబడినాడు. ఈనందివర్మపుత్రునిగూర్చియు, పౌత్రునిగూర్చియు విశేషములు తెలియుటలేదు.

## శాలంకాయనుల పతనము

క్రీ. శ. 450 ప్రాంతమున మహారాజస్కంద వర్మ వేంగీసింహాసనము నెక్కెను. ఇతనిరాజ్యకాలముననో, లేక నితడు మరణించిన కొలదికాలమునకో విష్ణుకుండులు వేంగీదేశమును జయించిరి. ఇట్లనుటకు చిక్కుళ్ళతామ్రశాసనమే యాధారము.52 ఈ కాలమున ప్రకృతసైజాంరాష్ట్రములోని చాలభాగము నేలుచుండిన వాకాటకరాజగు రెండవపృథ్వీసేనుడు

50. Hist. Ind. p. 135.

51. A. H. D. p. 59.

53. E. I. IV. P. 193.

శాలంకాయనులను జయించి తనబంధువును, విష్ణుకుండినవంశజుడు నగు మొదటిమాధవవర్మను వేంగి సింహాసనమున ప్రతిష్ఠించె నని దుబ్రేలుగారి యభిప్రాయము.[53] జయస్వాలుగారు నీవిధముననే తలంచుచున్నారు.[54] దుబ్రేలుగారు పైవిష్ణుకుండిన మాధవవర్మ క్రీ. శ. ౪౫౦-౪౭౫ నడుమ నుండెననియు,[55] జయస్వాలుగారు వాకాటకపృథ్వీసేనుడు క్రీ. శ. ౪౭౦-౭౫ నడుమ నుండెననియు వ్రాసియున్నారు.[56] దీనినుండి యీరాజు లిర్వురును క్రీ. శ. ౪౭౦-౭౫ నడుమ సమకాలికులై యుండిరని స్పష్టమగుచున్నది. అప్పుడు పై యిర్వురుపండితుల యభిప్రాయముల ననుసరించియు క్రీ. శ. ౪౭౦-౪౭౫ నడుమనే శాలంకాయన రాజ్యమంతరించియుండవలెను. కీ. శే. లక్ష్మణరావుగారును, శ్రీయుత సోమశేఖరశర్మగారును విష్ణుకుండిన ఇంద్రభట్టారకవర్మ శాలంకాయనులను జయించెననియు నతడు క్రీ. శ. ౪౯౮-౫౨౮ నడుమ జీవించెననియు వ్రాసియున్నారు.[57] ఏది యెట్లున్నను క్రీ. శ. ౪-వ శతాబ్ది ప్రారంభమున బయల్వెడలిన శాలంకాయన రాజ్యము ౫-వ శతాబ్ది మూడవపాద మారంభమగునప్పటికి నశించెనని స్పష్టమగుచున్నది.

## రాజ్యవిస్తీర్ణము

శాలంకాయనుల రాజ్యముయొక్క విస్తీర్ణము వారిశాసనములలో చెప్పబడిన గ్రామములనుండియు, దేశవిభాగములనుండియు తెలియనగుచున్నది. అందు చిన్నాపురము, వేపమారి, కురువాడ, ప్రాలూరు, చెంచెరువ, ముందూరు గ్రామములు పేర్కొనబడియున్నవి.[58] చిన్నాపురము బందరు తాలూకాలో నున్నది. లేపమారి కైకలూరుతాలూకాలోని లోకమూడియు, కురువాడ గుడివాడ తాలూకాలోని కూరాడయు నగునని నా యభిప్రాయము. తణుకు తాలూకాలోని పాలూరును, ఏలూరు తాలూకాలో ముందూరును శాసనములలోని ప్రాలూర, ముందూరులకు సరియగును. కంతేరుతామ్రశాసనములోని కుదూహారవిషయము నేటికృష్ణామండలములోని దివి, బందరు, కైకలూరు, గుడివాడతాలూకాలకు సరియగునని పండితుల యభిప్రాయము.[59] దీనినిబట్టి ప్రకృత పశ్చిమగోదావరిజిల్లాలోని తణుకువరకును గల భాగము వేంగివిషయమయియుండెనని స్పష్టమగుచున్నది. కొంచెమించుమించుగా నేటి పశ్చిమగోదావరి, కృష్ణాజిల్లాలు నాటి శాలంకాయనరాజ్యముగ నుండెననిచెప్పవచ్చును. అది కుదూహారవిషయము, వేంగివిషయము న నిరెండు భాగములుగ విభజింపబడియుండెను.

## పరిపాలనావిధానము

శాలంకాయనరాజు లొక చక్కని పరిపాలనా విధానము ననుసరించి దేశము నేలుచుండిరని వారిశాసనములు తెల్పుచున్నవి. కొల్లేరు శాసనమున[60] "దేశాధిపత్యాయుక్తకవల్లభరాజపురుష"ులును, మొదటికంతేరు శాసనమున[61] "నియోగనియుక్తాయుక్తక విషయపతి మిత్రు"లును పేర్కొనబడియున్నారు. పెదవేగిశాసనమునను వీరి ప్రశంస గలదు.[62] కొల్లేరు శాసనములోని యుద్యోగులను "Governors of the Country, ministers, favourites and servants of the king" అని ఫ్లీటుపండితుడు పేర్కొనియున్నాడు.[63] లక్ష్మణరావుగారు పైకంతేరు శాసనభాగమును "All the respecteble officers of the king, mini-

54. A. H. S. p. 84.
55. Hist. Ind. p. 128.
56. A. H. D. p. 110.
57. Hist. Ind. p. 79.
58. భారతి, ఆగష్టు ౧౯౨౪ పే. ౧౧౫.
59. చూ. కంతేరు పెదవేగిశాసనములు.
59. J.A.H.R.S. V-i. p.
60. I.A.V. p. 175.
61. J. A. H. R. S. V-i. మూలము 11, 12 పంక్తులు.
62. Ibid I-2 pp. 16, 17 పంక్తులు.
63. I.A.V. p. 176.

sters, agents, heads of vis̈hayas" అని యనువదించిరి.64 పెదవేగిశాసనమున "రహస్యాధికృత్" అను మరియొకయుద్యోగి చెప్పబడినాడు. అతడు శాసనములను వ్రాయుచుండెను. ఈ యుద్యోగము నేటి అంతరంగికకార్యదర్శిత్వము (Frivate Secretary). నకు సరియగుచున్నది. పెదవేగిశాసనములో "ప్రాలుర గ్రామే మునుదసహితాన్ గ్రామేయకాన్ సమాజ్ఞాపయతి" యను భాగము గలదు. శ్రీయుత రాళ్లబండి సుబ్బారావుగారు మునుదయనునది ములుదయనుపదమునకు రూపాంతరమనియు, "పూర్వము వలసవచ్చినవారు" అని దాని కర్థమనియు వ్రాసిరి.65 కాని దీనికి ప్రమాణమేమియు జూపబడలేదు. ఈ యర్థము నంగీకరించినచో పైవాక్యమున కన్వయము కుదురుటలేదు. ఈపదమును లక్ష్మణరావుగారు 'మునుడ' యనియు,66 బర్నెలుపండితుడు 'మున్యోడ' యనియు జదివిరి.67 ఫ్లీటుపండితు డీపదమును చర్చించి యది 'మత్యాది' యగుననియు పైవాక్యమునకు "మంత్రులతో గూడిన గ్రామస్థులు" అని యర్థము చెప్పవలెననియు 68 వ్రాసియున్నాడు. మంత్రులు రాజధానిలో నుందురుగాని రాజ్యములోని చిన్నచిన్న గ్రామములలో నుండరు. "ములదసహితాన్ గ్రామేయకాన్ సమాజ్ఞాపయతి" యనువాక్యము తరువాతకాలమున శాసనములలో గాంచనగు "రాష్ట్రకూటప్రముఖాన్ సర్వేకుటుంబినస్సమాహూయ ఇత్థమాజ్ఞాపయతి" యను వాక్యమును పోలియున్నవి. ఈరెండవవాక్యమునకు 'రాష్ట్రకూటుడు మొదలుగాగల కుటుంబినులను' అనునర్థమును పండితులంగీకరించియున్నారు. మొదటివాక్యములో నీరాష్ట్రకూటశబ్దముస్థానమున ములుదశబ్దము గాంచనగుచున్నది. గాన ములుద, మునుడశబ్దములకు గ్రామముఖ్యుడను నర్థము చెప్పుట సమంజసముగ నుండునని నాయభిప్రాయము. ఈ చర్చనుండి శాలంకాయన రాజులకాలమున నీక్రింది యుద్యోగు లుండిరని తెలియనగుచున్నది.

| | |
|---|---|
| దేశాధిపతి | నేటిగవర్నరుకు సరియగు రాజోద్యోగి |
| విషయాధిపతి | నేటి జిల్లాకలెక్టరువంటివాడు |
| నియోగ | ఒక రాజోద్యోగి-ఒక ప్రత్యేకశాఖకధిపతియైయుండును |
| నియుక్త | మంత్రి. |
| ఆయు(యో)క్తకుడు | ప్రతినిధి |
| రాజపురుషుడు | రాజోద్యోగి |
| వల్లభుడు | రాజాదరముగలవాడు, ఇష్టుడు |
| మిత్రుడు | పలుకుబడిగల పౌరుడు |
| రహస్యాధికృతుడు | అంతరంగికకార్యదర్శి |
| ములుద | గ్రామాధిపతి. |

## మతము

శాలంకాయన శాసనము లానాటి మతమును గూర్చియు విశేషములను తెల్పుచున్నవి. ఈవంశపు రాజులు "భగవచ్చిత్రరథస్వామి పాదానుధ్యాతు"లు. దీనినుండి క్రీ. శ. ౪, ౫ లలో వేంగీదేశమున సూర్యారాధనము వ్యాప్తిలోనుండెనని తెలియుచున్నది. నేటికిని ఏలూరువద్దగల చినవేగిగ్రామములో నొక శిథిలాలయము చిత్రరథస్వామిగుడియని స్థానికులచే జూపింపబడుచున్నది. విజయదేవవర్మ మాహేశ్వరుడు. రెండవ నందివర్మ పరమభాగవతుడు. దీనినిబట్టి శాలంకాయన రాజులకాలమున శైవవైష్ణవమతములు రెండును వ్యాప్తిలోనుండినట్లు స్పష్టమగుచున్నది. శాలంకాయనరాజ్యమంతరించిన ౧౫౦ సంవత్సరములకు వేంగీదేశమును జూడవచ్చిన హ్యూయాన్ ష్వాంగ్ అను చైనాదేశయాత్రికుడు వేంగిలో ౨౦ బౌద్ధవిహారములును, 30 హిందూదేవళములును, కొన్ని జైనఉపాశ్రయములు నుండినవని వ్రాసియున్నాడు. మచిలీపట్టణమునకు సమీపమున ఘంటశాలలో ప్రాచీన బౌద్ధస్తూపము బయల్వెడలినది.

64. J.A.H.R.S. V-i. p. 31.
65. J. A. H. R. S. I—2. p. 101
66. Ibid V i p. 32 n. 3.
67. South Ind. pale. pp. 135-136.
68. I. A. V p. 176.

దీనినిబట్టి శాలంకాయనులకాలమునగూడ వేంగిలో జైన బౌద్ధమతము లుండినవని యూహింపవచ్చును. రాజులు మతసహిష్ణుత గలవా రగుటచే నాకాలమున జైన బౌద్ధ శైవ వైష్ణవులును, మార్యారాధకులును అలజడి లేక వర్ధిల్లిరి.

---

# నారాయణదాసు

అత్తిలి సూర్యనారాయణమూర్తి
(రవీంద్ర సారస్వతసమాజం)

విన్నామురా పాట
కన్నామురా నృత్య
విన్యాసవీచికల
విహరించు మధురిమలు.

సంగీతవిద్యలో
చక్రవర్తివి నీవు,
మహతీవిపంచికా
మహనీయరూపమవు; విన్నామురా.

పలుకు తేనెల జిల్కు
పద్మజునిరాణివిర,
కవిత వేదవ్యాసు
గంభీరవాక్కురా, విన్నామురా.

శంభోపదమ్ములో
అంభోధి అరచెరా
కాళ్ల గజ్జెలమోత
కంపించె కులగిరులు; విన్నామురా.

ఆనడకలా నృత్య
మానాట్యగతులలో,
కరిగించు లాస్యాల
భరతముని యాడెరా; విన్నామురా.

సప్తదశవర్షాలు
లిప్తలైనడిచెరా
వాగ్గేయకారకా
ప్రజ్ఞాధురంధరా, విన్నామురా.

---

# చెరకుపానకమును మరగించి దించుట

పూడిపెద్ది వెంకటరమణయ్య

అట్లు శుభ్రపరచిన చెరకురసమున నూటికి ౮౦ మొదలు ౮౫ వరకు నీరే యుండును. కావున నందుండి యట్లే చక్కెరను వేరుచేయుట యసాధ్యము. ఆనీటి నెట్లయిన వెడలగొట్టవలెనుగదా. పూర్వ మీ పానకమును తెరచియుంచిన వెడల్పు పెనములలో పెట్టి నీరుపోవువరకును మరగించివేసెడివారు. అట్లు మరగించుటలో వేడి యెక్కువగ తగిలి లోనిచక్కెరలో కొంత పరిస్ఫుటముకాని చక్కెరగ (Gluecose) గ మారి తీసికొన నవకాశమీయకుండెడిది. ఇప్పు డట్లుగాక మూసిన పాత్రలలో తక్కువవేడితో దానిని మరగింతురు. పానకము మరగుచోట గాలిలేకున్న నది తక్కువవేడితోనే మరగును. అప్పుడు లోనిచక్కెర అంతయు చెక్కుచెదరకుండ రవలై ప్రస్ఫుటించును. ఈయుష్ణపరిమాణము రసము, బలమును బట్టి మారుచుండును.

## గాలిలేకుండ చేయువిధానము

మూడు నాలుగు లోహపాత్ర లొకదానితో నొకటి కలసియుండును. వానిలో నడుమ నిలువుపాత్ర లుండును. ఈనిలువుపాత్రలలోనికి ఆవిరి నంపుదురు. దీన నమర్పబడి గొట్టములలో మరగించవలసిన రసమును లాగికొందురు. అప్పుడు యంత్రమును నడుపుదురు. మొదటిపాత్రలో లేచినయావిరి రెండవనిలువుపాత్ర లోనికి పోయి, మొదటిపాత్రనుండి రెండవపాత్రలోనికి (గొట్టములకు) రసమును లాగును. అక్కడనుండి యవి రెండును మూడవపాత్రలోనికి నడచును. ఇక్కడనుండి ఆయావిరిని చల్లబరచుపాత్రలోనికి చిమ్ముదురు.

ఇది చన్నీటిప్రవాహమున ముంపబడియుండును. ఈనీటిప్రవాహమున చల్లబడిన ఆవిరియంతయును నీరయి పోవును. పాత్రలోని యావిరిట్లు నీరయి పైనిబడుట వలన క్రమక్రమముగ నాపాత్రలలో గాలిలేని ప్రదేశ మేర్పడును. ఈప్రదేశమునగల గొట్టములలోని పానకమును తక్కువ యుష్ణముతో మరగింపవచ్చును. యంత్రమున నిట్టిపాత్రలెన్నియుండిన నంతయెక్కువరసమును మరగింపవచ్చును. కాని సాధారణముగా నాలుగుపాత్రల కెక్కు డుంచరు. అట్లుగొట్టములలోని రసము మరగి కొసపాత్రలోని గొట్టములలోనికి వచ్చుసరికి అందలినీరు కొంతఆవిరియై వెడలి రసము చిక్కబడును. దీని నప్పుడు చిక్కనిరసము, లేక పానకమందురు.

ఈపానకము నప్పుడు వెడల్పుపాత్రలలో నింపి నిలువరింతురు. ఆవిరిగ వెడలివచ్చి నీరయిన యానీరును యంత్రము నడుపుట కుపయోగింతురు. ఏమనగా నిది చాలవేడిగ నుండును. కావున చన్నీటికంటె తక్కువ వేడిమితో మరగి యంత్రమును నడుపగలదు. కాని ఈ నీటిలో నేమాత్రమును చక్కెర ఉండకూడదు. ఈ యావిరియంత్రము నడచునపుడు లోన నేమిజరుగుచున్నదియు పనివాడు చూచుకొనుటకు చిన్నచూపుటద్దము లందమర్పబడియుండును. అట్లుచూచి కొసపాత్రలోనికి వచ్చినరసము తగినంతచిక్కబడినదని తెలిసికొని దానిని పానకపుతొట్టెలలోనికి విడచును.

## చక్కెరను దించుట

ఇది సులభముగ చెప్పదగిన విధానము కాదు. ఈపని నడపుటకు అన్యదేశములలో మంచిశాస్త్రజ్ఞుని నియమింతురు. కాని మనదేశమున నట్లుకాదు. చక్కెరను వండి దించుపని, అలవాటుపడిన (శాస్త్ర మెరుగని) వంటవాని చేతులో విడతురు. వానిచాకచక్యమునుబట్టి యిది పాకమున బడునేగాని శాస్త్రచర్చ లేదు. యంత్రము నడపువానికిని శాస్త్రజ్ఞునకును ఎంతటి ప్రాముఖ్యము గలదో అంతటి ప్రాముఖ్యము ఈవంటవానికిని గలదు. దీనికి చేవేతనమునకు కొరతయుండదు. కాని వానికి చదువురాదు. అనుభవమును బట్టి మాత్ర మాతడు పాన

కము పాకము నెరిగినవాడు. తానేమి అక్కడ చేయుచున్నాడో, ఎందుకట్లుచేయు చేయుచున్నాడో ఆతడు చెప్పలేదు. చక్కెరసొగసు రవలు సమానముగ నున్నప్పుడే. ఈరవల సౌభాగ్యము చక్కెరశాస్త్రజ్ఞుని పయి నెంత యాధారపడియున్నదో ఈవంటగానిపయి నంత యాధారపడియున్నది. ఈ రవలసౌభాగ్యమే కర్మాగారముల కీర్తిభాగ్యములు.

చక్కెరను మరగించి, దించుటకు పూర్వము పానకమునకు కొంతరసాయనచికిత్స యవసరము. పలుచనిరసములో కరగియున్న కొన్నిపదార్థములు రసము చిక్కపడినకొలది వేరయిపోవును. అవి చిక్కనిరసములో కరగియుండలేవు. అవి పైకితీసివేయకున్న చక్కెర మలినమయి తక్కువరకమున చేరను. కొన్ని కర్మాగారములలో దీనిని వడియగట్టుదురు. కొన్నిట నిది యడుగంటువరకు ౬ మొదలు ౧౦ గంటల కాలమువరకు పాత్రలలో నట్టె విడతురు. అట్లు వడియగట్టిన, లేక తేర్చిన రసములో గంధకపుటావిరి నడిపించి దాని ఛన్నెను తీసివేయుదురు. మంచిచక్కెర కావలెనన్న ఈగంధకవైద్యము చేయవలెను. గంధకము పట్టిన యీ రసమును దింపుడుపాత్రలలో నింపుదురు. పూర్వ మీ పానకము నెన్నేని సారులు మరగించి మడ్డితీసెడివారు. కాని యిప్పుడు సర్వత్ర కలుపుడు మరగింపే చేయుచున్నారు. ఇట్లుచేయుటవలన మూడు మరగింపులలో చక్కెర అంతయు దిగును. మూడుమరగింపులలోను మూడురకముల చక్కెర దిగును. ఇందు మొదటి రెండు రకములును మంచి తెల్లనికాంతిగల చక్కెరగ సంచులబడును. మూడవదిమాత్రము తిరుగ యంత్రమున కెక్కును. చక్కెరవంటవాడు చాకచక్యముగలవాడయ్యెనేని మొదటి రెండురకముల చక్కెరనే దించును.

## చక్కెరరవల దించు విధానము

దీనికి ౧౨ మొదలు ౨౦ అడుగులవరకు ఎత్తుగల ఇనుపపాత్రముండును. దానిలో నొక లోపలిపాత్ర ముండును. దాని నావిరితో నింపుదురు. ఈయావిరి పాత్రమున నిలచిన గొట్టములుండును. వానిని పానకముతో నింపుదురు. ఇందు మరగుచున్న పానకమును పరిశోధించుటకు ఇనుపగజమొకటుండును. దానితో పానకమును పైకితీసి మచ్చు చూడవచ్చును. పాత్రకమర్చిన మాపుదద్దములనుండి లోన నేమిజరుగుచున్నదియు చూడవచ్చును. పానకమును భూతయంత్రమున పరీక్షింతురు. వెనుకటివలెనే ఇక్కడకూడ ఆవిరిని చల్లబరచు సాధన ముండి, లోపల తక్కువయొత్తిడముతో పానకమును మరగింతురు. పానకము చిక్కబడినకొలది పలుచని పానకము పెనములోనికి నడుపుదురు. వంటగాడు చిక్కదనమును పరీక్షించుచు చాలినంత చిక్కబడగానే అచటియొత్తిడమును అకస్మాత్తుగతగ్గించును. లోపలగాలిలేమిని హెచ్చించినట్లగును. ఉష్ణత తగ్గగానే ఈపానకపు పెనములు చల్లారును గదా! ఈ చల్లారుటలో పానకము తడబడి చక్కెరరవల వెలికి గ్రక్కును. ఇట్లుచేయుటకు ఎన్నదగిన పనివానితనమును, అనుభవమును ఉండవలెను. అన్నిరవలును అట్లా పాకమున విడవరాదు. అప్పుడావంటగాడు పెనములలోనికి మరికొంత పలుచని పానకమునుగాని నీటినిగాని లాగి సగముచక్కెరరవలను దాన కరగనిచ్చును. వెనుకటివలెనే ఈపానకమును మరగించి యకస్మాత్తుగ చల్లార్చినయెడల వెనుకటి రవలు పెద్దవి యగుచుండును. కాని చిన్నరవలు వేరుగ నేర్పడవు. అక్కడ ఈవరకే కొన్ని రవలుండుటవలన క్రొత్తగవచ్చిన చక్కెర అప్రాత రవలనే అంటుకొనును. ఇట్లా వంటవాడు ఆరవలను కావలసినంతమట్టున పెరుగనిచ్చును. ఇక నాపాకమును ఉండయయి ప్రాకిపోకుండునందాక మరగించి విడతురు. మరగించుట యయినది.

ఇట్లు సిద్ధపడిన పెనములలోని పదార్థమును U ఆకృతిగల పాత్రలలో పెట్టి మెల్లగ కదలు తెడ్లతో కదుపుదురు. ఇట్లు కదుపుటవలన రెండులాభములు గలవు: (౧) చక్కెర అడుగంటదు. (౨) కదలుచుండునంతసేపును మడ్డిలోని చక్కెర తేరినరవల కంటుకొనుచుండును. రవ పెరుగుచుండును. అంతె దానిని రమారమి ఆరుగంటలకాలము చల్లార్తురు. రెండవమాటు వచ్చిన దానిని ౧౨ గంటలకాలము చల్లార్తురు.

## చక్కెర తీసికొనుట

ఈముద్దను మరజల్లెడలతో త్రిప్పుదురు. ఈ తిరుగుటలో చక్కెరరవలు జల్లెడకన్నములలో నిలచిపోయి మడ్డిమాత్రము జారిపోవును. ఆచక్కెరను నీటితోను, ఆవిరితోను కడిగి గ్రహింతురు. ఈచక్కెరను గల పచ్చదనమును తీసివేయుటకు శేదో యొక నీలిద్రావకమును దానిపయిని పోయుదురు. కొందరీద్రావకమును సెనముఃలోనే కలుపుదురు. ఇట్లు కడిగిన చక్కెరను ఎండపెట్టు పాత్రలకు తీయుదురు.

ఇందుల కుపయోగించుపాత్ర పాడవాటి పంచపాత్రవలె నుండును. అది యంత్రమున గిరగిర తిరుగుచుండును. ఈపాత్రలో నొకవైపునుండి వేడిగాడ్పును, రెండవవైపునుండి తడిచక్కెరయును వచ్చుచుండును. ఇట్లువచ్చిన చక్కెర పాత్రనఘుమ నిగురును. దానిని చల్లారినవెనుక సంచుల కెత్తుదురు. ఈవిధానమంతయు నొక్క యూపున నడుపుదురు.

రాబోవువ్యాసమున బెల్లమును శుభ్రపరచుట చెప్పబడును.



కాబోవుసంగతులు                                    D. A. R.

# జిజ్ఞాస—స్థవిరదశ

చిల్కపాటి సీతాంబ

ప్రీతితరంబగు కౌతుకంబున
నలరుమానసికాదు లీయెడ
సతతమును నీరసము నొందుచు
సమయు టేలనొకో.

కన్నులకు సొంపగుచు నెంతయు
గన్పడెడు నీప్రకృతి యీగతి
చెన్నుదొరగి యసహ్యభావము
జెందుటేలనొకో.

మున్ను పరమార్థము లనుచు మది
నెన్నబడువిషయాదిచింతలు
సన్నగిలి నానాటి కవియే
చనియె నెచ్చటికో.

అంచితాంగవిశేష మడగుచు
నతిబలము శల్యానుగతమై
నెంచ భీమగదాహతికి తను
విటుల ద్రగ్గుచు భారతము నుప
మించి చూడగ దేహధర్మము
యిటులమారెనుగా.[౧]

చూడ వింతగ నాల్గుకన్నులు
మూడుకాళ్లు లొసంగి యౌవన
మేడకో కనుబ్రామి సనెనిది
యేమిహేతు వొకో.

కొంతకాలము క్రీడలకు మఱి
కొంతకాలము కాంతలకు గృహ
చింతలకు మరికొంతకాలము
జిక్కె ఫలమేమో!
హాయలు మీరిన వేషభాషల
నొప్పునాజీవనవిధం బిటు
రయమునను విపరీతమై చెడ
నయిన దెందులకో.

ఏయెడను ననుగూర్చి ప్రియమే
సేయుచుండెడిపరిజనంబులు
దాయకయ సాసూయమున విడ
దలచు టేలనొకో.

కోరి యెప్పుడు నాకు సౌఖ్యము
గూర్చి పాయక మెలగుచుండెడి
వారిజాక్షులు మారుమోమిడి
చేర రేలనొకో!

తనువు లస్థిరములు సుతాదులు
దారలును సంపదలు కల్లల
టనుచు నహమిక తరుణదశలో
నరయనైతినిగా.

నాది నావారనుచు మది స
మ్మోదమున గనుసతిసుతాదులు
సాదరంబుగ చూచిచూడని
చంద మేలనొకో!

సారరహితంబైన దీసం
సారబంధ మటంచు మది కొక
తీరుగా నిజబోధతత్త్వము
దెల్పె హృది నెవరో.

సతిసుతాదులు వెంటరారట
అతికఠినుడట కాలు డికనే
గతియొ కాలముచేరువట నిక
గాచువా రెవరో.

శిరము కుక్షిని జేర్చి యోజన
సేయ నన్నియు మిథ్యలౌ శ్రీ
హరిపదంబులె తారకంబని
యరయగల్గితిగా.

---

౧. ఈ పద్యమున రమ్యమగు శ్లేషకలదు. ప్రకృతార్థమొకటి రెండవది భారతయుద్ధపర్యాయము.

# మానవవికాసము

గూ. వెంకటచలం

జీవము:—

ఈపదానికి అర్థం రెండువేలఏళ్లక్రిందట ఎంత తెలిసిందో ఇప్పుడూ అంతేతెలిసిం దని ఒప్పుకోవాలి. ప్రకృతిలో వచ్చిన ఈ విచిత్రాన్ని విజ్ఞానం వ్యక్త పర్చలేకపోయింది. ప్రపంచమంతటా, ప్రతిదేశం లోనూ అన్నికాలాల్లోనూ ఈరహస్యం తెలుసుకుందా మని ప్రయత్నాలు జరిగాయి. భారతీయులు ఆధ్యా త్మికరీత్యా తెలుసుకుందామని తపస్సులు చేశారు. పాశ్చాత్యులు అనంతాధికారంగల్గిన మానవుని కసా ధ్యమూ అనుకున్నారు. ఇదీ భౌతికవాదుల యహం కారము. కాని ప్రతివారుకూడ ఈజీవంరూపం ఇద మిత్థమని నిర్ణయించలేకపోయినా ఏదో అర్థాన్ని చెపు తున్నారు. పాశ్చాత్యవేదాంతులుకూడ జీవాన్ని భౌతి కంగా వ్యక్తపర్చారు. ౧౯-వ శతాబ్దమునందు హెర్బ ర్టుస్పెన్సరు అను వేదాంతి "జీవము—ద్రవ్యము (Matter) చలనంతో ప్రత్యేకసంయోగంచెందితే వచ్చే ఫలిత" మన్నాడు. కాని ఇది ఆయనచెప్పినటుల సిద్ధించే సులభసాధ్యమైన పదార్థము కాదు. స్పెన్సరుచెప్పిన అర్థము కొంతమట్టుకు డార్విను సిద్ధాంతీకరించిన 'ప్రకృతి పరివర్తనానుకరణ ఫలితా' న్ననువర్తిస్తుంది. కాని సుప్రసిద్ధప్రకృతిశాస్త్రజ్ఞులు దీని నామోదించలేదు. హక్సలీ నీతి, ధర్మను మున్నగుసంఘనియమాలు ప్రకృతి సిద్ధాంతాలకి విరుద్ధమన్నాడు. తాత్త్వికుల తత్త్వవిచా రానికి ప్రకృతిపరిణామా నికి తూర్పుపడమరల సామ్యమే.

అయితే జీవ మనగా నేమి???

చలనం:—

జడానికి జీవానికి ఇదే పరిహద్దు. గింజలలో చలన ముండదు. అయినా చలనానుకూల పరిస్థితుల నేర్పరిస్తే అంకురం బయటికి వస్తుంది. కేవలం చలన స్వరూప మయిన యంత్రమెా అంటారు. అంటే ఏవస్తువులకయినాసరే అంతర్గతికంగా చలనాత్మకశక్తి యుండాలి.

ఆహారం:—

జీవానికి ఆహారం అత్యవసరం. ఆహారాన్ని ఏదో రూపాన్ని గ్రహిస్తుంది. ఇది లోపల రాసాయనిక పరి వర్తనం పొంది శక్తిగా ఉద్భవించాలి. ఈశక్తి ఫలి తంగా ఆజీవం పెరుగుతుంది. కాని రాళ్లు రప్పలమీద మన్ను పడి అవికూడ పెరుగుతూ ఉంటాయి. కాని ఈపెరగడం ఆంతరంగికంగా ఉండాలి. కొన్ని రాసా యనికక్రియల ఫలితం కావాలి.

సంతానవృద్ధి:—

జీవం తను ఎటువంటి పరివర్తనాలు పొంది అయినాసరే తనవంటి వానిని మళ్లీ సృష్టించాలని ప్రయ త్నిస్తూ ఉంటుంది. కొన్ని సూక్ష్మాణుజీవులు తమ ఆకారవిచ్ఛిన్నం పొంది అయినాసరే సంతానాన్ని నిలబెట్టుకుంటాయి.

ఇదే జీవమా?:—

గింజలు అనేకసూక్ష్మజీవులు నీరు లేకపోతే పైన జీవస్వభావాలు ఏమీలేకుండా ఉంటాయి. కాస్త తేమ తగలడంతోనే వాటిలో జీవం ప్రదర్శితమవుతుంది. అందుచే జీవచిహ్నా శూన్యంగా ఉన్నంతకాలమూ అది జీవస్వరూపం అనగలమా ?

అనునాతనంగా భౌతికశాస్త్రజ్ఞులు ద్రవ్యంలో ప్రతి అణువుకూడ జీవస్వరూపం అంటున్నారు. ద్రవ్య కణంలో ఈ అణునిర్మాణమే జడానికి, జీవానికి గల తారతమ్యం తెలియపరుస్తోంది. ఈ అభిప్రాయం ప్రబలి నప్పటినుంచి జీవా న్ననుకరించిన పదార్థాలని తయారు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. పాశ్చరు జీవాన్ని సృష్టించడానికి బ్రహ్మాండమైన పరిశోధనలు చేశాడు. కాని విఫలమైనవి. అప్పుడు సృష్ట్యాదిలో



౧. జీవాన్ని సృష్టించడానికి పరిశోధన సల్పిన పాశ్చరు

వచ్చిన జీవాణువు ప్రకృతిపరిస్థితుల కనుకూలమైన పరివర్తనం పొందుతూ ఒక అవిచ్ఛిన్న జీవవాహిని అయిపోయింది. ఆవాహిని అనంతరాయంగా ఉంది. కాని అనంతమా ?

## ప్రదేశపరిమితి:—

మనకు తెలిసినంతమట్టుకు (లోవెల్ గారి అంగారక జీవులకు క్షమాపణతో - డిసెంబరు భారతిసంచిక) భూమికి ఒకటి రెండు మైళ్లు పైనా, కొద్దిగా క్రిందా తప్ప విశ్వంలో జీవం ఎక్కడా గోచరంకాదు. ఈ అనంతప్రదేశంలో మనభూమి వాయుమండలం దాటితే జీవము కన్పడదు. ఖగోళంలో అనేక నక్షత్రాలు, నీహారికలు, గ్రహాలు ఉన్నాయి. కాని వీనిలో ఎక్కడా కూడ స్పష్టమైన జీవం కన్పడటంలేదు. కాబట్టి ఈ విచిత్రమైన జీవం భూసామీప్య ప్రదేశంలో సీమాబద్ధమయిఉంది. లేకపోతే ఎవరెస్టుశిఖరారోహణకి ఎన్ని ప్రయత్నాలు జరిగాయి ? ఒకటికూడా సఫలంకాలేదు. ౧౯౨౪ మల్లోరీ, ఇర్విన్ గార్లు బయలుదేరారు. జూన్ ౬-వ తారీఖున ౨౮౨౦౦ అడుగుల ఎత్తువరకు వెళ్లారు. కాని వాళ్లు మళ్లీ తిరిగిరాలేదు. లెఫ్టినెంటు కల్నల్ నార్టన్, డాక్టరు సోమరువిల్లీగార్లు ౨౮౨౦౦ అ. ఎత్తువరకు వెళ్లారు కాని తరువాత వారికి గ్రుడ్డితనంవచ్చింది. క్రిందటి సంవత్సరం విమానాలమీద కొంతమంది వెళ్లామన్నారుకాని అక్కడదగ్గి కొనిన ఛాయాచిత్రపరిశీలన చేసిన పిదప అది ఎవరెస్టుశిఖరం కాదన్నారు. గత వేసవియందుకూడ ఒక ఆంగ్లేయారోహకుడు అయిపులేకుండ మాయమైపోయాడు. ప్రదేశంలో అత్యున్నతస్థానానికి పోవడానికి అనేక ప్రయత్నాలు జరిగాయి. ౧౯౦౧ జులైలో బెర్సను అను వైమానికుడు ౩౪౫౦౦ అడుగుల ఎత్తువరకు పోయాడు. కాని ఆ ఎత్తునకు ఆక్సిజని గైకొనిపోయినను సంజ్ఞావిహీను డైపోయాడు. ౧౯౨౭ లో కెప్టన్ గ్రే ౪౨౪౭౦ అ ఎత్తువరకూ పోయాడు. కాని ఆక్సిజని తక్కువయిపోవడంచేత దిగుతుంటే ప్రాణాలు గోల్పోయాడు. టిసానిడియర్ అను ఫ్రెంచి వైమానికునికి ౨౬౫౦౦ అ. ఎత్తు పోయేసరికి స్పృహ తప్పిపోయింది. కిందకి వచ్చేసరికి అతని ఇద్దరు సహచరులూ చచ్చిపోయారు. శాస్త్రజ్ఞుల ఆహుతి ఫలితంగా మనం కొంత ఎత్తుతరువాత జీవం ఉండడం అసంభవమని తెలుసుకున్నాం. ఆ ప్రదేశంలో......

౧. ఆక్సిజని ఉండదు.

౨. మనశరీరంమీద గాలియొత్తిడి ఉండదు.

3. విపరీతమైన శీతలం.

అట్టి అత్యున్నతప్రదేశాలో ఆక్సిజని తక్కువగుటవలన హృదయస్పందనం ఎక్కువగుతుంది. ముక్కుల్లోనుంచి, కళ్లల్లోనుంచి, చెవులద్వారా రక్తం బయటికివస్తుంది. శాస్త్రజ్ఞుల అనుభవంప్రకారం అయిదుమైళ్లతరువాత జీవం అసంభవం. ఆ ఎత్తునకు ఏదైన పక్షిని, పురుగును తీసుకొని వెళ్లితే అది వెంటనే మరణిస్తుంది.

ఈలాగున నేలసముద్రగర్భంలోకాని భూగర్భంలో ఎంతో లోతున జీవింపజాలరు. దీనికి కారణం ఉష్ణ

ధిక్యత, ఎక్కువ ఒత్తిడి (Pressure). సముద్రాంతర్గాములు ౩౦౦ అడుగులలోతుకంటె ఎక్కువపోలేరు. పోయినను అక్కడ ౨౦ నిముషము లుండగలరు, తరువాత పైకివచ్చుటకు సుమారు గంటన్నర పడుతుంది. సముద్రగర్భంలో జీవించే జీవులు కూడ ఒకనిర్ణీతమైన లోతుకంటే ఎక్కువపోలేవు. గ్రీనులాండు తిమింగిలములు ౮౦౦ నిలువుల లోతు (సుమారు ఒకమైలు) వరకు పోతాయి. సముద్రం బాగా లోతుగాఉన్న చోట సుమారు ౬ మైళ్లుంటుంది. అనగా మనము భూమినంతా ఆవరించిఉందనుకునే జీవం ఈవిశ్వంలో సూక్ష్మాతిసూక్ష్మమైన భూమండలప్రదేశంలో ౧౪ మైళ్ల పరిమితిలో ఉంది.

జీవప్రదర్శనము :—

జీన్సుగారు చెప్పినటుల ఈబ్రహ్మాండంలో ద్రవ్యమంతా అనేకవిశ్వాలుగా విభజింపబడి ఉంది. అసంఖ్యాకవిశ్వాల్లో మనమొక విశ్వంలో చిన్నగోళంలో ఉండి, నక్షత్రపుంజాలని, నీహారాలని మనముందర అవి ఎంత అని నిర్లక్ష్యభావంతో చూస్తూ ఉంటాము. మొట్టమొదట ఎన్నో సహస్రశతసహస్ర సంవత్సరాల



౨. సూర్యమండల మేర్పడినవిధము
చిత్రమున నుపరిచిన యొక నీహారమునుండి
యీ విశ్వ మంతయు నిర్మింపబడినది.

క్రిందట ఒక చిన్ననీహారంగా బయలుదేరి అందులో అనంత నక్షత్రమండలాలు, సూర్యకుటుంబాలు ఏర్పర్చుకుంది. అందులో ఒకసూర్యకుటుంబంలో మనభూమీ, మనమూ తయారయాము. ఇదంతా ఖగోళశాస్త్రజ్ఞులు మూడువేల లక్షలక్షల సంవత్సరాలక్రిందట జరిగిందంటారు. ఈ అనంతకాలాన్ని ఊహించకోడం కష్టం. ఇందులో కనపర్చిన పట్టికలో (చూడు పు.౬౨౦)కొంత మట్టుకు స్పష్టపర్చడానికి ప్రయత్నించాను.

పట్టిక గనపర్చిన 'అ' అను భాగము ౮౦ లక్షల లక్షలసంవత్సరాలని వ్యక్తపరుస్తుంది. (సూర్యునివయస్సు తెలుపుటకు) "అ" లోని ఆఖరు ౧౦ లక్షలలక్షలు "ఆ" యనుభాగమునందు వివరింపబడియున్నవి. "ఆ" భాగమునందు భూమివయస్సు, జీవప్రారంభము గానవగును. "ఆ" లో ఆఖరు ౧ లక్ష లక్షసంవత్సరాలను "ఇ"లోవివరింపబడినది. ఇందులో వివిధజీవవర్గప్రారంభం బోధపడుతోంది. "ఇ" లోని చివరి ౧౦ వేల లక్షల సంవత్సరాలను "ఈ"యందు వివరింపబడినది. ఈయుగమంతా హిమమయం. "ఈ" భాగంలోని ఆఖరు ౧౦ లక్షల సంవత్సరాలు "ఉ" భాగమునందు వివరింపబడ్డాయి. ఇందులో మానవప్రవేశం, తద్వికాసం, క్రీస్తుపుట్టుక ప్రారంభమయింది. "ఊ" "ఋ" లలో ఇరువదవ శతాబ్ద ప్రారంభం నేటివరకు అయిన చరిత్రాంశాలు (మనదేశానికి సంబంధించినంతవరకు) చిత్రింపబడ్డాయి.

ఈపట్టికప్రధానోద్దేశం అనూహ్యమైన విశ్వవయః కాలసముద్రంలో మానవజీవితం ఒక క్షణబిందువని తెలియపర్చడము.

జగన్నాటకంలో భూమి రంగస్థలమయింది. అందు జీవం పాత్రపోషణ చేసింది. భూమి రంగస్థలం కావడానికి విపరీతమైన పరివర్తన పొందింది ముందర భూమి చంద్రునినుండి వేర్పడి చల్లపడడం అవసరమయింది. (ఇది ఒకసిద్ధాంతము. ఇందువిషయమై భేదాభిప్రాయంఉంది. పైన ఒక భూపటలం ఏర్పడింది. ఈ భూపటలము భూగర్భంలోని ప్రకాశకారక ధాతువులకు (Radio-activeElements) ఆచ్ఛాదనము అయింది. ఒకప్పుడు భూగర్భంలోని 'లావా' ద్రవము భూపటలఘనత్వము తక్కువగా యున్నచోట పైకి చొచ్చుకొని వచ్చినది. అప్పుడు లావాభారముచే భూపటలము లోనికి క్రుంగిపోయినది. ఈలాగున క్రుంగి

| అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | ఋ |
|---|---|---|---|---|---|---|
| | —20000 లక్షలు | —2000 లక్షలు | —2 లక్షలు | | —1900 | |
| | జీవప్రారంభము | హిమయుగము | హిమయుగాంతం | —క్రీస్తు పుట్టుక | | —1935—? |
| —10 ,, ,, | —10 లక్షలక్షలు | —10 | —10 ,, | —అశోకునిపుట్టుక | —1800 భారత స్వాతంత్ర్యయుద్ధప్రారంభం | —1934 మహాత్ముని స్వస్తి |
| | —150000 లక్షలు భూమివయస్సు | —11 ,, పక్షులు | | | | |
| | | | | —5000 వ్యవసాయారంభము | —1700 ఆంగ్లేయప్రవేశం | —1932 శాసనోల్లంఘనం |
| —20 ,, ,, | —2 ,, ,, | —20 ,, బల్లిజాతి | —20 ,, | | | —1931 గాంధీ-ఇర్విను సంధి |
| | | —28 ,, జలమందుండి భూమిమీదకువచ్చి వెన్నెముకగల జీవులు | | | | —1930 ఉప్పుసత్యాగ్రహము |
| | | | | | —1400 మొగలాయి సామ్రాజ్యము | —1925 కౌన్సిలుప్రవేశం |
| | | | | —18000 కొండగుహలలో వసించే మానవులు | | |
| —30 ,, ,, | —3 ,, ,, | —30 ,, | —30 ,, | | | |
| | | —33000 లక్షలు పురుగులు | | | | —1920 సహాయ నిరాకరణోద్యమము |
| —40 ,, ,, | —4 ,, ,, | —40 ,, | | | —1100 మహమ్మదీయ ప్రవేశము | —1918 వర్సలీసు సంధి |
| | | —45000 లక్షలు వెన్నెముకగల జీవవర్గము | —40 ,, | | | |
| | | | | — 40000 నియాండ్రీతల్ మానవప్రవేశము | | |
| —50లక్షలలక్షలు సూర్యునివయస్సు | —5 ,, ,, | —50 త్రైలోబైటా జీవము | —50 ,, | | | —1915 |
| | | | | | —800 శంకరాచార్యులు | —1914 జర్మనీయుద్ధము |
| —60 ,, ,, | —6 ,, ,, | —60 ,, [illegible] | —60 ,, | | | |
| | | | | | —500 బుద్ధుడు | —1908 హోమ్‌రూలు హడావిడి |
| —70 ,, ,, | —7 లక్షలలక్షలు | —70 ,, | —70 ,, | | | |
| | | | | | | —1905 స్వదేశీ ఉద్యమప్రారంభము |
| క్రీ. పూ. 80 లక్షలలక్షలు | క్రీ. పూ. 8 లక్షల లక్షలు | క్రీ. పూ. 80000 లక్షలు | క్రీ. పూ. 80 లక్షలు | క్రీ. పూ. 78000 | క్రీ. శ. 1900 వరకు | 1935 వరకు |

విశ్వవయఃకాలవాహిని

పోయిన ప్రదేశాలే సముద్రాంతః ప్రదేశాలయాయని భూశాస్త్రజ్ఞుల యభిప్రాయం. ఇక వాయుమండలము



3. బహుశః ఇటువంటి సముద్రాంతరమున జీవము ప్రారంభమయియుండవచ్చును.

నీటియావిరి, గంధకవాయువులతో ఏర్పడిపోయింది. అప్పుడు భూమియంతా నిరంతరము మేఘావృతమయి వుంది. సూర్యకిరణాలు మేఘాలను చొచ్చుకొని భూమికి చేరలేకపోయాయి. (బృహస్పతిగోళం ఇప్పటికీ ఆస్థితిలోనే ఉంది) తర్వాత సంతతవర్షధార ప్రారంభమయింది. ఈ జలప్రవాహంతో నిమ్నోన్నతాలు ఏర్పడ్డాయి. వాయుమండలంలోని మేఘాలు ద్రవీభూతమయాయి. మెల్లిగా సూర్యకిరణాలు భూమిమీదికి చేరగలిగాయి. అప్పుడు భూమి ప్రకాశవంతమయింది. ఈవిధంగా భూరంగస్థలం తయారయింది. ఇక 'జీవం' ఈరంగస్థలంమీద పాత్రధరించి ప్రవేశించాలి.

'జీవ' ప్రతిష్ఠ ఇప్పటికీ రహస్యమే. ఎలా వచ్చిందో కేవలం అగమ్యగోచరంగా ఉంది. ఉల్కాపాతంలో వచ్చిందని కొంతమంది శాస్త్రజ్ఞుల అభిప్రాయం. దీనివలన 'జీవా'న్ని ఖగోళంలోకి త్రోసివేస్తున్నామేకాని ఉత్పత్తి చెప్పలేకపోతున్నాము. కాని భూమి శీతలమగుచున్నపుడు సముద్రాలు ఉష్ణంగా ఉన్నప్పుడు, పరిస్థితులు అన్నివిధాలఅనుకూలంగా ఉన్నప్పుడు ఈ అతిసూక్ష్మమగు జీవాణువు ఏర్పడింది. మళ్లీ ఆపరిస్థితు లెప్పుడూ ఏర్పడలేదు. ప్రకృతి శాస్త్రజ్ఞులు ఆపరిస్థితులు కనుక్కొందామని పరిశోధనలు చేస్తున్నారు. అప్పటినుంచి ఆజీవాణువుసంతాన వృద్ధి చేయుచు పరిస్థితుల కనుగుణమగు మార్పులు బొందుచు అవిచ్ఛిన్నజీవవాహిని అయింది. 'జీవం' లో ప్రకృతిలోలేని విశేష అచేతన పదార్థాలు లేవు. జీవశక్తికూడా రాసాయనిక, భౌతికసంయోగవిశ్లేషణము లందుండి వచ్చు శక్తికంటె విపరీతమైనది కాదు. భూమిఇతిహాసంలో ఒక విశేష పరిస్థితులందు ఈ ధాతుసంయోగం కలిగి 'జీవం' ఆవిర్భూతమయిం దనుకోవాలి. కాని జీవసృష్టికి వైజ్ఞానికుల పరిశోధనలుమాత్రం ఆగలేదు. ఈవిషయంలో ఇంకా ప్రొఫెసర్ బేలీ, హాల్డేను, డిహెరెల్లీ మున్నగువారు కృషిసల్పుచున్నారు. భవిష్యత్తే వీరి పరిశోధనలఫలితాలని నిర్ణయించాలి.

కొంతవరకు జీవకణాల్లో ఉద్భిజ్జవర్గానికి జంతువర్గానికి భేదం లేకపోయింది. ఇప్పటికిని యూగ్లీనా అను సూక్ష్మజీవిని ఉద్భిజ్జశాస్త్రజ్ఞులు ఉద్భిజ్జమంటారు. జంతుశాస్త్రజ్ఞులు జంతువంటారు. ఈ సూక్ష్మజీవియందు ఉద్భిజ్జ, జంతుప్రకృతులు రెండూ ఉన్నాయి. సముద్రమందు ఉద్భవిల్లిన జీవం సముద్రపరిసర జలావృతప్రదేశాల్లోకి వచ్చుసరికి జీవంలో ద్వివిధ (ఉద్భిజ్జ, జంతు)ప్రకృతులు ఏర్పడ్డాయి. అప్పటి జంతువులలోనూ, ఉద్భిజ్జములలోనూ పరిణామము ప్రారంభమయింది. ఈపరిణామసిద్ధాంతాలను బాగా తెలుసుకొని చర్చించడం ౧౮౫౯ లో ప్రారంభించారు. వికాసవాదానికి మూలపురుషులు డార్విను, లెమార్క్, వెజమాన్, మేండలే, హెకిల్ మున్నగువార్లు. వీరు వారివారి వాదాల వికాసానికి హేతువులుగా చూపించారు. అప్పటినుంచి ప్రాచీనజీవులకొరకు, వాని చిహ్నాలకొరకు పరిశోధనలు జరిగాయి. తత్ఫలితమే ఆధునిక వికాసవాదము. భారతదేశ పురాణేతిహాసములందుకూడ జంతువికాసాన్ని అంతనిదర్శన పూర్వకముగా సూచింపలేక పోయినా కొంతమట్టుకు ఊహింపగలిగారు. బిపినచంద్రపాలుగారు తమ 'శ్రీకృష్ణ' యను పుస్తకమునందు దశావతారాలకథ కొంతమట్టుకుఆధునికవికాసవాదాన్ని

అనుకరిస్తోందని సూచించారు. విజ్ఞానపరికరాలు లేని రోజుల్లో ప్రాచీనులు ఇంత ఊహింపగల్గారంటే అది చాలా గౌరవింపదగిన విషయము. ఈవ్యాసంప్రధానోద్దేశం 'వికాసవాదం' కాదు. కాని అనంతకాల



వికాసఫలితమయిన మానవుని చిత్రించేముందు అతడు కాలవాహినిలో పొందిన పరిణామావస్థలను తెలుసుకోవాలి. పటమునందలి జీవవృక్షముచూస్తే తెలుస్తుంది.

మానవుడు :—

ఎవరు, ఎందుకు సృష్టిలోకి వచ్చాడంటే జీవానికి చెప్పగల్గిన సమాధానమే దీనికి వస్తుంది. కాని మనుష్యుడు ఎలాగున వచ్చాడంటే విజ్ఞానం కొంత మట్టుకు సమాధానం చెపుతుంది. ౧౯-వ శతాబ్ద ప్రారంభంవరకు ప్రపంచంలో తదితరజీవవర్గముకాక మానవుని ప్రత్యేకముగా సృష్టించారనుకున్నారు. అప్పటి తాత్వికుల అభిప్రాయం సృష్టిని పాలించుటకు మానవుని భగవంతుడు తన ప్రతినిధిగా పంపాడనుకున్నారు. ఇందులో మళ్లీ తెల్లవాళ్ల కొక ఆదిమమాతాపితరులను, పచ్చవాళ్లు (మంగోలియనులు), ఎర్రవాళ్లు, నల్లవాళ్లు-వీళ్లందరికి వేర్వేరు ఆదిమమాతాపితరులను సృష్టించాడనుకున్నారు. ఈవిధంగా పాశ్చాత్యతాత్వికులు మొత్తం ౧౦౦ మంది మాతాపితరులని కల్పించారు. ఇదే జాత్యహంకారానికి మూలకారణము. ఒకప్పుడు బానిసవ్యాపారంచేసే తెల్లవారు "మేము నల్లవారిని పరిపాలించడానికి పుట్టా" మని విర్రవీగారు. ఇప్పటికి వారిలో చాలామందికి నల్లవారిని జంతువులలాగా ఉపయోగించడానికే సృష్టింపబడ్డామని అభిప్రాయం.

౧౮౫౯ చాలా గొప్పసంవత్సరం. డార్విను అహంకారాంధకారంలో ఉండే మనకళ్లకి కాంతి ప్రసాదించాడు. ఈ మాతాపితరులు ప్రత్యేకసృష్టి అంతా వట్టి బూటకమన్నాడు. ఆకారచేష్టల్లో మనతో అన్నివిధాల సమానంగా ఉండే చింపాంజి, ఏప్, కోతులను చూపించాడు. సృష్టాధికారులనుకునే మీరందరు ఆజంతువుల్లోంచి వచ్చారన్నాడు. ౧౯-వ శతాబ్దంలో డార్విన్ ఇది చెప్పినపుడు చాలా పరిహాసానికి పాలయ్యాడు. ఆవిధంగానే పదిహేను, పదహారు శతాబ్దాల్లో చెప్పిఉంటే బ్రూనోగతి పట్టేది. ఈసహనమే విజ్ఞానం! నాగరికత! ఇరవైయవ శతాబ్దంలో మానవుడు ప్రత్యేకంగా నిర్మింపబడ్డాడంటే నవ్వుతారు. శరీరమంతా రోమయుతంగా ఉండి, వెకిలిచేష్టలతో నాగరికతావిహీనంగా ఉండే కోతులు మన సన్నిహితజ్ఞాతులంటే కష్టంగానే ఉంటుంది. "మనపూర్వికులు కూడ రోమాచ్ఛాదితులై చిన్ననుదురుతో వృక్షవాసులై



౫. చిన్న నుదురుతో రోమాచ్ఛాదితుడయి చెట్లమీద వసించిన మన పూర్వికుడు.

ఒకప్పు డున్నారు." అప్పుడు వారు భయంకర ప్రకృతితో పోరాడవలసివచ్చింది. ఈప్రకృతియుద్ధాలలో మేధస్సు వృద్ధిపొందింది. ఇప్పటికీ నూతన ఆవిష్కారాలు యుద్ధవాతావరణలో వస్తాయి. కోతులకు మనకు సన్నిహితత్వం తప్పితే మిగిలిన జంతువర్గంతో కూడ మన జ్ఞాతిబాంధవ్యాలు ఉన్నాయి.

చేపకూ మనకూ ఉన్న సంబంధముకంటె కప్పకూ మనకూ దగ్గర సంబంధమున్నది. అలాగుననే కప్పకూ మనకూ గల సామ్యములకంటె కుక్కకూ మనకూ గల సామ్యములు ఎక్కువ. అన్నిటికంటె కోతికీ మనకూ సన్నిహితత్వ మెక్కువయింది. పైనచెప్పినవన్నియు

వివిధ పరిణామావస్థలు. నేడు అత్యంత మేధావికిగూడ ఈ విజ్ఞానశూన్య జంతుజాలమంతా జ్ఞాతివర్గం.

డార్విను వికాసవాదాన్ని కేవలం తనఊహాజనితంగా చెప్పలేదు. ప్రత్యక్షనిదర్శనాలు చూపించాడు. ఈనిదర్శనాలు తాత్వికుల ఆధ్యాత్మికచర్చకాదు. భౌతికచర్మచక్షువులకు గోచరమయేవి. అందుచేత వికాసవాదానికి నాల్గువిధాల నిదర్శనాలు చూపిస్తారు.

౧. శైశవావస్థానిదర్శనాలు.

౨. శల్యనిదర్శనం.

3. అవయవ నిర్మాణ నిదర్శనం.

౪. ప్రాచీనవస్తునిదర్శనం.

మనుష్యుడు కోతిలోంచి వచ్చాడని కోతికి మనకు సంబంధం తెచ్చిపెట్టేముందర ఈ వివిధనిదర్శనాలు ఉన్నాయా, లేవా, అని చూచారు. తర్వాత దొరికిన మనపూర్వికుల అస్థులు మనవారసత్వాన్ని వ్యక్తపర్చాయి.

శైశవావస్థలు:—

చింపాంజి, గోరిల్లా, ఉరాంగు ఉటాంగు, గిబ్బను- ఈకోతులన్నియు కొంచెము ఇంచుమించుగా మనుష్యులవలెనే ఉంటాయి. ఇవి బాగుగా పెద్దవయినప్పటికంటె గర్భములోని పిండములను పరిశీలించిన చింపాజిపిండమునకును, మనుష్యపిండమునకును ఏమీ భేదమున్నటుల గన్పడదు. మనుష్యపిండంబొడ్డుకును, చింపాంజిపిండంబొడ్డుకును ఏమీ భేదంలేదు. శిశువు మాతృగర్భంలో ఉన్నప్పుడు చింపాంజిపిల్లవలె ఒక విధమైన సన్నని రోమములచే కప్పబడిఉంటుంది. పుట్టుకముందర శరీరమువిూద ఈరోమములంతా రాలిపోయి తలవిూద పొడుగుపాటి వెంట్రుకలు వస్తాయి. మిగిలిన శరీరమంతా రోమవిహీనంగా ఉంటుంది. పుట్టినతర్వాత మానవశరీరం ఈవిధంగానే రోమవిహీనంగా ఉంటుంది. చింపాంజిశరీరం దానిజీవితానికనుకూలంగా రోమయుత మవుతుంది. పుట్టకపూర్వం చింపాంజి శిశువు తలకి, మానవశిశువుతలకి ఏమీ భేదం లేదు. రెంటినీ దగ్గరగా యుంచిన చింపాంజిపిండంతలే మానవపిండంశిరస్సు అనుకుంటారు. గర్భంలో ఉండగా చింపాంజి కాళ్లకి చేతులకి స్పష్టంగా భేదం కనపడుతుంది. శిశువు పుట్టడంతోనే పైకి తిరిగియుండే అరికాళ్లు పరిణామవాదప్రత్యక్ష నిదర్శనాలు.

శిశువు జన్మించిన రెండేళ్లవరకూ నిటారుగా నిలబడలేదు. గోరిల్లాకు చేతిలో కర్ర ఇస్తే అది నిలబడడానికి ప్రయత్నిస్తుంది. దీనినే శిశువులోకూడ మనం



౬. ఏవస్తువునయిన పట్టుకొని నిలబడుటకుయత్నించు మానవశిశువు

చూస్తూఉంటాము. మనం నిటారుగా నిలబడడం మన పిరుదులపై ఆధారపడియుంది. శిశువునుగాని, ఏకొననుగాని గైకొని వాని పిరుదలనుండి గురుత్వాకర్షణభారమును కొలిచిన అది పిరుదులముందరకి యుండును. అందువలన శరీరము ముందరకి వాలిపోవును. శిశువు ముందరికి పడిపోవుచున్న ఈశరీరమును చేతులతో ఆపుకొని ప్రాక ప్రయత్నించును. ఈస్థితిలో శిశువు వెన్నెముక తదితర జంతువుల వెన్నెముకలవలెనే ముందువైపుకి వంకరతిరిగి యుంటుంది. తరువాత నెమ్మదినెమ్మదిగా గురుత్వాకర్షణ పిరుదులవెనుక వచ్చి వెన్నెముక సరిగా నగును. అప్పుడు నిటారుగా నిలబడడం మనకు స్వతః సిద్ధ మవుతుంది. ప్రప్రథమమున చేపలలో అడ్డముగా యున్న వెన్నెముక మానవులలోకి వచ్చుసరికి నిలువుగా అగుట క్రమక్రమముగా వస్తున్న పరిణామాన్ని ద్యోతకపరుస్తుంది. క్షుద్రజంతువులలో కేవలం చలనానికి కాళ్లు చేతులు ఉపయోగపడ్డాయి. పక్షులలో ఆచేతులు

అంతరిక్షంలో ఎగరడానికి రెక్కలుగామారాయి. మానవునిలో నిలువునా ఉండుస్థితి వచ్చుసరికి చలనానికి చేతులు ఉపయోగించవలసిన అవసరం పోయింది. అప్పటినుంచి మెదడుకి, చేతులకు అన్యోన్యసంబంధం ప్రారంభమయింది. శిశువు ఏదిచూస్తే అది పట్టుకునేందుకు ప్రయత్నిస్తుంది. పట్టుకున్నదానిని నోటిలో పెట్టుకునేందుకు తీసుకుంటుంది. ఇదంతా ఆశిశువు పరిణామావస్థల పూర్వస్పృహ. వీటన్నిటిలో అత్యంత సన్నిహితమైన చింపాంజి చర్యలస్పృహ బాగా ఉంటుంది. మానవగర్భంలో పిండోత్పత్తి అయినప్పటినుంచి ఆపిండం జీవవృక్షంలో గన్పరిచిన చేప, కప్ప, బల్లి, పాలిచ్చుజంతువు, కోతి-వీటన్నిటి పిండాకృతిని బొంది చివరకి మానవశిశువు



౪. పైవరుస: గర్భమందలి శిశువులు.
క్రిందివరుస: బాగుగాపెరిగినతర్వాత.
ఎడమనుండి కుడివైపునకు: ౧. గిబ్బను, ౨. చింపాంజి, 3. మానవుడు, ౪. గోరిల్లా, ౫. ఒరాంగుటాంగు.
శైశవావస్థయందు పైవాటిలో భేదము కనుపడదు. పెద్దవయినపుడు మార్పులు స్పష్టము.



౬. పిండవృద్ధి
(క్రిందినుండి పైకి) ఎడమనుండి ౧. మానవుడు, ౨. చెవులపిల్లి, 3. బల్లి, ౪, ౫. చేపలు. మొట్టమొదట పిండములన్నియు నొక్కతీరునే యున్నవి. వృద్ధియగుచున్నకొలది భేదము కనుపించుచున్నది. మానవపిండమునందలి తోక, పుప్పొరములు కనుపడుచున్నవి.

అవుతుంది. చేప, బల్లి, కుందేలు, మనుష్యుల శైశవావస్థలను పరిశోధనచేస్తే ఆద్యమందు ఏకవిధముగా ఉంటాయి. చేపలో ఉండే పుప్పొరాలే మానవపిండంలోకూడా ఉంటాయి. అనగా నాసికారంధ్రాలనుంచి నోటివరకు ఒకపెద్దచీలిక ఉంటుంది. ఇది జలచరములందలి ఉచ్ఛ్వాస నిశ్వాస పరికరము. కొంతమంది మానవులకు ఇది చీలికగానేఉండిపోతుంది. వారినే విపరీతమానవులుగా ప్రదర్శనాలలో చూపిస్తారు. ఇది మనమత్స్యకారులగు మనపూర్వికుల వారసత్వమని ఒప్పుకోవాలి. ఈవిధంగానే మానవపిండానికి తోకకూడ ఏర్పడుతుంది. ఆతోకను ఆడించడానికి కావలసిన కండరాలు కూడ ఉంటాయి. కాలక్రమేణ పిండం పెద్దదైనప్పటినుండి ఆతోక తగ్గిపోయి ఆకండరాలు వేరుపనుల కుపయోగిస్తాయి. చిన్నపిల్లలు తోకలతో పుట్టుతూఉండడం అరుదుగా

వింటూయుంటాము. చిన్నపిల్లలు తమరెండుచేతులను క్రిందకి చాపి ప్రాకుతారు ఒంటిచేతితో వేళ్లాడడానికి కూడ వాళ్లకి విపరీతమైన శక్తి యుంది శిశువులు కాలి వేళ్లతో కూడ పట్టుకు నేందుకు ప్రయత్నిస్తారు. ఈ విషయాల్లో వానరులకు, మనకు అత్యంత సన్నిహిత సామ్యముంది. శిశువుయందలి ఈ పూర్వవాసనలన్నీ అచిరకాలంలోనే సమసిపోతాయి. మేదస్సు పని చేయడం మొదలుపెడుతుంది. నాగరికతలో వన్నెకెక్కుతాడు. ఇక సృష్టికంతా తనే అధికారినని అహంభావము. అందుచే తాను ప్రత్యేకంగా సృష్టింపబడ్డాడనుకుంటాడు. తన జ్ఞాతివర్గాన్నంతా మరిచిపోతాడు. అయిన అజ్ఞానియైన మానవునకు ప్రతిభాశాలియైన కొడుకుపుట్టి అతడు నాతండ్రి కాదంటే చెల్లుతుందా?

శల్య నిదర్శనం:—

గోరిల్లా అస్థిపంజరము, మానవుని అస్థిపంజరము గాంచిన రెంటికి గల సామ్యము బాగుగా గోచర మవు



౯. అస్థిపంజరములు
ఎడమనుండి కుడివైపునకు
౧. మానవుడు, ౨. గోరిల్లా.

తుంది. క్లైన్‌గారు (జర్మను శల్యశాస్త్రజ్ఞుడు) మన శరీరమందు మన కేవిధముగను పనికిరాకుండా యున్నటువంటి ఎముకలు ౧౮౦ ఉన్నాయని చెప్పియున్నారు. ఈఎముకలే గోరిల్లాచింపాంజీలయందుకూడ గానిపించుచున్నవి. కోతిపుర్రెలో నుదురు చాలా చిన్నది ఉంటుంది. ఆవిధముగనే ఆదిమవాసుల పుర్రెలు చూచిన నుదురు కోతులనుదుటివలెనే చాలాచిన్నదిగా ఉంటుంది. రానురాను మెదడు పెద్దదగుచున్నకొలది



౧౦. నుదుటి వైశాల్యము
ఆదిమవాసులయందు నుదురు చిన్నదిగానుండి రానురాను మెదడు వృద్ధిపొందుటకయి వైశాల్యము చెందుచున్నది.

నుదురు విశాలము కావలసివచ్చినది. శరీరముమీది రోమములుకూడ మనకేవిధముగను ప్రయోజనకరములు కావు. అవి జంతువులను శీతలమునుండి కాపాడుట కత్యావసరములు. చలివేయుచున్న ఆరోమములు గగుర్పాటను చుండును. ఇప్పుడు మనకు వానితో అవసరము లేకపోయినను చలికాలమందు గగుర్పాటు మున్నగునవి కలుగచేయుచుండును. మనకు వయస్సు వచ్చినతరువాత జ్ఞానదంతములువస్తాయి. అవి మనకు ఎందుకూ పనికిరావు. అయినా మనం గడిచివచ్చిన పరిణామావస్థలను జ్ఞాపకం తెస్తూఉంటాయి. మన వెన్నెముక చివరనున్న కాకిర్సు మనకు పిండాకృతిలో నున్నప్పటి తోకకు స్మృతిచిహ్నంగా ఉందనుకుంటాను. చేతిఎముకలుకూడ మనము వసించు వాతావరణమును బట్టి మారుచువచ్చాయి. కేవలం కంకరప్రదేశంలోనే నడుచు గుర్రపు ఒంటి డెక్క, ఎద్దు రెండుడెక్కలు, చెట్లకొమ్మలు బాగుగా పట్టుకోడానికి ఆసాదాలు చేతులే బాగా చీలి వేళ్లుగా



౧౧. చేతులు
వానర, మానవహస్తములకుగలసామ్యము ఇందు స్పష్టముగా గనపట్టుచున్నది.

ఏర్పడ్డాయి. మిగిలినజంతువర్గంలో ఒక్క వ్రేలుకి మరియొక వ్రేలుకి భేదం బాగా కనిపించదు. కోతి కాలిబొటన వ్రేలు, చేతిబొటనవ్రేళ్లకి కూడ మన బొటనవ్రేళ్లవలెనే తారతమ్యముంది. వ్రేళ్ల గోళ్లతో మనకేం అవసరం లేదు. అయినా వానిని పూర్వికులు ఆయుధాలుగా ఉపయోగించి ఉంటారు. జంతువర్గంలో వ్రేళ్లు ప్రధానాయుధాలు. వాడుక లేకపోవడంచేత గోళ్లు అంత పెరుగకపోయినా మన అవస్థాంతరాలను మరిచిపోకుండా ఉంటాయి.

## అవయవ నిర్మాణ నిదర్శనము:—

మనుష్యులకి కోతులకు సామాన్య అవయవ నిర్మాణమంతా ఒకేవిధంగా ఉంటుంది. మనచెవులను ఒకగొప్పనిదర్శనంగా పరిగణిస్తారు. జంతువర్గమునందు పైకికనపడుచున్న చెవి శబ్దాన్ని గ్రహించడం అత్యవసరం. శబ్దం ఏవైపునుంచి వస్తే ఆవైపు దోరపెట్టి వింటాయి. మనకు ఆవిధం అనుకరింపవలసిన అవసరం పోయింది. మనకు చెవులను తిప్పగల్గిన శక్తిపోయినా చెవులు మట్టుకు మిగిలిపోయాయి. మనుష్యులలోకూడ కొంతమందికి చెవులను ఇష్టమువచ్చినటుల కదలించు శక్తి ఉంటుంది. చెవి తమ్మెవద్దబొడిపెను డార్విను పాయింటు అంటారు. ఆబొడిపె జంతువులయందు శబ్దరంధ్రాన్ని కాపాడుటకు ఉండేది. కాని ఇప్పుడు డార్విను పాయింటు మనకి కేవలం అలంకారార్థం ఉంది.

మిగిలిన జంతువర్గంలో స్త్రీజాతికి ౪, ౬, ౮ స్తనాలుండేవి. కోతులలో ఈ స్తనాలు రెండే అయిపోయాయి. ఈసంఖ్యే మానవులలోకి వచ్చింది. గోరిల్లా స్తన ఆకారపరిమాణాలకి మానవ స్తనఆకార పరిమాణానికి ఏం భేదం లేదు. స్త్రీపురుష- అవయవనిర్మాణం కూడ కొంచెం ఇంచుమించుగా ఒకేవిధంగా ఉంటుంది.

## ప్రాచీన వస్తునిదర్శనము :—

జీవవృక్షము ప్రకారము జీవాణువు చేపస్థితిలోనుండి వానరత్వములోనికి వచ్చుటకు ఎన్నియో పరిణామావస్థలను బొందవలసివచ్చినది. నేడు మనము గాంచుచున్న చింపాంజి, గోరిల్లా, గిబ్బను వానరము హఠాత్తుగా మనవంటి విజ్ఞానయుతుడగు మానవుడుగా మారిన దనుట హాస్యాస్పదము. సర్వజ్ఞానసంయుత



౧౨. గోరిల్లాను కనుగొనిన పాల్ డిచేలూగారు

మానవునకును చెట్లపై వసించు చింపాంజికి మధ్య ఎన్నియో పరిణామావస్థలు ఉండితీరవలయును. ఈ వికాసవాదము సిద్ధాంతీకరించినపుడు 'నరునకును వానరమునకును మధ్య ఏమైన పరిణామావస్థలుగాని, తచ్చిహ్నములుగాని చూపించగలరా ?' అని డార్విను ప్రతికక్షులు ఎదురొడ్డిన్నారు. కాని డార్విను మున్నగువారు ఈవికాసవాదావస్థలను కొంతమట్టుకు ఊహింపగల్గారు. అవి నరవానరుడు' ఆదిమ మానవుడు అయిఉండాలన్నారు. కాని ఈ "విలుప్తసంబంధములు" బయటపడనంతవరకు వికాసవాదము సంపూర్ణము కాజాలదు.

అదృష్టవశమున ౧౮౯౨ లో జావాద్వీపమునందు ట్రినిల్ అనుచోట అలెగ్జాండరు యూజిన్ డుబా



౧౩. జావామానవుని కనుగొనిన డాక్టరు డుబాయిస్ గారు

యిస్ గారికి ఒకపుర్రెపైభాగమూ, తొడఎముక దొరికింది. అప్పుడు దానినిబట్టి ఆమానవుని ఆకారపరిమాణాలు ఊహించారు. ఆపుర్రె ఒక పెద్దగోరిల్లా పుర్రెకును మానవుని పుర్రెకును మధ్యస్థముగాఉంది. ఆమానవుని భ్రుకుటి చాలాఉత్తుంగా ఉంది. ఆమానవుడు ఎప్పుడూకూడ రెండుకాళ్లమీద నడిచేవాడు. అతనిని పిథ్‌కాన్త్రొపస్ మానవు డన్నారు. ఈపుర్రెవలన విలుప్తసంబంధములలో ఒకఅవస్థ తెలిసింది.

జావా మానవునితర్వాత ఇంగ్లాండులో సస్సెక్సునందు పిల్టుడౌనుమానవుని శల్యాలు దొరికాయి. ఇతనిని యూన్‌థ్రోపస్ మానవుడన్నారు. పిల్టుడౌను మానవుని కళ్లు, పళ్లు పెద్దవిగా ఉన్నాయి. అతని అడుగుదవడ కేవలనరవానరందవడవలె ఉంది. మెదడు చాలా చిన్నదిగా ప్రాచీనంగా ఉంది. ఇతని శల్యాలతోపాటు కొన్ని పరికరాలుకూడ దొరికాయి. వీటినిబట్టి ఇతడు జావామానవునికంటె కొంచెం వికాసంబొందినవాడనుకున్నారు.

౧౯౨౭ లో చైనాయందు రెండుఅడుగులదవడలుదొరికాయి. ౧౯౨౯ లో చైనాభూగర్భశాస్త్రజ్ఞులగు 'పయ్' గారికి ఒక పుర్రె అంతయూ దొరికింది. ఈ లాగున ౧౯౩౧ వరకు రమారమి ఒకడజను ప్రాచీన శల్యాలు దొరికాయి. చైనాలో దొరికిన మానవులందరు రమారమి జావా, పిల్టుడౌను మానవుల కాలమునాటివారని నిర్ణయించారు. అనగా సుమారు ఒకలక్ష సంవత్సరములక్రిందటివారు.



౧౪. హీడెల్బర్గు మానవుని అడుగుదవడ
ఈ దవడకు గడ్డములేదు

ఈశల్యాలన్నీ భూగర్భంలో దొరికాయి. ఇంకా వాటితోపాటు వాళ్లుపయోగించిన పరికరాలు ఏమైనా దొరుకుతాయేమో అని పరిశోధించారు. మనకు అత్యంత సన్నిహితావస్థలో యుండిపోయినది 'నియాన్‌డ్రథల్' మానవుడు. ఈమానవునియందు మెదడు ఏమీ పెద్దది గాకపోయినను 'జావా, పిల్టుడౌను మానవుల'కన్న వికాసము పొందినవాడు. 'జావామానవుడు' ఇతరజంతువర్గమువలెనే చనిపోయినతర్వాత ఏమీ సంస్కారము లేక కుళ్లిపోయేవాడు. కాని నియాన్‌డ్రథల్ మానవుడు చనిపోయినప్పుడు అతని శరీరమును ఏదో గుహలో అతనుపయోగించిన పరికరములతో సహా యుంచెడివారు. అందువలన ఈమానవునకు 'మృత్యువు, జన్మాంతరము' అను విజ్ఞానమున్నట్లు తోచుచున్నది.

పైనుదాహరించినశల్యములుగాని ప్రాచీనవస్తుసముదాయముగాని సమస్త విలుప్తసంబంధములను వెల్లడిపరుపజాలవు. కాని నరవానరాంతర పరిణామావస్థల విషయమై మనలను కేవలఅంధకారమునందుంచక వికాసవాదవిజ్ఞానవీథిని ఇంచుక కాంతిని వెదజల్లుతాయి.

మానవుడు జంతువుగా ఉన్నంతకాలము కేవలము శారీరకవాంఛ, నైసర్గికస్వభావమే అతని జీవితాన్ని నడిపింది. జావామానవునినుండి 'నియాన్‌డ్రిథక్' మానవునిసరికి వచ్చుసరికి అప్పుడే అమస్తిష్కమందు మెదడును, ముందరిభాగము వృద్ధిపొంది బుద్ధినొసగాయి. ఇప్పుడు మానవుడు నైసర్గికబుద్ధితో పని చేయుటలేదు. హేతువిచక్షణ అతనిజీవితనావను నడుపుతోంది. హేతువు శరీరాన్ని కష్టపెట్టుకోడంకంటె పరికరాల నుపయోగించడం నేర్పింది. భూమియందలి మార్పులు,నూత్న భూఖండములు ఏర్పడుట,-ఇవన్నియు వివిధజాతులను వివిధ నాగరికతలను తీసుకొనివచ్చాయి. ప్రకృతి పరివర్తనలకు అనువర్తులుగాని జాతులు నశించిపోయాయి. ఇప్పుడు సిలోనునందలి "వడ్డాలు" అను తెగ




(రేడల్ గారిపట్టిక)

మానవజాత్యారోహణ



౧౫. సిలోనునందలి వడ్డెలను ఆదిమజాతివారు.
ప్రపంచములో ఇంతకంటె ఆదిమజాతివారు లేరు. ౨౦౦౦ సంవత్సరముల నుండి వీరి ఆచారవ్యవహారములు ఏమియు మార్పులేక యున్నవి.

వికాసముకూడ కాలంతో వృద్ధిపొందుతోంది. ఆధునికమానవుడు వికాసోన్నతసౌధాన్ని ఉన్నాడు. కాని ఈవికాససౌధం ఇంతటితో ఆగుతుందా ?............ఆగదు. ఆగితే వికాసమెందుకవుతుంది. అప్పుడు మన మున్న సౌధంమీద ఇంకా అంతస్థులు లేస్తాయి. ఆ అంతస్థులతో ఉన్న జీవులు మన జాతీయులు ఎవరైనా మిగిలి ఉంటే ఆదిమవాసులంటారు. లేక ఒకప్పుడు ప్రపంచమంతా ఆక్రమించిన బల్లిజాతివారు భూమియందున్న మానవజాతులలో అత్యంత ప్రాచీనమైనవారు. కాని వీరుకూడ ఆస్ట్రేలియా ఆదిమవాసులవలె శిథిలము కానున్నారు. అయినా కిందిపట్టిక వలన నాగరికజాతుల నిర్మాణం కొంచెము తెలియగలదు.

## మానవుడు అనంతకాలవాహినిలో......

కాలమొక విచిత్రం. దానికి రూపంలేదు. మన ఇంద్రియాల కది అతీతం. కాని గడిచిపోతున్న కాలం మట్టుకు మనస్మృతిపథాన్ని ఎప్పుడూ ఉంటుంది. మన విజ్ఞానసంపత్తితో దాని నిరంతరానంత ప్రవాహంలో బుడగలను లెక్కపెట్టగల్గుచున్నాము. ప్రకృతికి కూడ ఈకాలస్మృతి ఉంది. తనగర్భంలో శిథిలమైన జీవాలతో కాలఘటికలను గణిస్తూంది. మేడేము క్యూరిగారి ప్రకాశకారక ధాతువు తన హేలియము అణువిసర్జనతో (Radio activity) పొందే రూపాంతర ధాతువులవలన మనయూహానిబద్ధం కాని కాలాన్ని కొంతమట్టుకు తెలుసుకోవచ్చును.

స్థూలమృగములవలె నామరూపములు లేకుండా పోతామేమో? విజ్ఞానయుతులకు మనం ఆదిమవాసుల క్రౌర్యాన్ని చూచి ఏవగించుకుంటాం. రేపు అంగారకగ్రహములో వంటి జీవులు (లోవెల్ గారి వాదప్రకారము) భూమిమీద ఏర్పడి యుద్ధాలు, దేశాలు, ఖండాలు మాసిపోయి ఒకటే జీవప్రణాళిక ఉంటే ఆచరిత్రకారులు ఈ ౨౦ శతాబ్దంలోని మనుష్యులనుగురించి ఏంవ్రాస్తారో...?

[ఈవ్యాసంలోని పటాలకు, విషయాలకు—
'Science of Life:—By H. G. Wells, Julian Huxley Harmsworth Popular Science Series :—Vol I B.

Short sketch of Biological Histories:—By Rall.

Educational Book Company, Cassel Company వార్లకు కృతజ్ఞుడను. గూ. వెం.]

# 'సాహసే లక్ష్మీః'

దివాకర్ల శారదామణి

150

## ౧

## వైవాహిక చర్చ

"నీవు వెయ్యి చెప్పు లక్ష చెప్పు. ఎంత చదువు చదివినా, ఎన్ని తెలివితేట లున్నా సాహసము శూన్యమైతే బ్రతుకు నిరర్థకమై పోతుంది. ఈ కోర్టు షిప్పులు, ఈ లవ్ మేరియేజ్ లు—ఏతంతూ లేకుండా కలిపించుకొన్న దాంపత్యాలు, మీమనస్సులకి ఆకర్షణీయంగా ఉంటాయిగాని ప్రత్యక్షజీవితంలో ఎందుకూ పనికి రావు. నాబ్రతుకంతా 'సాహసేలక్ష్మీ' అనే ఉత్తమ తత్వంతోనే నిర్వహిస్తూవస్తున్నాను. నీవు యమ్. ఏ., వరకు చదువుకున్నా రాజశేఖరంకన్న గొప్పసంబంధం రాదు. అతని కేంలోటు?"

"అయితే లక్షలకొలదీ డబ్బున్నదని చదువు, శీలం, ప్రేమ, వేటినీ పరీక్షించకుండా ఇప్పుడంత తొందరగా మీ రీసంబంధం నిశ్చయించడం బాగుతే దని నాయూహ. ఇంతకూ ఆయన ఎట్టివాడో సరిగా తెలియదు. ఇన్నాళ్లూ ప్రతిపత్రికలోనూ ప్రతిచోటా యిష్టముండికాని పెండ్లిచేసుకోరాదని యిన్నివిధముల ఘోష పెట్టి చివరకు మీరీవిధంగా పెళ్లిచేస్తే లోకులు పరిహసింపకుండా ఉండగ."

"లోకులు కొత్తపద్ధతులకు, పాతపద్ధతులకు కూడా కాకులుకూసినట్లు కూస్తూనేవుంటారు. ప్రౌఢా వివాహాలూ, స్వయంవరపుపెండ్లిళ్లు చేస్తే హర్షించేవాళ్లెంతమందుంటారో ఆక్షేపించేవాళ్లుకూడా అంతమందే వుంటారు. మనం అంతగా గమనించంగాని కళ్లుపెట్టుకు చూస్తే ఈవిధంగానే జరుగుతోంది. ప్రౌఢావివాహాల్ని యాక్టుగా దేశంలో ప్రవేశపెట్టించిన హర్ బిలాస్ శారదాగారే పన్నెండేళ్ల తనమేనగోడలికి రాజస్థానంలో పెండ్లిచేశాడు. ఎంతరిఫార్మర్లకైనా వాక్ శూరత్వంలో వున్నంత ధాటీ కార్యశూరత్వంలో వుండదు."

"అందుచేతనే దేశంలోవాళ్లంతా ఆయన్ని ఛీఛీ యంటున్నారు. ఇంతకూ నేచెప్పేసంగతు లేమిటో గ్రహించకుండావున్నారు. ఈరాజశేఖరంగారిని నేను నిరాకరించడంలేదు. మీరు మీయిష్టానుసారంగా వివాహం చెయ్యవచ్చును గాని కొంతకాలం వ్యవధివుంటే మంచిదని నా అభిప్రాయం. 'సహసావిదధీతనక్రియాం' అని యెన్నిసారులు మీరు నాతో చెప్పియుండలేదు?"

"తొందరపడి నే నీసంబంధం నిశ్చయించలేదు. చేసుకోదలచినట్లయితే వందలకొలది సంబంధా లతనికి సిద్ధంగావున్నాయి. డాక్టరు రంగాచారి ధర్మమా అని మనల నాతనికి పరిచయంచేసి ఈవివాహసందర్భంలో నిన్నంగీకరించునట్లుచేయగలిగినాడుగాని మనంవెయ్యేళ్లు తపస్సుచేసినా ఇటువంటి సంబంధం దొరకదు."

"అంటే ఆయన యెంతగొప్పవాడయినా, ఎంత చదువుచదువుకున్నా ప్రేమించి పెళ్లిచేసుకోడం అంటే ఏమిటో తెలియనివాడన్నమాట. ఒకమాటు పెండ్లి చేసుకొనుటకు అంగీకరించినప్పుడు ఎన్నివిఘ్నములు వచ్చినా, ఎంతకాలవిలంబమైనా వదలనిప్రేమ కలిగి వుండొద్దా చెప్పండి?"

"రాజశేఖరానికి నీ మీద ప్రేమ లేదని నీకు వట్టి భ్రాంతిగా వుంది. అతనికి నీమీద ప్రేమ వుందో లేదో నీవు పరీక్షించిచూడవలసిన ఆవశ్యకత ఎంతమాత్రం లేదు. కొన్నాళ్లుచూసి పెళ్లిచేసుకొంటానని చెబుతున్నావు. అది వట్టి పిచ్చిమాట. 'శుభస్య శీఘ్రం' అని నీవిప్పుడే పెండ్లి చేసుకునితీరాలి. తరువాత రాజశేఖరానికి నీమీద ప్రేమ యున్నదో లేదో సావకాశంగా పరీక్షించి తెలుసుకోవచ్చును."

"ప్రేమలేకపోయినతరువాత చూచి ఏంచేస్తాను? ఎంతచదువు చదువుకొన్నా, ఎన్ని డైవోర్సుయాక్టులు వచ్చినా దొరసానులలాగ చీటికిమాటికి కోర్టులెక్కి వ్యవహారాలు పరిష్కరించుకోలేంగద!"

"ఇవన్నీ యింగ్లీషు చదువులవల్ల వచ్చినభ్రమలే కానివేరుకావు. భయంవల్ల ప్రతిచోటా కంసుడికి కృష్ణ సాక్షాత్కార మయినట్లుగా యిప్పటికాలంపిల్లలకు కోర్టులు, వివాహవిచ్ఛేదనాలు, విడిపోవడాలు యిటు వంటివే కనిపిస్తూంటాయి. ఒక్కసంగతిమాత్రం జ్ఞాపకం ఉంచుకో. నవలలలోను, నాటకాల్లోను చూసేవిధంగా ప్రాపంచిక చర్యలు జరగవు. ఈ లవ్ ఎట్ ఫస్టు సైట్లు, మోహాక్రాంతాలు, గంధర్వవివాహాలు గ్రంథ కర్తల కల్పనాకౌశలాల్లో కనిపిస్తాయిగాని సామాన్య జీవితంలో అరుదుగా వుంటాయి."

"నేను కాదనడంలేదు. కాని మనచేతుల్లోను, మనయిష్టాల్లోను వున్న సంగతులను స్వేచ్ఛానుసారంగా ఎందుకు చేసుకోనకూడదో నాకు తెలియకుండావుంది. మాపరీక్ష లేమయినదీ యింకా తెలియలేదు. ఈచదువు పూర్తిఅయితేనేగాని పెళ్లినిగూర్చి ఆలోచించవద్దని మీరే పలుమారు చెప్పుచువచ్చారు. నేనుకూడ ఈ ప్రసంగంవచ్చినపుడల్లా అందఱితోను అదేవిధంగా చెప్పుచువచ్చాను. ఇప్పుడింతతొందరపడి పెళ్లిచేసుకున్న యెడల—"

"మరేమీ ఆక్షేపించరు. పెళ్లిళ్లెప్పుడు అప్రయత్నంగా ఆకస్మికంగా ఇలాగే జరుగుతూంటాయి. పెళ్లిచేసుకొన్నంతమాత్రమున విద్య నాశనమైపోదు."

"పోనీ మాపరీక్షలు తెలిసేవఱకైనా—"

"అందువల్ల ఏమీప్రయోజనం లేదు. ఇవన్నీ నీకన్న ఎక్కువగానే ఆలోచించాను. లేనిపోని అపోహలతో ఉండకు. డబ్బే పావనంగా ఊహించి చెయ్యడంలేదు. అన్నివిధాలా రాజశేఖరం తగినవాడు. అహోరాత్రా లూహించి నే నీపెళ్లి నిర్ణయించాను. నీవు స్వయంవరపద్ధతిని పెండ్లిచేసుకున్నా ఇంతకన్న ఉత్తమ మయిన సంబంధం దొరకదు."

అని ఈవిధముగ మాతండ్రిగారితో సంభాషణ జరిగినది. ఆయన నాకు కళాశాలలో ఉన్నత విద్య నేర్పించుచువచ్చినారు. పట్టపరీక్షలో కృతార్థురాల నగువఱకును నాపరిణయ విషయమైన ప్రసంగముల నెవ్వరెంతచేసినను ఆయనమాత్ర మెప్పుడు నీవిధముగపలికి యుండలేదు. పలికియుండకపోవుటయే గాదు; అట్టి యవసరము మాపరీక్షలు తెలియునంతవఱకుకూడ నుండదని నాకు తోచునట్లు ప్రవర్తించుచువచ్చినారు. పరీక్ష లింకను జరుగకపూర్వమే మదరాసునందున్న క్వీన్ మేరీ కళాశాలయందలి విద్యార్థినీవసతిగృహమున నే నున్నపుడే నా సహాధ్యాయినులతో కలసి బెంగుళూరు వెళ్లి వేసవికాల మచ్చట నుండవలెనని యున్నదని మాతండ్రిగారికి వ్రాసితిని. వా రందుల కంగీకరించుచు లేఖ వ్రాసిరి. ప్రతిసంవత్సరమును కళాశాల తెఱచియున్నపుడు మదరాసునందును, సెలవు లిచ్చినప్పుడు బంధువుల యిండ్లకుగాని, మిత్రురాండ్రతో తదితరప్రదేశములకు గాని పోయి కాలము గడపుటయేగాని కాకినాడలో మాయింటియొద్ద నంతగ నుండినదానను కాను. నేనీయేడు బెంగుళూరు వెళ్లెదనని వ్రాసినపుడు ఆయన తానుకూడ బెంగుళూరు వచ్చి కలసికొనెద నని వ్రాసియుండుటచేత పరీక్షలయినవెంటనే నేనత్యుత్సాహమున నెచ్చెలులతో గలసి బెంగుళూరునకు బోయియుంటిని. కాని ఆయన యెందువల్లనో రాజాలకపోయిరి. నేను బెంగుళూరు వెళ్లిన అయిదాఱువారములు పోయినతరువాత తానువచ్చుచుండుట లేదనియు, వెంటనే నన్ను బయలుదేరి రావలసిన దనియు మాతండ్రిగారివద్దనుండి తంతివార్త వచ్చెను.

వారియాజ్ఞానుసారముగా నేను వెంటనే బయలుదేరి కాకినాడ వచ్చిచూచుచో నా కాశ్చర్యము కలుగునట్లు మిగుల వైభవముగను యిల్లలంకరింపబడుటయేగాక నా పెండ్లిప్రయత్నముల సహితము మిక్కిలి సందడిగ చేయించుచుండిరి. ఆకోలాహలమును చూచి నేను నివ్వెఱపడితిని.

ప్రౌఢావివాహముల నంగీకరించు మాతండ్రిగారు నాయొప్పుదల లేకుండ తమ యేకైకపుత్రిక నగు నాకీవివాహ మెట్లు నిశ్చయించిరాయని మహాశ్చర్యము కలిగినది. బి. ఏ. పరీక్షకు వెళ్లియున్న నాకు ప్రౌఢావివాహతత్త్వమున నెంతో యభినివేశ ముండుటో నేను వేఱుగచెప్పకుండగనే యెట్టివారైనను తెలుసుకొనవచ్చును.

పదునెనిమిదేండ్ల ప్రాయమువుకు పెండ్లియాడుచున్న నా కావైవాహికోత్సాహము భగ్నమగునట్లుగ నాయిష్టముతో నిమిత్తములేకుండ వరాన్వేషణ మొనర్చుటయే గాక వివాహనిర్ణయమునుకూడ జేసినందులకు చెప్పవలదా? నాకు మిక్కిలి కష్టముగానుండెను. మా తల్లి యున్నయెడల నేనట్టిపెండ్లి చేసుకొనననని నిర్భయముగ జెప్పియేయుందును. మా అమ్మ—ఆమె గర్భవాసమున నేనుపుట్టియుండకపోయినను కన్నతల్లియొద్దకంటె నామె యొద్ద నాకు చనవుండెను. స్త్రీ జీవితమున వివాహమనునది జన్మాంతమువఱకు స్థిరమగు పరివర్తనము గలుగజేయునట్టి దగుటచేత సాహసించి నేను నాతండ్రిగారితో పైవిధముగ ప్రసంగింపవలసినదాననైతిని. పర్యవసానమును నేను వేరుగ జెప్పనక్కఱలేకయే చదువరులు గ్రహింపవచ్చును. కిమ్మనకుండ మాతండ్రిగారు నిశ్చయించియుంచినట్లు మఱునాడే నాకు పెండ్లి జరుగవలసియుండెను.

## ౨

## దొంగనోటు

చదివినచదువును గూర్చి, కావలసిన భర్తనుగూర్చి నేను మిక్కిలి గందరగోళముగ నాలోచించుచు గూర్చుంటిని. భావాకాశమున దుపానువలె నెంతసంక్షోభముగనైన నుండెను. సమస్త కార్యభారనిర్వాహకత్వమున పురుషులతో సమానముగ స్త్రీలు వ్యవహరింప సమర్థురాండ్రని యెప్పుడును తెలుసుకొనుచున్న నాకు నా పెండ్లియే పరహస్తగత మగుట కంటగింపుగ నుండెను. సాయంసమయ మగుటచేత వాహ్యాళికి బోయిన కొంత మనశ్శాంతిగ నుండునని యూహించి నాయూహాపోహలను గట్టిపెట్టి సావడిలోనికి వచ్చితిని. అక్కడ మా తండ్రిగారి స్నేహితులయిన డాక్టరు రంగారావుగారు ఒకపోలీసు ఇన్‌స్పెక్టరుగారితో మాట్లాడుచుండిరి.

డాక్టరు రంగా సోఫాపై గూర్చుండెను. పోలీసు ఇన్‌స్పెక్టరు ప్రక్క నొకబల్లవద్ద నిల్చుని ఆయనతో మాట్లాడుచుండెను. వారింగ్లీషున సంభాషించుచుండిరి.

“అయ్యా! డాక్టరుగారు! తమయింటికి బోయియుంటిని. అక్కడ తమరు జనార్దనరావుపంతులుగారింటికి వెళ్లినారని తెలిసికొని ఇక్కడకు వచ్చినాను. అత్యావశ్యకమైన పనియగుటచేత మిమ్ములను వెంటనే కలసికొనవలసి వచ్చినది.”

అని ఇన్‌స్పెక్టరు పలుకుచుండెను. అత డొక కాగితమును దీసి డాక్టరుగారికి చూపుచుండెను. “యాభై రూపాయిలనోటు. ఎక్కడనుంచి వచ్చినదో మేము కనిపెట్టలేక పోయియుందుముగాని దీనిమీద తమపేరు స్టాంపు చేయబడియున్నది.

‘డాక్టరు రంగా, కన్‌సల్‌టింగ్ ఫిజిషియన్, స్పెషలిస్ట్ ఇన్ మెంటల్ డిసీజెస్ మద్రాస్.’

అని మీపేరు స్టాంపు గొట్టబడియున్నది.”

“ఆహా! ఇది నాస్టాంపే” అని డాక్టరుగారు చెప్పుచుండిరి.

“అయితే ఇది తమ కెట్లువచ్చినదో, ఎవరికిచ్చితిరో తమకు జ్ఞాపకమున్నదా?” అని ఇన్‌స్పెక్టరుగా రడుగుచుండిరి.

“యాభైరూపాయలనోట్లు సామాన్యంగారావు. ఆఁ—ఏదీ చూడనీయండి. దీనిపై ఈముద్ర ఎట్లు వచ్చినదో ఆశ్చర్యముగ వుంది. ఆఁ—ఇది నాకు యస్. వి. రాజశేఖరరావుగా రిచ్చారు.”

ఇన్‌స్పెక్టరు డాక్టరుగారు చెప్పిన దంతయు నోటుబుక్కులో వ్రాసికొనుచుండిరి.

“ఆయనను నేను ఎఱుగుదును. ఆయన పోలవరం జమీందారుగారి మేడలోవున్న లక్షాధికారి కాదండీ?”

“ఆహా, ఆయనే. వారే ఇచ్చారు. అవుతే ఇందులో రహస్యమేమిటో చెప్పండి. ఈనోటు ఎక్కడైనా దొంగసొత్తుల్లో దొరికిందా ఏమిటి?” అని డాక్టరుగారు నవ్వుచు,

“అవుతే కొంపతవ్వి రాజశేఖరంగారు దీన్ని ఎక్కడైనా కన్నంవేసి సంపాదించారని మీరు చెప్పవస్తారా ఏమిటి?” అని తమహాస్యరసమును వెల్లడించిరి.

"కావండీ! ఈనోటు వట్టిదొంగసృష్టి. ఈలాంటి నోట్లిప్పుడు అపరిమితంగా మద్రాసు, బొంబాయి, కలకత్తా మొదలైన బ్యాంకుల్లో దొరికిపోతున్నాయి. రాజమండ్రీలో కొన్నినోట్లు దొరకినట్లు తెలిసింది. కాకినాడలో దొరకడానికిదే ప్రథమం — అవుతే మీరు ఖంగారుపడకండి. మీ రీనోటు నష్టపోనక్కరలేదు. బ్యాంకినా రీనష్టం పెట్టుకొన్నారు. ఈ నోట్లెవరు సృష్టించారో అదే నాకు కావాలి."

"అయితే నిశ్చయంగా చెబుతానుండండి." అని డాక్టరుగా రొకపుస్తకం జేబులోనుండి తీసి—"రూ. ౫౩-౧౨-౦. ఇదిగో చూడండి. యస్. వి. రాజశేఖరరావుగా రిచ్చినట్లు జమ—ఆయన ఎప్పుడూ రొక్క రూపంగానే సొమ్మిస్తారు."

"నేను శెలవుతీసుకుంటాను. ఆ రాజశేఖరంగారికి ఈనో టెట్లు వచ్చినదో కనుక్కోవాలి" అని ఇన్స్పెక్టరుగారు వెడలిపోయిరి. అదియేమోకాని నాకు మనసు చెయ్యిపెట్టికలచినట్లయిపోయినది. నేను వెంటనే షికారువెళ్లక మఱల గదిలోనికి బోయి కూర్చుంటిని. దొంగనోట్లను గూర్చిన వృత్తాంతము నా కచ్చెరువు పుట్టించెను.

## 3

### దేవికారాణి

రమారమి గంట పోయినతరువాత నేను మఱల సావడిలోనికి వచ్చి చూచునప్పటికి డాక్టరుగారు లేరు. వీథివంక చూడగా ఒకరోల్సురాయిస్ (Rolls Royce) కారు మాగుమ్మమువద్ద ఆగియుండెను. పిఠాపురం మహారాజాగారికి ఒక రోల్సుకారున్నదని నేనెఱుగుదును. ఈ వచ్చినవా రెవరాయని చూచుచుండగా రాజశేఖరరావుగారు కారునుండి దిగి మాయింటిలోనికి వచ్చుచుండిరి. మానాయనగా రప్పు డింటియొద్ద లేరు.

నేను కాకినాడవచ్చి నాలుగుదినము లయినది. ఆ నాలుగుదినములలోను రాజశేఖరరావుగారిని రెండుమూడుసారులు చూచి సంభాషించియుంటిని. సంభాషించినపుడెల్ల వారిఘనాతిశయమే యాకర్షణీయముగనుండెనుగాని వారివైఖరి నాకంత యాకర్షణీయముగ దోచలేదు. స్త్రీలను వైవస మొనర్చుకొనునది కేవల సౌందర్యమని కొందఱిమతము. ఆకారమును బట్టిచూచినచో ఆయన రూపవంతుడే యని చెప్పవలెను. అయిననదేమి పాపమోకాని ఆయనవైఖరి (Personality) నాకంతగ నాకర్షకముగ లేదు. పురుషు లెంతధీమంతులైనను వారి ప్రాశస్త్యమును ఎంతటివిద్యావంతురాండ్రైనను ఒకప్పుడు గ్రహింపకపోవచ్చును. రాజశేఖరరావుగారు కలకత్తాలో బి. యల్. పరీక్షకూడ కొంతవఱకు చదివినారట. అయిననేమి? నేనెంతవఱకు చదువుకొన్ననూ వారి సౌందర్యవిద్యాదిలక్షణములు నాకుత్సాహజనకముగ లేవు. మా యిరువురి జీవితములు నొక్కటిగ కలిపివేయుటకు నిశ్చయింపబడియు మా పరస్పరతత్త్వములం దిట్టి వైపరీత్య మెందుల కుండవలెనో నాకు దురవగాహముగ నుండెను.

భావికార్యఘటన మెట్లున్నను నేను వారిస్వభావమును దెలిసికొనుట కవకాశము కలుగలేదని నా మనస్సునం దాందోళనముగ నుండెను.

కారునుండి దిగునప్పటికి రాజశేఖరరావుగారి ముఖమున నుత్సాహచిహ్నములు లేకపోవుటయేగాక మిక్కిలి చీకాకుగ నుండెను. ఆకలగియున్న ముఖముతోడనే వారు సావడిలోనికివచ్చి నన్నుగాంచి చిఱునవ్వున "మీనాన్నగా రింటియొద్ద లేరా?" అని యడిగిరి.

"లేరు. షికారువెళ్లారు. కూర్చొండి వస్తారు." అని నే నంటిని.

ఆయన దీర్ఘాలోచనపరులై అచ్చటనున్న యొక కుర్చీపై గూర్చుండిరి.

మానాన్నగారిబల్లపై సేవకులను బిలుచుట కేర్పడినగంట (Calling Bell) పై చేయివేసితిని. సేవకుడు వచ్చెను. వంటవానిని బిలిచికొని రమ్మంటిని. వంటవానితో నేను కొన్నిఫలహారములను నిర్దేశించి వెంటనే గొనిరమ్మని చెప్పితిని. కొంతసేపటికి నేను చెప్పినట్లు

కొన్ని భక్ష్యములను, కాఫీ, ఓవల్ టైన్, టీ మున్నగు పానీయములను వేరువేరు పాత్రములతో బట్టించుకొని వచ్చి వంటవాడు మాయెదుట బల్లపై నుంచెను.

"నాకు కడుపునిండుగ నున్నది. ఇపు డేమియు వలదు. నేను టీ త్రాగను. నేను త్రాగేవస్తువు నీవు తెప్పించియుండవు." అని రాజశేఖరరావుగా రనిరి.

"ఏం త్రాగుతారు?"

"ఓవల్ టైన్."

నేను వంటవానివైపు చూచితిని. మావంటయింట నలుడై యవతరించిన ఆవంటవా డప్పుడు ఓవల్ టైను కప్పులోబోసి వారియెదుట నుంచెను. నన్నుగూడ తీసికొమ్మని వా రనిరి. కొన్నిభక్ష్యములనుగూడ దినుడని కోరితిని. మేమిరువురము కొన్ని ఫలహారములను దిని, కొన్నిపానీయములను ద్రాగితిమి. వంటవాడు బల్ల శుభ్రపఱచి పాత్రములను దీసుకొని వెడలిపోయెను.

అది సిగ్గో, లేక భయమో నేను చెప్పజాలనుగాని వా రెప్పుడును నన్ను తేరిపార చూచుటకు సంశయించుచున్నట్లు నాకు దోచెను. ఉచితజ్ఞుడైన కాంతునియెదుట కాంత సిగ్గుపడవచ్చునుగాని పురుషుడు సిగ్గుపడువాడై స్త్రీయు నట్లయినయెడల కాపుర మెట్లుచేయవచ్చునన్న కవిగారి*వాక్యము నా కపుడు జ్ఞప్తికి వచ్చెను.

"ఏదో యాంగ్జైటీతో నున్నట్లున్నారే" అని కొంతసేపటికి సాహసించి యడిగితిని.

"యస్ ఐ యామ్ ఎ బిట్ వరీడ్ (Yes, I am a bit worried). ఒక ఇన్స్పెక్టరు యాభైరూపాయిలనోటొకటి తీసుకువచ్చి అది ఎప్పుడు నా కెట్లు వచ్చినదో చెప్పవలసినదని వేధించడం మొదలు పెట్టాడు. అది దొంగనోటనీ, అట్టినోట్లెవరు సృష్టిస్తున్నారో కనుక్కోవలసిఉందనీ చెప్పడం మొదలు బెట్టాడు. నేను సృష్టించాననో ఏమో అతని ఊహ. అలాంటినోట్లు కొన్నివందలు వస్తూ పోతూ ఉంటాయి. ఎవరికి జ్ఞాపకం?" అని వా రూరకుండిరి.

మఱల కొంతసేపు నిశ్శబ్దము. నా కేమనుటకును దోచలేదు.

"కారులో మిమ్ములను జూచువఱకు మీరని నే ననుకొనలేదు." అని యసందర్భముగా నంటిని.

"మొదట నేనుగూడ ఇక్కడకు రావలెనని ఊహింపలేదు. కాని సంగతు లాలోచింపి—అనగా ఒకవేళ తొందరపడి—(అని అర్ధోక్తియందే)—ఇంతకు నాభావమేమో నీ వెఱుగుదువుగద!" అని కొంతఖంగారుతో తడబడుచూ మాట్లాడిరి. నేను నిర్దాక్షిణ్యముగా "ఏమిసంగతులు? నా కేమితెలియును?" అని యంటిని.

"నీవు విద్యావతివి. విద్యాధికులు ఎట్టి మనస్తత్త్వమున పెండ్లిచేసుకోవలెనో నాకు తెలియక పోలేదు. అందువల్ల నీకో ప్రేమ పరిపక్వంకాకుండానే పెండ్లి జరుగుచున్నదేమో యని నా భ్రాంతి." అని కొంత దైన్యస్వరమున వా రనిరి.

"అయితే నిశ్చయించుకొన్న పెళ్లి రద్దుపరచుకునే నిమిత్తం వచ్చారా ఏమిటి?"

"లేదు. మన తెలుగువాళ్లలో యింతసౌందర్యవతి లేదని డాక్టరు రంగా చెప్పడం మొదలుపెట్టాడు. నిన్ను చూచినప్పుడు నేనుగూడ అదేవిధంగా భావించాను పెళ్లి నిర్ణయమైనది. నీవంత తెలియనిదానవు గావు. పెద్దపరీక్షలు చదివినావు. నీకు ప్రేమలేని యెడల—" అని నడుమ నాపివేసిరి.

"అయితే నాకు సమ్మతంగాలేదని నేను పట్టుపట్టేయెడల ఈపెళ్లి యాగిపోవచ్చునని యనుకొనుచున్నారా?—అంత తెలివితక్కువగా—" అని నేను నడుమ నాపివేసితిని. లోపలిభావ మొకటియు, పైకి వచ్చు పలుకొకటియు నగుటచేత నేనసత్యసంవాదినినయి పరస్పర విరుద్ధముగ, నసందర్భముగ మాట్లాడుచుంటినా యని నాకు స్ఫురించెను.

"హెవెన్ ఫర్ బిడ్! (భగవంతు డట్లొనర్పకుండునుగాక) ఈ పోలీస్ ఇన్స్పెక్టరు గొడవవలన నా

* కళాపూర్ణోదయమునందు పింగళిసూరన్న.

మనసున కలతగానుండి నేను సందర్భశుద్ధి లేకుండ మాట్లాడినాను. ప్రసాదరావునాయుడుగారిప్పుడు ఇక్కడ పోలీసు సూపరింటెండెంటుగా నియమింపబడినట్లు తెలిసినది. బర్మాలో ఆయన ఏదో పోలీస్ పనిమీద వచ్చినప్పుడు నాకాయనతో పరిచయం కలిగింది. ఆయనను ఒకసారి కలుసుకోవాలి."

"అయితే మీకు బర్మాలో ఏదైన బంగారపు గని గాని దొరకినదా ఏమి?" అని యాకస్మికముగా నంటిని. నిజమునకు బర్మాలో బంగారుగను లున్నవో లేవో నాకు సరిగా తెలియదు ఆయన తెల్లబోయారు.

"బంగారపు గనులా? — లేదు. బర్మాలో బంగారు గనులు లేవు. ఉన్నా హిందువులకు దొరకవు. నాధనమంతా — చెప్పనా? — రంగూనులో మానాన్నగారు సంపాదించారు. నేను దాన్నిప్పుడు గుణిస్తున్నాను — కాని ఈ ప్రశ్న నీవెంత ఆకస్మికంగా అడిగావు? నేనీ డబ్బంతా ఎత్తుకొచ్చిన ట్లొకరడుగగా నా మనస్సేమనునో అదేవిధంగా నీప్రశ్నమున నైపోయినది. ఇంత యదరిపాటునకు కారణమున్నది. దానివల్ల నే నాకింతకంపం — ఇంత భయం పిశాచములవలె పట్టుకుని వదలకుండా ఉన్నాయి. క్షమించు. ఇదంతా వట్టి అప్రస్తుతం." అని ఆయన ఊరుకున్నారు.

అంతలో మా నాయనగారు మోహనరావను నొక యువకునితో నచ్చటికి వచ్చిరి. మోహనరావుని నేను బెంగుళూరులో కొంచెం ఎరుగుదును. ఆత డెల్లప్పుడు నాడువాండ్రకంటె నెక్కుడగ కట్టి, పూసి, తొడిగి ముస్తాబగుచుండును. స్త్రీలుగూడ నిరంతర పరివర్తన శీలములైన ఫ్యాషనుల నాతనియొద్ద నేర్చుకొనవలెనన్నట్లాతడు శృంగారపుబూతలతోను, మెఱుపులతోను దళుక్కుమనుచు ఠీవిగా ప్రవర్తించుచుండును. కామినీ ఆయిల్, ఆటోడిల్ బహార్, హిమాలయన్ స్నో, యింకా ఫ్రెంచి అత్తరువులు — ఇవన్నీ కాంపౌండై గాలిలో నొకదుమారముగ బయలుదేరి ఉద్యోగిముందటి బయలుదేరు నౌఖరువలె ముందుగా నతనిరాకను తెలియజేయుచుండును. బెంగుళూరులో నాకు తెలిసిన మోహనరావు నేను కాకినాడవచ్చిన మరునాడే నాకు కనబడెను. తనతల్లిగారు కాకినాడలో నుండి రనియు, ఆమెను జూచునిమిత్తమై వచ్చితి ననియు, తాను మా తండ్రిగారిని బాగుగ నెరుగుదుననియు నతడు చెప్పెను. ఎప్పుడు రాజశేఖరరావుగారిని కలసికొన్నను ఆయావేళలం దెప్పుడును మోహనరావు ప్రత్యక్షమగును. అతడక్షిగోచర మయినంతనే రాజశేఖరరావుగారి కెక్కడలేని కొరకొరయు మొగమున కనబడుచుండును. మా తండ్రిగారు సుప్రసన్నముగ రాజశేఖరరావుగారిని బహూకరించిరి.

"దేవికారాణి టాకీ వచ్చింది. ఈ "కర్మ" ను చూద్దామంటే నాకు బెంగుళూరులోగూడ సాధ్యం కాలేదు. లక్షలు ఖర్చుపెట్టి హిమాంశురాయ్ అను బెంగాలీవాడు దీన్ని లండనులో తయారుచేశాడు. ప్రపంచంలో అన్నిదేశాలు ఇప్పుడు దేవికారాణిని జూచి మోహించిపోతున్నాయి. ఈ "కర్మ" అనే ఫిల్ము లండనులో సెక్రెటరీ ఆఫ్ స్టేటయిన సర్ సామ్యూల్ హోర్ చేత, ఈదేశంలో వైస్రాయిచేత ప్రథమంలో ఓపెన్ కా (ప్రారంభింప) బడ్డాయి" అని మోహనరావుత్సాహమున చెప్పజొచ్చెను.

"అయితే, నాన్నగారు, మన మాఫిల్ము చూడాలండీ." అని నే నంటిని.

"అమ్మాయీ, నీవు తప్పకుండ వెళ్లు. నాకు వీలుండదు — అయితే రాజశేఖరరావుగారూ మీరు, అమ్మాయి వెళ్లి ఫిల్ము చూడండి" అని మాతండ్రిగారు పలికిరి.

"లేదండీ, నాకు సూపరింటెండెంటు ప్రసాదరావుగారితో కొంతముఖ్యమైన పనియున్నది. ఎప్పటికి తెమలుతుందో చెప్పలేను. ఆయనను జూచి చాలాకాలమైనది. ఇప్పుడాయనవద్దకు జరూరుగా పోవలసిఉంది." అని రాజశేఖరరావుగారు పలికిరి.

నేను ఫిల్మును జూడవలెనన్న యుద్దేశమును ప్రకటింపగా రాజశేఖరరావుగారది గమనించకుండ నా

మనసు చివుక్కురుమనునట్లు కార్యాంతర మున్నదని చెప్పుట నాకు మిగుల విరసముగ నుండెను.

"రాజశేఖరరావుగారు మహాప్రభువులు. ఆయన కొక్క నిమిషమైన ఊపిరి సలపకుండ పనిఉండడంలో ఆశ్చర్యము లేదు. జనార్దనరావుగారూ, మీ అభ్యంతరం లేకపోతే మీ విజయలక్ష్మిగార్ని నేను తీసుకు వెళ్లి ఫిల్ము చూపించివస్తాను. బి. ఏ. దాకా చదువు కొనడాని కొప్పుకొని ఆమె చూడాలనుత్సాహపడే ఫిల్ము చూడనీయక పోవడం అప్రతిష్ఠ."

"మోహనరావూ, ఏమనుకుంటున్నావో కాని, మా విజయ యింకా చిన్నపిల్ల కాదు. రేపేగదా పరిణయం? పంపడానికీ పంపకపోవడానికీ దాని ఇష్టం, దానిభర్త గారి ఇష్టంగాని నాఇష్టం ఏమీలేదు." అని మానాన్నగారనిరి.

"అప్పుడే భర్తగారిఇష్ట మేమిటండీ? ఇంకా పెళ్లీ లేదు ఏమీ లేదు. పూర్వకాలంపద్ధతిని మాట్లాడుతున్నారు. రేపు సుముహూర్తం జరిగించుకుని పాణిగ్రహణమహోత్సవం అయింతర్వాత ఆయనఆజ్ఞానుసారంగా జరుపుకుంటే బాగుంటుంది. అంతేగాని అప్పుడే ఆయనచెప్పులు మొయ్యమని చెబుతున్నారేమిటి? ఆమెకు మీ రిచ్చిన ఎడ్యుకేషనుకుకూడా తలవంపులు వచ్చేటట్లు చెప్పకండి!"

నా కీమాటలు మనఃకంటకముగా నుండి రాజశేఖరరావుగారితో "నాకు చూడవలె నని యున్నది. మీరు వీలుచేసుకుని రాలేరా?" అని యడిగితిని.

"నన్నడుగ నక్కర లేదు. మీ నాన్నగారు వెళ్లమని ఈవఱకే చెప్పినారు. నీకుకూడా కుతూహలముగ నున్నది. కాబట్టి తప్పకుండా వెళ్లు." అని వా రనుజ్ఞ నిచ్చిరి.

## ౭

## సినీమాయందు చూచితిని

నాటిరాత్రి సినీమాయందు దేవికారాణియొక్క హావభావవిలాసములను మిగుల నక్కజముగ, నద్వితీయముగ, అలౌకికప్రతిభాసంపన్నముగ దలంచి తన్మయత్వమున నామనోజ్ఞప్రదర్శనమును వీక్షించితిని. నడుమ నడుమ మోహనరావు కథనుగూర్చి వ్యాఖ్యానించుచు వచ్చెను.

"ఆహా! ఏముందం! ఏముందం! ఎంతబాగుంది! బలే, బలే!"

అని పై కనుకొనుటయే గాక దేవికారాణిని, సుధారాణిని, హిమాంశురాయుని, తదితరపాత్రములను స్తుతించి, మురిసి, పులకరించి, పొంగిపోవుచు వచ్చినాడు. దాంపత్యానురాగప్రతిబింబితమైన యాకథాదృశ్యములను, సంభాషణములను చూచునప్పుడును వినునప్పుడును నాభావాంబరమున భావికార్యఘటనలను దలంచుకొనుచు రాజశేఖరరావుగారితోడి నాప్రణయకథ కెట్టిపరిణామ ముండునో, ఎట్టి పరివర్తనములుగునో యని మెఱపుమెఱసిన ట్లూహించుచు వచ్చితిని. కథయొక్క నడిమిభాగమున విద్యుద్దీపములచే బ్రకాశించు విరామసమయమున నొక్కసారి ప్రేక్షకులను జూచుచు నలుగెలంకులకును నా మాడ్కులు ప్రసరించినవి. అప్పుడాకస్మికముగ నొక్క యున్నతాసనమున నా వెనుక పార్శ్వమున రాజశేఖరరావుగారి నుపలక్షించితిని. నా కొడలు జలదరించెను. అప్పుడు వారు నావైపునకు జూచుచుండుట లేదు. ప్రక్కనున్న ఒక ఇండియన్ దొరగారితో మాట్లాడుచుండిరి.

"హరి, ఏం తమాషాగా ఉంది! భార్య ఏమయి పోతుందో అని వచ్చి కనిపెడుతూకూర్చున్నాడే మహాపురుషుడు." అని యాంగ్లమున బరిహసించుచు మోహనరావు ప్రేలజొచ్చెను. నే నక్కడ నిలువక రాజశేఖరరావుగారు కూర్చున్నస్థానమువద్దకుబోతిని. ఆయన నేను వచ్చుటను గమనించి ఆంగ్లేయపద్ధతిని పాణిగ్రహణ (Shake Hands) మొనర్చి, ఆంగ్లేయులవైఖరిని వస్త్రధారణ మొనర్చి ప్రక్కను గూర్చున్న వారి స్నేహితునితో పాశ్చాత్యపద్ధతుల ననుసరించి నన్ను వారి కెఱిగించిరి. ఆయన మందస్మితవదనమున నా పరిచయభాగ్యము కలిగినందులకు సంతసముగ నున్నదని పలికిరి.

ఆయన రాజశేఖరరావుగారిస్నేహితులను పోలీసు సూప
రింటెండెంటు ప్రసాదరావుగారని నేను తెలుసు
కొంటిని. ఆనాడు ప్రసాదరావుగారుకూడ సినీమా
చూడవలెనివచ్చుటచేత నిరువురును గలసి వచ్చియుంటి
మని రాజశేఖరరావుగారు చెప్పిరి. అంతలో మఱల
ప్రదర్శన మారంభమగుటయు ప్రసాదరావుగారు రాజ
శేఖరరావుగారి ప్రక్కసీటు నొకటి ఖాళీజేయించి
అందు నన్ను గూర్చుండచేసిరి.

నాటిరాత్రి రాజశేఖరరావుగారితో ప్రదర్శన
మును జూడవలయునను సంకల్ప మీవిధముగ సిద్ధించి
నందులకు నేను మిగుల నానంద మొందితిని.

౫

## మఱల దొంగనోట్లు

మఱునాడు జరిగిన పరిణయమహోత్సవమును
గూర్చి నేనంతగ వర్ణింపవలసిన యావశ్యకత లేదు.

మదరాసు, బెంగుళూరు మున్నగు స్థలములకు
సహితము తంతివార్తలను బంపి నాకత్యంతమైత్రి గల
సహాధ్యాయినులను మాతండ్రిగారు రప్పించిరి. కొందఱు
సుముహూర్తసమయమునను, కొందఱు వివాహోత్సవ
మధ్యమునను వచ్చి నా కానందము కలిగించిరి.

ఆంధ్రులలో పుంభావలక్ష్మీంద్రుడైన రాజశేఖర
రావుగారిని విజయలక్ష్మి యను నామముగల నేను పరి
ణయమాడి చరితార్థురాల నయితినని కవులు, గాయ
కులు, పత్రికావిలేఖరులు ఒక్కరీతిని స్తోత్రము చేయు
చుండగ మహావైభవముగ, నత్యంతరమణీయముగ, వేడు
కలతో, వినోదములతో, విద్యుద్దీపములతో, నానానగరా
హూతులైన ప్రముఖులతో, నట గాయక వైతండిక
లతో, జన్మమధ్యమున నిక నెన్నడును మఱపురానిచిత్ర
మహాచిత్ర చిత్రాతివిచిత్రములతో జరిగిన దని నేను
వేఱుగ వర్ణింపనక్కర లేకయే పాఠకులూహించి తెలుసు
కొందురుగాక.

రుచ్యమైనపదార్థమును భక్షించుచుండగ నడుమ
నంతరాయముగ పంటిక్రింద ఱా యొక డడ్డుపడినట్లు
మధ్యమధ్య మోహనరావుచేయు వికటసరసములకు నా
యానంద మప్పుడప్పుడు భగ్నమగుటయేకాక నాకతనిపై
పట్టరాని కోపముసహితము వచ్చెడిది. కాని ఆయాసం
దర్భములను జెప్పవలసిన యావశ్యకత లేదు.

వివాహమహోత్సవ మయిన కొన్నిదినములకు
రాజమహేంద్రవరమునందలి నాభర్తగారి గృహమునకు
వచ్చివేసితిని. ఆభవనము రెండంతస్థుల మేడ. ఆంగ్లేయు
లీదేశమున నివసించు బంగాళాలవలె, నలువైపులను
మూడునాలుగెకరముల పుష్పోద్యానమున్నది. ఆయిం
టికి వచ్చిననాటి సాయంకాలమున నేను మేడమీద
నొకగదిలో సుఖాసీనురాలనయి నాడు వచ్చిన గృహ
లక్ష్మిలోని పత్రములను ద్రిప్పుచు గూర్చుంటిని. అపుడు
పరిచారిక వచ్చి "అమ్మా, బాబుగారు ఏవో వస్తువులను
దెమ్మని రాఘవుడికి లెక్క ఇచ్చారట. అందులో పది
రూపాయిలనోటు దొంగనోటని బజారులో పోలీసు
వాళ్లు పట్టుకుని ఱల్లరిపెట్టారుట. వాడు ఇనస్పెక్టరు
గారి కాళ్లుకడుపులు పట్టుకుని ఎల్లాగో విడిపించుకుని
ఏడుస్తూవచ్చాడు. తనకి నట్టనడిబజారులో పరాభవం
జరిగిం దని గోలెత్తుతున్నాడు. అయ్యగారితో చెబుదా
మంటే అయ్యగా రింట్లో లేరు." అని నాయొడలు
ఝల్లుమనునట్లు చెప్పెను.

"పాపం రాఘవుడిని ఏడవవద్దనిచెప్పు. ఆయన
సరిగా చూచుకోరో యేమో చేతికి వచ్చే సొమ్ములో
దొంగనోట్లు చూసుకుంటూవుండాలి. ఇప్పుడు ప్రతిచో
టా దొంగనోట్లు హెచ్చయిపోతున్నట్లున్నాయి. నేను
పదిహేనురూపాయ లిస్తాను. ఒక అయిదురూపాయలు
రాఘవుడికి నేనిచ్చానని చెప్పి ఇయ్యి. మిగిలినపది బాబు
గారు చెప్పినఖర్చులను చేయుమనిచెప్పు." అని దానికి
సొమ్మిచ్చి పంపివేసితిని. ఈదొంగనోట్లసంగతి చిత్ర
ముగా నుండెను. రాఘవుడిసంగతి తలచుకుంటే నాకు
హృదయంలో ఏదో పీకుచున్నట్లుండెను. ఆయనవచ్చిన
తరువాత నేను రాఘవుడిసంగతి చెప్ప దొడగితిని. వారు
పరధ్యానముగ వినిరో ఏమోకాని నేను చెప్పినదానినే
మఱల చెప్పవలసివచ్చినది. "ఏమిటీ దొంగనోటా?
సొమ్ము తీసుకోడంలోను, ఇయ్యడంలోను ఇంత యశ్ర

ద్దగా వుంటున్నాను." అని వారేదో ఆలోచించడం మొదలుపెట్టారు. వారొకసోఫాపై చతికిలబడి కొంత సేపటివఱకు నిశ్శబ్దముగ నూరకుండిరి.

"ఇంట్లో ఖర్చులన్నీ నీవు చూసుకోవాలి. చిన్న ఖర్చులకు ఇనప్పెట్టెలో సొమ్ము వుంటుంది. పెద్దఖర్చులకు ఇక్కడ బ్యాంకిలో నీపేరగూడ సొమ్మువుండే యేర్పాటు చేయించినాను. నీకు కావలసిన చెక్కులు వ్రాసి యిస్తూవుండు."

"నేను చేసే పెద్దఖర్చు లేమీ వుండవు. అయినా మీరు చూపిస్తూవున్న యాదరిమునకు సంతోషంగా వుంది." అని నాకృతజ్ఞతను కొంత వెల్లడించితిని.

"మీనాన్నగారికి వ్యాపారంలో యిచ్చిన ౫౦ వేలు నా కంతలక్ష్యం లేదు. నీవు సొమ్ము స్వేచ్ఛగా ఖర్చు పెట్టినపుడే నాడబ్బుకి సరియైన ప్రయోజనంవుంటుంది. ఈడబ్బువల్లనే నిన్ను పెండ్లియాడగలిగినాను." అని వారనుచుండగా మిక్కిలి యవివేకమున

"అవును. 'సర్వేగుణాః కాంచనమాశ్రయంతి.'" అని చిఱునగవుతో నంటిని.

"అనగా నాధనమే నిన్ను వశంచేసుకున్నదన్న మాట."

"మీగుణములనుజూచి మిమ్ములను ప్రేమించుటకు నాకవకాశమిచ్చినారుకారు."

"క్షమించు, డాక్టరు రంగాతొందరవలన అవివేకంగా ఒప్పుకున్నాను. లేనియెడల నీవు నాప్రేమను గనిపెట్టియే పెండ్లాడియుందువు."

అప్పుడు రాఘవుడువచ్చి "బాబూ పోలీసాయిన ఎవరో తీసుకునివచ్చారు. అర్జంటుపనిమీద వచ్చారుట." అని చెప్పెను.

"పైకిరమ్మను. హాలులోకివచ్చి కూర్చోమను." అని ఆయన చెప్పిరి. నాభర్తగారు హాలులోనికి వెళ్లిపోయిరి. నేను గదియావలనువచ్చి చూడగా నేనెఱిగిన సి. ఐ. డి. ఇన్‌స్పెక్టరు రంగాచారియను నాయనయు, ఒక కాన్‌స్టేబుల్‌ను మెట్లెక్కివచ్చుట గానవచ్చెను. పోలీసువాడు సూట్‌కేస్ ఒకటి పట్టుకుని వచ్చుచుండెను. వా రెందులకు వచ్చిరో తెలుసుకొనవలెనన్న కుతూహలముతో హాలులోనికి పోయి చూచితిని.

"క్షమించండి. రాజశేఖరరావుగారూ, ఈనోట్లకట్ట రాజమండ్రీ రైలుస్టేషనులో మీ సూట్‌కేసులో దొరకింది." అని ఇన్‌స్పెక్టరు చెప్పుచుండెను. ఇన్‌స్పెక్టరుచేతిలో క్రొత్తనోట్లదొంతరయొకటియుండెను.

"ఇది నిన్న ఉదయం స్టేషనుకు పంపబడింది. ఈనోట్లకట్ట తమసూట్‌కేసులో కెలా వచ్చిందో సెలవియ్యాలి."

"వాట్ డు యు మీన్? మీ రనేదేమిటో స్పష్టంగా చెప్పండి."

"ఇందులో ప్రతి కాగితంకూడా ఒక దొంగ నోటు."

రాజశేఖరరావుగారు స్పష్టముగ "నాసూట్‌కేసు లెవ్వీ స్టేషనుకు పంపబడలేదు." అని చెప్పిరి.

"నేను చెప్పేదేమంటే—"

"అయ్యా, దయయుంచి వ్యర్థప్రసంగము లేమీ నావద్ద చెప్పకండి. స్టేషను కెవ్వీ నాసూట్‌కేసులు పంపించలే దని స్పష్టంగా చెప్పెను." అని రాజశేఖరరావుగారు మిక్కిలి చికాకుగా మాట్లాడిరి.

"దానిమీద మీపేరున్నదండీ." అని ఇన్‌స్పెక్టరు పలికెను.

"ఏమిటండీ, ఇంత దౌర్జన్యంగా చెబుతారు? ఎక్కడైనా దొంగనోట్లు సృష్టించి వాటిని సూట్‌కేసులలో పెట్టి స్టేషనులో వదలేస్తారండీ. మీ సూపరెంటుగారికి వ్రాసి కనుక్కోండి. ఏమంటారోను? లేకపోతే మీ ఇన్‌స్పెక్టరు జనరల్ గారికైనా సరే. లేక హోమ్ మెంబరుగారికైనాసరే వ్రాసి తెలుసుకోండి. ఎవడైనా నవ్విపోతాడు! ఇంపీరియల్ బ్యాంకి చేర్మన్లనిగాని, బ్యాంకాఫింగ్లండ్ గవర్నర్లనిగాని, కాక సృష్టింప

బడుతూవున్న రిజర్వుబ్యాంకి గవర్నర్లనిగాని అడుగుతే యింత స్టుపిడ్‌గా ఎక్కడా జరగదని ఒక హండ్రెడ్ థౌజెండ్ రీజన్లు చెబుతారు."

ఇన్‌స్పెక్టరు మాట్లాడకుండ సూట్‌కేసందుకుని బల్లపై బెట్టెను. దాని గొళ్లెమునకు తెల్లనిచేపుతో నొకకార్డు వ్రేలాడుచుండెను. నేను దగ్గరకు బోయి చూచితిని. దానిమీద,—

'యస్. వి. రాజశేఖరరావుగారు,
కాకినాడ.'

అని యాంగ్లమున నచ్చువేయబడియున్నది.

"ఇంతకు పూర్వము నే నీసూట్‌కేసును చూడ లేదు. అవుతే ఇది స్టేషనువద్ద ఉండిపోయినదన్న సమాచారం మీ కెట్లా తెలిసిందో నాకు చెప్పవచ్చునా? చెప్పినట్లయితే మీ పోలీసురహస్యాల కేమయినా భంగమా?" అని రాజశేఖరరావుగారు ప్రశ్నించిరి. ఇన్‌స్పెక్టరు బుస్సుమని

"మా రహస్యాలనుగూర్చిన ప్రసక్తి మీ కెందుకో చెప్పండి. దీనినిగూర్చి విచారించి కనిపెట్టుటకే వచ్చాను. అది నాడ్యూటీ. అంతేగాని మా పోలీసుడిపార్టుమెంటులోని గుట్టుమట్టులన్నీ మీకు తెలియజేయడానికి రాలేదు. ఇంకా మిమ్మల్ని కనుక్కోవలసినసంగతి ఏమిటంటే—"

"నేను పదిరూపాయిల దొంగనోటొకటి నా నౌఖరు కిచ్చాననికాదూ—అంతేనా? ఇంకా మీకు తెలియదేమోకాని ఏభైరూపాయిల దొంగనోటొకటి కాకినాడలో నేనిచ్చినట్లు మీపోలీస్‌శాఖవారే పట్టుకొన్నారు. అంతేకాదు—" అని జేబులోనుండి రాజశేఖరరావుగారు మనీపరసు నీవలకు దీసిరి. "ఇదుగో ఈ పైది మంచినోటే—ఈ వందరూపాయిల నోటు—ఇది విశ్వామిత్రసృష్టి! ఇది తమకు జాగ్రత్తపెట్టండి. తరువాత ఈ పదిరూపాయిలనోటూఅంతే. మళ్లీ ఈనాలుగు మంచినోట్లు. తరువాత ఇక్కడనుంచి ఈఐదురూపాయిలనోట్లన్నీ మారీచుడి మాయలేడిలాగ సృష్టికాబడ్డాయి. ఇవన్నీ తమకు భద్రంచేయండి. వీటిలోని నీటిగుర్తులు సరిగాలేవు." అని ఒకయిరువది ముప్పది నోట్లను బల్లమీద బడవైచిరి.

ఇన్‌స్పెక్టరు నోట్లను ఒకదానితరువాత నొకటిగ నొంతరబెట్టుచు "అయితే ఇవన్నీ మీకు బ్యాంకినుంచే వచ్చినవా?" అని యడిగెను.

"కొన్ని బ్యాంకినుండి వచ్చియుండవలెను. కొన్ని ఇతరులవద్ద యిచ్చిపుచ్చుకొనుటలో వచ్చినవి."

"అయితే మీరన్న కిట్టనివారు మీకివి యంటగట్టుతున్నారా? మీపై విరోధముగలవారెవరు?"

"అయ్యా, రంగాచారిగారు, నాకెవ్వరూ విరోధులు లేరండీ. విరోధులుంటే మీరే కావాలి."

ఇన్‌స్పెక్టరు రుసరుసలాడుచు,

"అయ్యా, నాడ్యూటీ నేను చేస్తున్నాను. ఇది శత్రుత్వంగా మీరు భావిస్తున్నారు. మీపొజిషన్‌లో నున్నవారు నన్నీవిధముగ పలుకడం న్యాయంకాదు." అని బింకముగ బలికెను.

"మూడువారములనుంచి నేనొక తస్కరమహాశయుడనన్నట్లు నన్ను దృష్టిపథమున (under observation) బెట్టుకొని మీరు నన్నన్నివ్యవహారములలోను వెన్నాడుచు తిరుగుచుంటిరా లేదా? మీరు సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్లని నాకు తెలియకపోలేదు" అని రాజశేఖరరావుగారనిరి.

ఇన్‌స్పెక్టరు కొంతధాటితో "అలాగాండి? అవుతే కొన్నిసంగతులు మీరు నాకేమీ శ్రమలేకుండా చెప్పివేస్తే సంతోషిస్తాను-అయితే ప్రతిరాత్రి మీరున్న మేడమీదకు వస్తూ మళ్లీ ఎపుడు తిరిగిపోతుందో తెలియకుండా మాయమయిపోతూవున్న దక్షిణాదిస్త్రీ ఎవ్వరో, ఎందుకు వస్తోందో కొంచెం నాకు తెలియజేస్తారా?" అని వజ్రాయుధమువలె నాచెవులు పగులునట్లు పలికెను.

"ఎంతఘోరమయిన కల్పన!" అను వాక్యము లప్రయత్నముగ నానోటినుండి వచ్చెను.

"రంగాచారిగారూ, ఇక మీరు దయచేయండి. మీకు చెప్పినసంగతి వాస్తవమయినా మీ రందునిమి



ఉదయశంకరుని నాట్యవిశేషము
(Harves Dance)

యమై ప్రశ్నించడానికి మీకేమి హక్కుంది?" అని యాగ్రహావేశమున నాభర్తగారనిరి. మఱల నేమను కొనిరో కాని కొంత శాంతము వహించి "ఇదికూడ నేనేమో జరిగిస్తూవున్న నోట్లసృష్టికి చెందినరహస్యమనీ, నామాయావాగురకు ప్రత్యక్షమైన తార్కాణమనీ మీ యూహాకాబోలు. మీ వైఖరి చూస్తే ఆలాగే వుంది. కాబట్టి చెబుతున్నా వినండి.

మీరు చెప్పినట్లొక దక్షిణాది స్త్రీ నావద్దకు వస్తూవున్న సంగతి వాస్తవమే. ఆమెకు యాభైరెండేండ్లు. ఆమెవచ్చి నాతో ఘర్షణపడిపోతూవుంటుంది. ఆమె ఎవరో, ఆమె అడ్రెసేమో అదిమాత్రం మీకు చెప్పలేను." అని చెప్పెరి.

"మీరు స్నేహితులా?" అని ఇన్‌స్పెక్టరు తన మనస్సులోనున్న విషమును కొంత వెడల గ్రక్కెను.

"ఎంతమాత్రం కాదు. ఘర్షణ పడిపోతూవుంటుం దని చెప్పనేచెప్పేను. ఆవిడకు నేనంటే పరమ ద్వేషం. ప్రథమంలో ఆవిడ ఒకవంటమనిషి. నాకు తెలిసినంతవఱకు ఆమె ఎప్పుడు వంటచేసినా, లేక ఇతరులచేత చేయించినా నానాపాడుగాను ఉంటుంది. ఆమె చేసిన వేపుడుముక్కలలో కారం నాలుక కోసి నట్లుయిపోతుంది. ఏటువంటిబియ్యమైనా లైపిండిచేసి పెడుతుంది. ప్రతిభక్ష్యంలోను ఉప్పు విపరీతంగావేసి గాని, అసలు వెయ్యకగాని పాడుచేసి తీరుతుంది."

అక్కడ నున్న మా కందఱకు నవ్వువచ్చినది.

"అవుతే ఈసంగతులన్నీ నేను రిపోర్టువ్రాసుకుంటాను లెండి. పైవాళ్లకు చోద్యంగా వుంటుంది." అని ఇన్‌స్పెక్టరు వికటముగా నవ్వజొచ్చెను.

"మీరిపోర్టు సూపరెంటెండెంటుగారికి అందే లోపుగానే నేను మీసంగతి ఆయనకు తెలియజేస్తాను."



"అయ్యా నా డ్యూటి నేను చేస్తున్నాను"

"ఇదెక్కడి గ్రహచారం?"

"ఇప్పుడిక్కడున్నవాళ్ల గ్రహచారం ఏదైనా వక్రంగా ఉంటే తప్పకుండ మీదేనుంది. మీరు వారంటు లేకుండా వచ్చారు. నన్నీ విధంగా నానా ప్రశ్నలు వేస్తున్నారు. ఇప్పుడీ సంగతి సూపరింటెండెంటుగారికి నేను రిపోర్టు జేయకుండా మీరు నన్నిప్పుడు క్షమాపణ కోరుకోవలసివుంది."

ఇన్‌స్పెక్టరు తెల్లబోయెను.

"మాస్తే తమరే మాపైన సి. ఐ. డి. లాగున్నారు. తమకు శ్రమయిచ్చినందులకు మన్నించండి. వారంటు లేకుండా మీయింటికి పరిశోధననిమిత్తం యిక రాను. ఈసారికి క్షమించండి." అని ఖిన్నవదనముతో రాజశేఖరరావుగారివద్ద సెలవుతీసుకుని ఇన్‌స్పెక్టరు వెడలిపోయెను.

## ౬

## క్లోరోఫారము రుమాలు

"నాకు ఒక దురభ్యాసంవుంది. రాత్రిపన్నెండు గంటలుదాటితే నేగాని నిద్రపోను. ఎందుకైనా అవసరం వుంటే ఈ టేబుల్ బెల్ కొడితే వస్తాను. అవతలితట్టున వున్న పుస్తకాలగదిలో నిద్రపట్టేవఱకు కాలక్షేపం చెయ్యాలనివుంది." అని నాయంగీకారమునుబొంది భర్తగారు వెడలిపోయిరి. నాకు నిద్రపట్టినది. క్రొత్తచోట పండుకొనుటచేతనో యేమోకాని అకస్మికంగా మెలకువవచ్చిచూచితిని. గదిలో నెవ్వరును లేరుకాని గడియారమువంక చూడగా పదకొండున్నరగంటలైనది. ఆవలిదెసనున్న కిటికీచట్రము (Shutters) ల నెవ్వరో తెరచి యాశించిచూచుచున్నట్లు నాకు చప్పుడయ్యెను. నేను కదలకుండ అవైపునకే చూడసాగితిని. తప్పక ఎవడో మనిషి యున్నాడని తెలిసికొంటిని. నాచేతులప్రయత్నముగ బల్లమీదనున్నగంటపై వ్రాలెను. ఖంగు మనిశబ్దమయ్యెను. నేను గవాక్షమునొద్దకు బోయి తలుపులను తెఱచిచూచితిని. మేడకు సమీపముననున్న చెట్టునుండి ఎవడో క్రిందికి తోటలోనికి పరుగెత్తుచున్నట్లు నాకు గానవచ్చెను.

"ఏమిఇంకను నిద్రపోలేదా?" అని గదిలో ప్రవేశించుచు నాభర్తగారనిరి.

"చూడండి, ఎవడో పాఱిపోవుచున్నాడు. ఈ కిటికీవద్ద కెక్కివచ్చి వీనినాడించి చూచుచుండగా నాకు మెలకువ వచ్చినది. ఆచెట్టునుంచి ఉఱుకుచుండగా చూచాను. ఆచెట్టెక్కి మేడమీదకు వచ్చాడేమో?"

నాభర్తగారు దూరమున పాఱిపోవుచున్న మనుష్యునిజాడ జెప్పవశిపోయిరి. వెంటనే నౌకరులను బిలిచి పెట్రొమేక్సు లైట్ ఒకటియు, కొన్ని ఎలక్ట్రిక్ టార్చిలను దీసుకొని తోటలోనికిబోయి నలుగెలంకులను పరిశోధించిరి. వారంత గడబిడచేయుచుండగ ఆరాత్రివేళ నాగవాక్షముపై నట్లు వ్రాలినపక్షి వారెంత వెదకినను అగుపించకుండ పాఱిపోయెను.

మఱునాటి రాత్రి మఱింత గందరగోళముగ గడపవలసినదాన నయితిని. నాటిరాత్రి దొంగ లెవ్వరును చెట్టునుబట్టి మేడపయి కెక్కిరాకుండ మధ్యాహ్నమే దానిని గొట్టించివైచితిని. పరుండునపుడు ప్రక్కనున్న ఎలక్ట్రిక్ ఫాన్‌ను సవరించుచుండగా ప్రమాదమున చేయితగిలి రెండత్తరువుసీసాలు పగిలిపోయినవి. దాసీని బిలిచి గాజుముక్క లెత్తించివేసితిని గాని ఘాటైన అత్తరుల వాసన నాపాన్పువద్ద నుండిపోయెను. ఆయత్తరుల కెరటములలో నిద్రాభారమున మునిగిపోతిని. అప్పుడు కల లొకటివెంబడి యొకటి మొదలును తుదయును లేకుండ దొంగలనుగూర్చియు, దొంగనోట్లనుగూర్చియు, సి. ఐ. డి. ఇన్‌స్పెక్టరును గూర్చియు వట్టియడవివలె నామనస్సున నల్లుకొనిపోవుచుండెను. చేయియెత్తుపాడవున నున్న నోట్లకట్టలమీద రంగాచారి నిలబడి రుసరుసలాడుచుండెను. నాభర్తగారు జేబులోనుండి ఒక నోట్లకట్టను దీసి రంగాచారి మొగముమీద గొట్టిరి. అకస్మికముగా ఆనోట్లకట్టలన్నియు తగులబడ నారంభించెను. రంగాచారి 'క్షమిం

చండి, బాబు! మీ చెప్పులు మోస్తాను.' అని కాళ్లు చేతులు పట్టుకొని బ్రతిమాలుచు కూలబడిపోయెను.

హఠాత్తుగా నాకు మెలకువవచ్చెను. ఎవ్వరో నన్ను చేతులతో గట్టిగా నదిమిపట్టుకొనిరి. గది యంధకారబంధురముగా నుండెను. నాభర్తగారు కారు. వాడెవ్వడో ఎంతసాహసికుడో గాని మెలకువ వచ్చిన ఆయుత్తరక్షణమున నాపై నెంతఘోరముగనైన పడిపోవుచున్నట్లు నాకు దోచెను. జపానువారి 'జియు జిట్సు' పద్ధతులను మదరాసులో గొంత తెలిసికొనియుండుటచేత ఆచండగుని గడ్డము నొకముష్టిప్రహారమున నా యావచ్ఛక్తియు నుపయోగించి యావలకు ద్రోసివైచితిని. నాయంసద్వయమును విడిచి వాడు శయ్యప్రక్క క్రింద కొరగిపోయెను. నేను లేచి పాన్పు డిగి ఈవలకు వచ్చితిని. కేకలు వేయుటకుగూడ నాకు సమయస్ఫూర్తి లేకుండ ఆయంధకారమున గోడను దడిమికొనుచు విద్యుద్దీపమును వెలిగింప నాతురత పడుచుంటిని. ఈలోపుగ ఆట్లు కూలబడిన ఆవ్యక్తి యెక్కడకో దొరలుచు బోయినట్లు చప్పుడు వినిపించెను. నేను దీపమును వెలిగించితిని. ఎవ్వరును గదిలో లేరు. గదితలుపొకటి తెరువబడి యుండెను. నేనాతలుపువద్దకు బోయి చూచితిని. ప్రక్కనున్న గదినిదాటి వాడు పరుగిడి పోవుచుండెను. నేను బల్లపైనున్న గంటను మ్రోగించితిని. ౧౨ గంట లింకను కాలేదు. పరుండుటకుముందు మెడలోనికొన్ని యాభరణములను దీసి బల్లపై నుంచితిని. అవి అట్లే యున్నవి. నాభర్తగారువచ్చి సర్వమును దెలిసికొని ఎలక్ట్రిక్ టార్చి చేతబట్టుకొని ఆమనిషి పాఱిపోయినవైపునకు బోయి వారు పరిశోధన మారంభించిరి. వరండాలోనికి బోయి చూడగా అక్కడ నిచ్చెనయొకటి నేలనుట్టమునకు జేరవేయబడియుండెను. చేతిలోని విద్యుద్దీపము నన్నిదెసలకును ద్రిప్పిచూచితిమి గాని ఎవ్వడును కానుపించలేదు. తోటకవ్వలిరోడ్డుమీద అప్పుడేబయలుదేరుచున్న మోటర్ కారు ధ్వనివలె మాకు వినిపించుటయేకాక నిర్మానుష్యముగ మిగుల నిశ్శబ్దముగానున్న ఆ నిశీథసమయమున నెక్కడికో పోవుచున్నట్లు మాకు శ్రవణగోచరమయ్యెను.

"కులుకు! నిన్నవచ్చినవాడే కాబోలును. పట్టుకొన్నయెడల మెడ విరుగగొట్టియుందును." అని నాభర్తగారు క్రోధావేశమున ననిరి.

పడకగదిలోనికివచ్చి చూచులప్పటికి శయ్యకును బల్లకును నడుమ లేడీస్ పర్సువలె నేదో పడియుండెను. దానిని పైకి తీసి చూచితిని. పైన నాంగ్లమున 'క్లోరోఫారం' అని చిన్నచీటిపై వ్రాసియుండెను.

"ఇదేమి! క్లోరోఫారమేమిటి? హత్యజేయుటకు దెచ్చినాడా? లేక దీనితో మరేమి ఘోరమును చేయదలచుకొన్నాడు?" అని యాశ్చర్యముననంటిని. "సీసాలో నుండవలసిన క్లోరోఫారం యిందులో ఎట్లు తెచ్చాడు? లోపల జేబురుమాలువలె నున్నది. క్లోరోఫారమునందు తడిపితెచ్చాడు కాబోలు. వీడుమానవుడా, లేక పిశాచమా?

(ఇంకా ఉన్నది.)

# లేఖలు

మ. రా. రా. శ్రీ భారతీసంపాదకులకు

అయ్యా,

భారతి ౧౯౩౮ సం. నవంబరునెల సంచికలో శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులవారు, (వసుచరిత్రను విమర్శిస్తూ)

"ఇన్నగరాజుఁ జూడ వసు
ధేశ్వరుఁ డెన్నఁడు వచ్చు వచ్చి యీ
క్రొన్ననతీవ జొంపముల
కోనకు నెన్నఁడు డిగ్గు, డిగ్గి యీ
కన్నియఁ గన్నులారఁ గను
కంబున నెన్నఁడు గాంచుఁ, గాంచి తా
నెన్నఁడు గారవించుఁ, జెలు
లెన్నఁడు గాంతు రభీష్టసంపదల్."

ముంటికి కత్తి, కత్తికి కంప, కంపకు రొట్టె, రొట్టెకు ముండ, ముండకు డోల్, డోల్ బజా అని అనకాపల్లి బులుసు పాపయ్యశాస్త్రిగారి ముక్తపద గ్రస్తాలంకారోదాహృత గద్యశ్రాద్ధమువలె నుండక యీ పద్యము మిగుల సొంపుగ నున్నది."
అని మృదువుగా వ్రాసినారు.

'అనకాపల్లి బులుసు పాపయ్యశాస్త్రి గారి గద్యశ్రాద్ధము' లో 'ముంటికి కత్తి' ప్రభృతివాక్యములు లేవు. అవి శ్రీ పిఠాపురగ్రామ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులవారు 'అనకాపల్లి బులుసు పాపయ్యశాస్త్రిగారి గద్యశ్రాద్ధము'లో నున్న కథను సంక్షేపించి రచించినసమ్మరీ. వసుచరిత్రపద్యము ఆ గద్యశ్రాద్ధముకంటెనా, ఆసమ్మరీకంటెనా సొంపుగా నున్నది? ఆ గద్యశ్రాద్ధమూ ఆ సమ్మరీ ఒకటే అంటారా? అయితే ఆ సమ్మరీ యెందుకు? ఆ గద్యశ్రాద్ధములోని వాక్యములనే నిరసించ దలచుకొన్నప్పుడు వాటినే ఉద్ధరించడము యుక్తము గాదా?

మరి 'ముంటికి కత్తి' ప్రభృతి వాక్యములు 'అనకాపల్లి బులుసు పాపయ్యశాస్త్రిగారి గద్యశ్రాద్ధము' లో 'ముక్తపద గ్రస్తాలంకారోదాహృతము' లయి ఉండలేదే. ఈకల్పన ఎందుకో? రామరాజభూషణమహాకవి పండితవేద్యముగా రచించిన ప్రౌఢప్రబంధమయిన వసుచరిత్ర యెక్కడ? 'అనకాపల్లి బులుసు పాపయ్యశాస్త్రిగారు' ౭-౮ సంవత్సరముల యీడు గల పిల్లలకోసము సంగ్రహించిన పిట్టకథ లెక్కడ? ఆ ప్రౌఢప్రబంధమునున్నూ ఈ పిట్టకథలనున్నూ సామ్యము చేయడము హాస్యాస్పదము కాదా?

ఇవన్నీ ఈలా గుండనిండు. అభిప్రాయభేదము గలిగినప్పుడు ప్రతిపక్షుల వ్రాతలకు శ్రాద్ధాలూ పిండాలూ పెట్టడము సరసవిమర్శ అవుతుందా? (ఆవిషయములో కూడా అభిప్రాయభేదాలు ఉంటవా?

ఏమయినా,

"మన్నిందయా యది జనః పరితోషమేతి
నన్వప్రయత్నజనితోఽయ మనుగ్రహో మే;
శ్రేయోఽర్థినో హి పురుషాః పరతుష్టిహేతోః
దుఃఖార్జితాన్యపి ధనాని పరిత్యజంతి."

ఇట్లు
బులుసు పాపయ్యశాస్త్రి




## వాయువిమానము: నీరుకాచు కూజా

**(Aeroplane; Kettle)**

కో. నరసింహాచారి

a b c d (చి. ౧) అను నలుచదరపు కాగితమును దీసికొని దానిమూలలకు మడువవలెను. రెండు మూలమడతలును o వద్ద కోయును. a c అను మూలమీద కాగితమును మడిచి (చి. ౨) o వద్ద కాగితమును పట్టుకొని, b మూల a మూలతోను, d మూల c తోను చేరునటుల మడువవలెను. (చి. ౩) ఈ మూడు చిత్రములందలి విధములును, సిరాబుడ్డిని చేయు విధమును చూపు ముందటివ్యాసమునందలి మొదటి నాలుగు చిత్రములందు జూపబడియున్నవి. మడిచిన కాగితమును o క్రిందిపక్కకు వచ్చునటుల త్రిప్పకొని b c అను మూలలను మాత్రము o వద్దకు మడువవలెను. అపుడు e f అను మూలలు ఏర్పడును (చి. ౪). పిమ్మట b c మూలలను మరల క్రిందనుండు p అనుమధ్య భాగమునకు మడువవలెను (చి. ౫). పిమ్మట e p, f p అను అంచులు o p రేఖపైకి వచ్చునటుల మడిచి విప్పినయెడల p g, p h అనుమడత లేర్పడును (చి. ౬, ౭). అదే రీతిని oe, of అను అంచులను గూడ, o p రేఖపైకి వచ్చునటుల మడిచి విప్పవలెను. అప్పుడు o j, o k అను మడత లేర్పడును (చి. ౮). తర్వాత e మూలను ముందేర్పడిన p g, o j అను మడతగుర్తులవెంబడి మడిచి (చి. ౯ లో చేతితో మడుచువిధమును చూ.) o వైపునకు మడువవలెను. ఈరీతిగ f మూలను గూడ మడువవలెను. తర్వాత o మూలను వెనుకకు మడవవలెను (చి. ౧౦). ఒక సన్నని నిడుపైన కాగితపుతునుకను దీసికొని దానికొన నొకదానిని పక్షితోకవలె (చి.౧౧) కత్తిరించి, దాని రెండవకొనను చి. ౧౦ యందలిరూపమున p వద్ద లోపలికి దూర్చినయెడల చి. ౧౨ నందలి వాయువిమానరూపము వచ్చును. a d పైపక్కకుమడిచి p వద్ద పట్టుకొని గాలిలో విసరివేసినయెడల విమానము కొంతదూరము గ్రద్దవలె నెగిరిపోగలదు.

### నీరుకాచుకూజా

సిరాబుడ్డికిని వాయువిమానమునకును వలెనే యొకనలుచదరపు కాగితమును దీసికొని దానిని, సిరాబుడ్డిని చేయుటకుగాను చూపిన విధమునే ముందటి వ్యాససంబంధమగు చిత్రముల చి. ౭ వరకు మడువవలెను. ఈరూపము ఈపాఠసంబంధమగు చిత్రము




d ని మరల కుడి ప్రక్కకు మడువవలెను (చి. ౧౭). ఇదేరీతిని తక్కిన a b c మూలలను గూడ చి. ౧౪ మొదలు చి. ౧౭ వరకు d ని మడుచుచు వచ్చినవిధముననే మడువవలెను. అప్పుడు కాగితము చి. ౧౮ నందలివిధమున నేర్పడును. a d మూలలను ఒకప్రక్కను, c b మూలలను మఱియొకప్రక్కను చేర్చిపట్టుకొని (చి. ౧౯) p వద్ద గల రంధ్రమునందు గాలిని ఊదినయెడల సిరాబుడ్డివలె కాగితము ఉబ్బి చి. ౨౦ యందలి విధముగ వచ్చును. దానియందు నీటిని నింపి m అను సన్నని దీపపుజ్వాలకు పైన తగిలీతగులనట్లు s, s అను ద్వారముల మూలమున వ్రేలాడగట్టినయెడల కూజాయందలి నీరు వేడియగును. కాగితము గట్టిదిగా నుండినయెడల నిట్లు నీటిని కాచవచ్చును.

లలో చి. ౧౩ నందు కలదు. ఇందు d మూలను పూర్తిగా మడతవిప్పినయెడల (చి. ౧౪) అందు p f, g h j అను మడతగుర్తులు తెలియును. తర్వాత g h మడతగుర్తువెంబడి, కాగితమును మడిచి d మూలను ఎడమవైపునకు తీసికొనవలెను (చి. ౧౫). h j గుర్తువెంబడి మరల కాగితమును మడిచి d ని క్రిందికి వచ్చునట్లు చేయవలెను (చి. ౧౬). తర్వాత

# కలగూరగంప

## ఆధ్యాత్మిక గానము

[ జనవరి నెల "ఆడ్వాన్సు ఇండియా" లోని ప్రొఫెసరు సాంబమూర్తి బి. ఏ., బి. యల్ గారి "Sacred Music", అను వ్యాసమునకు అనువాదము ]

మతమునకును సంగీతమునకును మనదేశములో సమ్మేళనమున్నట్లు ప్రపంచమునం దెక్కడను లేదు కాబోలు. సంగీతము త్రిమూర్త్యాత్మకమైనది. మహేశ్వరుని హస్తమున డమరుక మమరియున్నది. విష్ణువు శంఖమును ధరించియున్నాడు. బ్రహ్మరాణియగు వాణి హస్తమున వీణ నెలయుచున్నది. వేదములోని ధ్యాన శ్లోకములు సంగీత శ్లోకములవలె పాడబడుచున్నవి. ప్రార్థనపద్యము లెల్లప్పుడును గానయుక్తములుగా నుండును. గానకళయను గాంధర్వవేదము వేదములలో నొకటి. శ్రీరాముని యాస్థానసభలో కుశలవులు రామాయణమును గానమొనరించిరి. కాన సంగీత మెప్పటికిని నట్టియానందమునకో, సంతోషమునకో నియమింపబడ లేదు. ఉత్తమస్త్రీపురుషులు దీనిని ప్రత్యేకముగా పట్టుదలతో ప్రయత్నించి సాధించిరి దైవమహిమ నిరూపించుటకై సంగీత ముపయోగింపవలయునని మన గురువులలో ఘను లనేకులు పలుమారు నొక్కి వక్కాణించుచునే యున్నారు. "ఎన్నగ మనసుకురాని..." అని నీలాంబరి రాగములో శ్రీరాముని పొగడజాలని నాలుకవలన లాభమేమి అని త్యాగరాజుల నుడువు. అందువలననే మనజాతీయ జీవితములో సంగీతమున కగ్రస్థాన మొసగబడినది. మనపండుగలు, వ్రతములలో సంగీత మేదోయొకవిధమున మిళితమగుచున్నది. గొప్పవిద్వాంసులతోపాటు సమానగౌరవమును మన గాయకులు మొదటినుండియు పొందుచునే యున్నారు. జాతికి వారు అమూల్యమణులవలె పరిగణింపబడుచున్నారు. దేవాలయములలోను మఠములలోను సంస్థానములయందును అనేక గానవిద్వాంసులు స్థిరపదవుల నొందియున్నారు. గానకళయం దభిరుచిగల తంజపురాధీశ్వరుడగు రాజా తులజాజీ (౧౭౬౫... ౧౭౮౭) గారికాలమున సంస్థానములో ౩౬౦ మంది సంగీతవిద్వాంసు లుండి సంవత్సరమున దినమున కొకరు ప్రకారము పాడుచుండిరి.

లౌకికసంగీతమునకన్న ఆధ్యాత్మిక గానము మిగుల ప్రాచీనమైనది. భక్తిని వెలిబుచ్చుటకు ఆధ్యాత్మిక గానము సాధనము. లౌకికసంగీతమున గానకళను సాహిత్యము పోషించును. లౌకిక సంగీతము మతసంబంధము గాక, గానకళకును నాట్యకళకును, జనసామాన్యసంగీతమునకును సంబంధించినది. యూరపున కీర్తనలు, ధ్యాన శ్లోకములు, ఆరాధనలోనుప్రార్థన, జపరసగానము, భక్తిగీతములు ఆధ్యాత్మికగానమునకు చేరినవి. మనదేశములో అష్టపదిశ్లోకములు, భాగవతాంగములు, అభంగములు, తోహరాలు, కీర్తనలు, దివ్యనామకీర్తనలు, నామావళులు ఈ ఆధ్యాత్మికగానములో కొన్ని ముఖ్యమైనవి. మనదాక్షిణాత్యకృతులు ఉభయాత్మకములు.

వేదాంతకీర్తనలు, ముహార్ తేవారముగాక జయదేవుని గీతగోవింద ఆధ్యాత్మికగానములో ప్రాచీనమైనది. అది సంస్కృతములో శృంగారరసప్రధానమగు మహాకావ్యము. పండ్రెండు నిసర్గలుగల్గి అష్టపదులు పేరు గలది. జయదేవుడు పండ్రెండవశతాబ్దమువాడు; వంగదేశీయుడు. ఈ అష్టపదులు మనదేశమునం దెల్లెడలను జయదేవు డేర్పఱచిన రాగతాళయుక్తములుగా గాకున్నను యేదోయొకవిధమున పాడబడుచున్నవి. ఇంకొకవిధమునను ఈగ్రంథ ముత్కృష్టమైనది. ఇది ఒకవిధమైన నాటకము.

తీర్థనారాయణస్వామికృతమైన కృష్ణలీలాతరంగిణి ఈ ఆధ్యాత్మికగానములో రెండవ ప్రాముఖ్యమైన గ్రంథము. ఈనాటకము ౧౨ తరంగములు గలది. ఈ పాటలు పల్లవి - అనుపల్లవి గలిగిన, చరణ అంగ యుక్తములగు కీర్తనలు. ఒక్కొక్కపాటకు మునుపు ఒక శ్లోకము ఒకవాక్యము నుండును రుక్మిణీకృష్ణులకు సంబంధించిన గాథ. అనేకపాత్రలు ప్రవేశపెట్టబడినవి.

౧౭, ౧౮, ౧౯ శతాబ్దములలో ఆత్మీయ ప్రబోధమున భజనవిధానము క్రొత్తయుత్తేజము నొందెను. మనదేశములోని వివిధప్రాంతములవారు భక్తిరస ప్రధానమగు గానమును వెదజల్లిరి. దక్షిణదేశమున తెలప్రాకం చిన్నయ్య ఈవిషయమున ఆకాలమున ప్రధానుడు. నవీనభజనాపద్ధతికి ఇతనినే మూలపురుషు డనదగును. తెనుగున భక్తిరసప్రధానములగు కీర్తన లనేకముల నతడు రచించెను. తామ్రశాసనమున నుండుటచే మన అదృష్టవశమున అవి మన కిప్పటికి లభ్యమైనవి. ఇప్పుడు భజనలలో ఆరంభించు అనేకవిధ గానతరంగముల కతడే మూలాధారుడు. పురందరదాసు, భద్రాచల రామదాసు, సదాశివ బ్రహ్మేంద్రుడు, శ్రీ బోధేంద్ర సద్గురుస్వామి శ్రీ వేంకటేశ్వర దీక్షితులు, విజయగోపాలుడు అనేక భక్తిగేయములను విరచించిరి. త్యాగరాజుగారి దివ్య కీర్తనములు, ప్రహ్లాద భక్తివిజయము, ఆత్మ నుద్ధరించి భక్తిపరవశము జేయు కీర్తనలతో నలరారుచున్నవి.

ఆధ్యాత్మికగానములో నామావళి మిగులసాధారణమైనది. భజనలలో నామావళి పలుమారు కీర్తింపబడును. తరచు భజనముగింపుచు భజననాయకుడు "పుండరీకవరద" యనగనే అనుచరులందరును ఆ దివ్యనామము ననువదించుచు ముగింతురు. చూర్ణిక, పద్యము, శ్లోకము, స్తోత్రము, దండకము, అష్టకము ప్రబంధము ఈ ఆధ్యాత్మికగానములో మరికొన్ని విధములు. అరవమునగూడ ఆధ్యాత్మికగానమునకు నిదర్శనములు గలవు.

---

## ఫిలిప్పైనులలోని హైందవనాగరకత

ఫిలిప్పైనుదీవులలో ప్రాచీన హైందవనాగరకతా సూచన లున్నవని "మిథిక్ సొసైటీ జర్నల్" వ్రాయుచున్నది.

"౧౫౨౧-వ సంవత్సరములో స్పెయినుదేశస్థులాదీవులను కనిపెట్టునంతవరకును వానిచరిత్ర ప్రపంచమునకు తెలియనే తెలియదు. ఇపుడు చేయుచున్న పరిశోధనలందుగూడ అంతకు పూర్వకాలమందలిస్థితిగతులు యోచింపబడుటలేదు. కాని ఆదీవులందు శిథిలములై యున్న సౌధదేవాలయాదులందును, శిల్పములందును, జనుల ఆచార వ్యవహారములందును గూడ రెండువేలయేండ్లకుపూర్వమే వానితో సంబంధముగలిగి మెలగిన హిందూమతమును గూర్చినవిశేషములు స్పష్టముగ గోచరించుచుండును. ఇప్పుడిప్పుడు క్రొత్తగా కట్టుచున్న మందిరములందును ప్రజల మనఃప్రవృత్తి ననుసరించి హిందూనాగరకతాముద్ర లప్రయత్నముగ పడిపోవుచున్నవి. ఇందు కొక్కటే తార్కాణము. నేడాదేశమునకు పోయి చూడుడు: మొన్నమొన్ననే నిర్మింపబడిన లెజిస్లేటివ్ కౌన్సిల్ (శాసన సభ) సౌధము మనిల్లా యందున్నది; దాని ముఖద్వారముపై చెక్కబడిన బొమ్మలమధ్య హిందూధర్మశాస్త్రకారు డగు మనువు ప్రతిమ గోచరించును!

"క్రైస్తవశకమునకు పూర్వమే అచ్చట హిందువులరాజ్యము స్థిరముగ నేర్పడియుండును. తరువాత స్వదేశమునందువలెనే అక్కడగూడ వీరిప్రభావము విదేశీయుల ఒత్తిడివలన క్రమక్రమముగా క్షీణించియుండవచ్చును. కాని ఫిలిప్పైనులుమాత్రము హిందులకు శాశ్వతముగ ఋణపడియున్నమాట నిజము. ఎన్నియో శతాబ్దములవరకు అచ్చటిమతము హిందూమతము; శివుని విగ్రహములు దేవాలయములు నేటికిని గోచరించును. వారివ్రాత, అక్షరములు, అన్నియు హిందువులనుండి యెరవు తీసికొన్నవి. ఇప్పటి వారివాఙ్మయమునందు సంస్కృతపుపోకడలన్నియు స్పష్టముగా కనుపట్టును. వారికళ, వ్యాపారవిధానము, పరిశ్రమలు, నౌకానిర్మా

ణము, ఖనిజములు పరిశుభ్రపరచుపద్ధతిగూడ ప్రాచీన హైందవమార్గములై యున్నవి. చిన్నచిన్న సాంఘిక విశ్వాసములందును మూఢాచారములందును ఈ సంబంధము స్పష్టపడును. రాజులు రాణులు హిందూనామములు ధరించెడివారు. మహమ్మదీయ ప్రభువులుగూడ సంఘమునం దావరించిన ప్రాచీన నాగరకతాగంధము నుండి తప్పించుకొనలేకపోయిరి. ఇందుకు వారిచరిత్ర నుండి ఒకవిచిత్రమైన ఉదాహరణము చూపవచ్చును; ఒక మహమ్మదీయుడు రాజ్యమునకు వచ్చునప్పుడు తనకు పెట్టుకొనుక్రొత్తబిరుదములలో హిందూసామాన్యమైన 'శ్రీ' కూడ చేర్చుకొనెను— అతనిపేరు పాదుకా శ్రీ సుల్తాన్ బొటీలన్!"

—కుం. స.

## సయాము రాజ్యాంగము



ప్రజాధిపోరాజు

తన సయామురాజ్య పరిపాలనము సంతృప్తికరముగను, ప్రజానుకూలముగను లేదనుకారణమున రాజ్యపరిత్యాగముచేయ నిశ్చయించుకొన్నట్లు కొన్ని నెలలకు పూర్వమే ప్రజాధిపోరాజుగారు ఇంగ్లండులో ప్రకటించిరి.

వీరు ౧౯౩౫ సం. మార్చి ౨-వ తేదీనాడు తమ నిశ్చయము ననుసరించి రాజ్యమును పరిత్యజించిరి.

## సయాము క్రొత్తరాజు



ఆనంద మహీరాలు

ప్రజాధిపోరాజుగారు రాజ్యత్యాగము చేసిన తరువాత సయాముదేశమునకు రాజుగ నియమింపబడెను. ఇతడు ప్రజాధిపోరాజుగారి సోదరుని పుత్రుడు

## జోస్ రిజాల్

ఫిలిప్పైన్ దీవులకు స్వాతంత్ర్యము సంపాదించవలెనని ప్రయత్నించి, అప్పుడు వానిని పాలించు స్పెయినుప్రభుత్వముచేత కాల్చివేయబడిన వీరుడు జోస్ రిజాల్ జ్ఞాపకార్థమై "ఓరియంట్" పత్రిక యీ క్రింది పంక్తులు ప్రకటించుచున్నది. రిజాల్ చంపబడినది ౧౮౯౬ డిసెంబరు ౩౦-వ తేదీన—

"మానవజాతిలో అట్టి అపూర్వవ్యక్తిని గూర్చి యింతవర కెవ్వరును వినియుండరు. చాల చిన్నతనము నందే మరణింపవలసివచ్చినను, అత డప్పటికే సహస్ర మార్గముల తనప్రతిభను ప్రసరింపజేసి మానవకోటిని తనకు ఋణస్థులుగ జేసికొన్నాడు.

"ప్రథమమున, తనఉద్యోగమునుబట్టి, కంటి వైద్యుడు. దానిలో అతడుచేసిన పరిశోధనలు, కనిపెట్టిన నవ్యచికిత్సావిధానములు నేటికిని శాస్త్రజ్ఞుల సాశ్చర్యపరవశుల జేయుచున్నవి. తరువాత, రిజాల్ గొప్పజంతుశాస్త్రవేత్త; అతడు కనిపెట్టిన క్రొత్త ప్రాణులును పదార్థములును నేడతని పేరుతోనే వ్యవహరింపబడుచున్నవి. నవలారచనయం దత డద్భుతప్రజ్ఞను వెలిపుచ్చినాడు. అతని రెండునవలలను అతనిదేశీయులు నేడు మతగ్రంథములవలె శిరములపై ధరించుచున్నారు అతడు మహాకవి: మూడుభాషలలో సమగ్రపాండిత్యముగలిగి శాశ్వతముగ జీవింపగల పద్యములు రచించినాడు. రిజాల్ గొప్పశిల్పాచార్యుడు, అతడు చేసి చూపిన విగ్రహములలో దేశీయజీవితము సర్వతోముఖముగ ప్రతిబింబించుచుండును. అతడు గొప్ప ఇంజనీయరు కూడ: ఈనా డతనినిర్మాణములనుజూచి అన్ని ప్రభుత్వములవారును రాయబారులను ఇంజనీయరులను నేర్చుకొని రమ్మని పంపుదురు. మహోపాధ్యాయు డతడు: ఈనాడాదేశమునందున్న అపూర్వవిద్యావిధానము నతడే సృష్టించిపోయినాడు. ఇక రాజకీయవేత్తలలో అతనినిమించినవారు లేరు. పన్నులనియామకము, న్యాయపాలనము మొదలగు విషయములపై అత డనంతమగు సారస్వతము ప్రకటించెను. భాషాతత్త్వశాస్త్రజ్ఞుడని అతనిని ప్రపంచ మానాడే పొగడినది. యూరపుఖండమునం దాతడు నేర్వనిభాషగాని పరిశోధింపని గ్రంథముగాని లేదేమో! అత డొకదేశభక్తుడని వేరుగ చెప్పవలెనా? తనజాతికొరకని జీవితమంతయు విరామములేని కష్టములకు లోనై తుదకు ప్రాణముల నర్పించినాడు జోస్ రిజాల్."

—కుం. న.

# ఆంధ్రాభ్యుదయము

## శ్రీ నాదూరి వేంకటశాస్త్రిగారి షష్టిపూర్తి

శ్రీ వేంకటశాస్త్రులుగారు పండితవంశమున జని యించినవారు విజయనగరాస్థాన విద్వాంసులకడ వ్యాకరణాద్యనేకశాస్త్రముల నధ్యయనముచేసి పేరుగన్న వారు.

తొలుదొలుత శాస్త్రులుగారు శ్రీకూర్మము నందలి సంస్కృతపాఠశాలయం దధ్యాపకులయినారు. తదీయపాండిత్యగౌరవము, ప్రవచనపాటవము, శాస్త్రిగా రచ్చటనున్నకాలముననే ప్రఖ్యాతిని గనినవి. అదికారణముగ శాస్త్రిగారిని విజయనగర మహారాజ సంస్కృత కళాశాలయందలి వ్యాకరణాధ్యాపకపదవి అయాచితముగ వరించినది. నాటినుండి నేటికిని శాస్త్రిగారాపదవి నధిష్ఠించి నిరంతరశాస్త్రాధ్యాపనతత్పరులయి యున్నారు. సహస్రపరిమితమగు శిష్యబృందము వారి యొద్ద శాస్త్రాధ్యయనమును గావించి పండితప్రశస్తిని గనినది. వీరికి శిష్యవాత్సల్య మత్యధికము. వీరీనార్థకమునను నిరంతరప్రవచన తత్పరులయి యుందురు. ఇట్టి పండిత వతంసమునకు మొనమొన్ననే షష్టిపూర్తి




నడుమ శ్రీ నాదూరి వేంకటశాస్త్రులుగారు, కుడిని సభాధ్యక్షులు సర్. యస్. రాధాకృష్ణనుగారు.
ఎడమను:-పరవస్తు వేంకటరామానుజస్వామిగారు, విజయనగర సంస్కృత కళాశాలాధ్యక్షులు.

మహోత్సవము విజయనగరమున జరిగినది. శ్రీ సర్. యస్. రాధాకృష్ణను గారు మహోత్సవమునకు పెత్తనమును వహించినారు. గురుభక్తితో నీ యుత్సవమును జరిపిన శాస్త్రిలుగారి యంతేవాసిగణము ధన్యతను గాంచినది.

---

## యస్. వి. యస్. రామారావుగారు

### చిత్రకారులు

మదరాసు చిత్రకళాశాలవిద్యార్థులగు వీరు ఈ వత్సరము పరీక్షలలో చెన్నరాష్ట్రమున వర్ణ చిత్ర లేఖన మందు ప్రప్రథమములుగ నుత్తీర్ణులయి గ్రిగు మెమోరియలు బంగారు పతకము బడసిరి. ఈబహుమతిని బడసిన ప్రథమాంధ్రులు వీరే. ఇటీవల జరిగిన మదరాసు ఫైనార్ట్సు సంఘము ప్రదర్శనమునందు ప్రథమ బహుమతిని బడసిరి. వీరు వేలు పిక్చర్సువారి స్టూడియోలో ఆర్టు డైరక్టరుగ నియమింపబడినారు.



యస్. వి. యస్. రామారావు.

---



# భారతీయ మహిళా మండలి




శ్రీమతి ఎ. జె. లోబోసతిగారు

మదరాసునగరము గౌరవమేజిస్ట్రేటుగా నియమింపబడిరి.

---



# విమర్శనలు

## ఆంధ్రవాఙ్మయ సంగ్రహము

ప్రథమభాగము. సంధాతలు విద్వాన్, శ్రీ. టి. ఆర్ముగం పిళ్లగారు, ప్రధానాంధ్రోపాధ్యాయులు, ముత్యాలపేట హైస్కూలు, మద్రాసు; శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారు, సంపాదకులు, భారతి. డెమ్మీ ౧౧౫ పుటలు. వెల ౧౦ అణాలు. ముచ్చటయిన కూరుపు. ప్రకాశకులు కే. పి. పిళ్ల కంపెనివారు, మద్రాసు.

ఉన్నతపాఠశాలలలోఁ జదువు బాలుర యుపయోగార్థము విద్వాంసులు కొందఱు వివిధగ్రంథముల నుండి గద్యములను కొన్నిటిని, పద్యములను కొన్నిటిని సేకరించి సంగ్రహగ్రంథములను కూర్చుట అలవాటయినది. అందు కొన్ని కేవలము ప్రాచీనవాఙ్మయ సంగ్రహములు; కొన్ని కేవలము నవీనవాఙ్మయ సంగ్రహములు. వానియందలి గద్యపద్యభాగములు విషయమునందును, శైలియందును పరస్పరము కొంత అనుగుణ్యము కొఱవడి యున్నవి. సంగ్రహగ్రంథములు ఏదేనొక తరగతికి ఉద్దిష్టములు కాకుండుటచే, ఆంధ్రోపాధ్యాయులును, ప్రధానోపాధ్యాయులును, వానిని తమ యిచ్చవచ్చినట్లు నిర్ణయించుచున్నారు. కొన్ని తరగతుల బాలురు వానిని తెలిసికొనలేకను, కొన్నితరగతులవారు ఉపయోగములేకను వ్యర్థముగ వ్యయప్రయాసములకు లోనగుచున్నారు. కలిగినను, కొన్నింటివలన సారస్వతాభివృద్ధియేగాని తక్కిన నైతికాద్యభివృద్ధులు కలుగకున్నవి. పాఠశాలలలో విద్యార్థులు నేర్చుకొనవలసిన దొక్క విద్యయేకాదు. వారు నేర్చుకొనవలసినవి నీతి, వ్యక్తిస్వాతంత్ర్యము, మనోదార్ఢ్యము మొదలగునవి ఎన్నియేని కలవు.

పయివిషయముల నన్నింటిని లెస్సగఁ బరామర్శించి "సంధాత" లీ "ఆంధ్రవాఙ్మయ సంగ్రహము"ను జతకూర్చినారు. గద్యపద్యసంగ్రహముల పట్టులనగల లోటుపాటులన్నియు నిందు సవరింపఁబడినవిఁ "ఇందలి గద్యపద్యభాగము లొకటి రెండు తప్ప తక్కినన్నియు సరి క్రొత్తవి; విషయములును ప్రాయశః నూతనములు."

"ఆయాభాగముల రచయితలు ప్రాచీన నవీన సాహిత్యప్రపంచమున పెద్దపేరును గన్నవారు. రాధామాధవకవి, చరిగొండధర్మన, పుష్పగిరితిమ్మన ప్రాచీన కవులలోఁ గ్రొత్తవారు. నవీనులలో నెక్కువమంది క్రొత్తవారు. కూరుపు క్రొత్తతీరుది."

విద్యార్థుల కంతగా అక్కఱరాని గ్రంథకర్తృచరిత్రాదికము ప్రస్తావన రూపకమయినది ప్రతిభాగము మొదట నిందులేదు. ఇట్టి యుత్తమ సంగ్రహగ్రంథమును పఠనీయముగ ఉపయోగించుకొను బాలురకు సారస్వతాభివృద్ధితోఁబాటు "నైతిక, మానసిక, వైయక్తికాభివృద్ధియును గలుగఁగలవు."

"ఈ గ్రంథము నాలుగవఫారము విద్యార్థుల కుద్దేశింపఁబడినది. కావ్యగౌరవము, విషయగౌరవము నందు కెంతయుఁ దగియున్నది."

విద్యార్థులు విజ్ఞానసౌధము నధిరోహించుటకు మూడవసోపాన మున్నతపాఠశాల అట్టిపాఠశాల లిట్టి యమూల్యగ్రంథములను పఠనీయములుగ నిర్ణయింతురేని వాని సంకల్పము చరితార్థము కాఁగలదు.

వెల స్వల్పము; ఫలమధికము.

బు. వేంకటరమణయ్య

### వినోదశిల్పము (ప్రథమభాగము)

సంపాదకురాలు : కొ. స్వర్ణవల్లి గారు.

ప్రకాశకులు : ఆంధ్రగ్రంథమాల, ౭, తంబుశెట్టి వీధి, మదరాసు.

చాలాకాలముగా భారతియందు ప్రచురింపబడు చుండిన 'వినోదశిల్ప' వ్యాసములు గ్రంథరూపమున నిట్లు ప్రచురింపబడినవి. బాలబాలికలకు శిల్పవిజ్ఞానము నార్జించుకొనుట కీపుస్తకము మిక్కిలి సహకారి కాగలదు. ఉల్లుదారము, పట్టుదారము, కమ్మి, కాగితములు, అట్టలు మొదలయిన చిన్న చిన్న వస్తువులతోనే పలువిధము లయిన గృహోపకరణములు చేయు విధానములు సులభశైలిలో, సచిత్రముగా వివరింపబడినవి. ఇదివఱ కిట్టి గ్రంథ మాంధ్రభాషయందు లేదు. బోధనాభ్యసనపాఠశాలల విద్యార్థులకును, ప్రాథమికమాధ్యమికపాఠశాలల విద్యార్థులకును ఇది మిక్కిలి యుపకారకమయిన గ్రంథము. ద్వితీయభాగమునుగూడ త్వరలోనే ప్రచురింపజేయుటకు తగిన యాదరణమును ప్రకాశకులకు గల్గింపవలయును.

---

# గ్రంథ స్వీకారము

### రహస్యలేఖ (నవల)

గ్రంథకర్త :—చెలికాని సత్యనారాయణగారు, పద్మనాయక గ్రంథమాల, పెంటనాగుల వలస, రాజాం పోస్టు, విశాఖపట్టణం. క్రౌను ౧/౮ సైజు ౬౭ పుటలు. వెల రు. ౦-౮-౦.

---

### ఉదంకుడు

గ్రంథకర్త:—మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు. సోంపేట. క్రౌను ౧/౮ సైజు. ౧౦౮ పుటలు. వెల రు. ౦-౧౨-౦.

### ౧. కమలాకల్యాణము, ౨. శ్రీ భగవద్గీతామంజరి

గ్రంథకర్త:—పానుగంటి పార్థసారథి రాయనింగారు, పానగల్, కాళహస్తి. ౧. డెమ్మీ ౧౨౮ పుటలు, వెల తెలియదు. ౨. క్రౌను ౧౨౭ పుటలు, వెల తెలియదు.

---

### విలాపతరంగిణి

గ్రంథకర్త : కే. కృష్ణమాచార్యులుగారు, తిరుపతి.
ప్రకాశకులు : వావిళ్ల రామస్వామిశాస్త్రులు సన్సు, ౪౯-౨ ఎస్ప్లనేడు, మదరాసు. ౧/౧౬ సైజు, ౩౯ పుటలు, వెల తెలియదు.

---

### కో కి ల

కర్త : తురగా వెంకటరామయ్యగారు, తాడేపల్లిగూడెము. క్రౌను ౧/౧౬ సైజు, ౧౨౦ పుటలు వెల రు. ౦-౮-౦.

---

### దండకగుచ్ఛము

కర్త : చక్రాల సీతారామయ్య, గుత్తి, ౮ పుటలు, వెల రు. ౦-౦-౩.

---

### శ్రీ త్యాగరాజస్వామి

కర్త : బి. లక్ష్మీనారాయణరావుగారు, కోలారు.
ప్రకాశకులు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మదరాసు. డెమ్మీ ౧/౧౨ సైజు, ౫౮ పుటలు, వెల తెలియదు.

---

### హరిజనుడు

గ్రంథకర్త : అల్లాడి నీలకంఠ శాస్త్రిగారు, వకీలు, కడప. క్రౌను ౧/౮ సైజు, ౨౬ పుటలు. వెల ౦-౬-౦.

---

### మల్లెపూలు

గ్రంథకర్త: కర్లపాలెం కృష్ణరావుగారు, చీరాల. క్రౌను ౧/౮ సైజు, ౬౯ పుటలు. వెల రు. ౦-౧౨-౦.

---

# సాభిప్రాయ విశేషములు

ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీః, దైవంహి దైవమితి కాపురుషా వదన్తి;
దైవం నిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా, యత్నే కృతే యది నసిద్ధ్యతి కోఽత్ర దోషః.

ప్రపంచాన్వితమైన విషమపరిస్థితులందు మొదటిపాఠకపుస్తకమునందలి "భరత పక్షిపిల్లలు" కథ జిజ్ఞాసువులందరును స్మరించి కార్యపరాయణులు కావలసిన యవసరమును తెలుపుచున్నది. సకలకార్యములందును "తొందరలేదు వేచియుండవచ్చును" అనెడి సామాన్యభావము ప్రబలుచు నిస్సహాయత్వము వ్యాపించుచున్నది. రాజ్యాంగములందు ఇండియా బిల్లునకు నిరీక్షించెడివారును, ధరలందు కాలమునకు వేచియుండువారును, పరివర్తనమునకు సంగ్రామమును విశ్వసించెడివారును, పన్నులకు ప్రభుత్వకటాక్షము నాసించెడివారును, స్వాభివృద్ధికి దైవానుగ్రహమును నమ్మెడివారును, అదృష్టమునకు లాటరిటిక్కెట్లను నమ్మెడివారును భరతపక్షులకథను తలచి కార్యనిర్వహణమునకు పూనుకొనుట పురుషార్థము. మానవ జీవితమునందు కాలమమూల్యపదార్థము. వ్యర్థమైన ప్రతిక్షణమును, విడిచిన ప్రతిపనియును పురుషార్థసిద్ధిని వ్యక్తులకు, సంఘములకు, జాతులకు దూరస్థము చేయుచున్నది. కార్యాచరణములందు కాలహరణము కామితార్థములను దూరస్థము చేయుచున్నది. మానవాభీష్టములను ప్రతిఘటించెడి శత్రువులందు కాలశత్రువు పరమశత్రువు. ప్రజానాయకు లీపరమధర్మమును గ్రహించవలసిన యవసరమును వర్తమానకాలమునందు హిందూస్థానమునందు దిగంతవ్యాప్తమైన నిస్సహాయత్వము, కాలయాపనము, వైరాగ్యము పరిస్ఫుటముచేయుచున్నవి. విషాదపూరితమైనను సంకల్పసిద్ధికి గీతాశాస్త్ర కీలకమైన "కరిష్యే వచనం తవ" ప్రయోజనకరము కాని ప్రజ్ఞావాదము సాధనము కాదు. సకలవిషయములందును శాస్త్రవాదముల కాద్యంతములు లేవు. పనిలేని మంగలిసామెత తెలిసిన విషయము. పనిపాటులులేనివారు ప్రజ్ఞావాదముతోను, ఆటపాటలతోను, కలహములతోను, ప్రత్యేకలాభములతోను కాలయాపనము చేయుట పరిపాటియైనది. మనోరథములు సఫలమగుటకు క్రియాశక్తివలెను మాటలు సాధనములుకావు. పరాధీనదేశములం దీదురవస్థ సర్వకాలసర్వావస్థలందును ప్రత్యక్షమగుచున్నది. పరాధీనదేశములందు రాజ్యాంగములు శాసనములు ప్రభుత్వోద్యోగములు, వ్యాపారపరిశ్రమలు, విద్యావిధానములు, శాస్త్రకళాప్రయోగములు శాసనములందువలెను క్రియలందు గోచరముగాకున్నవి. సకలవ్యవహారములందును విత్తాపహరణమునకుగల ప్రతిష్ఠ చిత్తాపహరణమునకును, మాటలకుగల గౌరవము చేతలకును గలుగకున్నది.

[illegible] దేశములందు [illegible] దేశాభిమానములు [illegible] కాపులకును, నాయకులకును కృషి యందు దుర్లభమైనది. గంభీరోపన్యాసము లకు దగిన కార్యపరత్వమును పరాధీనత్వము దుర్లభము చేసినది. శాసనసభలు, శాసన ములు, ధర్మశాస్త్రములు, న్యాయస్థానములు, న్యాయశాస్త్రములు, సివిలు క్రిమినలు శాసన ములు, విద్యాలయములు స్వతంత్రశక్తిని నిర్వీ ర్యము చేసినవి. పరాశ్రయము శ్రమ లేకుండా జీవయాత్రను సాధ్యము చేయునపుడు శ్రమ పడుట మానవస్వభావమునకు విరుద్ధము. పరాధీన ప్రవాహమునందు పడినపు డెదురీది స్వతంత్రప్రవాహమునందు పడుటయును కష్ట సాధ్యము. హిందూస్థానపరిస్థితు లీపరమార్థ మును సర్వకాలసర్వావస్థలందును ప్రత్య క్షము చేయుచున్నను ఉద్యోగపరాయణ త్వము సాధ్యముగాకున్నది. ఆరంభమునం దుదాహృతమైన హితోపదేశశ్లోకము ప్రాచీన కాలమునందువలెను వర్తమానకాలమునం దును యథార్థమైన పురుషార్థసాధనమును సాధకులకు మనోగతము చేయుచున్నది. శాసనసభలును శాసనములును సక్రమాం దోళనమును నీపరమార్థమునకు మహావ్యా ఖ్యానములు.

* * *

## శాసనసభలు—శాసనములు

ప్రపంచ వ్యవహారములందు శాసన సభలు, ధర్మశాస్త్రములు, ఆర్థికనిర్ణయములు, దేశకాలపాత్రల ధర్మప్రయోజనముల కను [illegible]కారమును పొందుచు మానవధర్మా [illegible]కు సాధనము లగుచున్నవి. [illegible] [illegible]హీనులకును, ధనవంతులు ధనహీనులకును, పండితులు పామరులకును, స్వతంత్రులు పరతంత్రులకును, గురువులు శిష్యులకును, యజమానులు పనివారికిని కల్పించెడి ధర్మార్థకామశాస్త్రశాసనములు స్వప్రయోజనపరాయణములై ధర్మప్రయో జనములకు నిరర్థకము లగుచున్నవి. ఆచార వ్యవహారములందు పరివర్తనము గలుగు నపుడు ధర్మశాస్త్రఘోష ప్రబలుచున్నది. పనివాండ్రయందు వ్యక్తిత్వము ప్రబలు చున్నపుడు నష్టఘోష ప్రబలుచున్నది. శిష్యులందు మతజిజ్ఞాస కలుగునపుడు గురు కులమునం దాస్తికభ్రష్టత్వఘోష వ్యాపించు చున్నది. ప్రజానాయకులందు స్వాతంత్ర్యాభి లాష వర్ధిల్లునపుడు విప్లవరాజద్రోహదోషా రోపణలు సంభవించుచున్నవి. అధికార సింహాసనాసీనులొకమెట్టయినను సింహాసనము నుండి దిగి ప్రజలకు సానుభూతిస్వాగతంబుల నొసగుట నియతధర్మమైనది. శాసనసభలు రాజ్యాంగములందు యధికారరక్షణమునకు వలెను ప్రజల హక్కులకు వినియోగపడ కుండుట సహజమైనను పరాధీనరాజ్యములం దీవిషయము రాజ్యాంగ వ్యవహారములను కేవల మొక ప్రహసనమును జేయుచున్నవి. భారతశాసనసభయందు గతించిన మూడు మాసములందును సంభవించిన వ్యవహార ములు హిందూస్థాన రాజ్యాంగప్రహసనము లకు ప్రమాణము. ప్రభుత్వమునకు ౧౪ సారులు పరాజయము కలిగినను అధికార హృదయమునం దేవిధమైన పరివర్తన పశ్చా త్తాపమును గలుగలేదు. ఆర్థికమంత్రి ఆర్థిక శాసనమును ప్రవేశపెట్టినపు డవలంబించిన ప్రజ్ఞావాదమునే నాలుగువారముల చర్చా

నంతరమును నవలంబించుట నిరంకుశపరి
పాలన ప్రహసనమునకు నిదర్శనము. సర్
జేమ్సు గ్రిగ్గుగారు ఆదాయవ్యయములందు
నిర్ణయించిన స్వాయంరక్షణమును, బాధ్యత
లును ౧౦,౦౦,౦౦౦ బ్రిటీషు పౌర సేవో
ద్యోగులకును, సైన్యములకును, సామాన్యో
ద్యోగులకును వ్యాపార పరిశ్రమ రక్షణము
కునువలెను ప్రజాసంరక్షణమునకును, ప్రభుత్వ
బాధ్యతలకును నిదర్శనములు కావు. ప్రభు
త్వము ౧౦ లక్షల ప్రభుత్వోద్యోగుల ప్రయో
జనములకును, బ్రిటీషు ప్రయోజనములకును
బాధ్యతలను వహించునటులు అన్న వస్త్ర
ములులేకను మలమలమాడుచున్న దుర్భర
మైనపన్నులను చెల్లించుచున్న నిరుపేదలకు
వహించుటలేదని విస్పష్టమగుచున్నది. పన్ను
లను చెల్లించలేని ప్రజలకు పన్నులను తగ్గిం
చుట, పన్నులను చెల్లించుటకు శక్తిసామర్థ్య
ములను గలుగజేయుట దేశాదాయమును
వృద్ధిచేయుట కాని ధనవంతులకు పన్నులభార
మును తగ్గించుటయును, ప్రభుత్వోద్యోగు
లకు తగ్గించిన జీతములను హెచ్చించుట
యును కాదు. ప్రభుత్వాధికారులు ఉప్పు
పన్నును, పోస్టేజిని, బీదల ఆదాయపుపన్నును
తగ్గించుటకుబదులు ఉద్యోగస్థుల జీతము
లను హెచ్చించుట శాస్త్రవిరుద్ధము. నిరు
పేదలనుండి దుర్భరమైన పన్నులనుండి ౧౨౦
కోట్లు వసూలుచేసి ౧ కోటిరూప్యములను
గ్రామసీమలకు దానముచేయుట ధర్మార్థ
కామములకు విరుద్ధము. కాంగ్రెసు జాతీయ
పక్షములు కలిసి ప్రభుత్వమునకు కలుగజేసిన
పరాజయపరంపరలు కాంగ్రెసు ధర్మప్రతిష్ఠకు
నిదర్శనములైనను సంకల్పసిద్ధికి కార్యసాధన
ములు కావు.

శాసనసభయందు దన్నిపక్షములవారును
ప్రజ్ఞావాదములతో కాలహరణముచేయుట
ప్రజానాయకుల నిస్సహాయస్థితికి నిదర్శనము.
ప్రజానాయకులు ఉద్యోగపరాయణులై కార్య
ములను సాధించవలసిన యవసరము దేశా
వృతమైన జడత్వము వెల్లడిచేయుచున్నది.
దేశావృతమైన జడత్వమునుండి ప్రజలను
మేలుకొలుపుటకు గాంధిమహాత్ముడుపక్ర
మించిన సకలోద్యమములు ఫలోన్ముఖము
లగుచున్నను కార్యకర్తవ్యముల నవలోకించు
నపుడు కర్తవ్యబాధ్యత సహస్రాంశము లధిక
ముగ స్ఫురించుచున్నది.

* * * *

### గాంధిమహాత్ముడు—ఉద్యోగపర్వము

నిరుద్యోగావస్థయందు ప్రజ్ఞావాదము
లందు మునిగి తేలుచున్న విద్యావంతులకు
గాంధిమహాత్ముని యుపదేశాచరణములు
ప్రబోధమును గలుగజేసినవి. త్రివిధములైన
నిర్మాణ కార్యక్రమమునందును గాంధిమహా
త్ముడుపక్రమించిన కార్యవిధానము విద్యా
వంతులందు పరావలంబన విశ్వాసము తగ్గి
ఆత్మవిశ్వాసము వర్ధిల్లుటకు వినియోగపడి
నది. ఖద్దరు నిర్మాణధారణములందు గల
ఆత్మవిశ్వాసగౌరవములు ప్రజానాయకులం
దభయమును సత్త్వసంశుద్ధిని గలుగజేయు
టకు వినియోగపడినవి. ఖద్దరుటోపీ ఖద్దరు
ధారణము భారతశాసనసభయందును నిగ్ర
హమునకును, ఆత్మవిశ్వాస గౌరవములకును
చిహ్నము లయినవి. కాంగ్రెసుసభ్యులు జాతి,

మత, స్థల భేదములను విడిచి రాజకీయ వ్యవహారములందు కలిసి పనిచేయుట అన్ని పక్షములవారికిని సత్యాగ్రహరహస్యమును గోచరము చేసినవి. సంస్కారణముల నిరాకరించుటయందును, కరాచి కాల్పులపట్లను, తోళ్ల మొగుమతి పన్నులవిషయమునను హిందువులకు దురభిప్రాయములకు కారణములు కనుపడినను, కాంగ్రెసు యథార్థమైన జాతీయ రాజ్యాంగపక్షమని ప్రభుత్వాధికారులకు వ్యక్తమైనది. శాసనసభయందు కాంగ్రెసు ధర్మబలమును సంయోగబలమును క్రమముగను వర్ధిల్లుచున్న విధమును ఆర్థికశాసనమునందు ప్రభుత్వమున కన్ని విషయములందును గలిగిన పరాజయము విశదము చేసినది. సత్యాగ్రహము నిర్ణయించిన సహాయ నిరాకరణము నిరంకుశ ప్రభుత్వమునకు సంబంధించినది కాని నిరుద్యోగమునకును, పరస్పర విశ్వాససహాయములకును సంబంధించినది కాదని కాంగ్రెసు వ్యవహారములు కార్యరూపమున నీ ప్రపంచమునకు సువ్యక్తము చేసినవి.

సత్యాగ్రహ ప్రయోజనము ధర్మసంస్థాపనము. మూలధర్మము సాధ్యమయినపుడు సామాన్య ప్రయోజనములును సాధ్యమగును. సత్యాగ్రహ మూసరక్షేత్రములందు నాటిన బీజములవలెను నిష్ఫలమైన దని కాంగ్రెసు నాక్షేపించెడి మహానుభావులు ప్రభుత్వాధికారులందు వలెను నాయకులందును గలరు. అరణ్యాజ్ఞాతవాసపర్వములు లేకను ఉద్యోగపర్వమును, ఉద్యోగపర్వము లేకను యుద్ధపంచకమును, యుద్ధపంచకము లేకను భగవద్గీతోపదేశమును, శాంతి అనుశాసనిక పర్వములును సాధ్యములు కావని మహాభారతమువలెను స్వల్పవ్యవహారములును విశదము చేయుచున్న విధము నీమహానుభావులు గ్రహింతురు గాత! సత్యాగ్రహము అస్సెంబ్లి ఎన్నికలందు కాంగ్రెసు అభ్యర్థుల విజయమునకును, అస్సెంబ్లియందు కాంగ్రెసుపక్ష విజయమునకును తోడ్పడిన విధమును గతించిన యనుభవము విశదము చేయుచున్నను సంశయాత్ములు గ్రహింపకుండుట బుద్ధిమాంద్యము. కాంగ్రెసు ప్రతినిధులుగా సామ్యుయెలు ఆరను, కుమారస్వామిరాజు, శ్రీ ప్రకాశ, బాబు భగవాన్‌దాసు, హాలానాషాకతాలి, ముత్తురంగమొదల్యారు, వర్మ, గిరి, భూలాభాయిదేశాయి, ఆనెగారులు మొదలగు నాయకులు చూపెడి నిగ్రహత్యాగములు కాంగ్రెసుపక్షమున కపూర్వమైన గౌరవమును గలుగజేయుచున్నవి. కాంగ్రెసుప్రతిపాదనల సన్నిపక్షములవారును నామోదించుటయును కాంగ్రెసుపక్షమువారి ధర్మవిజయమునకు నిదర్శనము. యూరపియనుపక్షసభ్యులనుకూడ రైళ్లయందు మూడవతరగతి ప్రయాణికుల సౌకర్యములు, ఉప్పుపన్ను, పోస్టురేటులు మొదలగు విషయములందు కాంగ్రెసుపక్షమున కాకర్షించుట కాంగ్రెసు ధర్మవిజయములను వెల్లడి చేయుచున్నది. విద్యావంతులందు ప్రారంభమైన ఉద్యోగపర్వము ప్రజాసామాన్యమునందును వ్యాపించినను ౩౫ కోట్ల ప్రజలయందు వ్యాపింపవలసిన యవసరము శాసనసభావ్యవహారములును, దేశా

వృత్తమైన ఆర్థికదురవస్థయును ప్రభుత్వనిరాదరణమును చెప్పక చెప్పుచున్నవి.

* * * *

### ప్రభుత్వనిరాదరణము

శాసనసభానిర్ణయములపట్లను, ప్రజాభీష్టములపట్లను ప్రభుత్వము చూపుచున్న నిర్లక్ష్యము, నిరసనము, నిరాదరణము గర్హ్యముగ నున్నది. ప్రభుత్వాదాయమునందు విశేషభాగమును గ్రామవాసులు చెల్లించుచున్నను గ్రామవాసు లనుభవించుచున్న కష్టములను, దారిద్ర్యమును ప్రభుత్వము నిర్లక్ష్యము చేయుచున్నది. ఆదాయమును, శక్తిననుసరించి పన్నులను వేయుటయును, పన్నులననుసరించి ప్రజాసౌకర్యములను సమకూర్చుటయును ఆర్థికశాస్త్రధర్మము. సర్ జేమ్స గ్రిగ్గుగారి ఆర్థికశాస్త్రధర్మము బ్రిటీషుపరిపాలనమున కనుకూలముగ నున్నది. గతించిన రెండేండ్లయందును హిందూస్థానమునుండి ౨౩౦ కోట్ల బంగారము నెగుమతిచేయుటను సమర్థించుట గ్రిగ్గుగారి యహంభావమునకు వలెను వారి వివేకమునకును, శాస్త్రపరిజ్ఞానమునకును నిదర్శనములు కావు. ప్రస్తుతము నిలువయున్న ౫ కోట్లను రాగల సంవత్సరాంతము నిలువను బీదల పన్నులను తగ్గించుటకు వినియోగించుటకు బదులు విమానాశ్రయములకును, బ్రాడ్ కాస్టింగుస్టేషనులకును, గ్రామసీమలకు ధర్మముచేయుటకును, ఆదాయపు పన్నును తగ్గించుటకును, తగ్గించినజీతముల నుద్ధరించుటకును, రోడ్లకును వినియోగించుట యవివేకము. ప్రజలనుండి అత్యధిక మయిన పన్నుల మూలమున వసూలుచేసినసొమ్మును పన్నులను తగ్గించుటకుబదులు కన్నులను కప్పుటకు గ్రామసీమల సౌకర్యమునకై దానముచేయుట ప్రయోజనకరమును, శాస్త్రసమ్మతమును కాదు. ప్రజలు దుర్భరదారిద్ర్యము ననుభవించుచు అన్నమునకై పరితపించుచున్నపుడు ప్రజల కన్నపానీయముల నుకల్పించుట ప్రభుత్వమునకు ప్రథమధర్మము ప్రజల కన్నపానీయములను గల్పించుటకు విశాలమైన నిర్మాణకార్యవిధానము నవలంబించుట సాధనమని సకలరాజ్యములు నవలంబించుచున్నను గ్రిగ్గుగారును ఇండియాప్రభుత్వము నిర్లక్ష్యమును బూనుట యనుచితము. బ్రిటీషుసామ్రాజ్యవ్యాపారపరిశ్రమ సంరక్షణమునకును, బ్రిటీషు ప్రజాక్షేమమునకును నేర్పడిన ప్రభుత్వవిధానమునందు ధర్మప్రయోజనములును, ప్రజాప్రయోజనములును దురారాధ్యములు. గాంధిమహాత్ము డుపక్రమించిన గ్రామోద్యోగోద్యమము ప్రభుత్వమున కాదరణీయ మగుట భయభ్రాంతులను గలుగజేయుట దుర్బోధనత్వమునకు నిదర్శనము.

* * * *

### గ్రామోద్యోగోద్యమము — గాంధిమహాత్ముడు

గాంధిమహాత్ముడు సంకల్పించిన గ్రామోద్యోగోద్యమమునకు ప్రభుత్వము స్వాగతము నొసంగుటకుబదులు ప్రతిఘటనమునబూనుట బ్రిటీషుప్రభుత్వాధికారుల మంత్రాంగమున కనుకూలముగనున్నది. పార్లమెంటుసభ్యులు, బ్రిటీషుమంత్రులు, బ్రిటీషునాయకులు, బ్రిటీషుఇండియాప్రభుత్వాధికారులు హిందూస్థాన సామాన్యప్రజాక్షేమమునకు బాధ్యులు తా

మని ఘోషించుట యాచారమైనది. మాటలం దీఘోషనె సర్ జేమ్సు గ్రిగ్గుగారును ఘోషించుచు కాంగ్రెసుపక్షసభ్యులను వారి ప్రసంగమునందు నిందించిరి. గాంధిమహాత్ముని యుద్యమమునకు ప్రతిబంధకములను కల్పించుటకు ప్రభుత్వము రహస్యముగ నాజ్ఞాపించినది. బహిరంగముగను కోటిరూప్యములనిచ్చి సంతృప్తిని గలుగజేయనెంచినది. కాని ప్రజాసామాన్యమునకు ఆర్థికవ్యవహారములందును, రాజ్యాంగ విధానమునందును, వ్యాపారపరిశ్రమవిధానములందును తరణోపాయము గలుగదని నిత్యవ్యవహారములు విశదముచేయుచున్నవి. ఉప్పుపన్నును తగ్గించుటకు నిరాకరించుచు, ౧౦౦ లక్షల ధర్మమువలన నెవరుసంతసింతురు? ప్రజల తరణోపాయములు వారి హస్తములందే కలదు. అధికారులును, నాయకులును గ్రామసీమల యుద్ధరణమునకు చేయునదియును, చేయగలదియును స్వల్పము. ముప్పదిరెండుకోట్ల ప్రజల స్వయంసహాయోద్యమ మూలమునను హిందూస్థానమునకు స్వయంపోషణము సాధ్యము గావలసియున్నది. పెద్దపరిశ్రమలు వ్యాపారముపట్టణవాసులకును, వర్తక వ్యాపారములకును వినియోగపడునటులు గ్రామ వాసులకును, గ్రామసౌభాగ్యమునకును వినియోగపడవు. దేశమునందంతటను పరిశ్రమలు వ్యాపించి నాలుగైదుకోట్లకు మించినప్రజలకు యంత్రాలయపరిశ్రమలందు పనులు లభింపవు. ఈపరిశ్రమాలయ నిర్మాణమునకు కోట్లరూప్యములును, చిరకాలమును పట్టును. ఒకవేళను సఫలమైనను దేశసౌభాగ్యమునకును, ప్రజాక్షేమమునకును నెంతవరకు ప్రయోజనకరమో నిర్ణయించుటదుర్లభము. గ్రామోద్యోగోద్యమమునం దనేక గ్రామములందువెంటనే చేతిపనులను, గృహపరిశ్రమలను నుద్ధరించుటకును నవకాశములుగలవు. రాజ్యాంగసంస్కారణములకును, యంత్ర పరిశ్రమాలయములకును, ఆర్థికవ్యాపారోద్ధరణమునకును నిరీక్షించియుండుట కేవలము కాలహరణము గాని ప్రయోజనకరముగాదని ఇండియాబిల్లు, బ్రిటీషుప్రభుత్వవ్యవహారములు, భారతశాసనసభావ్యవహారములు, హిందూస్థాన వ్యవహారములు కరతలామలకము చేయుచున్నవి. గాంధిమహాత్ముని యుపదేశాచరణము పట్టణవాసులకు, గ్రామవాసులకు, విద్యావంతులకు, సామాన్యులకు, స్త్రీలకు, పురుషులకు, యంత్రాలయాధీశులకు గృహపరిశ్రమ నిర్వాహకులకు, ధనస్వాములకు, కార్మికులకును స్వీయజీవనమాత్రలందును నియత కర్మానుష్ఠానమూలమునను ఆత్మోద్ధరణమును, దేశోద్ధరణమును, ప్రపంచోద్ధరణమును చేయవలసిన విధమును, చేయవలసిన యవసరమును గ్రహించుట సకలార్థసాధనమై ప్రభుత్వపాశబంధములను ప్రతిఘటించుట సులభసాధ్యము గాగలదు.

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras.
Editor: G. Subbaramayya.

ప్రథమ, ద్వితీయ సంపుటములు అమ్మకమునకు సిద్ధముగా నున్నవి.

# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

ప్రథమసంపుటమునందు డిమ్మీ ౪-వ ఆకృతియందు ౬౦౦ పుటలు గలవు. ఇందు 'అ' నుండి "అథర్వర్య" వరకును గల విషయము గలదు. త్రివర్ణపటములు ౮, ఇతర పటములు ౧౨౫, వివిధ విషయములు ౪౦౦ కలవు.

రెండవ సంపుటమునందు డిమ్మీ ౪-వ ఆకృతియందు ౬౦౦లకు మించిన పుటలు కలవు. "అన్" మొదలుకొని "అశ్విని" వరకు గల విషయము గలదు. త్రివర్ణపటములు ౧౦. వానిలో ౨ అమరావతీస్తూపమునకును ౨ అనాహతమునకును చెందినవియు ౬ దేశచిత్ర పటములును గలవు. ఇవిగాక మరి ౫ సాదాదేశపటములు కలవు. ప్రాచీనాంధ్రుల కళాసంపదను వ్యక్తముచేయు అమరావతీస్తూపమునుగురించిన గొప్ప వ్యాసమునందు అమరావతీశిల్పమునకు సంబంధించిన హాఫ్‌టోన్ బొమ్మలు రమారమి ౧౦౦ ను, వేషభూషాదుల వెల్లడించు బొమ్మలు ౫౦ వఱకును గలవు. మరియు అభినయమను వ్యాసమున భరతశాస్త్రమునందలి వేలువేలుహస్తములను సూచించు బొమ్మలు ౫౭ ను, 'అనాహతము' నందు షట్చక్రాదులచిత్రములును గలవు. ఇట్లు ఆయావ్యాసములకు చెందిన చిత్రములు మొత్తముమీద ౨౫౦ కి పైగా నున్నవి. వివిధవిషయములసంఖ్య ౪౦౦ వరకు నుండును.

సంపుటము చక్కని స్వదేశీచర్మముతోడను బంగారు రేఖలతోడను సంపుటీకృతము. ప్రతిసంపుటమున ౬౦౦ పుట లుండును. ప్రతి సంపుటము వెల రూ. ౧౦-౦-౦. ప్రవేశరుసుము రూ. ౧-౦-౦. మొత్తము రూ. ౧౧-౦-౦.

పోస్టుద్వారా: రూ. ౧-౮-౦ రైలుద్వారా: దగ్గరచోట్లకు ఖర్చులు అ. ౧౨.

☞ పోస్టు-రైలుఖర్చులు ప్రత్యేకము. చందాదారులు అడ్వాన్సు రూ. ౫ లు పంప ప్రార్థితులు.

మూడవ సంపుటము ముద్రణమున నున్నది. అందు ఆంధ్రదేశ చరిత్ర, వాఙ్మయము, భాష మొదలయిన విషయములకు సంబంధించిన వ్యాసము లనేకములు కలవు.

పండితసాహాయ్యమునను, అపార సాధనసంపదల మూలమునను, సాధ్యము గాదగిన ఈ కార్యమును తలపెట్టుట సాహసమును, అనాలోచితమును అయినను ఆంధ్రమహాజనుల సాహాయ్యమున నీప్రయత్నము సఫలము గాగల దని నమ్ముచు యథాశక్తిని సహాయము చేయుటకు వేడుచున్నాము.

ఆంధ్రవిజ్ఞానసర్వస్వ కార్యాలయము, నెం. ౭, తంబుచెట్టివీధి, మదరాసు.